దోషేష్వపరిపక్వేషు కషాయం యశ్చ సేవతే ॥ 16 ॥

లౌల్యాద్వా స్నేహపానాని క్షీరం సంతర్పణాని వా ।
దైవతానామభిధ్యానాద్ గ్రహాసంస్పర్శనాదపి ॥ 17 ॥
సద్యో వాన్తో విరిక్తో వా స్నేహపీతోఽనువాసితః ।
శీతోపచారం గుర్వన్నం వ్యవాయం యశ్చ సేవతే ॥ 18 ॥

తస్యాపి సహసా వాయురస్థిమజ్జాన్తరం గతః ।
కుపితః కోపయత్యాశు శ్లేష్మాణం పిత్తమేవ చ ॥ 19 ॥

తతోఽస్య ధాతువైషమ్యాద్విషమో జాయతే జ్వరః ।
సతతోఽన్యేద్యుకో వాఽపి తృతీయః సచతుర్థకః ॥ 20 ॥

దోష ఆమావస్థ, తరుణ జ్వరములో కషాయము సేవించుట జిహ్వాలోలత కారణముచే స్నేహ పానము, క్షీరము, సంతర్పణ ద్రవ్యముల సేవించుట. దేవతలు గ్రహాల ద్వారా ఆక్రాంతమగుట. వమన, విరేచన, స్నేహపా అనువాసన, ప్రయోగానంతరము వెంటనే శీతలోపచారము, గురు అన్నము మైథునము, చేయువారికి అస్థిలోని మజ్జాంతర్గతమైన వాయువు కుపితమై కఫపిత్తములను ప్రకోపింపచేయును. ఈ విధంగా ధాతువులు విషమము అగుట వారికి సతతము, అన్యేద్యుష్కము, తృతీయకము, చతుర్థకము అను 4 విష జ్వరములు కలుగును.

న చ నోపశమం యాతి న చ భూయో న కుప్యతి ।
శమప్రకోపయోః కాలం న చాయమతివర్తతే ॥ 21 ॥

ఈ విషమ జ్వరము శాంతము కానపుడు లేదా పునఃప్రకోపం కాద అనుటకు వీలులేదు. వీటి శమనము, ప్రకోప కాలములు ఉల్లంఘించవు.

న చ స్వభావోపశమం గచ్ఛత్యనుశయాత్మకః ।
న హి స్వభావశాన్తానాం భావానామస్తి సంభవః ॥ 22 ॥

అనుశయము అగుటచే వీటికి స్వభావము శాంతం కాదు. స్వభావమ శాంతం అయినపుడు పదార్థములు పునరుత్పత్తికాదు.

జ్వరప్రవేగోపరమే దేహీ ముక్త ఇవేక్ష్యతే।
తథాఽప్యస్యామవస్థాయామేభిర్లిఙ్గైర్న ముచ్యతే ॥ **23** ॥

ముఖవైరస్యకాటుక్యమాధుర్యాదిభిరల్పశః।
నాత్యన్నలిప్సాగ్లానిభ్యాం శిరసో గౌరవేణ న ॥ **24** ॥

జ్వర వేగము శాంతం అయినపుడు, జ్వరముక్తమైనపుడు కూడా ముఖ వైరస్యము, కటుత్వము, మధురత, అన్నము అధికముగా రుచించక పోవుట, గ్లాని, శిరోగురుత్వం మొదలగు లక్షణములు ముక్తము కావు.

పునః పునర్యథా చైష జాయతే తన్నిబోధ మే।
నిరుద్ధమార్గో దోషేణ విషమజ్వరహేతునా ॥ **25** ॥

వాయుస్తద్దోషకోపాన్తే లబ్ధమార్గో యథాక్రమమ్।
దోషశేషం తమాదాయ యథాస్థానం ప్రపద్యతే ॥ **26** ॥

స దోషశేషః స్వే స్థానే లీనః కాలబలాశ్రయాత్।
రసస్థానముపాగమ్య భూయో జనయతి జ్వరమ్ ॥ **27** ॥

ఈ విషమజ్వరము మాటి మాటికి ఏ కారణమున వచ్చునో ఇపుడు నానుండి వినుము. విషమ జ్వరమును ఉత్పన్నం చేయు దోషముల ద్వారా ఏ మార్గం అయితే అవరోధింపబడిన ఆవాయువు ఆ దోషాల యొక్క అంతమునందు మార్గములను పొంది క్రమంగా దోషాలను తీసికొని ఆమాశయమును పొందును. దీని వలన దోషాలు వాటి స్థానంలో ఉన్నటువంటి దోషము, కాలము మరియు బలముల ఆశ్రయముతో రసస్థానము( ఆమాశయం)ను పొంది మళ్లీ జ్వరము కలిగించును.

ఉపక్రమవిశేషేణ స్వబలస్య వ్యయేన చ।
క్షయం ప్రాప్నోతి వృద్ధిం చ సమానగుణసంశ్రయాత్ ॥ **28** ॥

చికిత్స వలన కాని, జ్వరము తక్కువగుట వలన కాని, సమాన గుణాశ్రితములు అగుటచే జ్వరము క్షయము గాని, వృద్ధిగాని చెందును.

సోఽయం నివృత్తిం సంప్రాప్య యథా దీపః స్వభావతః।
పునః పునః ప్రజ్వలతి క్షీణతైలేన్ధనోఽపి సన్ ॥ **29** ॥

స్వమధిష్ఠానమాశ్రిత్య శాన్తః శాన్తస్తథా జ్వరః ।
కాలే బలం దర్శయతి క్షీణదోషేన్ధనోఽపి సన్ ॥ 30 ॥

నివృత్తి కలుగునపుడు ఏ విధముగా దీపము తైలరూప ఇంధనము క్షీణము అయినప్పటికి మాటి మాటికి ప్రజ్వలితము అగుచుండునో అదే విధముగా జ్వరము తన అధిష్ఠానము చేరి, శాంతము అయినప్పటికి దోషరూప ఇంధనములు నశించుటచే స్వయముగా తగిన సమయము నందు స్వభావ కారణమున ప్రకటితం అగును.

స్వహేతుదోషమాశ్రిత్య నియతో నియమేన యః ।
అహోరాత్రే దర్శయతి కాలహేతుకృతం బలమ్ ॥ 31 ॥
ద్వికాలం స యథాదోషం జ్వరః సతతకః స్మృతః ।
స్థానమామాశయస్తస్య యం సమాశ్రిత్య వర్తతే ॥ 32 ॥

జ్వరోత్పాదక హేతువు, దోషాశ్రయము, కలిసి నియమపూర్వకముగా రాత్రి పగలు రెండు సార్లు నిశ్చిత సమయం నందు కాలము మరియు హేతుకృత బలమును ప్రకటించును. దీనిని సతత జ్వరము అందురు. దీని స్థానము ఆమాశయము దీనికి ఆశ్రితమై వృద్ధి పొందును.

ఉరస్త్వన్యేద్యుకస్థానమహోరాత్రాదురశ్చ్యుతః ।
దోషో రసం సమాసాద్య యదా దర్శయతే బలమ్ ॥ 33 ॥
తదాఽనుషఙ్గీ స్వే కాలే జాయతేఽన్యేద్యుకో జ్వరః ।

అన్యేద్యుక జ్వరము- స్థానము ఉరస్సు చెప్పబడినది. అహోరాత్రములు ఉరస్సు నుండి ఈ దోషములు ఆమాశయస్థిత రసమును చేరి, తమ బలమును ప్రకటించును. ఇది అనుషంగి అయి ప్రతిదినము, తన స్వకాలములో వచ్చును. దీనిని అన్యేద్యుక జ్వరము అందురు.

కణ్ఠస్తృతీయకస్థానమహోరాత్రాచ్చ్యుతస్తతః ॥ 34 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 199 తమం పత్రమ్)
ఉరః ప్రపద్యతేఽన్యస్మాదహోరాత్రాద్యథాక్రమమ్ ।
రసధాత్వాశ్రితో దోష ఊష్మణా సహ మూర్ఛితః ॥ 35 ॥

తృతీయేఽహని నిర్వృత్తిం జనయేత్ స తృతీయకః ।

తృతీయక జ్వరము - తృతీయక జ్వర స్థానము కంఠము. మొదటి అహోరాత్రములో దోషము కంఠము నుండి ఉరస్సును చేరును. రెండవ అహోరాత్రములో యథాక్రమంగా ఆయామాశయ స్థానమైన రసధాతువులో చేరి ఊష్మచే మూర్ఛితమై మూడవ దినమున పునర్ప్రకటితం అగును. దీనిని తృతీయక జ్వరం అందురు. కావున తృతీయక జ్వరము ఒక దినము విడిచి మూడవ దినమున ఉత్పన్నం అగును.

శిరశ్చతుర్థకస్థానం చతుర్థం సముదాహృతమ్ ॥ **36** ॥
అహోరాత్రాచ్చ్యుతః స్థానాద్దోషః కణ్ఠేఽవతిష్ఠతే ।
తతః పునరహోరాత్రాదురసి ప్రతిపాద్యతే ॥ **37** ॥
తృతీయే చాప్యహోరాత్రే రసధాతౌ ప్రకుప్యతి ।
చతుర్థకః స విజ్ఞేయశ్చిరస్థాయీ మహాజ్వరః ॥ **38** ॥
గమ్భీరస్థానసంభూతో ధాతుసంకరదూషితః ।
దర్శయిత్వా బలం కాలే జన్తోః శిరసి లీయతే ॥ **39** ॥
త్రిదోషసంభవత్వాచ్చ భూతసంస్పర్శనాదపి ।
దుశ్చికిత్స్యతమో హ్యేష తస్మాద్యత్నేనముపక్రమేత్ ॥ **40** ॥

చతుర్థకజ్వరం - 4వది చతుర్థక జ్వరం దీని స్థానం శిరస్సు మొదటి అహోరాత్రములో శిరస్సును విడిచి కంఠం చేరును. 2వ అహోరాత్రంలో దోషము ఆమాశయ స్థిత రసమును చేరి ప్రకటితం అగును. ఇది చతుర్థకజ్వరము. ఈ మహాజ్వరం చిరస్థాయిగా ఉండును. గంభీర స్థానంలో ఉత్పన్నం అయి అనేక ధాతువులను దూషితం చేసి తన స్వకాలంలో బహిర్గతం అయి తిరిగి శిరస్సులో స్థితం అగును. త్రిదోషములచే ఉత్పన్నం అయి భూతసంసర్గ కారణంచే దుశ్చికిత్సతం. కావున ఈ క్రింది ఉపాయముల ద్వారా చికిత్స చేయవలెను.

బలిభిః శాన్తిహోమైశ్చ సిద్ధైర్మన్త్రపదైస్తథా ।
పాపాపహారణం చాస్య కర్తవ్యం సిద్ధిమిచ్ఛతా ॥ **41** ॥
భూతేశ్వరం నీలకణ్ఠం ప్రపద్యేత వృషధ్వజమ్ ।

సిద్ధిని కోరువారు బలి, శాంతి, హోమ, సిద్ధమంత్రముల ద్వారా దీని పాపనివారణము చేయవలెను. నీలకంఠ, వృషధ్వజ భూతేశ్వర మహాదేవుని ఉపాసన చేయవలెను.

**చిరానుబన్ధీ విషమో యథాకాలం వివర్ధతే ॥ 42 ॥**
**ఏకాహాచ్చ ద్వ్యహాచ్చైవ త్ర్యహాచ్చతురహాత్తథా ।**

చిరానుబంధి విషమజ్వరము- యథాకాలములో ఒకటి, రెండు, మూడు, 4 దినములలో వృద్ధిని పొందును.

**పఞ్చమేఽహని షష్ఠే వా కస్మాదేష న జాయతే ॥ 43 ॥**
**తస్య త్వామాశయః స్థానమురః కణ్ఠః శిరస్తథా ।**
**స్థానమన్యత్తతో నాస్తి స్థానాభావాన్న జాయతే ॥ 44 ॥**

ఈ విషమ జ్వరము, 5,6 దినములలో ఎందుకురాదు ప్రత్యుత్తరం - విషమజ్వరమునకు ఆమాశయ, ఉరస్సు, కంఠం, శిరస్సు ఈ నాలుగు స్థానములు. వీటికి అతిరిక్తముగా వేరే స్థానం లేదు కావున 4 దినముల మించి 5,6 దినములలో జ్వరం రాదు.

**ఆగ్నేయః స్యాత్ సతతకో వాయవ్యో హి ద్వితీయకః ।**
**వైశ్వదేవస్తృతీయః స్యాదైశానస్తు చతుర్థకః ॥ 45 ॥**

సతతజ్వరం ఆగ్నేయం. అన్యేద్యుకము వాయవ్యం. తృతీయకం వైశ్వదేవము. చతుర్థకం ఈశాన్యం.

**కస్మాత్ పరిక్షీణబలః క్షీణధాతుబలౌజసః ।**
**జ్వరో వివర్ధతే జన్తోర్మోక్షకాలే విశేషతః ॥ 46 ॥**

ధాతు బలము, ఓజస్సు, క్షీణించిన వ్యక్తికి క్షీణ బలం కల జ్వరము విశేషించి మోక్షకాలంలో ఎందుకు వృద్ధి చెందును?

**గతేరభావాద్బాహ్యేన వాయునాఽభ్యాహతక్రమః ।**
**సంక్షీణవర్త్యనుగతః స్నేహవాయ్వభిమూర్ఛితః ।**
**శాన్తోఽపి తదుపాదానాద్యథా దీపో న ( ఽను? ) దీప్యతే ॥**
**తద్వద్ధాతుబలే క్షీణో జ్వరః క్షీణబలోఽపి సన్।**
**నిరుపాదానదోషత్వాన్మోక్షకాలే విశేషతః ॥ 48 ॥**

హేతుశేషమశేషేణ దహన్ దర్శయతే బలమ్ ।
సప్రతీకారవైశేష్యాత్ ప్రశమం యాతి హన్తి వా ॥ 49 ॥

ఏ విధంగా గతిలేని వాయువుచే ఆక్రామితం అయిన వత్తి క్షీణించుటచే రానున్న మరియు స్నేహం వాయువుతో మూర్ఛితం అగుటచే శాంతించిన దీపము కూడా ఉపాదాన కారణం ఉండుటచే ప్రజ్వలించుచుండునో అదే విధంగా ధాతు బలము క్షీణించినప్పటికి జ్వరం క్షీణబలం అయినప్పటికి ఉపాదాన దోషములు మిగిలి ఉండుటచే మోక్ష కాలంలో మిగిలి ఉన్న దోషరూప కారణములను దహిస్తూ తమ బలమును ప్రకటించును. ఇది విశేష చికిత్సచే శాంతించును. లేదా చంపివేయును.

పాకాద్వా శమనాద్వాఽపి శోధనాద్వా హృతాధికే ।
స్వస్థానస్థే నరో దోషే శుద్ధస్రోతా విసృజ్యతే ॥ 50 ॥

దోషముల పాచనం శమనం శోధనంల ద్వారా తమస్థానంలో ఉన్న దోషములు నష్టం అగుటచే శుద్ధ స్రోతస్సులు కల మనుష్యుడు జ్వరం నుండి ముక్తం అగును.

నిర్దిష్టో దోషపాకాదేరస్మాద్ధేతుత్రయాత్ పరమ్ ।
అన్యత్ర చైవ నాన్యోఽస్తి హేతుర్జ్వరవిమోక్షణే ॥ 51 ॥

జ్వరమునుండి ముక్తమగుటకు దోషపాకాది మూడు కారణములు తప్పించి మరోకారణములేదు.

కస్మాద్దోషపరిక్షోభే ప్రాయశః శీతపూర్వకమ్ ।
నిర్వర్తతే జ్వరో జన్తోః పశ్చాద్దాహః ప్రవర్తతే ॥ 52 ॥

దోషములు ప్రకుపితమైనపుడు జ్వరములో మొదట చలి తర్వాత వేడి ఎందుకుండును?

వాయుర్వ్యవాయీ విశదః శీతో రూక్షశ్చలః ఖరః ।
పిత్తమాగ్నేయముష్ణం చ తీక్ష్ణమల్పం లఘుద్రవమ్ ॥ 53 ॥
సౌమ్యః శీతో గురుః స్నిగ్ధో బలవాన్ కఫకో బహు ।
కఫో మన్దవ్యవాయీ చ చిరోత్థాననివర్తనః ॥ 54 ॥

వాయుశ్చ శీతసామాన్యాత్ కఫస్యానుబలో బలీ।
బలవాన్ హి గుణః సౌమ్య ఆగ్నేయో దుర్బలః స్మృతః ॥ 55 ॥
హేతునాఽనేన మహతా శ్లేష్మా హి బలవత్తరః।
తస్మాత్ పూర్వం జ్వరే శీతం పశ్చాద్దాహః ప్రవర్తతే ॥ 56 ॥

జవాబు - వాయువు వ్యవాయి, విశద, శీత, రూక్ష, చల, ఖరముగా నుండును. పిత్తము ఆగ్నేయము, ఉష్ణ, తీక్ష్ణ, అల్ప, లఘు ద్రవముగా నుండును కఫము సౌమ్యము శీత, గురు, స్నిగ్ధ అత్యంత బలమైనది మంద వ్యవాయిగా ఉండును. కఫ ఉత్పత్తి నివృత్తి ఆలస్యముగా జరుగును. శీత గుణ కారణముచే వాయువు కూడ కఫము వలె బలమైనది.

సౌమ్యగుణము బలమైనది ఆగ్నేయము దుర్బలమైనది. కావున కఫము బలమైనది. కావున జ్వరమునందు మొదట చలి ఉండి తర్వాత దాహముగా ఉండును.

స్వవేగపరిణామాచ్చ క్రియాభిశ్చ యదా కఫః।
ఉష్మాభిః ప్రశమం యాతి తదా పిత్తం ప్రకుప్యతి ॥ 57 ॥
పరిణామక్రియాభిర్వా శాన్తే తస్మిన్ సుఖీ భవేత్।
హేతురుక్తో మహానేష యథావచ్ఛీతపూర్వకే ॥ 58 ॥

తన వేగ పరిణామము ఉష్ణ క్రియల ద్వారా కఫము శాంతించినపుడు పిత్తము ప్రకుపితమగును తర్వాత పరిణామము క్రియల ద్వారా పిత్తము శాంతించినపుడు మనుష్యుడు స్వస్థుడగును. జ్వర ప్రారంభములో చలి కల్గుటకు ఇది మహా కారణముగా చెప్పబడినది.

అథ కస్మాజ్జ్వరో జన్తోర్జాయతే దాహపూర్వకః।
స ఏవ హేతురత్రాపి బలీయస్త్వాదుదాహృతః ॥ 56 ॥
అత్యుదీర్ణం యదా పిత్తం వాయునాఽల్పేన మూర్ఛితమ్।
అనుబద్ధం రసస్థానే శ్లేష్మణాఽల్పబలేన చ ॥ 60 ॥
దాహః పూర్వం తదా జన్తోః శీతమన్తే ప్రవర్తతే।
సోద్వేపకః సప్రలాపస్మృతిబుద్ధిప్రమోహనః ॥ 61 ॥

తర్వాత ప్రశ్న ఏమనగా దాహపూర్వక జ్వరము ఎందుకు కల్గును? జవాబు- ఇక్కడ కూడ అదేకారణము. బలమైన పిత్తము ఉదీర్ణమై అల్ప బలము గల వాతశ్లేష్మములతో మూర్ఛితమై రసస్థానమైన ఆమాశయమున చేరును. అపుడు ప్రారంభములో దాహముగా నుండును. తర్వాత చలిగా నుండును. ఈ జ్వరములో రోగికి కంపము, ప్రలాపము, స్మృతి బుద్ధి ఆఘాతము కల్గును.

**తావేతౌ శీతదాహాదీ జ్వరౌ సంసర్గసంభవౌ ।**

**అసాధ్యః కృచ్ఛ్రసాధ్యో వా దాహపూర్వో జ్వరస్తయోః ॥ 62 ॥**

ఈ విధముగా ఉష్ణశీతములు రెండు జ్వర సంసర్గముచే ఉత్తన్నమగును. ఇందులో దాహ పూర్వ జ్వరము అసాద్యము లేదా కృచ్ఛ సాద్యమగును.

**ప్రత్యనీకగుణాః సన్తో దోషా వాతాదయః కథమ్ ।**

**సంభూయ కుర్వతే రాగాన్నాన్యోఽన్యం శమయన్తి చ ॥ 63 ॥**

**(ఇతి తాడపత్రపుస్తకే 200తమం పత్రమ్)**

ప్రశ్న- ఈ వాతాదిదోషములు విరుద్ధగుణములు కల్గి ఉన్నప్పటికి ఏ విధముగా రోగములనుత్పన్నము చేయును? విరుద్ధమగుటచే పరస్పరము ఒక దానినొకటి ఎందుకు శాంతింప చేయవు?

**స్వభావాద్దూషణాద్దోషా నాన్యోన్యశమనాః స్మృతాః ।**

**యస్మాత్తస్మాద్బహువిధాః సంస్పృష్టాః కుర్వతే గదాన్ ॥ 64 ॥**

**విరుద్ధా గుణతోఽన్యోన్యం కార్యం సత్త్వాదయో యథా ।**

జవాబు! స్వభావము, దూషితమగుట అను కారణములచే దోషములు పరస్పరము ఒకదాని నొకటి శాంతింప చేయవు. కావున అనేక రోగముల నుత్పన్నము చేయును. సత్వాది గుణములు విరుద్ధములైనను కలిసి పని చేయునట్లుగా.

**శిరః సంతప్యతే కస్మాజ్జ్వరితస్య విశేషతః ॥ 65 ॥**

**సతి సర్వాఙ్గతాపే చ శైత్యం భవతి పాదయోః ।**

ప్రశ్న- జ్వరములో విశేషించి శిరస్సు ఎందుకు వేడిగా నుండును. సమస్త శరీరము వేడిగానున్నప్పటికీ పాదములు ఎందుకు చల్లగానుండును ?

దోషైరావృతమార్గత్వాదూర్ధ్వగత్వాచ్చ తేజసః ॥ 66 ॥
బాహుల్యాదిన్ద్రియాణాం చ శిరః సంతప్యతేఽధికమ్ ।
తేజసాఽతిప్రవృద్ధేన సోమధాతుః ప్రపీడితః ॥ 67 ॥
అధః ప్రపద్యతే తేన శైత్యం భవతి పాదయోః ।

జవాబు - దోషములు మార్గమును ఆవృతమగుటచే తేజస్సు ఊర్ధ్వ స్వభావము గలదగుటచే ఇంద్రియముల ఆధిక్యతచే శిరస్సు అధికముగా వేడి నొందును. అతికుపితమైన తేజోధాతువుచే పీడితమైన సోమధాతువు క్రింది భాగమును చేరును. కావున పాదములు చల్లగా నుండును.

జ్వరోష్మణాఽభిసంతప్తే ప్రాగుష్ణాదిక్రియావిధిః ॥ 68 ॥
క్రియతే నేతరః కస్మాచ్ఛీత ఉష్ణస్య బాధకః ।
యథాఽగ్న్యగారే సంతప్తే కపాటపుటసంవృతే ॥ 69 ॥
భవత్యత్యధికస్తూష్మా సర్వతః పరితాపనః ।
స ఏవోద్ఘాటితద్వారే మన్దీభవతి తత్క్షణాత్ ॥ 70 ॥
ఏవమావృతమార్గేషు దోషైః స్రోతఃసు దేహినామ్ ।
జ్వరోష్మా వర్ధతే దేహే యథాహేతుబలాశ్రయమ్ ॥ 71 ॥
ఉద్ఘాటనార్థం తత్తేషాముష్ణోపక్రమ ఇష్యతే ।
స్తమ్భనో హి గుణః శీత ఉష్ణో విలయనః స్మృతః ॥ 72 ॥

జ్వరోష్ణతచే సంతప్తమైన రోగికి ప్రప్రథమముగా ఉష్ణ విధినాచరించవలెను. శీతోపచారము కూడదు. ఎందుకనగా శీతవిధి ఉష్ణబాధ కము కావున ఏవిధముగా ద్వారములు బంధించి సంతప్తమైయున్న అగ్న్యాగారములో నలువైపులనుండి వేడి కల్గజేయు ఉష్ణము అధికముగా నుండునో అదే ఉష్ణము అగ్న్యాగారము ద్వారములు తెరచుటచే క్షణమాత్రములో మందమగును. అదేవిధముగా రోగి శరీరములో దోషములచే ఆవరించబడిన మార్గములు హేతు బల ఆశ్రయముచే జ్వరోష్మ వృద్ధి పొందును. ఆస్రోతోఽవరోధమును తొలగించు ఉష్ణవిధి అభిలషణీయము. శీతగుణము దోషస్తంభనము చేయుగుణము కలది. ఉష్ణగుణము దోష విలయనము చేయును.

తస్మాదుష్ణాంబు పానాయ జ్వరితాయ ప్రదీయతే ।
తేనాస్య దోషాః పచ్యన్తే కాయాగ్నిశ్చాభిదీప్యతే ॥ 73 ॥

జ్వరోష్మా మార్దవం యాతి విబన్ధశ్చ ప్రశామ్యతి ।
తృష్ణా నివర్తతే చాశు ప్రకాంక్షా చోపజాయతే ॥ 74 ॥

కావున జ్వరితునకు త్రాగుటకు ఉష్ణోదకము నివ్వవలెను. తద్వారా దోషపచనము కల్గి జఠరాగ్ని ప్రదీప్త మగును. జ్వరోష్ణము తగ్గిపోవును. విబంధము తొలిగిపోవును. దప్పిక శీఘ్రముగా శాంతించును. భోజనముతో రుచి ఉత్పన్నమగును.

ఋతే పిత్తజ్వరాదుష్ణో విధిః సర్వో జ్వరాపహః ।
తత్రాప్యనుష్ణశీతాదిరుపచారో విధీయతే ॥ 75 ॥

పిత్త జ్వరము తప్ప మిగతా అన్ని జ్వరములలో ఉష్ణ విధిని ప్రయోగించవలెను. పిత్త జ్వరములో కూడ ఉష్ణము శీతము గాని ఉష్ణ విధిని చేయవలెను.

ఇతి సప్త యథాప్రశ్నం నిర్దిష్టా విషమజ్వరాః ।
వక్ష్యే సతతకాదీనాం చికిత్సాం శృణ్వతః పరమ్ ॥ 76 ॥

ఈ విధముగా ప్రశ్నానుసారము 7 విషమజ్వరములు నిర్దేశించ బడినవి. ఇప్పుడు సతతాది విషమ జ్వరముల చికిత్సను చెప్పెదము.

ఉపక్రమైః పరిక్లిష్టం క్షీణధాతుబలౌజసమ్ ।
జ్వరః పురాణో రూక్షాత్వాదనుబధ్నాతి దేహినమ్ ॥ 77 ॥

చికిత్సచే పరిక్లిష్టమైన ధాతు, బలము ఓజస్సు క్షీణించిన వానికి రూక్షమగుటచే పురాణ జ్వరము పట్టు కొనును.

తస్మాదస్య బలాధానే ప్రయతేత విచక్షణః ।
రమ్యైర్విచిత్రైరాహారైర్బృంహ్యైః శ్రద్ధోపపాదితైః ॥ 78 ॥
సురాగ్రపానైర్మాంసానాం వైష్కిరాణాం చ భక్షణైః ।
సర్పిషః పఞ్చగవ్యస్య పయసో లశునస్య చ ॥ 79 ॥

కావున వివేక వంతుడైన వైద్యుడు రమ్య విచిత్ర హృద్య శ్రద్ధా ఉత్పన్నముచేయు ఆహారము, సురాపానము విష్కిర జంతువుల మాంస భక్షణము పంచగవ్యఘృతము పాలు లశునము ద్వారా రోగికి బలాధాన ప్రయత్నం చేయవలెను.

**ఉపక్రమేచ్చౌషధానాం ప్రయోగైర్విషమజ్వరమ్**
**దైవతేజ్యోపహారైశ్చ ధూపనాభ్యఞ్జనాఞ్జనైః ॥ 80 ॥**

ఇదికాక ఔషధ ప్రయోగము దేవతా ఇజ్యా ఉపహారము ధూపనము, అభ్యంగము అంజనముల ద్వారా విషమ జ్వర చికిత్స చేయవలెను.

**వాతోత్తరం స్నేహపానైరభ్యఙ్గైః సావగాహనైః ।**
**స్నిగ్ధోష్ణైరన్నపానైశ్చ బలిభిశ్చాప్యుపక్రమైః ॥ 81 ॥**

వాత ప్రదాన విషమ జ్వరములో స్నేహపానము అభ్యంగము అవగాహనము స్నిగ్ధ ఉష్ణ అన్నపానము బలిద్వారా చికిత్స చేయవలెను.

**పిత్తోత్తరం తిక్తశీతైః శమనైః సవిరేచనైః ।**
**పయసా సర్పిషా చైవ శీతైశ్చాభ్యఞ్జనైర్జయేత్ ॥ 82 ॥**

పిత్త ప్రధాన విషమ జ్వరములో తిక్త శీతల శమన ద్రవ్యములు విరేచన ద్రవ్యములు, పాలు ఘృతము శీతల అభ్యంగము ద్వారా చికిత్స చేయవలెను.

**వమనైః పాచనీయైశ్చ లఙ్ఘనైర్లఘుభోజనైః ।**
**రూక్షోష్ణైశ్చాప్యుపచరేత్ కషాయైశ్చ కఫోత్తరమ్ 83 ॥**

కఫ ప్రధాన జ్వరములో వమనము, పాచన ద్రవ్యములు లంఘణము లఘుభోజనము రూక్ష ఉష్ణ కషాయము ద్వారా చికిత్స చేయవలెను.

**రోమహర్షోఽఙ్గమర్దశ్చ వాతపిత్తోత్తరే జ్వరే ।**
**మహాకల్యాణకం సర్పిః పఞ్చగవ్యమథో పిబేత్ ॥ 84 ॥**
**పీత్వా వా మహతీం మాత్రాం సర్పిషః పునరుల్లిఖేత్ ।**
**తదహర్వా పరేద్యుర్వా పేయాం సమరిచాం పిబేత్ ॥ 85 ॥**

వాతపిత్త ప్రధాన జ్వరములో రోమహర్షము అంగమర్దము ఉండును. ఇందులో మహాకళ్యాణక, పంచ గవ్య ఘృతమును త్రాగించవలెను. లేదా ఘృతము

ఉత్తమ మాత్రలో త్రాగించి పునర్వమనము చేయించవలెను. లేదా అదేదినము లేదా మరుసటి రోజు మరిచయుక్త పేయను త్రాగించవలెను.

**రాజమూలస్య వా క్వాథం పిబేత్ ప్రజ్వరకం హవిః ।**
**క్రితోయం . . . . . మయోగశ్చతుర్థకమపోహతి ॥ 86 ॥**

లేదా జ్వరము ప్రబలముగా నున్నప్పుడు రాజమూల క్వాథముత్రాగించవలెను. యజ్ఞములో---- ఆహుతినివ్వవలెను. దీని వలన చతుర్థక జ్వరము దూరమగును.

**ధారోష్ణం వా పయః పీత్వా తద్వమేదిచ్ఛయా న వా ।**
**శీతం వా మధునాఽశీతం నిమ్బపత్రోదకం పిబేత్ ॥ 87 ॥**

లేదా ధారోష్ణపాలు త్రాగి స్వయముగా ఇష్టముతో గాని అనిష్టముతోగాని వమనము చేయవలెను. శీత లేదా ఉష్ణ నింబపత్రోదకమును తేనెతో కలిపి సేవించవలెను.

**సర్పిర్వా మాహిషం పీత్వా హిఙ్గుస్తోకసమన్వితమ్ ।**
**తస్మిన్ విదగ్ధ ఏవాన్నం దధ్నా భుఞ్జీత కేవలమ్ ॥ 88 ॥**

మహిషఘృతములో కొంచెము హింగుకలిపి త్రాగించి అది విదగ్ధమైనపుడు పెరుగుతో కేవలం అన్నమును సేవించ వలెను.

**నీలస్పృక్షశిఫా వాఽపి సుపిష్టా తణ్డులామ్బునా ।**
**దేయా జ్వరతిథౌ నస్యే మృగరాజస్య వా వసా ॥ 89 ॥**

జ్వరము వచ్చిన రోజు నీల అపరాజితమూలమును కల్కము చేసి బియ్యపు నీటితో లేదా మృగరాజు వసను నస్యరూపములో ఇవ్వవలెను.

**హరీతకీ వచా కుష్ఠం నిమ్బపత్రం పలఙ్కషా ।**
**సిద్ధార్థకా యవాః సర్పిర్ధూపో జీర్ణజ్వరాపహః ॥ 90 ॥**

హరీతకి, వచ, కుష్ఠ, నింబపత్రము గుగ్గులు శ్వేత సర్షపము, యవలు, ఘృతము వీటిధూపనము జీర్ణజ్వరమును నశింపచేయును.

**మూలాని సహదేవాయాః కటుకా రోహిణీ వచా ।**
**తణ్డులోదకపిష్టోఽయం దేహో దాహజ్వరాపహః ॥ 91 ॥**

సహదేవిమూలము, కటుకి రోహిణి, వచ వీటిని తండులోదకము తో మర్దించి ఇచ్చినచో దాహజ్వరము నశించును.

**సురయా సర్వగన్ధైశ్చ తైలమభ్యఞ్జనం పచేత్ ।**
**సర్షపా లసునం హిఙ్గు త్రివ్యోషం రోచనా వచా ॥ 92 ॥**

**ఋక్షపిత్తం బస్తమూత్రం కరఞ్జస్య ఫలాని చ ।**
**గ్రహజ్వరాభిభూతానాం నస్యకర్మాఞ్జనం హితమ్ ॥ 93 ॥**

**(ఇత తాడపత్రపుస్తకే 201 తమం పత్రమ్)**

అభ్యంగమునకై సురామరియు సర్వ గంధౌషధములతో తైల పాకము చేయవలెను. సర్షపము, లశున, హింగు, త్రికటు గోరోచన, వచ, ఋక్షపిత్తము, మేకమూత్రం, కరంజఫలము గ్రహజ్వర రోగిలో నస్యకర్మకు అంజనమునకు హితకరము.

**సన్నిపాతవిబన్ధే చ వ్యాలదష్టే చ శస్యతే ।**
**అర్శఃసు యోనిశూలే చ ప్రలేపోఽయమనుత్తమః ॥ 94 ॥**

పై ఓషధుల లేపనమునే సన్నిపాతజ్వరము, మలబంధము సర్పదంశము అర్శసు యోనిశూలలో హితకరము.

**భీషణైర్హర్షణైశ్చైవ విచిత్రాద్భుతదర్శనైః ।**
**వ్యాక్షేపం మనసశ్చాస్య భిషక్కుర్యాజ్జ్వరాగమే ॥ 95 ॥**

జ్వరమున్నపుడు చికిత్సకుడు భీషణ, హర్షకారక విచిత్ర అద్భుత దర్శనములద్వారా రోగి మనో పరివర్తనము చేయవలెను.

**పానం చైతత్ ప్రదాతవ్యం స్నిగ్ధస్విన్నస్య దేహినః ।**
**త్రిభణ్డీమజగన్ధాం చ నీలినీం కటురోహిణీమ్ ॥ 96 ॥**

**కల్కం వా కటురోహిణ్యాః పిబేద్గోమూత్రసంప్లుతమ్ ।**
**చికిత్సాయాం చ యత్ ప్రోక్తం తచ్చ కుర్యాద్విధానవిత్ ॥ 97 ॥**

స్నిగ్ధ స్విన్న రోగికి త్రివృత్, అజగంధా, నీలిని, కటుకరోహిణి క్వాథమును త్రాగించవలెను- తెలిసిన వైద్యుడు ఇవిగాక ఇతర వైద్యులు చెప్పినవి కూడా ప్రయోగించవలెను.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ।**

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**(ఇతి) ఖిలేషు విషమజ్వరనిర్దేశీయో (నామ ప్రథమోధ్యాయః) ॥**

ఇది ఖిలస్థానము విషమ జ్వర నిర్దేశీయాధ్యాయము.

# విశేషనిర్దేశీయాధ్యాయః - ద్వితీయః

అథాతో విశేషనిర్దేశీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥
ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇపుడు మనము విశేష నిర్దేశీయమను అధ్యాయమును వాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

మహర్షిం కశ్యపం వృద్ధం వేదవేదాఙ్గపారగమ్ ।
సుఖోపవిష్టమవ్యగ్రమపృచ్ఛద్ వృద్ధజీవకః ॥ 3 ॥

వేదవేదాంగ పండితులు, జ్ఞానవృద్ధులు, వ్యగ్రతారహితన్మై సుఖ పూర్వకముగా ఆసీనులైన మహర్షి కశ్యపునితో వృద్ధ జీవకుడు ప్రశ్నించెను.

విషమాణాం జ్వరాణాం తే సవికల్పం సవిస్తరమ్ ।
యద్యథావచ్చ యావచ్చ ప్రోక్తం వక్తవ్యమాదితః ॥ 4 ॥

మొదలు మీరు విషమజ్వరం గురించి చెప్పవలసినదంతా వికల్పాదులు సవిస్తరముగా చెప్పినారు.

సామాన్యేనాపి సర్వేషాం జ్వరాణాం విగతజ్వర !।
వక్తుమర్హసి కార్త్స్న్యేన పరిశేషమతః పరమ్ ॥ 5 ॥

ఓ విగతజ్వరా! ఇపుడు మీరు సామాన్యముగా అన్ని జ్వరములలో ఏదైతే చెప్పవలసి ఉన్నదో అదంతా విస్తారముగా ఉపదేశించగలరు.

ఇతి సంచోదితః ప్రాహ ప్రజాపతిరిదం వచః ।
సమాసాభిహితం యచ్చ (యచ్చ) నాభిహితం హితమ్ ॥ 6 ॥

జ్వరితానాం జ్వరాణాం చ భూయో వక్ష్యామి తచ్ఛృణు ।
అవస్థాలక్షణోద్దేశవిశేషోపక్రమే క్రమాత్ ॥ 7 ॥

ఈవిధంగా ప్రశ్నించబడిన ప్రజాపతి కశ్యపుడు ఈ క్రింది జవాబును ఇచ్చెను. జ్వర రోగి జ్వరముల గురించి సంక్షేపముగా లేదా అసలు చెప్పబడిన విషయములను ఇపుడు నేను అవి క్రమముగా అవస్థా లక్షణం ఉద్దేశ విశేష ఉపక్రమముల అనుసారముగా తిరిగి చెప్పెదను.

భైషజ్యమనవస్థాయాం పథ్యమప్యవచారితమ్ ।
గుణం న కిఞ్చిత్ కురుతే దోషాయైవ తు కల్పతే ॥ 8 ॥

విపరీత అవస్థ చెప్పబడిన ఔషధీ పథ్యము కొంచెం కూడా ఫలితముల నివ్వవు. దీనికి విరుద్ధముగా దోషములనే వృద్ధి చేయును అవే అనుకూలావస్థలో ప్రయోగించిన అమృత సమానముగా పని చేయును.

ప్రయుక్తం తదవస్థాయామమృతత్వాయ కల్పతే ।
వాతాద్బాహ్యాదభీఘాతాత్ క్రోధాచ్ఛోకాద్భయాత్ క్షయాత్ ॥ 9 ॥
శ్రమాద్ గ్రహాభిషఙ్గాచ్చ వేగానాం చ విధారణాత్ ।
సముత్పన్నే జ్వరే జన్తోర్వమనం న ప్రయోజయేత్ ॥ 10 ॥
ప్రయుక్తం కురుతే క్షిప్రం తీవ్రం సోపద్రవం జ్వరమ్ ।

వాయువు, బాహ్య ఆఘాతము, క్రోధము, శోకము, భయము క్షయ, పరిశ్రమ, గ్రహ ఆక్రమణము, వేగధారణచే ఉత్పన్నమైన జ్వరములో వమనము చేయించకూడదు. అలాంటి వమనము తీవ్ర ఉపద్రవ యుక్త జ్వరము నుత్పన్నము చేయును.

పూరణాత్తు సముత్పన్నే జ్వరే హ్యామాత్రయా శ్రయేత్ ॥ 11 ॥
దోషే వృద్ధేఽతిమాత్రా చ సముత్క్లిష్టే తథైవ చ ।
సన్నిపాతజ్వరభయాత్త్వరితం వామయేద్భిషక్ ॥ 12 ॥

వామితం లఙ్ఘనాద్యైన క్రమేణోపక్రమేత్తతః ।

సంతర్పణ జన్య జ్వరములో అల్పమాత్రలో వమనము చేయించవలెను. దోషవృద్ధి, ఉత్ల్కేశమున్నప్పుడు సన్నిపాత జ్వర భయకారణమున శీఘ్రముగా అధిక మాత్రలో వమనము చేయించవలెను. వమనానంతరము లంఘనాదులచే క్రమముగా చికిత్స చేయవలెను.

వమనానన్తరం చాస్య కుర్యాచ్ఛీర్షవిరేచనమ్ ॥ **13** ॥
తథాఽఽశు శిరసః శూలం గౌరవం చోపశామ్యతి ।
విబన్ధశ్చక్షురాదీనామరుచిశ్చ నివర్తతే ॥ **14** ॥

వమనము తర్వాత శిరోవిరేచనము చేయించవలెను. తద్వారా శిరశ్శూల, శిరోగురుత్వము శీఘ్రముగా శాంతినొందును. విబంధము చక్షు మొదలగు వాటి అరుచి దూరమగును.

జీర్ణజ్వరేఽప్యథైతేషు వికారేషు ప్రదాపయేత్ ।
బహుదోషే బలవతీ మధ్యదోషేషు మధ్యమా ॥ **15** ॥
అల్పదోషే జ్వరే మృద్వీ క్రియా కార్యా విజానతా ।

జీర్ణ జ్వరములో కూడ ఈ వికారములు కల్గినపుడు శిరోవిరేచనము చేయించవలెను. వివేకవంతుడైన వైద్యుడు జ్వరములో దోషాధిక్యమున్న బలమైన, మధ్యమముగా నున్న మధ్యమ, అల్పముగా నున్న మృదు క్రియలను చేయవలెను.

స్వాని రూపాణి కార్త్స్న్యేన యదా వ్యాధా విశేషతః ॥ **16** ॥
తీవ్రాణి వ్యథితత్వం చ శరీరస్యోపలక్షయేత్ ।
బహుదోషం తదా విద్యాదల్పదోషమతోఽన్యథా ॥ **17** ॥
తథా మధ్యబలేష్వేషు మధ్యదోషం విభావయేత్ ।

రోగము సంపూర్ణ లక్షణములు తీవ్ర అవస్థలో నున్నప్పుడు శరీర వ్యథ ఎక్కువగా నున్నపుడు దోషములు అధిక మాత్రలో నున్నవని తెలుసుకొనవలెను. దీనికి విపరీతముగానున్నచో దోషములు అల్పముగానున్నవని తెలుసుకొనవలెను. రోగ బలము మధ్యమముగా నున్నప్పుడు దోషములు మధ్యమముగా నున్నవని తెలుసుకొనవలెను.

విబన్ధారుచితృణ్మూర్ఛా గాత్రభేదః శిరోరుజా ॥ 18 ॥
ప్రలాపాలస్యహృల్లాసతన్ద్రీదాహశ్రమభ్రమాః ।
మూత్రప్రచురతా గ్లానిః పురీషస్యావిపక్వతా ॥ 19 ॥
ఉత్క్లేశో గురుకోష్ఠత్వం లిఙ్గాన్యామజ్వరే వదేత్ ।

**ఆమజ్వర లక్షణములు :** విబంధము, అరుచి, తృష్ణ, మూర్ఛ, గాత్రభేదము, శరీరపీడ, ప్రలాపము, ఆలస్యము, హృల్లాసము, తంద్రా, దాహ, శ్రమ, భ్రమ, మూత్రాధిక్యత, గ్లాని, మల అపక్వము, ఉత్క్లేశము, కోష్ఠగురుత్వము, ఇవి ఆరు జ్వర లక్షణములు.

నివృత్తౌ ప్రాయశశ్చైషాం సంజాతే జ్వరమార్దవే ॥ 20 ॥
లఘుత్వం చాష్టరాత్రే చ నిరామజ్వరమాదిశేత్ ।

**నిరామ జ్వర లక్షణములు :** పై చెప్పిన లక్షణములు దూరమైనప్పుడు, జ్వరము మృదువగుట, 8 దినములలో శరీరము లఘువగుట నిరామ జ్వరమనబడును.

ఆపాతలక్ష్యః స్యాదూష్మా తత్క్షణాదేతి మార్దవమ్ ॥ 21 ॥
అన్తర్లఘుత్వముత్సాహో దోషపక్తిః ప్రసన్నతా ।
తృష్ణాదీనాం మృదుత్వం చ బహిర్మార్గగతే జ్వరే ॥ 22 ॥
తత్రాభ్యఙ్గాన్ ప్రదేహాంశ్చ పరిషేకాంశ్చ కారయేత్ ।

**బహిర్మార్గ గత జ్వర లక్షణములు :** సర్వ శరీర సంచారి మరియు ప్రత్యక్షముగా కనబడు ఊష్మ అదే క్షణములో మృదువగును. అంతరావయములు లఘువగును. శరీరముత్సాహముగా నుండును. దోషములు పక్వమగును. శరీరము ప్రసన్నమగును. తృష్ణాదులు మృదువగును. ఈ జ్వరములో అభ్యంగము ప్రదేశము పరిషేకాదులు చేయవలెను.

అవిపక్వా విపక్వా వా దోషా యస్య న నిర్హృతాః ॥ 23 ॥
న చ వ్యాధేరుపశమో న చోత్సాహో న లాఘవమ్ ।
గ్లానికార్శ్యే న చాత్యర్థం న చ చ్ఛన్దోఽశనం ప్రతి ॥ 24 ॥
అప్రకృష్టే (ప్రకృష్టే) వా స కాలే దోషదుర్బలః ।
అతో విపర్యయాద్దేహీ భవేదౌషధదుర్బలః ॥ 25 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 202 తమం పత్రమ్)

అవిపక్వ పక్వ దోషములు నిర్ధారణము కానపుడు వ్యాధి శాంతి శరీర ఉత్సాహము, లఘుత్వము, గ్లాని, కృశత, రుచి ఇవి లేనపుడు ఎక్కువ లేదా తక్కువ సమయములో ఆ రోగి దోషములచే దుర్బలముగా ఉన్నాడని తెలిసికొనవలెను. దీనికి విపరీత రోగికి ఔషధకారణముచే దుర్బలుడైనాడని తెలిసికొనవలెను.

**పాచనైరవిపక్వానాం దోషాణాం దోషదుర్బలే ।**
**సమ్యక్కుర్యాదుపశమం పక్వానాం చ విరేచనైః ॥ 26 ॥**

దోషములచే దుర్బలమైన వ్యక్తిలో అపక్వ దోషములను పాచక ద్రవ్యములతో మరియు పక్వదోషములను విరేచన ద్రవ్యముల ద్వారా శాంతింపచేయవలెను.

**ఇతరస్యామయాపేక్షం బలాప్యాయనమిష్యతే ।**
**సముదీర్ణేషు సహసా దోషేష్వభినవేషు చ ॥ 27 ॥**

ఇందులో ఔషధంతో దుర్బలమైన వ్యక్తిలో ఉదీర్ణమైన నవీన దోషములలో బలవృద్ధి చేయవలెను.

**బలవద్ దుర్బలే వాఽపి కషాయం వాఽపి భేషజమ్ ।**
**సంరక్షన్ ధర్మయశసీ న ప్రయుఞ్జ్యాత్ కదాచన ॥ 28 ॥**

ధర్మము, యశస్సు కాపాడుకొని వైద్యుడు దుర్బల రోగికి బలమైన కషాయములను ఔషధములను ఎపుడూ ప్రయోగించకూడదు.

**యథా శరత్సు మహతోః క్రుద్ధయోరభిషక్తయోః ।**
**న ధత్తే దుర్బలా వేగం హస్తినోరగ్రవారణీ ॥ 29 ॥**
**తథా బలం బలవతోస్తద్దోషౌషధయోర్ద్వయోః ।**
**సంక్షుబ్ధయోర్న సహతే సంతప్తా దేహినస్తతః ॥ 30 ॥**

శరదృతువులో మదంతో మత్తెక్కిన క్రుద్ధ ఏనుగు వేగమును దుర్బలమైన ఆడ ఏనుగు సహించజాలనట్లు బలమైన క్షుభిత దోషములు ఔషధముల వేగములను పీడిత ప్రాణి సహించజాలడు.

**పుష్ణాతి దుర్బలం దోషాః కషాయః స్తమ్భయత్యతః ।**
**భూయోఽభివృద్ధాస్తే ప్రాణాన్నిఘ్నన్త్యాశు శరీరిణః ॥ 31 ॥**

కషాయేణాకులీభూతాశ్చిరం సంక్లేశయన్తి వా ।

దోషదుర్బలమైన రోగిని కషాయములు దోషస్తంభనం చేసి పుష్టి కలిగించును తిరిగి ప్రకోపమైన దోషములు శీఘ్రముగా మనిషి ప్రాణమును హాని చేయును. లేదా కషాయం ద్వారా వ్యాకులము చెందిన దోషములు చాలాకాలము వరకు క్లేశమును కలిగించును.

భగ్నవేగేషు దోషేషు విధినా లఙ్ఘనాదినా ॥ 32 ॥
కాలే ప్రయుక్తం భైషజ్యం స్యాద్వికారోపశాన్తయే ।

దోష వేగములు నశించిన పిదప లంఘనాదులచే ఉచిత కాలములో ప్రయోగింపబడిన ఔషధము రోగమును శాంతింపచేయును.

లఙ్ఘనం స్వేదనం పేయా త్రివిధా దీపనాన్వితా ।
ఓదనస్త్రివిధో యూషః కషాయస్త్రివిధో రసః ॥ 33 ॥
సర్పిరభ్యఞ్జనం బస్తిః ప్రదేహః సావగాహనః ।
జ్వరాపహః సముద్దిష్టో లఙ్ఘనాదిరయం క్రమః ॥ 34 ॥

**లంఘనాది క్రమము :** లంఘనము, స్వేదనము, 3 విధములైన దీపన పేయలు, ఓదనము, 3 విధములైన యూషములు, కషాయము, 3 విధములైన రసము, ఘృతము, అభ్యంగం, వస్తి, ప్రదేహము, అవగాహము, ఇవి జ్వరమును నష్టమొందించు క్రమము చెప్పబడినది.

పచ్యన్తే సప్తరాత్రేణ దోషాః సప్తసు ధాతుషు ।
తస్మాత్ కషాయం సప్తాహే పాచనీయం విధాపయేత్ ॥ 35 ॥
శమనం స్రంసనీయం వా యథావస్థమతం పరమ్ ।

ఏడు దినములలో సప్తధాతువులలో స్థితమైన దోషపాచనము జరుగును. కావున 8వ దినమున పాచన కషాయం త్రాగించవలెను తరువాత అవస్థానుసారముగా శమన, స్రంసన కషాయములు ప్రయోగించవలెను.

మన్దోష్మత్వాత్ స్థిరత్వాచ్చ గురుత్వాచ్చ కఫజ్వరః ॥ 36 ॥
పరిపాకం చిరాదేతి తస్మాదస్యౌషధక్రమః ।
అష్టాహాత్ పరతో వాఽపి యథాపాకం విధీయతే ॥ 37 ॥

ఉష్ణము తగ్గుటచే స్థిరము గురువగుటచే కఫజ్వరము ఆలస్యముగా పక్వం చెందును. పక్వానుసారము 8వ దినము తరువాత కషాయ రూపంలో ముఖ్య ఔషధ క్రమమును ప్రారంభించవలెను.

పక్వావశేషస్తేనాశు పచ్యతేఽగ్నిశ్చ దీప్యతే ।
దోషపక్త్యాఽగ్నిదీప్త్యా చ జ్వరస్యాపచయో ధ్రువమ్ ॥ 38 ॥

వీటిచే పక్వం కాగా మిగిలిన దోషములు శీఘ్రంగా పక్వం నొందును. జఠరాగ్ని ప్రదీప్తినొందును. ఈ విధముగా దోషపాచనము అగ్నిప్రదీప్తం అగుటచే జ్వరము నిశ్చితముగా శాంతించును.

తద్యుక్తరస్నేహసంస్కారాన్ రసానత్రావచారయేత్ ।
తతః సంశమనం కుర్యాద్వ్యాధిశేషోపశాన్తయే ॥ 39 ॥

శేష రోగ శాంతి కొరకు స్నేహ సంస్కార రసములను ప్రయోగించి తరువాత దోషశమనము చేయవలెను.

ప్రసాదనార్థం ధాతూనాం బలస్యాప్యాయనాయ చ ।
దేశదోషాగ్నిసాత్మ్యర్తుయుక్తం చాత్ర ప్రశోషణమ్ ॥ 40 ॥

త్ర్యహం చతురహం వాఽపి నాతిమాత్రమతః పరమ్ ।
రూక్షత్వాజ్జ్వర్యమాణాయ దేయం సర్పిర్జ్వరాపహమ్ ॥ 41 ॥
జ్వరితోఽనేన నిర్వాతి ప్రదీప్తం చామ్బునా గృహమ్ ।

ధాతు ప్రసాదనము, బలప్రాప్తి కొరకు దేశ దోష జాఠరాగ్ని, సాత్మ్యం ఋతు అనుసారం 3 లేదా 4 దినములలో దోష శోషణం చేయవలెను. దీనికంటె మించకూడదు. తరువాత దీనివలన జ్వరరోగి రూక్షమగుటచే స్వల్ప మాత్రలో జ్వరనాశకఘృతం ప్రయోగించవలెను. దగ్ధం అగు గృహము జలముతో ఆర్పివేసినట్లు జ్వరరోగికి ఘృత ప్రయోగము చేసి శాంతింప చేయవలెను.

సర్పిః పిత్తం శమయతి శైత్యాత్ స్నేహాచ్చ మారుతమ్ ॥ 42 ॥
సమానగుణమప్యేతత్ సంస్కారాజ్జీయతే కఫమ్ ।

ఘృతము శీతగుణం అగుటచే పిత్తమును, స్నిగ్ధం అగుటచే వాయువును శమింప చేయును. కఫంనకు సమానగుణం కలిగి ఉన్నప్పటికి సంస్కారముచే కఫంను శాంతింప చేయును.

అథ చేద్బహుదోషత్వాత్ కృతేఽపి శమనే సతి ॥ **43** ॥
పక్వాశయగురుత్వం చ స్తిమితత్వం చ లక్ష్యతే ।
స్వేదో విణ్మూత్రరాగశ్చ భక్తస్యానభినన్దనమ్ ॥ **44** ॥
స్నిగ్ధాయ క్షామదేహాయ దద్యాత్తత్ర విరేచనమ్ ।

దోషాధిక్యముచే దోషములు శమింపబడినప్పటికి పక్వాశయంలో గురుత్వం, స్థిమితత, స్వేదము, మలమూత్రము రాగయుక్తం అగుట, అరుచి ఉన్నచో స్నిగ్ధం దుర్బల శరీరం కలిగిన రోగికి విరేచనము చేయుంచవలెను.

శూలే పక్వాశయగతే పార్శ్వపృష్ఠకటిగ్రహే ॥ **45** ॥
వాతవిణ్మూత్రసఙ్గే చ నిరూహః సానువాసనః ।
బహిర్మార్గగతే చాపి జ్వరేఽభ్యఙ్గాదిరిష్యతే ॥ **46** ॥

పక్వాశయ శూల, పార్శ్వగ్రహము, పృష్ఠగ్రహము, కటిగ్రహము, వాయు మలమూత్ర అవరోధము ఉన్నచో అనువాసన, నిరూహ వస్తి ఇవ్వవలెను. జ్వరము బహిర్ మార్గగతం అయినచో అభ్యంగాదులు చేయవలెను.

నరస్య వాతప్రకృతేర్యది స్యాద్వాతికో జ్వరః ।
ఋతౌ చ వాతప్రకృతౌ స దుఃసాధ్యస్త్రిసంకరః ॥ **47** ॥
తథైవ పిత్తప్రకృతేః శ్లైష్మికస్య చ దేహినః ।
విపరీతప్రకృతయః సుఖసాధ్యా జ్వరాదయః ॥ **48** ॥

వాత ప్రకృతి కల వానికి వాతఋతువులో ( వర్షఋతువు) వాత జ్వరము వచ్చినచో 3 దోషములు కలియుట వలన కష్టసాధ్యం అగును. ఇదే విధంగా పిత్తకఫ ప్రకృతి రోగులలో కూడా ఆయాఋతువులలో ఆయాజ్వరములు వచ్చినచో కష్ట సాధ్యం అగును. విపరీత ప్రకృతి కలిగిన సుఖసాధ్యం అగును.

ఏకద్విత్రిప్రకృతయో వ్యాధయః సర్వ ఏవ హి ।
సుఖదుఃఖాశ్చికిత్స్యాః స్యుః ప్రాయశస్తే యథాక్రమమ్ ॥ **49** ॥

ఏకదోష సంసర్గ సన్నిపాత ప్రకృతుల వారికి సమస్త వ్యాధులు క్రమముగా సుఖసాధ్యము, దుఃఖసాధ్యం అగును.

**సముత్క్లిష్టేషు దోషేషు త్రివిధం కర్మ నిశ్చితమ్ ।**
**శోధనం శమనం చైవ తథా శమనశోధనమ్ ॥ 50 ॥**

దోషములు ఉత్క్లేశము చెందినపుడు 3 విధముల కర్మలు చేయవలెను, 1. శోధనం, 2. శమనం. 3. శమన- శోధనం.

**తత్ర పుంసాం బలవతాం (మన్ద) బహ్నిమతాం సతామ్ ।**
**తీవ్రవేగామయానాం చ హితం శోధనమౌషధమ్ ॥ 51 ॥**

శోధన ఔషధ అర్హులు: బలవంతుడు, మందాగ్ని కల రోగికి రోగము తీవ్ర వేగముగా ఉన్నచో శోధన ఔషధమును ఇవ్వవలెను.

**బలినామల్పదోషాణాం నాతివృద్ధవికారిణామ్ ।**
**నాతిక్లేశసహానాం చ శమనం హితముచ్యతే ॥ 52 ॥**

శమన ఔషధము: బలవంతుడు, అల్పదోషములు కలవాడు అధికక్లేశం సహించని వాడు రోగము అధికంగా వృద్ధి నొందనిచో శమనన ఔషధం హితకరము.

**తథైవ మధ్యదోషాణాం దుర్బలానాం శరీరిణామ్ ।**
**బలవద్వ్యాధిజుష్టానాం హితం శమనశోధనమ్ ॥ 53 ॥**

శమన శోధన ఔషధము: అదే విధముగా మధ్యదోషములు కలిగి దుర్బలమైన వ్యక్తి బలమైన వ్యాధి ఉన్నచో శమన- శోధన ఔషధంలు ఇవ్వవలెను.

**ఊర్ధ్వ హరతి యద్దోషానధశ్చోభయతశ్చ యత్ ।**
**ద్రవ్యం వివిధవీర్యత్వాత్తద్ధి సంశోధనం స్మృతమ్ ॥ 54 ॥**

ఊర్ధ్వ, అధో, ఉభయ మార్గముల ద్వారా దోషములను వెడలించు ద్రవ్యములు వివిధ వీర్యములు కలవగుటచే శోధన ద్రవ్యములు అనబడును.

**నాధో న చోర్ధ్వం హరతి యద్దోషాచ్ఛమయత్యపి ।**
**న చోగ్రగుణవీర్యం తద్ ద్రవ్యం సంశమనం విదుః ॥ 55 ॥**

ఊర్ధ్వ అధోమార్గముల ద్వారా దోషములను వెడలించకకేవలం శమనం చేయు ఉగ్రము కాని వీర్యగుణములు కలిగిన ద్రవ్యములను సంశమన ద్రవ్యములు అందురు.

నాత్యర్థం శోధయతి యద్దోషాన్ సంశమయత్యపి ।
తత్ర మధ్యబలోపేతం ద్రవ్యం శమనశోధనమ్ ॥ **56** ॥

అధిక శోధనమును శమనమును చేయక మధ్య బలము కలిగిన ద్రవ్యములను శమన శోధన ద్రవ్యములు అందురు.

దశమూలశటీరాస్నావయస్థాపఞ్చకోలకమ్ ।
శార్ఙ్గేష్టా రోహిణీ పాఠా సరలో దేవదారు చ ।
ముస్తాఽమృతా వృశ్చికాలీ కర్కటాఖ్యా దురాలభా ॥ **57** ॥
త్రాయన్తీత్యేవమాదీని శమనీయాని నిర్దిశేత్ ।

శమన ద్రవ్యములు : దశమూలములు కచ్చూరములు, రాస్నా, హరీతకి, పంచకోలములు, శారంగేష్ట, ( కాకజంఘా లేద కాకమాచి) రోహిణి, పాఠ, సరళ, దేవదారు, ముస్త, గుడూచి, వృశ్చికాలి, కర్కాటక శృంగి, దురాలభ, త్రాయంతి మొదలగునవి.

క్షారద్వయం సగోమూత్రం మదనం లవణాని చ ।
త్రిఫలాఽఽరగ్వధో దన్తీ నీలినీ సప్తలా త్రివృత్ ॥ **59** ॥
ఏవమాది తు యచ్చాన్యద్ ద్రవ్యం శోధనముచ్యతే ।

శోధనద్రవ్యములు - వచ, కోశాతకి, వేప, పిప్పలి, కుటజ, ఇంద్రయవ, క్షారద్వయం, గోమూత్రం, మదన ఫలము, పంచలవణములు, త్రిఫలములు, ఆరగ్వధము, దంతి, నీలిని, సప్తలా, త్రివృత్, మొదలగునవి. ఈ విధమైన వేరే ద్రవ్యాలను కూడ శోధన ద్రవ్యములు అంటారు.

కాశ్మర్యామలకం ద్రాక్షా శీతపాకీ పరూషకమ్ ॥ **60** ॥
మధుకం పిప్పలీమూలం విడఙ్గం హిఙ్గు సైన్ధవమ్ ।
పాఠాఽజగన్ధాఽతివిషా పథ్యా ముస్తా కటుత్రికమ్ ॥ **61** ॥
రోహిణీత్యేవమాది స్యాద్ ద్రవ్యం శమనశోధనమ్ ।

శమన - శోధన ద్రవ్యములు- కాశ్మరీ, ఆమలకీ, ద్రాక్ష, కాకోలి, పరూషకము, యష్టిమధు, పిప్పలీ మూలం, విడంగం, హింగు, సైంధవలవణము,

పాఠ, అజగంధా, అతివిష, హరీతకి, ముస్త, త్రికటు, రోహిణి, మొదలగునవి శమనశోధనములు.

త్రివిధం కర్మ నిర్దిష్టమిత్యేతద్దోషశాన్తయే ॥ 62 ॥

ఈవిధంగా దోషములను శాంతింపచేయుటకు మూడు విధములైన ద్రవ్యములు చెప్పబడినవి.

దోషశాన్తౌ చ ధాతూనాం ప్రసాద ఉపజాయతే ।
మలాయనానాం సర్వేషామవ్యాఘాతక్రియాసు చ ॥ 63 ॥
దోషధాతుమలైస్తస్మాత్ స్వే స్వే కర్మణ్యవస్థితైః ।
స్వాస్థ్యముత్పద్యతే నృణామస్వాస్థ్యం తద్విపర్యయే ॥ 64 ॥

దోషములు శాంతించి, మలస్థానములు ఉపద్రవ రహితమైనపుడు ధాతువులలో ప్రసన్నము ఉత్పన్నమగును. ఈ విధముగా దోషధాతుమలములు తమతమ కార్యములలో స్థితమైనప్పుడు మనుష్యుడు స్వస్థముగా నుండును విపరీతమైనప్పుడు అస్వస్థుడగును.

సమ్యగాహారచేష్టాభ్యాం యదా సాత్మ్యం యథేరితమ్ ।
సమానాం రక్షణం కుర్యాద్దోషాదీనాం విచక్షణః ॥ 65 ॥
కుపితానాం ప్రశమనం క్షీణానామభివర్ధనమ్ ।
క్షపణం చైవ వృద్ధానామేతావద్ధి చికిత్సితమ్ ॥ 66 ॥

సమ్యక్ ప్రకారమైన ఆహారము మరియు చేష్టల ద్వార సాత్మ్యమైనపుడు బుద్ధిమంతుడైన వాడు సామ్యావస్థలో నున్న దోషాదులను రక్షించుకొనవలెను. కుపితదోషముల శమనమును, క్షీణదోషములను వృద్ధి, వృద్ధి చెందిన దోషములను తగ్గించవలెను. ఇదే చికిత్స అనబడును.

తదేకత్వమనేకత్వమవస్థాముదయవ్యయమ్ ।
దోషాణామాతురాణాం చ సంప్రధార్య బలాబలమ్ ॥ 67 ॥
యథావదౌషధానాం చ భిన్నానాం నామరూపతః ।
రసాన్ గుణాంశ్చ వీర్యం చ విపాకం చ యథాతథమ్ ॥ 68 ॥

**దేశం కాలముపాయం చ ప్రమాణం వ్యాధిమేవ చ ।**
**జ్ఞాత్వా చికిత్సా భిషజా ప్రణేతవ్యాఽప్రమాదతః ॥ 69 ॥**

చికిత్సకునికి దోషములు, రోగి ఏకత్వ అనేకత్వ ఉద్భవము, బలా బలమును చూచి నామరూపానుసారము వేర్వేరు ఔషధముల రసగుణ వీర్య విపాక దేశకాల ఉపాయ ప్రమాణవ్యాధులను తెలిసికొని ప్రమాద రహితముగా చికిత్స చేయవలెను.

**యే యథా చ సముద్దిష్టా యోగాః స్వే స్వే చికిత్సితే ।**
**తే తథైవ ప్రయోక్తవ్యా న తేష్వస్తి విచారణా ॥ 70 ॥**

తమ తమ చికిత్సలలో యోగములు ఏ ఏరూపములో ఇవ్వబడినవో వాటిని అవే రూపములో ప్రయోగించవలెను. ఇందులో విశేష విచారణ అవసరము లేదు.

**కో హి నామ ప్రణీతానాం ద్రవ్యాణాం తత్త్వదర్శిభిః ।**
**నానావిధానామేకత్వే తత్కర్మ జ్ఞాతుమర్హతి ॥ 71 ॥**

తత్త్వ దర్శులైన ఋషులు ద్వార ప్రణీతమైన నానాద్రవ్యములు ఏకమైనపుడు వాటి కర్మలను ఎవరు తెలుసు కొనగలరు.

**కిఞ్చిదన్యరసం ద్రవ్యం గుణతః కిఞ్చిదన్యథా ।**
**వీర్యతశ్చాన్యథా కిఞ్చిద్విద్యాదత్ర విపాకతః ॥ 72 ॥**
**అథ చైకత్వమాగమ్య ప్రయోగే న విరుధ్యతే ।**
**ఉత్పద్యతే యథార్థం చ సమవాయగుణాన్తరమ్ ॥ 73 ॥**
**పృథక్పృథక్ప్రసిద్ధేఽపి గన్ధే గన్ధాన్తరం యథా ।**
**గన్ధాఙ్గానాం మనోహ్లాది ప్రత్యక్షం సామవాయికమ్ ॥ 74 ॥**

కొన్ని ద్రవ్యములు రసము ద్వారా, కొన్ని గుణము ద్వారా, కొన్ని వీర్యము ద్వారా, కొన్ని విపాకము ద్వారా విరుద్ధమగును. ఇవి పరస్పరము ఏకమైనప్పుడు ప్రయోగ విరుద్ధము కావు. సమవాయముచే యధార్థ గుణాంతరము ఉత్పత్తి అగును. వేర్వేరు ప్రసిద్ధ గంధ ద్రవ్యములు పరస్పరము కలిసినపుడు ప్రత్యక్షముగా ఆహ్లాదితమగు క్రొత్త గంధము ఉత్పన్నమగునట్లు.

తస్మాదార్షప్రయోగేషు ప్రక్షేపాపచయం ప్రతి ।
న ప్రమాద్యేదవిజ్ఞాయ దోషౌషధబలాబలమ్ ॥ 75 ॥

కావున ఆర్ష యోగములను ప్రక్షేపము, అపచయముల దోషములు, ఔషధ బలాబలములు తెలుసుకొనక ప్రయోగించ కూడదు.

వయః శరీరాగ్నిబలం త్వవేక్ష్య మతిమాన్ భిషక్ ।
మాత్రాం వికల్పయేదత్ర ప్రధానావరమధ్యతః ॥ 76 ॥

వివేకవంతుడైన వైద్యుడు రోగి శరీరము, అగ్ని బలము చూచి ప్రధాన, అవర, మధ్యమ మాత్రను నిర్ణయించవలెను.

ఇతి జ్వరాణాముద్దిష్టో విశేషోఽయముపక్రమే ।
యం విదిత్వా తు కార్యేషు వివిధేషు న సంభ్రమేత్ ॥ 77 ॥

ఈ విధముగా జ్వరచికిత్సలో విశేష క్రమము చెప్పబడింది. ఇది తెలిసిన తర్వాత వివిధ కార్యములలో మతిభ్రమ కలుగదు.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 78 ॥
అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

ఇది ఖిలస్థావమందలి విశేష నిర్దేశీయమను రెండవ అధ్యాయము.

# భైషజ్యోపక్రమణీయ - తృతీయోఽధ్యాయః

అథాతో భైషజ్యోపక్రమణీయమధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇపుడు మనము భైషజ్యోపక్రమణీయాధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

బ్రాహ్మ్య శ్రియా ప్రజ్వలన్తం బ్రహ్మర్షిమమితద్యుతిమ్ ।
కశ్యపం లోకకర్తారం భార్గవః పరిపృచ్ఛతి ॥ 3 ॥

బ్రహ్మతేజస్సుతో ప్రజ్వలితుడైన అత్యంత కాంతి వంతుడైన లోకగురువు బ్రహ్మర్షి కాశ్యపునితో భార్గవుడు ( వృద్ధజీవకుడు) ప్రశ్నించెను.

ఆబాధకారణం వ్యాధిర్భేషజం సుఖకారణమ్ ।
సమ్యగ్యుక్తం తదమృతం తదన్యద్విషవద్భవేత్ ॥ 4 ॥

వ్యాధి రోగ కారణము, ఔషధము సుఖ కారకము. సమ్యక్ ప్రకారము ప్రయోగించబడిన ఔషధము అమృత సమానము, అసమ్యక్ ప్రయోగము చేసిన విషతుల్యమగును.

భేషజోపక్రమం తస్మాద్భగవాన్! వక్తుమ్మర్హసి ।
ఔషధం కిమధిష్ఠానం కథం చాస్యోపదిశ్యతే ।
ఔషధజ్ఞౌషధత్వం చ భేషజత్వమథాపి చ ॥ 5 ॥

భైషజ్యత్వాగదత్వం చ కషాయత్వం తథైవ చ ।
యథా చ గౌణ్యేన రసా ద్రవ్యే ద్రవ్యే వ్యవస్థితాః ॥ 6 ॥
ప్రాధాన్యేన యథా దృష్టో మధుకే మధురో రసః ।
ఆమ్లః కపిత్థే, లవణః సైన్ధవే, నాగరే కటుః ॥ 7 ॥
తిక్తస్తిక్తకరోహిణ్యాం, కషాయశ్చాభయాం ప్రతి ।
సత్యేవం రసనానాత్వే సంయోగః సర్వ ఏవ హి ॥ 8 ॥
కషాయత్వేన నిర్దిష్టః కుతః కిం చాత్ర కారణమ్ ।
కతి కే చౌషధగుణా భేదాశ్చాస్య కతి స్మృతాః ॥ 9 ॥
కతి కే చౌషధకాలాశ్చ కాలే కాలే చ కో విధిః ।
కస్యాం కస్యామవస్థాయాం పాతవ్యం భేషజం న వా ॥ 10 ॥
కథం చ పేయం పీతస్య పరిహార్యం చ కిం భవేత్ ।
జీర్యమాణస్య కిం రూపం కిం చ జీర్ణస్య లక్షణమ్ ॥ 11 ॥
విభజ్య వయసస్త్రిత్వం కథం మాత్రా విధీయతే ।
అధోభాగోర్ధ్వభాగానాం దోషసంశమనీ చ యా ॥ 12 ॥
జీవనీయా చ యా మాత్రా దీపనీయా చ యా స్మృతా ।
మాత్రా సంశోధనీ యా చ స్నేహమాత్రా చ యా భవేత్ ॥ 13 ॥
సర్వమేతద్యథాతత్త్వం కీర్తయస్వ మహామునే !।
జాతమాత్రముపాదాయ యావద్వర్షశతం పరమ్ ॥ 14 ॥

కావున ఓ భగవాన్! మీరు ఓషధి ఉపక్రమము ఉపదేశించగలరు. ఓషధి అధిష్ఠానమేమి? ఔషధ జ్ఞానము, ఓషధి, భేషజము భైష్యజ్యము, అగదము, కషాయము ఏవిధముగా ఉపదేశించబడును? వేర్వేరు ద్రవ్యములలో గుణరూపములు వేర్వేరుగా నుండును. కాని ప్రధానముగా యష్ఠిమధు లోమధురరసము, కపిత్థములో ఆమ్లరసం సైంధవంలో లవణరసం, శుంఠిలో కటురసం, తిక్తరోహిణిలో తిక్తరసం, హరీతకిలో కషాయ రసము చెప్పబడినవి. ఈ విధంగా రసములు నానావిధములైనప్పటికి వాటి సముదాయమును

కషాయరసముగా ఎందుకు చెప్పబడినది? దీని కారణమేమి? ఔషధమునకు ఎన్ని, ఏ ఏ గుణములుండును? వీటి భేదములేమి? ఔషధకాలములెన్ని? వేర్వేరు కాలములలో ఔషధసేవన విధానమేమి? ఏ అవస్థలో ఔషధప్రయోగము చేయువలెను. ఏ అవస్థలో చేయకూడదు? ఔషధమును ఏ విధముగా సేవించవలెను? ఔషధ సేవనాంతరం పథ్యమేమి? ఔషధము జీర్ణమగుచున్నపుడు, జీర్ణమైన పిదప లక్షణములేమి? బాలుడు జన్మించినది మొదలుకొని 100 సం॥లవరకు ఆయువును 3గా విభజించి ఊర్ధ్వ అధోమార్గముల ద్వారా దోష సంశమనము చేయు, జీవనీయ దీపనీయ, సంశోధనీయ, స్నేహమాత్రను ఏవిధముగా విభాగము చేయబడును. వీటన్నిటిని సక్రమముగా ఉపదేశించగలరు.

**ఇతి శుశ్రూషమాణాయ శిష్యాయ వదతాంవరః ।**
**ఆచచక్షే యథాన్యాయం భైషజ్యోపక్రమం ప్రతి ॥ 15 ॥**

ఈ విధముగా వినుటకునిచ్ఛగించిన శిష్యునికి జ్ఞాని మహర్షి కశ్యపుడు యథా యోగ్యముగా భైషజ్యోప క్రమమును ఉపదేశించును.

**అయం హేతురిదం లిఙ్గమస్య చాయముపక్రమః ।**
**ఇతి తావత్ పరం సూక్ష్మం వ్యాధిజ్ఞానం ప్రచక్షతే ॥ 16 ॥**

రోగమునకు ప్రత్యేక హేతు, లింగ, చికిత్స కలవు. ఈ విధముగా రోగ జ్ఞానము అతి సూక్ష్మమైనది.

**అస్మాదప్యౌషధజ్ఞానమాహుః సూక్ష్మతరం బుధాః ।**
**తదహం తేఽభిధాస్యామి కార్త్స్న్యేనైవ నిబోధ మే ॥ 17 ॥**

జ్ఞానులు రోగము కంటె కూడ ఓషధి జ్ఞానమును అతి సూక్ష్మము పేర్కొందురు. కావున నేను నీకు సంపూర్ణముగా ఔషధ జ్ఞానమును ఉపదేశించెదను, వినుము.

**పథ్యసేవినమారోగ్యం గుణేన భజతే నరమ్ ।**
**అపథ్యసేవినం క్షిప్రం రోగః సమభిమర్దతి ॥ 18 ॥**

పథ్యసేవనము చేయు వ్యక్తి స్వాస్థ్యము ప్రాప్తించును. అపథ్యసేవనము చేయువాడిని రోగములు చుట్టు ముట్టును.

స రోగో ద్వివిధశ్ప్రోక్తః శారీరో మానసస్తథా ।
ఆధయో మానసాస్తత్ర శారీరా వ్యాధయః స్మృతాః ॥ **19** ॥
సాధ్యోఽసాధ్యశ్చ యాప్యశ్చ త్రివిధం రోగలక్షణమ్ ।

రోగములు 2 విధములు 1. శారీరకము 2. మానసికములు. మానసిక రోగములను ఆధి అని, శారీరకరోగములను వ్యాధి అనెదరు. సాధ్యము అసాధ్యము యాప్యములని రోగలక్షణములు 3 విధములు.

**వాతపిత్తకఫా దోషాః శారీరవ్యాధిహేతవః ॥ 20 ॥**
**సత్త్వేతరం చ ద్వన్ద్వం చ మానసామయహేతవః ।**

వాతపిత్త కప దోషములు శారీరక రోగ కారణములు. సత్త్వగుణము కాక శేష రజస్తమో గుణములు మానసిక రోగ కారణములు.

**ధృతివీర్యస్మృతిజ్ఞానవిజ్ఞానైర్మాన సంజయేత్ ॥ 21 ॥**
**శారీరం భేషజైః కాలయుక్తిదైవవ్యపాశ్రయైః ।**

మానసిక రోగములను దృతి వీర్యము, స్మృతి, జ్ఞాన విజ్ఞానముల ద్వారా శారీరక రోగములను కాలవ్యపాశ్రయము, యుక్తి వ్యపాశ్రయము, దైవవ్యపాశ్రయ ఔషధముల ద్వారా జయించవలెను.

**స పునర్ద్వివిధో వ్యాధిరాగన్తుర్నిజ ఏవ చ ॥ 22 ॥**
**ఆగన్తుర్బాధతే పూర్వం పశ్చాద్దోషాన్ ప్రపద్యతే ।**
**నిజస్తు చీయతే పూర్వం పశ్చాద్వృద్ధః ప్రబాధతే ॥ 23 ॥**

వ్యాధులు నిజ ఆగంతుక భేదములచే 2 విధములు. ఆగంతుకవ్యాధులు మొదలు శారీరమును నష్టముచేసి తర్వాత వాతాది దోషములను ప్రకోపింపచేయును. నిజవ్యాధులలో మొదట దోషము వికృతి చెంది తర్వాత శరీరమునకు కష్టమును కల్గించును.

**తస్మాదాగన్తురోగాణాం పశ్యన్తి నిజవత్ క్రియాః ।**
**నిజానాం పూర్వరూపాణి దృష్ట్వా సంశోధనం హితమ్ ॥ 24 ॥**

కావున ఆగంతుక రోగములను కూడ నిజ రోగముల వలె చికిత్స

చేయవలెను. ఆగంతుక రోగములో నిజరోగము యొక్క పూర్వ రూపమును చూసి సంశోధనము చేయవలెను.

సంశోధనం సప్తవిధం తదాయత్తం చికిత్సితమ్ ।
తచ్చాయత్తం చతుష్పాదే పాదశ్చౌషధముచ్యతే ॥ **25** ॥
ఓషధం యుక్త్యధిష్ఠానం దైవాధిష్ఠానమేవ చ ।
యుక్తిర్వమనకర్మాది దైవం యాగాది కీర్త్యతే ॥ **26** ॥

సంశోధనము 2 విధములుగా నుండును. దీనిపైనే చికిత్స ఆధారపడి ఉండును. చికిత్సాచతుష్పాదముపై ఆధారపడి ఉండును. ఈ చతుష్పాదమే ఓషధి అనబడును. ఓషధి యుక్తి దైవమునకు అధి ష్ఠానమై యుండును. వమనాది క్రియలు యుక్త అనబడును. యజ్ఞ యాగాదులు దైవమనబడును.

ఓసో నామ రసః సోఽస్యాం ధీయతే యత్తదోషధిః ।
ఓసాదారోగ్యమాధత్తే తస్మాదోషధిరోషధః ॥ **27** ॥
భిషగ్విజ్ఞానేయత్వాద్భేషజం భిషజో విదుః ।
భిషజ్జితే హితత్వాచ్చ భైషజ్యం పరిచక్షతే ॥ **28** ॥
అగదత్వం చ యుక్తస్య గదానామపునర్భవాత్ ।
కణ్ఠస్య కషణాత్ ప్రాయో రోగాణాం వాఽపి కర్షణాత్ ॥ **29** ॥
కషాయశబ్దః ప్రాధాన్యాత్ సర్వయోగేషు కల్ప్యతే ।

రసమును ఓసమందురు. ఇది దేనిని ధరించునో అది ఓషధి అనబడును. రసము ద్వారా ఆరోగ్యము కలుగును. కావున రసము ధరించు ద్రవ్యము ఓషధి అనబడును. భిషకుడు తెలిసికొన యోగ్యం అయినది కావున, దీనిని భేషజం అందురు. చికిత్సలో హితకరంగా ఉండుటచే భైషజ్యం అనబడును. దీనిని యుక్తిపూర్వకముగా ప్రయోగించుటచే రోగము తిరిగి రాదు. కావున అగదం అనబడును. కంఠములో పడుట వలన లేదా రోగములను కర్షణం చేయుటచే సమస్త యోగములలో ప్రధానరూపముగా కషాయ శబ్దము ప్రయోగించబడినది.

శబ్దరూపరసస్పర్శగన్ధవద్దేశజం నవమ్ ॥ **30** ॥
అజగ్ధమవిదగ్ధం చ ద్రవ్యం గుణవదుచ్యతే ।

శబ్ద స్పర్శరూపరస గంధముల వలె ఉత్కృష్ట దేశమున ఉత్పన్నం అయినది క్రొత్తది కీటాదులచే దూషితం కానిది విదగ్ధం కాని ద్రవ్యం గుణకారిగా చెప్పబడినది.

**మాత్రావల్లఘుపాకం చ హృద్యం దోషప్రవాహణమ్ ॥ 31 ॥**
**అల్పపేయం మహావీర్యం ప్రీణనం బలరక్షణమ్ ।**
**వ్యాపత్తావల్పదోషం చ మన్దగ్లాపనమేవ చ ॥ 32 ॥**
**సంస్కారగుణసంపన్నం రాజార్హం భేషజం మతమ్ ।**

ఉత్తమ ఔషధ లక్షణములు: మాత్రానుసారము ప్రయోగించబడింది, లఘుపాకం కలది, హృద్యమైనది, దోష నిర్హరణము చేయునది అల్పమాత్రలో సేవించదగినది, ప్రబల వీర్యం కలది ప్రసన్నమును కలిగించునది బలమును రక్షించునది విపరీత ప్రయోగం చేయునపుడు అల్పదోషములు కలది, గ్లాని చేయనిది, సంస్కారగుణ సంపన్నం అయిన ఔషధి రాజులకు యోగ్యంగా చెప్పబడింది.

**తద్ధి సిద్ధమసిద్ధం చ శీతముష్ణం ద్రవం ఘనమ్ ॥ 33 ॥**
**కోష్ణం సస్నేహమస్నేహమితి భిన్నమనేకధా ।**
**తదామయవయోభేదాత్ సప్తధైవ విభజ్యతే ॥ 34 ॥**

ఈ ఔషధి సిద్ధము అసిద్ధము, శీత, ఉష్ణ, ద్రవ, ఘన, ఈషద్ ఉష్ణ స్నేహ యుక్త, స్నేహ రహిత మొదలగు అనేక భేదములు కలిగి ఉండును. రోగము మరియు అవస్థానుసారముగా ఈ క్రింది 7 విధములుగా విభజింపబడినది.

**చూర్ణం శీతకషాయశ్చ స్వరసోఽభిషవస్తథా ।**
**ఫాణ్టః కల్కస్తథా క్వాథో యథావత్తం నిబోధ మే ॥ 35 ॥**

ఔషధి భేదము: 1. చూర్ణము 2. శీత కషాయము 3. స్వరసము, 4. అభిషవము ( మద్యము) 5. ఫాంటము, 6. కల్కము, 7. క్వాథము. వీనిని నా నుండి యథావిధిగా వినుము.

**సూక్ష్మచూర్ణీకృతం చూర్ణం నానాకర్మసు యుజ్యతే ।**
**గ్రహణ్యామవికారేషు వ్రణవత్యఞ్జనాదిషు ॥ 36 ॥**

శీతః శీతకషాయః స్యాదన్తరిక్షామ్బుసంప్లుతః ।
స పిత్తజ్వరదాహాసృగ్విషమూర్చామదాపహః ॥ 37 ॥
తద్వదేవ నిశావ్యుష్టోఽభిషవః సాధు సాధితః ।
ప్రశాన్తాగ్నిబలక్షోభః సౌమ్యః స్వరససజ్గతః ॥ 38 ॥
ద్రాక్షేక్ష్వామలకాదీనాం పీడనాత్ స్వరసః స్మృతః ।
స సంశమనసంయోగే నానారోగేషు కల్పతే ॥ 39 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 204 తమం పత్రమ్)
క్వథితస్త్వన్తరిక్షేణ వారిణాఽర్ధావశేషితః ।
సకృద్వా ఫాణితః ఫేనం కషాయః ఫాణ్ట ఉచ్యతే ॥ 40 ॥
సోఽల్పదోషబలే బాలే లఘువ్యాధౌ చ శస్యతే ।
కల్కః కల్కీకృతో యోజ్యః పానలేపావలేహనే ॥ 41 ॥
కేవలద్రవ్యపేయత్వాద్వికార్షీ దుర్జరశ్చ సః ।
పాదస్థితో భవేత్ క్వాథో యుక్తోఽబహ్వగ్నితేజసా ॥ 42 ॥
స వయోబలసంపన్నే గురువ్యాధౌ చ శస్యతే ।

సూక్ష్మముగా చూర్ణించబడిన ద్రవ్యమును చూర్ణమందురు. దీనిని గ్రహణి, ఆమవికారములు, వ్రణ, అంజానాదులలో వివిధ కర్మలకొరకు ప్రయోగించబడును.

అంతరిక్ష జలముతో కలిపిన శీత ద్రవ్యమును శీతకషాయమందురు ఇది పిత్త జ్వర దాహ రక్త విష మూర్ఛ, మదములను నశింప చేయును. పూర్వోక్త ద్రవ్యములనే రాత్రంతా నీటిలో ఉంచి తయారు చేసినచో అభిషవ మందురు. అగ్నిబలము క్షోభ శాంతించిన వానికి, సౌమ్యునికి స్వరసముతో పాటు అభిషవమును ప్రయోగించవలెను. ద్రాక్షా, ఇక్షు, ఆమలకి మొదలగు ద్రవ్యములను నిష్పీడనము చేసి తీయు రసమును స్వరసమందురు ఇది అన్య సంశమన ఔషధములతో కలిపి వివిధ రోగములలో ప్రయోగించబడును. ద్రవ్యమును అంతరిక్ష జలములలో పక్వము చేసి అర్ధ శేష జలము ఉన్నప్పుడు లేదా ఒకసారి మరిగి పొంగు వచ్చిన తర్వాత దానిని ఫాంతమందురు. ఇది

అల్పదోషములు అల్ప బలము గల బాలునికి మృదువ్యాధిలో ప్రశస్తము. ద్రవ్యమును నీటితో కలిపి దంచి కల్కముచేసి లేపము, పానము అవలేహముగా ప్రయోగించబడును. శుద్ధ ద్రవ్యము పాన రూపమున ప్రయోగించబడుటచే ఇది కర్షణము చేయునది, కష్టముగా జీర్ణమగునదిగా నుండును. తీవ్రాగ్నిపై చతుర్థావ శేషము పక్వముచేసినచో క్వాథమనబడును. దీనిని అవస్థ, బలము అధికముగా నున్నప్పుడు గురువ్యాధిలో ప్రయోగించబడును.

సప్తధైవం విభజ్యైతద్దశధా ప్రవిచారయేత్।
పూర్వం భక్తస్య మధ్యేఽధః సముద్గం సముహుర్ముహుః ॥ **43** ॥
సభక్తం భక్తయోర్మధ్యే గ్రాసగ్రాసాన్తరే పరః ।

ఈ విధముగా ఓషధి కల్పనలు 7 విధములు విభజించి తిరిగి 10 విధములుగా పునర్విభజించబడినవి. అవి -

1. భోజనపూర్వము 2. భోజన మధ్యము 3. భోజనాంతము 4. సముద్గము 5. మాటిమాటికి 6. సభక్త (భోజనము తో పాటు 7. రెండు భోజనముల మధ్యములో 8. ప్రాసములో 9. రెండు గ్రాసముల మధ్యన 10. భోజన రహితముగా.

పూర్వం భక్తస్య భైషజ్యం న కరోతి బలక్షయమ్ ॥ **44** ॥
ఆమాశయగతాన్ దోషాన్నిహన్త్యాశు చ పచ్యతే ।
అన్నసంస్తమ్భితే దేహే చర్ద్యుద్గారవ్యథాదయః ॥ **45** ॥
న భవన్తి యతస్తస్మాత్తద్దేయం దుర్బలీయసే ।

భోజన పూర్వము సేవించిన ఔషధము బలక్షయమును చేయదు. ఆమాశయగత దోషములను నష్టమొందించును. శీఘ్రముగా పాచనమగును. అన్నము ద్వారా శరీరములో స్తంభించబడిన ఓషధి వమనము, ఉద్గారము వ్యథను కల్గించదు. కావున దీనిని దుర్బల రోగిలో ప్రయోగించవలెను.

మధ్యేభక్తం హ్యుభయతో రుద్ధమన్నేన భేషజమ్ ॥ **46** ॥
తదన్తరాశయే దోషాన్ సుఖేనైవ నియచ్ఛతి ।
శమయత్యాశ్వధో భక్తమురఃకణ్ఠశిరోగదాన్ ॥ **47** ॥

భోజన మధ్యలో తీసికొన్న ఔషధి రెండువైపులా అన్నంతో నిరోధింప బడుట వలన శరీరం లోని ఆశయంలందున్న దోషములను సుఖపూర్వకముగా నిర్హరణం చేయును. 3) భోజనం తరువాత సేవించిన ఔషధం ఉరస్సు, కంఠము, శిరస్సులందు ఉన్న దోషములను శీఘ్రంగా శాంతింప చేయును.

వ్యత్యాసేన చ సాముద్గం దోషే తూర్ధ్వమధోగతే ।
ముహుర్ముహుః శ్వాసకాసహిక్కాతృట్ఛర్దిశాన్తయే ॥ **48** ॥

4) దోషములు ఊర్ధ్వ అధోభాగములందు వ్యాపించినపుడు పరస్పర క్షేపనం ద్వారా సాముద్గ ప్రయోగం చేయవలెను.

5) శ్వాస, కాస, హిక్క, తృష్ణ, ఛర్ది శాంతించుటకు మాటి మాటికి ఔషధం ప్రయోగించవలెను.

హితం బలాగ్నిరక్షార్థం సభక్తం దుర్బలాత్మనామ్ ।
స్త్రీబాలవృద్ధలలితక్షతక్షీణౌషధద్విషామ్ ॥ **49** ॥

6) దుర్బలుడు స్త్రీ, బాలుడు, వృద్ధుడు, సుకుమారుడు, క్షతక్షీణుడు, ఔషధ ద్వేషం కలవాడు వీరికి బలము అగ్నిని రక్షించుటకు సభక్త ఓషధిని ప్రయోగించవలెను.

వ్యాధౌ మన్దేఽనలే తీక్ష్ణే భక్తయోర్మధ్య ఇష్యతే ।

7) మంద వ్యాధిలో అగ్ని తీక్ష్ణంగా ఉన్నపుడు భోజనం మధ్యలో ఔషధంను ఇవ్వవలెను.

క్షీణక్షీణాల్పశుక్రాణాం వాజీకరణమౌషధమ్ ॥ **50** ॥
గ్రాసే విధేయం చూర్ణం చ యదగ్నిబలవర్ధనమ్ ।

8) దుర్బలుడు, క్షీణుడు, అల్పశుక్రము కల వ్యక్తులకు వాజీకరణ ఔషధము అగ్ని బలవు వృద్ధి పొందించు చూర్ణవునను గ్రాసవుతో కలిపి ప్రయోగించవలెను.

గ్రాసాన్తరే చ్ఛర్దనీయం ధూమపానం చ శస్యతే ॥ **51** ॥

9) 2 గ్రాసముల మధ్యన వమనం కలిగించు ధూమ్రపానం ప్రయోగించవలెను.

అభక్తమౌషధం పీతం వ్యాధిమాశు బలీయసామ్ ।
హన్యాత్తదేవేహ బలం బలవద్దుర్బలీయసామ్ ॥ 52 ॥

భోజనం లేకుండా ప్రయోగించబడు ఔషధి బలమైన వ్యక్తులలో రోగము శీఘ్రంగా నశింపచేయును. ఏ విధంగానైతే బలమైన వ్యక్తి దుర్బల మనిషి బలమును నశింపచేయునో.

ఏతానౌషధకాలాంస్తు విభజేద్దశధా దశ ।
క్షీణధాత్విన్ద్రియే శాన్తే క్లాన్తే తాన్తే బుభుక్షితే ॥ 53 ॥

భైషజ్యదగ్ధకోష్ఠే చ భేషజం నావచారయేత్ ।
క్రుద్ధే విషణ్ణే శోకార్తే రాత్రౌ జాగరితే తథా ॥ 54 ॥

విదగ్ధాజీర్ణభక్తే చ భేషజం నావచారయేత్ ।
కర్మాతిభారాభిహతే నిరూఢే సానువాసితే ॥ 55 ॥

ఉపోషితే విరిక్తే చ భేషజం నావచారయేత్ ।
యత్కిఞ్చిదప్యుపాత్తాన్నే మూర్ఛితే ఘర్మతాపితే ॥ 56 ॥

సద్యః పీతోదకే చైవ భేషజం నావచారయేత్ ।
అవస్థావిపరీతం చ భేషజం నావచారయేత్ ॥ 57 ॥

ఈ 10 ఔషధ కాలములను 10 ప్రకారములుగా విభజింపబడును.

**ఔషధ ప్రయోగ నిషిద్ధులు :** ధాతువులు, ఇంద్రియములు క్షీణించిన వాడు, క్లాంత కలిగినవారు, ఖిన్నులు, ఆకలిగొన్న వారు ఔషధముతో కోష్ఠము దగ్ధం అయినవారు, కృద్ధులు, దుఃఖితులు, శోకపీడితులు, జాగరణము చేసినవారు, భుజించిన ఆహారం విదగ్ధం అయినవారు, అజీర్ణం కలవారు, భారము, పనితో పీడితులు, నిరూహం అనువాసనము చేసికొన్నవారు, ఉపవాసం చేసినవారు, విరేచనమైన వారు సర్వం భుజించువాడికి మూర్ఛితుడు వేడిచే బాధపడు వారికి అపుడే నీరు తాగినవాడికి అవస్థా విపరీతము ఔషధ ప్రయోగం చేయకూడదు.

ఊనద్వాదశవర్షాణాం నైకాన్తేనావచారయేత్ ।
అవచారితమేకాన్తేనాహన్త్యహని చౌషధమ్ ॥ 58 ॥

అసమత్వాగతప్రాణదోషధాతుబలౌజసామ్ ।
అత్యన్తసుకుమారాణాం కుమారాణాం బలాయుషీ ॥ **59** ॥

12 సంవత్సరముల లోపలి వానికి ఔషధం నిరంతరము ప్రయోగించ కూడదు. ప్రతిదినము నిరంతరం ప్రయోగించబడు ఔషధం ప్రాణం, దోషము, ధాతువు బలము ఓజస్సు సమరూపముగా ఉండని వారిలో సుకుమారులైన బాలురిలో బలమును ఆయువును నశింపచేయును.

క్షీణాతివృద్ధకృద్ధానాం క్షీణధాత్విన్ద్రియౌజసామ్ ।
ఏకాన్తేనౌషధం పీతం సూర్యస్తోయమివాల్పకమ్ ॥ **60** ॥

క్షీణుడు వృద్ధుడు కృద్ధుడు ధాతువులు ఇంద్రియములు ఓజస్సు క్షీణించినవాడు, వీరిలో ఔషధము నిరంతరము ప్రయోగించినచో స్వల్ప జలమును సూర్యుడు నశింపచేయునట్లు నశింపచేయును.

వ్యాధిదోషబలాగ్నిభ్యో హీనం తేభ్యోఽధికం చ యత్ ।
అజిజ్ఞాసితపూర్వం చ గుణైశ్చోక్తైర్వివర్జితమ్ ॥ **61** ॥
అరోగసాత్మ్యం దుర్యుక్తమనిష్టం మనసశ్చ యత్ ।
యస్య పీతస్య పాకాన్తే దోషః సూక్ష్మోఽపి లక్ష్యతే ॥ **62** ॥
వ్యాధేశ్చ ప్రశమో న స్యాత్తచ్చ వర్జ్యం విజానతా ।

**త్యాజ్య ఔషధము :** వ్యాధి, దోష, బల, అగ్ని హీనము లేదా ఆధిక్యము, పూర్వము తెలియనిది, యథోక్తగుణ రహితమైనది, రోగానుసారముకానిది, సమ్యక్ ప్రకారము ప్రయోగించబడనిది, మనసుకు అనుకూలము కానిది, ఔషధ సేవనానంతరము కూడ దోషావశేషము మిగిలియుండుట, వ్యాధి శాంతించ కుండుట ఇలాంటి ఔషధమును త్యజించవలెను.

యన్నాతురబలం హన్తి వ్యాధివీర్యం నిహన్తి చ ॥ **63** ॥
తదేవాస్యావచార్యం స్యాదావ్యాధ్యుచ్ఛేదదర్శనాత్ ।

ప్రయోజ్య ఔషధము రోగి బలమును నష్టము చేయనిది రోగబలమును నశింప చేయునది అగు ఔషధమును వ్యాధినశించు పర్యంతము ప్రయోగము చేయవలెను.

కామం వ్యాధౌ ప్రశాన్తేఽపి శమదానాచ్ఛమౌషధమ్ ॥ 64 ॥
తదేవాల్పం విధాతవ్యం సకృద్ ద్విస్త్రిర్యథాబలమ్ ।

వ్యాధి శాంతించినప్పటికీ వ్యాధి కారణమును శమింప చేయుటకు ఆశామక ఔషధమును అల్పమాత్రలో బలాను సారము ఒకటి, రెండు లేదా 3 పర్యాయములు ప్రయోగించవలెను.

పుణ్యేఽహని నమస్యాదౌ దేవద్విజభిషగ్గురూన్ ॥ 65 ॥
పూర్వాహ్నే ప్రాఙ్ముఖాయాస్మై సుఖాసీనాయ సాధవే ।
బుభూషమాణాయ భిషఙ్మన్త్రవద్భేషజం శుచిః ॥ 66 ॥
ఇదం హన్త పిబ చేతి సంప్రయచ్ఛేదుదఙ్ముఖః ।

ఔషధ ప్రయోగ విధి : పుణ్యాదినమున ప్రప్రథమమున దేవ, బ్రాహ్మణ వైద్య గురువులను నవుస్కరించి, ప్రాతః కాలములో తూర్పునకుముఖముచేసి సుఖపూర్వకముగా కూర్చొని సజ్జనుడు ఓషధిని సేవించు నిచ్ఛగల రోగికి, పవిత్రడు ఉత్తరముఖముకల్గి కూర్చున్న వైద్యుడు, హంత! నీవు మంత్ర యుక్త ఓషధిని సేవించుము అని చెప్పవలెను.

అతిచఙ్క్రమణస్థానశయనాసనభాషణమ్ ॥ 67 ॥
క్రోధశోకదివాస్వప్నవిరుద్ధాన్నహిమాతపాన్।
పీతౌషధో న సేవేత తథా స్త్రీవేగధారణమ్ ॥ 68 ॥

ఔషధసేవన తర్వాత త్యజించుభావములు. అతి చంక్రమణము అధికముగా కూర్చొనుట, అతిశయనము, అతిబాషణము, క్రోధము, శోకము, దివాస్వప్నము విరుద్ధభోజనము మంచు, ఎండ సేవించుట, స్త్రీ సంబంధం, వేగ ధారణాదులు చేయకూడదు.

విజృమ్భాః శబ్దవిద్వేషో ముఖశోషోఽరతిః క్లమః ।
తన్ద్రీరుద్వేష్టనం సాదో లిఙ్గం జీర్యతి భేషజే ॥ 69 ॥

ఔషధ జీర్ణ లక్షణములు : జృంబ, శబ్దద్వేషము, ముఖశోష, అలసిపోవుట, తంద్ర, ఉద్వేష్టనము, ఆలస్యము ఉండును.

సృష్టిర్విణ్మూత్రవాతానాం శరీరస్య చ లాఘవమ్ ।
ఉద్గారశుద్ధిర్వైశద్యం వైమల్యం హృదయస్య చ ॥ **70** ॥
ప్రకాంక్షా కుక్షిశైథిల్యమన్నకాలస్య లక్షణమ్ ।

అన్న కాల లక్షణము! మలమూత్ర వాయువులు బైల్వెడలుట శరీర లఘుత్వము ఉద్గారశుద్ధి, విశదత్వము, హృదయవిమలత్వము భోజనము నందు రుచి కుక్షిశిథిలత.

వయస్త్రిధా విభజ్యాదౌ మాత్రా వక్ష్యామ్యతః పరమ్ ॥ **71** ॥

మొదటి వయస్సు 3 విధములు విభజించి తర్వాత ఔషధ మాత్రను నిర్దేశించెదను.

గర్భబాలకుమారాఖ్యమిత్యేతత్త్రివిధం వయః ।
యౌవనం మధ్యమం వృద్ధమేతచ్చ త్రివిధం పునః ॥ **72** ॥

గర్భ, బాల, కుమార అని 3 ప్రకారములు వయసు తిరిగి యౌవనము, మధ్యము, వృద్ధ అని 3 విధములు.

వర్షావరః క్షీరపః స్యాద్యావత్ పిబతి వా పయః ।
వయస్తద్బాలసస్మాచ్చ యావత్ షోడశవార్షికః ॥ **73** ॥
అన్నాదః సర్వ ఏవ స్యాత్ కౌమారే వయసి స్థితః ।
అతః పరం ధాతుసత్త్వబలవీర్యపరాక్రమైః ॥ **74** ॥
వర్ధమానైశ్చతుస్త్రింశద్యువా వర్షాణ్యుదర్కతః ।
ధాత్వాదిభిః స్థిరీభూతైర్యావదాసప్తతిర్నరః ॥ **75** ॥

(ఇతి తాడపత్రపుస్తకే **206** తమం పత్రమ్)

మధ్యో ధాత్వాదిభిః పశ్చాత్ క్షీయమాణైర్యథాక్రమమ్ ।
వృద్ధో భవతి మన్త్రాత్మా ప్రవృత్తిర్యావదాయుషః ॥ **76** ॥

ఒక సంవత్సరము వయస్సు వరకు లేదా కేవలం క్షీరపాన పర్యంతము బాలుని క్షీరప అందురు. ఇది బాల్యావస్థ అనబడును. ఒక సంవత్సరము వయస్సు నుండి 16 సం॥ వయస్సు వరకు సంపూర్ణ అన్నాదుడిని కుమారుడు అనబడును. ఆ తర్వాత ధాతువులు, సత్వము, బలము వీర్యము పరాక్రమము వృద్ధి చెందుతూ

34 సం॥ వయస్సు వరకు యువ అనబడును. ధాత్వాదులు స్థిరమైన తర్వాత 70 సం॥ ములవరకు మధ్యమ వయస్సు అనబడును. తర్వాత ధాత్వాదులు క్రమముగా క్షీణించుటచే మందాత్మ గల వ్యక్తి వృద్ధుడనబడును.

**వికల్పనాఽన్యా వృద్ధస్య తస్య షోడశవార్షికీ ।**
**భవేద్భేషజమాత్రా తు క్షీయమాణోత్తరోత్తరా ॥ 77 ॥**
**శతే శతాధికే వాఽపి క్షీరాన్నాదవదిష్యతే ।**

వృద్ధ వ్యక్తి ఔషధ మాత్ర 16 సంవత్సరముల వ్యక్తి వలె కాక, ఉత్తరోత్తరముగా క్షీణించుచుండును. అంతములో 100 సంవత్సరములు పైబడిన వారికి క్షీరాన్నాదులతో సమానముగా ఉండును.

**జాతమాత్రస్య మాత్రా స్యాత్ సర్పిష్కోలాస్థిసంమితా ॥ 78 ॥**
**పఞ్చరాత్రం భవేద్యావద్దశాహమధికం తతః ।**
**కోలార్ధసంమితం యావద్వింశద్రాత్రమతః పరమ్ ॥ 79 ॥**

జాతమాత్ర బాలునికి ఘృత మాత్ర రేగు గింజప్రమాణంలో ఉండవలెను. 5 నుండి 10 దినముల వయస్సు వారికి కొంచెం అధికముగా ఉండవలెను. 20 దినముల వరకు అర్ధ రేగు పండు ప్రమాణంలో ఉండవలెను.

**కోలమాత్రం భవేద్యావన్మాసం మాసద్వయేఽధికమ్ ।**
**ద్వికోలసంమితం సర్పిస్తృతీయే మాసి శస్యతే ॥ 80 ॥**

ఒక మాసం వరకు రేగుపండు ప్రమాణంలో 2 మాసముల వరకు ఇంకకొంచెం అధిక మాత్రలో ఉండవలెను. 3వ నెలలో ఘృతమాత్ర 2 రేగుపళ్ళకు సమానంగ ఉండవలెను.

**శుష్కామలకమాత్రం తు చతుర్థే మాస్యుదాహృతమ్ ।**
**పఞ్చమే మాసి షష్ఠే చ హ్యార్ద్రామలకసంమితమ్ ॥ 81 ॥**
**తదేవాభ్యధికం కిఞ్చిద్విహితం సప్తమాష్టమే ।**

4 వ నెలలో ఎండిన ఆమలకి ప్రమాణములో ఉండవలెను. 5,6 నెలల్లో ఘృత ప్రమాణం ఆర్ద్ర ఆమలక ప్రమాణములో నుండవలెను. 7,8 మాసములలో ఇంకా కొంచెము అధికముగా నుండవలెను.

క్షీరాన్నాదస్య బాలస్య ప్రాయేణాహారసంకరాత్ ॥ 82 ॥
భవత్యనియతో వహ్నిః పక్తౌ బహ్వానిలాత్మనః ।
తస్యాఽగ్న్యవేక్షికీ తస్మాత్ స్నేహమాత్రా విధీయతే ॥ 83 ॥

వాతప్రధాన క్షీరాన్నాద బాలునికి జఠరాగ్ని, మామూలుగా మిశ్రిత భోజనము చేయుటచే పాచన అనిశ్చితముగా నుండును. కావున స్నేహ మాత్ర అగ్న్యను సారము ఉండవలెను.

అన్నాదస్య తు భూయిష్ఠం సమో భవతి పావకః ।
తస్యామలకమాత్రస్య సర్పిషః పానమిష్యతే ॥ 84 ॥

అన్నాద బాలునికి అగ్ని అధిక సమముగా నుండును. వాడికి ఆమలకి ప్రమాణము ఘృతమును ఇవ్వవలెను.

తదేవాగ్నిబలం వీక్ష్య వర్ధమానస్య వర్ధయేత్ ।
క్షీరపస్య కుమారస్య క్షీరాన్నాదస్య చోభయోః ॥ 85 ॥

వృద్ధి పొందు బాలునికి అగ్నిననుసరించి మాత్రను వృద్ధి చేయవలెను.

దేయం స్నేహచతుర్భాగం భేషజస్య యథామయమ్ ।
ఘృతేన పాయయేద్బాలం యావత్ స్యాదష్టమాసికః ॥ 86 ॥
మాసాదతోఽష్టమాజ్జన్తోర్జలపిష్టం ప్రదాపయేత్ ।

8 నెలలవరకు బాలునికి రోగానుసారము స్నేహములో 4 వభాగము ఔషధమును ఘృతముతో ఇవ్వవలెను. 8 నెలల తర్వాత ఔషధమును నీటిలో కలిపి ఇవ్వవలెను.

అతఃపరం యథాశాస్త్రం కుమారస్యాన్నసేవినః ॥ 87 ॥
వక్ష్యామి వివిధాం మాత్రాం భేషజానాం విభాగశః ।

తర్వాత అన్నద బాలునికి శాస్త్రానుసారము విభాగపూర్వకముగా ఔషధ మాత్రను వివరించెదను.

ముచూటిం వా ప్రకుఞ్చం వా ప్రసృతం వాఽథావాఽఞ్జలిమ్ ॥ 88 ॥
ఆతురస్య ప్రమాణేన సమేతవ్యం చికిత్సితే ।

చికిత్సలో రోగి యొక్క రోగము లేక బల ప్రమాణము ననుసరించి ముష్టి, పల, ప్రసృత లేక అంజలి ప్రమాణ ఔషధము నివ్వవలెను.

అగ్రపర్వాఙ్గులిగ్రాహ్యా చూర్ణమాత్రా తు పాణినా ॥ **89** ॥
చూర్ణానాం దీపనీయానామేషా మాత్రా విధీయతే ।
ద్విగుణా జీవనీయానాం తథా సంశమనస్య చ ॥ **90** ॥
ఊర్ధ్వభాగే త్వర్ధమాత్రా తథైవ చ విరేచనే ।

దీపనము చూర్ణమును చేతి వేలి యొక్క అగ్రపర్వ సమానముగా తీసుకొనవలెను. జీవనీయ, సంశమనీయ చూర్ణమును దీనికి రెండింతలు తీసుకొనవలెను. వమన విరేచన చూర్ణమును చూర్ణములో సగభాగము గ్రహించవలెను.

వాతపిత్తకఫఘ్నానాం కషాయే తు ప్రదాపయేత్ ॥ **91** ॥
ద్వౌ దాపయేత ప్రసృతౌ శర్కరామధుసంయుతౌ ।

వాత పిత్త కఫ నాశక కషాయములలో శర్కర మధు కలిపి చూర్ణమును 2 ప్రసృతములు తీసుకొనవలెను.

ప్రసృతం ఛర్దనీయస్య నిష్క్వాథస్య ప్రదాపయేత్ ॥ **92** ॥
తథా వైరేచనీయస్య ప్రసృతం నాత్ర సంశయః ।
ద్విగుణాం జీవనీయస్య తథా సంశమనస్య చ ।

వామక, విరేచక క్వాథము ఒక ప్రసృతము, దీపనీయ సంశయనీయ క్వాథము రెండింతలు తీసుకొనవలెను.

దీపనీయస్య కల్కం తు అక్షమాత్రం ప్రదాపయేత్ ॥ **93** ॥
ద్విగుణం జీవనీయస్య తథా సంశమనస్య చ ।
అక్షార్ధం ఛర్దనీయస్య తథా వైరేచికస్య చ ॥ **94** ॥

దీపనీయ కల్క మాత్ర ఒకే కర్షము, జీవనీయ సంశయ నీయ కల్కము దీనికి రెండింతలు, వామక విరేచన కల్కము, కల్కము యొక్క మాత్రలో సగము తీసుకొనవలెను.

**స్నేహమాత్రామతో వక్ష్యే వమనే సవిరేచనే ।**
**వమనే వమనీయాభిరోషధీభిః సుసంస్కృతే ॥ 95 ॥**
**మాత్రావత్తు ఘృతం దద్యాద్వమనే కఫసంభవే ।**
**అర్ధమాత్రా భవేద్దేయా విరేకే సర్పిషస్తథా ॥ 96 ॥**
**వైరేచనైర్విపక్వస్య పిత్తే ప్రకుపితే సతి ।**

ఇపుడు వమన విరేచనమునకై స్నేహ మాత్రను చెప్పెదను. శ్లైష్మిక మనములో వామక ఔషధములను సంస్కృత ఘృత మాత్రలో ఇవ్వవలెను. త్త ప్రకుపిత ఉత్పన్న విరేచనములో విరేచన ద్రవ్య ములతో పక్వము చేసిన స్నేహ ాత్రలో సగము ఇవ్వవలెను.

**మాత్రాఽధశ్చోర్ధ్వభాగా చ శ్లైష్మికస్య ప్రశస్యతే ॥ 97 ॥**
**దీపనైః శమనీయైశ్చ జీవనీయైశ్చ సాధితమ్ ।**

శ్లైష్మిక వమనము విరేచనములో దీపన, వామక, జీవనీయ ద్రవ్యములతో ధిత స్నేహము ఇదే మాత్రలో నివ్వవలెను.

**తథాఽపి కుపితే వాతే దోషే పక్వాశయే స్థితే ॥ 98 ॥**
**కుక్షిగ్రన్థిషు పార్శ్వే చ సక్తే దేయం విరేచనమ్ ।**
**శమనైర్దీపనీయైశ్చ పాచనీయైశ్చ సాధితమ్ ॥ 99 ॥**

వాయువు ప్రకోపించి పక్వాశయము, కుక్షి గ్రంధి పార్శ్వములలో స్థితమై న్నప్పుడు శామక, దీపన, పాచక ద్రవ్యములతో సిద్ధమైన విరేచనము నివ్వవలెను.

**చతుర్భాగగుణం దద్యాన్మాత్రాయాః కుమ్భసర్పిషః ।**
**పాదార్ధహీనం పాదోనమర్ధం వాఽపి యథాక్రమమ్ ॥ 100 ॥**
**సర్పిర్విదద్యాద్బాలేషు సంప్రధార్య వయోబలే ।**

బాల్యావస్థలో బలానుసారము క్రమముగా కుంభసర్పిమాత్ర భాగములు, పాదార్ధహీనము, ¾ లేదా సగము ఇవ్వవలెను.

**నిష్క్వాథానాం సకల్కానాం మూర్ఛానాం సర్పిషస్తథా ॥ 101 ॥**
**ఇత్యుక్తా వివిధా మాత్రా మాత్రామూలం చికిత్సితమ్ ।**

ఈ విధముగా క్వాథ కల్క చూర్ణ మరియు ఘృతముల యొక్క అనేక ప్రకారముల మాత్రలు చెప్పబడినవి. ఎందకనగా మాత్రననుసరించియే చికిత్స ఉండును.

**తస్మాదగ్నిమృతుం సాత్మ్యం దేహం కోష్ఠం వయో బలమ్ ॥ 102 ॥**
**ప్రకృతిం భేషజం చైవ దోషాణాముదయం వ్యయమ్ ।**
**విజ్ఞాయైతద్యాథోద్దిష్టాం మాత్రాం సమ్యక్ ప్రయోజయేత్ ॥ 103 ॥**

కావున ఋతు, అగ్ని, సాత్మ్యము, దేహ, కోష్ఠము, వయస్సు, బలము, ప్రకృతి, ఔషధము, దోషప్రకోప శమనములు తెలుసు కొని తగు మాత్రను నిర్ణయించవలెను.

**అప్రమత్తః సదా చ స్యాద్భేషజానాం ప్రయోజనే ।**
**ఓషధీర్నామరూపాభ్యాం జానన్తి వనగోచరాః ॥ 104 ॥**
**అజపాలాశ్చ గోపాశ్చ న తు కర్మగుణం విదుః ।**

ఔషధ ప్రయోగములో ఎల్లప్పుడూ జాగరూకత వహించవలెను. వనములలో సంచరించు గోపాలురు మేకలను కాచువారు ఔషధముల నామ రూపములను తెలుసుకొందురు. కాని వాటి గుణ కర్మలు తెలియవు.

**యోగం తు తాసాం యోగజ్ఞా భిషజః శాస్త్రకోవిదాః ॥ 105 ॥**
**మాత్రాబలవిధానజ్ఞా జానతే గుణకర్మ చ ।**

ఔషధయోగములను తెలుసుకొనెడివాడు, శాస్త్ర పండితులు వాటి మాత్ర బల, విధానము తెలుసు కొను వైద్యుడు ఔషద యోగములను గుణ కర్మలను తెలుసుకొనును.

**కర్మజ్ఞో వాఽప్యరూపజ్ఞస్తాసాం తత్త్వవిదుచ్యతే ॥ 106 ॥**
**కిం పునర్యో విజానీయాదోషధీః సర్వథా భిషక్ ।**

ఔషధకర్మలు తెలిసి, రూపజ్ఞానములేని వైద్యుని తత్త్వ విదులందురు. ఔషధ ముల గురించి సర్వము తెలిసినవారిని చెప్పక్కరలేదు.

**యథా విషం యథా శస్త్రం యథాఽగ్నిరశనిర్యథా ॥ 107 ॥**

తథౌషధమవిజ్ఞాతం విజ్ఞాతమమృతోపమమ్ ।

ఔషధము యొక్క నామ, రూప, గుణ సమ్యక్ ప్రయోగములు తెలుసుకొనక ప్రయోగింపబడినచో ఆ ఔషధము శస్త్ర, విషము, అగ్ని, వజ్ర సమానము ప్రాణ నాశకమైనది. బాగా తెలిసి ప్రయోగింపబడిన ఔషధము అమృత సమానమైనది.

ఔషధం చాపి దుర్యుక్తం తీక్ష్ణం సంపద్యతే విషమ్ ॥ **108** ॥
విషం చ విధినా యుక్తం భైషజ్యాయోపకల్పతే ।

సరిగ్గా తెలుసుకోకుండా ప్రయోగింపబడిన ఔషధము తీక్ష్ణవిషముతో సమానము. తెలుసుకొని వాడిన విషము గూడ ఉత్తమ ఔషధమగును.

అగ్నిర్యథా ప్రజ్వలితః క్రుద్ధశ్చాశీవిషో యథా ॥ **109** ॥
అసిధారా యథా తీక్ష్ణా ప్రభిన్నో వాఽపి కుఞ్జరః ।
తథౌషధమసంయుక్తమవైద్యేనావచారితమ్ ॥ **110** ॥
విపర్యయేణ మాత్రాయా నిరుణద్ధ్యస్య జీవితమ్ ।

ప్రజ్వలితమైన అగ్ని, క్రుద్ధ సర్పము, తీక్ష్ణమైన ఖడ్గము మత్తెక్కిన ఏనుగువలె మూర్ఖ వైద్యునిచే ప్రయోగింపబడిన ఔషధము విపర్యయము చేసి రోగిని చంపును.

దృష్ట్వా స్పృష్ట్వా తథా పృష్ట్వా కార్యాకార్యక్రియాం తతః ॥ **111** ॥
ఔషధాని ప్రసిద్ధాని యాని స్యుర్బహుశో భిషక్ ।
రసతో వీర్యతశ్చైవ తాని తత్రావచారయేత్ ॥ **112** ॥
అతోఽన్యథా హ్యమాత్రజ్ఞో యుక్త్యాగమబహిష్కృతః ।
(ఇతి తాడపత్రపుస్తకే **207** తమం పత్రమ్)

ప్రసిద్ధమైన ఔషధమును దర్శించి, స్పర్శించి అనుభవజ్ఞులైన వాళ్లతో తెలుసుకొని కార్యాకార్యములు విచారించి రసవీర్యాను సారము ప్రయోగించవలెను.

కృశం రోగపరిధ్వస్తం సుకుమారం సమాత్వి(ధి)కమ్ ॥ **113** ॥

**తీక్ష్ణౌషధప్రయోగేణ హన్తి చాప్యతిమాత్రయా ।**
**మహారోగం మహాహారం మహాసత్త్వం మహాబలమ్ ॥ 114 ॥**
**మృద్వల్పౌషధయోగేన క్లేశయత్యాతురం భిషక్ ।**

బలహీనమైన, రోగములతో ఆవరింపబడిన, సుకుమార మరియు ఆధి (మానసిక రోగి) ని వైద్యుడు తీక్ష్ణ ఔషధ ప్రయోగముచే అధిక మాత్ర ద్వారా చంపును. దీనికి విపరీతము మహారోగములు, అధిక ఆహారము మహాసత్త్వము అధిక బలము కల్గిన రోగికి వైద్యుడు మృదు, అల్ప ఔషధముల ప్రయోగముతో క్లేశము కల్గించును.

**ఉపక్రమ్యో బలీ తస్మాద్ దుర్బలో నిరుపక్రమః ॥ 115 ॥**
**మధ్యం యుక్తైరుపక్రమ్య న చాహారాన్నివర్తయేత్ ।**

కావున బలమైన రోగికి చికిత్స చేయవలెను. దుర్బలునికి చికిత్స చేయకూడదు. మధ్యమ బలము కల్గిన రోగికి యోగ్య ఉపక్రమముల ద్వారా చికిత్స చేయవలెను. ఆహారమును నిలుప కూడదు.

**కృశం విశ్రామ్య విశ్రామ్య పథ్యైరౌషధసాధనైః ॥ 116 ॥**
**ధారయేద్వర్ధయేదగ్నిమగ్నౌ వృద్ధే హి జీవతి ।**

కృశునికి పలుసార్లు విశ్రమింపచేసి ఔషధము ద్వారా సిద్ధమైన పథ్యములను ఇస్తూ ధారణము చేసి అగ్నిని వృద్ధి చేయవలెను. అగ్నిని వృద్ధి నొందించుట వలన రోగి జీవించును.

**యథాఽనిలః పిత్తకఫాసృజశ్చ**
**నిత్యాః శరీరే నిహితా నరాణామ్ ।**
**తథైవ బాలేష్వపి సర్వమేత-**
**ద్ద్వయోస్తు రూపం తు తదల్పమల్పమ్ ॥ 117 ॥**

మనుషులలో వాతపిత్తకఫ రక్తములుండునట్లే పిల్లల శరీరములో కూడ ఉండును. ఇద్దరిలో భేదము కేవలం పిల్లలలో దోషములు అల్పమాత్రలో నుండును.

యథాఽల్పదేహస్య తదల్పమల్పం
తథాఽన్నపానౌషధమల్పమల్పమ్ ।
బుద్ధ్యా విమృశ్యేహ భిషగ్విదధ్యాత్
మాత్రా హి దేహాగ్నివయః ప్రధానాః ॥ **118** ॥

అల్పదేహము కలవారిలో దోషములు కూడ అల్పముగా నుండును. కావున బుద్ధి మంతుడగు వైద్యుడు విచారించి అన్న పానౌషధములను కూడ అల్పమాత్రలో ప్రయోగించవలెను. ఎందుకనగా మాత్ర ముఖ్యముగా దేహము, అగ్ని, అవస్థానుసారముగా నుండును.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ।
అలష్క (**134**)
(ఇతి) ఖిలేషు భైషజ్యోపక్రమణీయాధ్యాయస్తృతీయః ॥ **3** ॥

అని భగవాన్ కాశ్యపుడు చెప్పెను.

భైషజ్యోపక్రమణీయము సమాప్తము.

# యూష నిర్దేశీయాధ్యాయః - చతుర్థః

**అథాతో యూషనిర్దేశీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥**
**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥**

ఇపుడు మనము యూష నిర్దేశీయమను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**యూషాదివ్యఞ్జనోపేతం భోజ్యం పథ్యతరం భవేత్ ।**
**స్వస్థానామాతురాణాం చ విశేషారోగ్యకారకమ్ ॥ 3 ॥**

యూషాది వ్యంజన యుక్త భోజ్య పదార్థములు స్వస్థ మరియు రోగి ఇద్దరికి పథ్యములు. విశేషముగా ఆరోగ్యమునిచ్చునవి.

**అతశ్చ సర్వభూతానామాహారః స్థితికారణమ్ ।**
**న త్వాహారదృతేఽస్త్యన్యత్ ప్రాణినాం ప్రాణధారణమ్ ॥ 4 ॥**

కావున ఆహారము సమస్త ప్రాణులకు స్థితి కారణము. ఆహారము తప్ప మరేదియును ప్రాణుల ప్రాణ ధారణము చేయలేదు.

**న చాహారసమం కిఞ్చిద్భైషజ్యముపలభ్యతే ।**
**శక్యతేఽప్యన్నమాత్రేణ నరః కర్తుం నిరామయః ॥ 5 ॥**

ఆహార సమానమైన ఔషధము ఇంకొకటి లేదు. కేవలము అన్నముతోనే మనిషిని నిరోగిగా చేయవచ్చును.

భేషజేనోపపన్నోఽపి నిరాహారో న శక్యతే।
తస్మాద్భిషగ్భిరాహారో మహాభైషజ్యముచ్యతే ॥ 6 ॥

ఔషధము సేవించినప్పటికి ఆహారము లేకుండా వ్యక్తికి స్వస్థత చేకూరదు. కావున ఆహారమును వైద్యులు మహాభైషజ్యము అందురు.

స హ్యాహారణసామాన్యాద్దృష్ట ఏకవిధో బుధైః ।
ద్వివిధో వీర్యభేదేన, త్రివిధో దోషభేదతః ॥ 7 ॥

భక్ష్యభోజ్యాదిభేదేన తథైవోక్తశ్చతుర్విధః ।
పఞ్చభూతాత్మకత్వాచ్చ పునః పఞ్చవిధః స్మృతః ॥ 8 ॥
స ఏవ పునరుద్దిష్టః షడ్విధః షడ్రసాశ్రయాత్।
పునర్ద్వాదశధా భిన్నో ద్వాదశప్రవిచారతః ॥ 9 ॥

పండితులు ఆహారణత్వ సమాన కారణముచే సమస్త ఆహారమును ఒకటిగానె చెప్పినారు. శీతోష్ణ వీర్య భేదముచే 2 విధములు, త్రిదోషానుసారము 3 విధములు, భక్ష్య, భోజ్య (అశిత, ఖాధిత, పీత, లీఢ) అనుసారము 4 విధములు, పంచ మహాభూతానుసారము 5 విధములు షడ్రసానుసారము 6 విధములు, భోజన ప్రకృష్ట విచారణానుసారము 12 విధములుగా చెప్పబడింది.

చతుర్వింశతిధా భూయః కాలాదీనాం వికల్పతః ।
ప్రవర్తతే తమాశ్రిత్య ధర్మార్థాదిచతుష్టయమ్ ॥ 10 ॥
స్వాస్థ్యయాత్రా చికిత్సా చ తమేవాశ్రిత్య వర్తతే ।

కాలాది భేదముచే 24 విధములు, ఈ ఆహారముపైనే ధర్మార్థకామ మోక్షములను 4 కర్మలు ఆశ్రితముగా నున్నవి. మనిషి స్వస్థత, చికిత్స ఆహారముపై ఆధారపడి యుండును.

తుష్టిః పుష్టిర్ధృతిర్బుద్ధిరుత్సాహః పౌరుషం బలమ్ ॥ 11 ॥
సౌస్వర్యమోజస్తేజశ్చ జీవితం ప్రతిభా ప్రభా ।
ఆహారాదేవ జాయన్తే ఏవమాద్యా గుణా నృణామ్ ॥ 12 ॥
తదాత్మవాన్ హితమితం కాలే భుఞ్జీత షడ్రసమ్ ।

తుష్టి, పోషణ, ధైర్యము, బుద్ధి, ఉత్సాహము, పౌరుషము బలము, ఉత్తమస్వరము, ఓజస్సు, తేజస్సు, జీవనము, ప్రతిభ, ప్రభ, మొదలగు గుణములు మనిషిలో ఆహారమునుండే ఉత్పన్నమగును. కావున ఆయువును కోరువ్యక్తి ఉచితకాలములో షడ్రసాహారము హితకరము మరియు పరిమితి ననుసరించి తీసుకోవలెను.

యథా చ యచ్చ భోక్తవ్యం యే చ భోగ్య(జ్య) గుణాగుణాః ॥ **13** ॥
తత్తే భోజ్యవిభాగీయే సర్వం వక్ష్యామ్యతః పరమ్ ।

ఏ విధమైన ఆహారము ఎలా సేవించవలెను, భోజన గుణ అవగుణములు అన్ని తర్వాత భోజ్య విభాగీయమను అధ్యాయములో చెప్పెదను.

అత్ర తే సంప్రవక్ష్యామి నానాద్రవ్యోపసంస్కృతాన్ ॥ **14** ॥
నానారోగోపశమనాన్ యూషాన్ స్థవిరజీవక ! ।

ఓ! వృద్ధ జీవకా ఇప్పుడు నేను అనేక రోగములను శాంతింప చేయు నానాద్రవ్యములతో సంస్కరించబడిన యూష వర్ణన చేసెదను.

రోచనో దీపనో వృష్యః స్వరవర్ణబలాగ్నికృత్ ॥ **15** ॥
ప్రస్వేదజననో ముఖ్యస్తుష్టిపుష్టిసుఖావహః ।

యూషగుణములు: రుచికారకము, దీపనము, వృష్యము, స్వర, వర్ణ, బల, అగ్నిని వృద్ధి చేయునది, స్వేదమును కల్గించునది, ముఖమునకు హితకరము, తుష్టిపుష్టి సుఖదాయకము.

యూషః స్నేహోష్ణభావాచ్చ వాతం, స్నేహకషాయతః ॥ **16** ॥
పిత్తం, కఫం కదుష్ణత్వాత్ సంస్కారాచ్చ నియచ్ఛతి ।

స్నిగ్ధ ఉష్ణమగుటచే వాతమును, స్నిగ్ధ కషాయముచే పిత్తమును, ఉష్ణగుణముచే సంస్కరణ కారణముచే కఫమును శాంతింపచేయును.

యూషధాతుం వదన్తి జ్ఞా ద్రవీకరణపాకయోః ॥ **17** ॥
ద్రవీకరోతి భోజ్యాని పక్వః సద్యూష ఇత్యతః ।

పండితులు యూషను ధాతుద్రవీకరణముగా పాచనముగా అర్థము చెప్పెదరు. పక్వమైన యూషము భోజ్య పదార్థములను ద్రవ అవస్థలో తెచ్చును.

ద్రవ్యై(వై)ర్బహువిధైర్ద్రవ్యైస్తథా చాన్యైరతణ్డులైః ॥ 18 ॥
యూష ఇత్యుచ్యతే సిద్ధో, యవాగూస్తణ్డులైః సహ ।

తండులము తప్ప మిగతా అనేక పదార్థములను అనేక ద్రవములతో కలిపి చేయునది యూషమనబడును.

ముద్గయూషో విరసికా యూషో దాడిమకస్తథా ॥ 19 ॥
చిత్రకామలకానాం చ ద్వౌ యూషౌ పరికీర్తితా ।
పఞ్చకోలకయూషౌ ద్వౌ సంగ్రాహీ దీపనస్తథా ॥ 20 ॥
ధాన్యయూషోఽథ కౌలత్థః ఫలయూషశ్చ భార్గవ !।
పుష్పయూషః పత్రయూషో వల్కయూషస్తథైవ చ ॥ 21 ॥
ముఖ్యః పల్లవయూషశ్చ మహాయూషస్తథైవ చ ।
రాస్నాయూషో మహాయూషశ్చాఙ్గేర్యా మూలకస్య చ ॥ 22 ॥
పునర్నవాతిబలయోర్గుడక(కా)మ్బలికస్తథా ।
ముఖ్యత్రికటుయూషశ్చ లశునైర్వాస్తుకేన చ ॥ 23 ॥
పఞ్చవింశతిరిత్యేతే యూషాః కశ్యపనిర్మితాః ।

యూషభేదములు: 1. ముద్గయూష 2. విరసికా 3. దాడిమయూష, 4. చిత్రక యూష 5. ఆమలకి యూష 6-7 పంచకోలములతో 2 సంగ్రాహి, దీపనయూషలు 8. దాన్యయూష 9. కులుత్థ యూష 10. ఫలయూష 11. పుష్పయూష 12. పత్రయూష 13 వల్కయూష 14. పల్లవయూష 15 మహాయూష 16. రాస్నాయూష 17. చాంగేరియూష 18. మూలీయూష 19. పునర్నవాయూష 20. అతి బలాయూష 21. గుడకాంబలిక యూష 22 ముఖ్య త్రికటు యూష 23. లశున యూష 24. వాస్తుక యూష-ఈ విధముగా కాశ్యపుని ద్వారా నిర్మితమైన 24 యూషములు చెప్పబడినవి.

యూషాః కషాయమధురా కషాయామ్లాశ్చ భార్గవ! ॥ 24 ॥
ద్వివిధా విహితాః సర్వే సర్వే చ ద్రవయోనయః ।

ఓ భార్గవా సమస్త యూషములు 2 విధములుగా నుండును.
1. కషాయ మధుర 2. కషాయ అమ్ల యూషలన్నిటికి ఉత్పత్తి కారణము ద్రవము.

కృతాఽకృతాఽకృతకృతాః పిత్తశ్లేష్మానిలాత్మసు ॥ 25 ॥
రోగేషు స్నేహయోగాచ్చ తే యూషస్త్రివిధాః స్మృతాః ।

పిత్త, శ్లేష్మ వాతరోగములలో స్నేహ యోగాను సారము 3 విధములైన యూషలు చెప్పబడినవి. 1. కృత 2 అకృత 3. అకృత కృత.

త ఏవ పాచనాః ప్రోక్తాః కర్షణా బృంహణాస్తథా ॥ 26 ॥
శీతోష్ణమిశ్రవీర్యత్వాన్నానాద్రవ్యోపసంశ్రయాత్ ।

శీతోష్ణ, మిశ్ర వీర్య, నానా ద్రవ్య సంయోగములచే పాచన, కర్షణ, బృంహణమను భేదముతో 3 విధములు.

లవణవ్యోషణస్నేహపంక్తిసంస్కారయుక్తయః ॥ 27 ॥
సిద్ధా యూషేషు విదుషో న వక్ష్యామి పునః పునః ।

లవణము త్రికటు స్నేహముతో పక్వము చేసి సంస్కారము యుక్తి ద్వారా సిద్ధము చేసిన యూషములను పునరుపదేశము చేసెదను.

దోషభేదేన యూషాస్తే సంఖ్యాతాః పఞ్చసప్తతిః ॥ 28 ॥
తథైవ యాపనాదిత్వాత్ పఞ్చాశత్తు రసాశ్రయాత్ ।

దోష భేదముతో యూషములు 75 విధములు. వాతపిత్తకఫాను సారము 25 యూషములు 75 అగును. ఇదే విధముగా యాపనాది అనుసారము కూడ ఇవి 75 అగును. రసాశ్రయాను సారము 50 అగును.

ఏకే యూషాస్తథైకేషాం యత్కిఞ్చిద్వ్యఞ్జనం ద్రవమ్ ॥ 29 ॥
అగ్నౌ సిద్ధమసిద్ధం తు రాగఖాడవపానకమ్ ।

వ్యంజనాదులు కలిపి ద్రవ రూపముగా చేయబడు యూషములు కొన్ని ఉండును. వీటినే అగ్నితో, అగ్ని లేకుండా రాగ, ఖాడవ పానకములు చేయబడును.

యమకస్నేహసిద్ధాస్తు తే యూషా ఘృతతైలయోః ॥ 30 ॥

శష్యన్తే వాతరోగేషు వర్చః శోషాభిఘాతయోః ।
దీప్తాగ్నీనామనిద్రాణాం భారాధ్వశ్రమమైథునైః ॥ 31 ॥
క్లాన్తానాం పతనాద్యైశ్చ యూషోఽయమేక ఇష్యతే ।

ఘృత తైల యమక స్నేహము లో తయారు చేసిన యూష వాతరోగము, వర్చశోష, అభిఘాత రోగములో దీపాగ్ని గలవారు, నిద్రరానివాడు, భారము మార్గగమనము శ్రమ మైథునములచే అలసి పోయిన వారికి ఉపయోగముగా ఉండును.

దధికాఞ్జికశుక్తాని వర్గో యశ్చాపి దీపనః ॥ 32 ॥
నిర్యూహః సర్వయూషాణామన్యస్మాత్ పాఞ్చకమికాత్ ।
(ఇతి తాడపత్రపుస్తకే 208 తమం పత్రమ్)
క్వాథో నిర్యూహ ఆదానం కషాయశ్చేతి తత్ సమమ్ ॥ 33 ॥
గర్భః కల్కస్తథాఽఽవాపః పాకః సంస్కార ఉచ్యతే ।

పెరుగు, కాంజికము, శుక్తము దీపనవర్గాదులతో చేయిబడిన సమస్త యూష నిర్యూహము పంచకర్మలతో తప్ప అన్ని కార్యములలో ప్రయోగించబడును. దీనిని క్వాథము, నిర్యూహము, ఆదానము, కషాయము గర్భ, కల్కము, ఆవాపము, పాకము సంస్కారము మొదలగు సమాన శబ్దములతో పిలువబడును.

నిస్తుషాణాం పురాణానాం ముద్గానాం దీపనామ్బునా ॥ 34 ॥
ముద్గమణ్డస్తనుత్వాత్ స ముద్గయూషో ఘనోఽల్పశః ।
ముద్గతక్రామ్లసిద్ధస్తు యూషో విరసికా స్మృతః ॥ 35 ॥
స ఏవ దాడిమోదశ్విత్కృతో రోచన ఉచ్యతే ।
స్మృతో దాడిమయూషశ్చ ముద్గదాడిమసంస్కృతః ॥ 36 ॥
ముద్గామలకనిర్యూహో ధాత్రీయూషోఽభిధీయతే ।
ఇత్యేతే పఞ్చ యూషాస్తు విహితాః పాఞ్చకర్మికాః ॥ 37 ॥

పొట్టు తీయని పాత ముద్గను దీపనీయ ద్రవ్యములతో చేసినది పల్చగా నుండుటచే ముద్గమండ మనబడును. అదే ఘనముగా అల్పముగానున్నచో

ముద్గయూషమనబడును. ముద్గ, తక్రామ్లము ద్వారా చేసినను యూషను విరసిః అందురు. అదే దాడిమ, తక్రముతో చేసిన రోచకమన బడును. ముద్గ దాడిమత చేసిన దాడిమయయూషమనబడును. ముద్గ ఆమలకీతో చేసిన నిర్యూహమున ధాత్రీ యూష మనబడును. ఈ 5 యూషలు పంచకర్మ కొరకు ప్రయోగించ బడును.

కామ్యాంస్త్వన్యాన్ ప్రవక్ష్యామి యూషానామయదర్శనాత్।
సిద్ధశ్చిత్రకనిర్యూహే సమూలస్కన్ధపత్రకే ॥ 38 ॥
ఖ్యాతశ్చిత్రకయూషస్తు గ్రహణీదోషశూలనుత్।
ప్లీహార్శోగుల్మకుష్ఠఘ్నో హృద్రోగకఫవాతజిత్ ॥ 39 ॥
తద్వన్మూలకయూషోఽపి స వై సంస్కారమీక్షతే।

రోగానుసారము అన్య యూషములను వర్ణించెదను. మూలస్కంధ మరియు పత్రములతో కూడిన చిత్రక క్వాథమును చిత్రకయూషము అందురు. ఇది గ్రహణీ దోష శూల ప్లీహ అర్శగుల్మ కుష్ఠ హృద్రోగమరియు కఫ వాతములను నశింపచేయును. ఇదే విధముగా మూలక యూషముండును. ఇది సంస్కార కారణముగా పనిచేయును.

శటీకర్కటకీబిల్వమాజపౌష్కరధాతకీ ॥ 40 ॥
దధిత్థం దాడిమఫలం చాఙ్గేరీససమఙ్గయోః।
పఞ్చకోలకయూషోఽయం పరః సాంగ్రాహికః స్మృతః ॥ 41 ॥
స ఏవ దీపనోపేతో లవణైశ్చాపి దీపనః।

శటీ, కర్కాటకశృంగి, బిల్వ అజశృంగి పుష్కరమూల ధాతకి, కపిత్థ, దాడిమ, చాంగేరీ, సమంగా ఇది పంచ కోలక యూషమన బడును. ఇది అతి సంగ్రాహకము ఇందులోనే దీపన, లవణములను వేసినచో దీపకమగును.

అఖణ్డితానాం ధాన్యానాం సర్వేషాం సమభాగినామ్ ॥ 42 ॥
నిర్యూహః స్యాద్ఘృతే మాషతిలనిష్పావసర్షపాత్।
ధాన్యయూషః స్మృతో ముఖ్యో ద్వీపదాడిమసంస్కృతః ॥ 43 ॥
అఖండిత ధాన్యమును సమభాగము తీసుకొని తిల, నిష్పావము

(రాజశింబి) సర్షపముతో నిర్యూహము చేసి చిత్రకము దాడిమతో సిద్ధము చేసిన ధాన్య యూష మనబడును.

దధిమణ్డేఽథ వా సిద్ధస్తక్రే వా రోగదర్శనాత్।
శిరఃకర్ణాక్షిరోగేషు హృద్రోగేఽవర్ధాభేదకే ॥ 44 ॥
అరుచౌ చాతిసారే చ కార్యః సతిలమాషకః।

దధి మండము తక్రముతో సిద్ధము చేయబడిన యూషను రోగము కనిపించు నంతవరకు శిర, కర్ణ, అక్షిరోగములలో హృద్రోగము, అర్ధావభేదము, అరుచి, అతిసారములో తిల, మాషతో కలిపి ప్రయోగించవలెను.

కులత్థానాం తు నిర్యూహే కౌలత్థో యూష ఉచ్యతే ॥ 45 ॥
సన్నిపాతానిలకఫవ్యాధీన్ హన్తి విరూక్షణః।

కులుత్థ క్వాథమును కులుత్థ యూషమందురు. ఇది సన్నిపాత వాత కఫరోగములగు నష్టమొందించును. రూక్షము.

కపిత్థబిల్వబదరద్వాక(?)దాడిమచూతజైః ॥ 46 ॥
ఫలయూషం(షః)ఫలైరామైర్జీర్ణాతీసారనాశనమ్ (నః)।

కపిత్థ బిల్వ రేగు ద్వాక(?) దాడిమ మామిడి అపక్వ ఫలములతో ఫలయూష చేయబడును. ఇది జీర్ణ అతిసారనాశనము.

శణశాల్మలిధాతక్యః పద్మసౌగన్ధికైః సహ ॥ 47 ॥
కోవిదారాత్ కర్బుదారాత్ పుష్పైర్యూషం ప్రకల్పయేత్।
అసృగ్దరే రక్తపిత్తే దాహే చోదరచక్షుషోః ॥ 48 ॥
తైలామ్లాభ్యామృతే సిద్ధః పుష్పయూషః సదాడిమః।

శణ, శాల్మలీ ధాతకీ పుష్పము కమలము సౌంగధికముతో కోవిదారము కర్బుదారముల పూలతో యూషమును చేయవలెను. తైలము ఆమ్లరహిత దాడిమతో చేయబడిన ఈ పుష్ప యూషము ప్రదర, రక్తపిత్త దాహ ఉదర రోగములలో చక్షురోగములలో ఉపయోగము.

బిల్వశోభాఞ్జనైరణ్డబలారాస్నాప్రమవారిణా ॥ 49 ॥

పత్రనిష్క్వాథయూషః స్యాత్ పత్రయూషోఽనిలాపహః ।

నీళ్ళలో బిల్వ, శోభాంజన ఏరండ, బలా, రాస్నా, మామిడి ఆకు పక్వము చేసి యూషను చేయవలెను. ఈ పత్రయూషము వాత నాశకము.

దాడిమామ్రాతజమ్బూనాం చిరబిల్వస్య చ త్వచః ॥ 50 ॥
నిష్క్వాథ్య దధిమణ్డేన వల్కయూషోఽతిసారనుత్ ।

దాడిమ, ఆమ్రాతకము, నేరేడు, చిరబిల్వ త్వక్ దధి మండముతో క్వాథము చేసి వల్కయూషము చేయవలెను. ఇది అతిసారమును నశింపచేయును.

న్యగ్రోధోదుమ్బరాశ్వత్థప్లక్షకాలాపలాశజైః ॥ 51 ॥
పల్లవైః కమలానాం చ ఘృతదాడిమసంస్కృతః ।
పిత్తరోగేషు సర్వేషు గర్భచ్యవనదాహయోః ॥ 52 ॥
ముఖ్యః పల్లవయూషోఽయం హితః కటుకినీషు చ ।

వట, ఉదుంబర, అశ్వత్థ, ప్లక్ష, త్రివృత్, పలాశ కమల పత్రములతో నెయ్యి, దాడిమతో పల్లవ యూషము చేయవలెను. ఇది సమస్త పిత్త రోగములలో గర్భ పాతము దాహము గ్రహ రోగములలో హితకరము.

పునర్నవాయా రాస్నాయాశ్చాఙ్గేరీబలయోస్తథా ॥ 53 ॥
పృథగ్యూషాః సమాఖ్యాతా వాతఘ్నా దధిసర్పిషా ।

పునర్నవా రాస్నా చాంగేరి బలాను దధి ఘృతముతో వేర్వేరుగా యూషములను తయారు చేయవలెను. ఇది వాతనాశకరము.

రోహితాపోతమత్స్యానాం నిర్యూహం సాధయేజ్జలే ॥ 54 ॥
తం క్వాథం సాధయేద్భూయః శుక్తకాఞ్జికమస్తుభిః ।
ద్రవాణి కుడబీజాని గుడపఞ్చపలే శృతః ॥ 55 ॥

ఏష కామ్బలికో రూక్షః కటుతైలేన వా కృతః ।
వాతరోగప్రశమనో బృంహణో బలవర్ధనః ॥ 56 ॥

రతినిద్రారుచికరస్తిలతైలేన వా కృతః ।

రోహితమత్స్యములను జలములో పక్వము చేసి, దానిని శుక్తి కాంజికము దధిమస్తుతో సిద్ధము చేయవలెను. ఇందులో ద్రవము కుటజబీజము, 5 పలములగుడము వేసి పక్వము చేయవలెను. ఇది రూక్షము లేక కటు తైలముతో చేయబడిన కాంబలిక అనబడును. ఇది వాతరోగశామకము, బృంహణము, బలవర్ధకము. తిలతైలముతో చేసిన రతి, నిద్ర, రుచిని వృద్ధి పొందించును.

దీపనం పఞ్చమూలం చ ఫలాని మధురాణి చ ॥ 57 ॥
పూర్వవత్ సర్వధాన్యాని ధాన్యకం మరిచాని చ ।
కాకోలీక్షీరకాకోలీకాశ్మర్యాణి పరూషకమ్ ॥ 58 ॥

బదరాణి కులత్థాశ్చ రాస్నైరణ్డపునర్నవాః ।
ద్వే పలే గోక్షురః శిగ్రుపలాశతరుణాని చ ॥ 59 ॥

జలద్రోణే పచేదేతం నిర్యూహం పాదశేషితమ్ ।
దధికాఞ్జికశుక్తాని ప్రస్థశస్తైలసర్పిషీ ॥ 60 ॥

మూలకానామపత్రాణాం తరుణానాం శతం భవేత్ ।
ఏష సిద్ధో మహాయూషో వ్యోషసంరకారసంస్కృతః ॥ 61 ॥

సర్వరోగేషు భూయిష్ఠం సంసృష్టేషు ప్రశస్యతే ।
అత్యగ్నిషు వినిద్రేషు స్తబ్ధాఙ్గచ్చుబుకాక్షిషు ॥ 62 ॥

నిర్యూహేణ సమం దద్యాన్మాంసనిర్యూహమేవ తు ।
కార్యః సతిలకల్కో వా జీర్ణాతిసారశాన్తయే ॥ 63 ॥

దీపక పంచమూలము, మధురవర్గ ఫలము, సమస్త ధాన్యములు, ధనియాలు, మరిచ, కాకోలి, క్షీరకాకోలి, గంభారి, పరూషకము, బదరి, కులుత్థ రాస్నా, ఏరండ, పునర్నవ, 2 పలముల గోక్షురము లేత శిగ్రు, పలాశను ద్రోణ జలములో చతుర్థావ శేష క్వాథమును చేసుకొనవలెను. దధి, కాంజికము, శుక్తి తైలము ఘృతము ఒక్కొక్క ప్రస్థము తీసుకొనవలెను. పత్ర సహిత లేత మూలములు 100 కావలెను. ఇవి త్రికటుచే సంస్కరించిన మహా యూషమనబడును. ఇది అన్ని మిశ్రరోగములలో, అగ్ని వృద్ధి, అనిద్ర, స్తబ్ధాంగ,

ఛుబుకాక్షి రోగములలో ప్రశస్తము. ఇది నిర్యూహము వలె ఇందులో మాంస నిర్యూహమును, తిల కల్కమును కలపవలెను. ఇది జీర్ణ అతిసారమును నశింపచేయును.

**ఉక్తో లశునయూషస్తు స్వకల్పే వాతనాశనః ।**
**సూపాశ్చ రసకాశ్చైవ త్రివిధాః ప్రాఙ్నిదర్శితాః ॥ 64 ॥**

లశున కల్పములో వాతనాశక లశున యూషము చెప్పబడినది. మొదట 3 విధములైన సూపములు రసకములు చెప్పబడినది.

**స్విన్నాని మూలకాన్యప్సు నిష్పీడ్య తరుణో విభుః ।**
**పరిభృజ్య తతః స్నేహే తత్ర ఆదానమావపేత్ ॥ 65 ॥**
**ఏష మూలకయూషస్తు సర్వరోగవినాశనః ।**

వైద్యుడు మొదట ముల్లంగిని నీటిలో ఉడికించి కల్కము చేయవలెను. తర్వాత స్నేహములో వేయించి అందులో ప్రక్షేపములను వేసి యూషను చేయవలెను. ఈ మూలక యూషము సర్వరోగములను నశింపచేయును.

**అనమ్లోలదక( లావక? ) రసః సంస్కృతో జలసర్పిషోః ॥ 66 ॥**
**భవేత్ పిత్తోపశమనస్తైలభృష్టోఽనిలాపహః ।**

అమ్ల రహితమైన లావక మాంస రసమును ఘృతముతో సంస్కరించిన యూషము పిత్త రోగములను, తైలముతో సంస్కరించిన వాత రోగములను నశింపచేయును.

**ఏతే యూషాః స్వతన్త్రోక్తా ఉక్తా వ్యాససమాసతః ॥ 67 ॥**

ఇవి స్వతంత్రముగా చేయబడిన యూషములు విస్తారముగా సంక్షిప్తముగా చెప్పబడినవి.

**యవాగూరపి వక్ష్యామి నానాద్రవ్యోపసంస్కృతాః ।**
**నానారోగోపశమనీః శృణు వృద్ధైకవింశతిమ్ ॥ 68 ॥**

ఇప్పుడు నేను వేర్వేరు ద్రవ్యములతో సంస్కరించబడిన యవాగువులను వర్ణించెదను. వివిధ రోగములను శమింపచేయు 21 యవాగువులను వినుము.

ఓదనస్య విలేప్యాశ్చ యవాగ్వాశ్చ కిమన్తరమ్ ।
శుశ్రూషే భగవన్నేతదిత్యుక్తః ప్రాహ కశ్యపః ॥ 69 ॥

ఓ భగవాన్! నేను ఓదనము విలేపి యవాగు భేదములను తెలుసు కోవాలనుకుంటున్నాను. ఈ ప్రశ్నకు జవాబుగా కాశ్యపుడుత్తర మిచ్చెను.

ఓదనో విశదః సిద్ధః సుస్విన్నో నిస్రుతో మృదుః ।
తణ్డులైః సకలప్రాయైరక్షీణైశ్చాపి పఠ్యతే ॥ 70 ॥

**ఓదన గుణములు :** విశదము, సిద్ధము, సుస్విన్నము, నిస్రుతము, మృదు, తండులములు సంపూర్ణముగా నుండును.

అస్విన్నత్వమవక్లేదస్త్వసాకల్యమనిస్రవః ।
విరసోఽవిశదః శీత ఓదనస్య విపర్యయాః ॥ 71 ॥

ఓదన విపరీత గుణములు : అస్విన్నము, అక్లేదము, అసాకల్యము నిస్రములు, విరసము అవిశదము, శీతముగా నుండుట.

ద్రవాద్వింశతిభాగేన తణ్డులైః సహ సాధయేత్ ।
తథా పఞ్చదశాఖ్యేన యవాగూర్దశకేన వా ॥ 72 ॥

యవాగు చేయునపుడు బియ్యం 20 భాగములు, 15 లేదా 10 భాగములనీరుతో చేయవలెను.

వింశతేః స్ఫుటితైః సిక్థైస్తుల్యాధోమధ్యతోపరి ।
(ఇతి తాడపత్రపుస్తకే 201 తమం పత్రమ్)
అహస్తహార్యా పేయా స్యాద్యవాగూః సపరిగ్రహాః ॥ 73 ॥

పేయా యవాగు భేదము. 20 భాగముల నీటితో తయారు చేయునది సిక్థము ( బియ్యపుముక్కలు) స్ఫుటితమై యుండునది పైన, మధ్య, అడుగున సమాన ద్రవము కల్గి చేతితో తీసుకోరానిది పేయ అనబడును. పరిగ్రహాయుక్తమై నది యవాగు అనబడును.

ఘనా విశీర్ణా శీతా చ న చావక్షీణతణ్డులా ।
పిచ్ఛిలా విశదాఽహృద్యా యవాగ్వాదోషసంగ్రహః ॥ 74 ॥

యవాగుదోషములు : అధికఘనత్వం, అధిక విశీర్ణం, శీతముగా ఉండుట, అవక్షీణతండులము, పిచ్ఛిలత, విశదత అహృద్యము- ఇవి యవాగుదోషములు.

తక్రసిద్ధా యవాగూస్తు దధిసిద్ధా చ తే ఘనే ।
సంస్కృతే హస్తహార్యే తే ప్రతిషిద్ధే క్రియావతామ్ ॥ 75 ॥
ఉష్ణా ఘనా ప్రశిథిలా దలితైస్తణ్డులైః కృతా ।

తక్రము దధితో చేసిన యవాగు, సాంద్రము సంస్కార యుక్తము, చేతులతో గ్రహింపదగునది, ఉష్ణ, ఘన, శిథిల, నూకలతో చేయబడిన యవాగు క్రియాయుక్త వ్యక్తులకు నిషిద్ధము.

విలేప్యా గుణదోషాంస్తు యవాగ్వా ఇవ నిర్దిశేత్ ॥ 76 ॥

దీర్ఘోపవాసినాం నృణాం క్షీరపేయా ప్రశస్యతే ।
శీతపిత్తోపశమనీ బృంహణీ వర్చబన్ధనీ ॥ 77 ॥

దీర్ఘ కాల ఉపవాసము చేసినవారికి క్షీరపేయ ప్రశస్తము. ఇది శీతపిత్తమును శమింపచేయును. బృంహణము మలమును బంధించును.

శూలఘ్నీ దీపనీ పేయా దీపనీయోపసాధితా ।
పాచనీ పచనీ చోక్తా కషాయైర్వర్చబన్ధనీ ॥ 78 ॥

దీపన ద్రవ్యములతో చేసిన పేయ శూలను నశింపచేయును దీపనము పాచనము స్వయము పచింపబడును. కషాయము ద్వారా మలమును బంధించును.

బిల్వం దధిత్థం సహ దాడిమేన
సవ్యోషచాఙ్గేరికృతా యవాగూః ।
సాంగ్రాహిణీ దీపనపాచనీ చ
సపఞ్చమూలాఽనిలపీడితే తు ॥ 79 ॥

త్రికటు, చాంగేరి, బిల్వ, కపిత్థ, దాడిమతో చేసిన యవాగు సంగ్రాహము, దీపనము పాచకము. పంచ మూలములతో చేసిన యవాగు వాత రోగులలో ప్రయోగించవలెను.

బలా పృషత్పర్ణ్యథ శాలపర్ణీ
స్యాద్దాడిమం బిల్వశలాటుయుక్తమ్ ।
పేయా హితా పిత్తకఫాతిసారే
తోయం చ తత్త్ర వదన్తి పేయమ్ ॥ 80 ॥

బలా, ఆఖుకర్ణి, శాలిపర్ణి, దాడిమ, బిల్వ శలాటుతో చేసిన పేయ పిత్త కఫాతిసారములో హితకరము. ఈ అవస్థలో దీని జలమును త్రాగవలెను.

ఏషైవ దధ్నా రుచివర్ధనీ స్యా
న్నిర్వాహికాం హన్తి తిలోపసిద్ధా ।
రక్తాతిసారం శమయత్యుదీర్ణ-
మసృగ్దరం గర్భపరిస్రవం చ ॥ 81 ॥

ఇదే పేయ పెరుగుతో కలిపిన రుచివర్ధకము. తిలలతో సిద్ధము చేసిన యవాగు ప్రవాహికను నశింపచేయును. ఇది రక్తాతిసారము, రక్త ప్రదరము గర్భ స్రావమును శాంతింపచేయును.

సదాడిమా సాతివిషాఽథ సామ్లా
పేయా భవేదామవిపాచనీయా ।
స్యాత్ కణ్టకారీరసగోక్షురాభ్యాం
సఫాణితా మూత్రగదే యవాగూః ॥ 82 ॥

దాడిమ అతి విష, అమ్లద్రవ్యములతో చేసిన పేయ ఆమమును పచింపచేయును. కంటకారీ స్వరసము, గోక్షుర, ఫాణితము తోచేసిన యవాగు మూత్రరోగములలో హితకరము.

సువర్చికాక్షారవిడఙ్గశిగ్రు-
సపిప్పలీమూలకృతా యవాగూః ।
తక్రోపసిద్ధా క్రిమినాశనీ స్యా
ద్గుల్మేఽథ కాసే గ్రహణీగదే చ ॥ 83 ॥

సర్జక్షారము విడంగము, శిగ్రు, పిప్పలీమూలము తక్రముతో చేసిన యవాగు కృమినాశకము, గుల్మము కాస, గ్రహణీ రోగములలో ఉపయోగము.

మృద్వీకలాజామధుపిప్పలీభిః
ససారివా తృడ్‌శమనీ యవాగూః ।
విషం నిహన్త్యాశు తు సోమరాజ్ఞ్యా,
వరాహనిర్యూహకృతా తు బల్యా ॥ **84** ॥

మృద్వీకా, లాజా, మధు, పిప్పలి సారిబా యుక్త యవాగు తృష్ణను శమింపచేయును. సోమరాజియుక్త యవాగు విషమును నశింపచేయును. వరాహ నిర్యూహముతో చేసిన యవాగు బల్యము.

కార్శ్యార్థమిష్టా తు గవేధుకానాం,
సర్పిష్మతీ సైన్ధవయుగ్బలాయ ।
ద్విపఞ్చమూలోదకసాధితా తు
శ్వాసం చ కాసం కఫం చ హన్తి ॥ **85** ॥

గోధుమలతో చేసిన యవాగు కృశులకు శ్రేష్ఠము. ఘృతము సైంధవయుక్త యవాగు బల కారకము. దశమూలములతో చేసిన యవాగు శ్వాస, కాస, కఫమును నశింపచేయును.

శాకైః సమాంసైః సతిలైః సమాషైః
సర్పిష్మతీ స్నేహనభేదనీ తు ।
జమ్బ్వామ్రయోరస్థిదధిత్థబిల్వై-
స్తైరమ్లయుగ్వర్చవిబన్ధనీ తు ॥ **86** ॥

శాక, మాంసము, తిల, మినుములు, ఘృత యుక్త యవాగు స్నేహనము మల భేదము చేయును. నేరేడు, మామిడి జీడి, కపిత్థము బిల్వ అమ్లముక్త యవాగు మలమును బంధించును.

తక్రోపసిద్ధా తు ఘృతామయే స్యాత్,
పిణ్యాకయుక్ సైవ తు తైలరోగే ।
ఉపోదికాదధ్యుపసాధితా తు
మదం విదాహం చ నయేత్ ప్రసాదమ్ ॥ **87** ॥

తక్రసిద్ధయవాగును ఘృతోత్పన్న వ్యాధులలో, పిణ్యాకయుక్త యవాగును తైలోత్పన్నవ్యాధులలో ఉపోదికా, దధితోచేసిన యవాగు మదమును విదాహమును శాంతింపచేయును.

శాకైరభృష్టైః పరిభృష్టకైశ్చ రోగాతురావేక్ష్యుపకల్పయేత్తాః ।
లోకే ప్రసిద్ధం యన్మానం తర్కుమానం తులాధృతమ్ ।
తత్తన్త్రేఽస్మిన్ ప్రమాణం స్యాద్వక్తవ్యం తత్ర నాస్తి మే ॥ 88 ॥

రోగము రోగిని చూసి భృష్ట లేక అభృష్ట శాకములతో చేసిన యవాగును ఇవ్వవలెను. తర్కు సంగత తులాయుక్త మానము లోక ప్రసిద్ధము. అదే ఈ తంత్రములో గూడ ప్రమాణముగా తీసుకోబడినది. కావున ఈ విషయము విశేషముగా ఇక్కడ చెప్పలేదు.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥
అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

(ఇతి) ఖిలేషు యూషనిర్దేశీయో (నామ చతుర్థోఽధ్యాయః) ॥

యూష నిర్దేశీయాధ్యాయము సమాప్తము.

# భోజ్యోపక్రమణీయాధ్యాయః - పంచమః

అథాతో భోజ్యోపక్రమణీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇపుడు మనము భోజ్యోపక్రణీయాధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

అథ ఖల్వస్మాభిః పూర్వం యద్రసవిమానేఽభిహితం కాలాది-చతుర్వింశతివిధమాహారమానం, తస్యేదానీం ప్రతివికల్పవిశేషానుపదేక్ష్యామః। కిం కారణమ్ ? న హ్యాహారాదృతే ప్రాణినాం ప్రాణాధిష్ఠానం కిఞ్చిదప్యుపలభామహే। స సమ్యగుపయుజ్యమానో జీవయతి, సర్వేన్ద్రియాణి ప్లాదయతి, ధాతూనాప్యాయయతి, స్మృతిమతిసర్వబలౌజాంస్యూర్జయతి, వర్ణప్రసాదం చోపజనయతి; అసమ్యగుపయుజ్యమానస్త్వసుఖేనోపయోజయతి। తస్మాత్ కాలే సాత్మ్యం మాత్రావదుష్టం స్నిగ్ధమవిరోధి శుచౌ దేశే శుచిషు పాత్రేషు శుచిపరిచరేణోపనీతం ప్రాఙ్ముఖస్తూష్ణీంతన్మనా ఆస్వాదయన్నాతిద్రుతం నాతివిలమ్బితం నాత్యుష్ణం నాతిశీతం నాతిరూక్షం నాతిస్నిగ్ధం నాతిబహు నాతిస్తోకం నాతిద్రవం నాతిశుష్కం నాకాంక్షితో న ప్రతాన్తో నైకరసం వాఽఽరోగ్యాయుర్బలార్థీ సమశ్నీయాత్ ॥ 3 ॥

మనము మొదలు రసవిమానములో 24 ప్రకారముల ఆహార మానములు చెప్పితిమి. ఇప్పుడు వాటి విశేష వికల్పములను చెప్పెదము. ఎందుకనగా ఆహారము లేకుండా కొంచెం కూడ ప్రాణులలో ప్రాణము స్థిరముగా

నుండదు. ఆహారము సరిగా ఇచ్చినట్లైతే అది జీవమునిచ్చును. సమస్త ఇంద్రియములను ప్రసన్నము చేయును. ధాతువులను వృద్ధి పొందించును. స్మృతి, బుద్ధి, అన్ని బలములను ఓజస్సును వర్ణమును వృద్ధి పొందించును. దీనికి విరుద్ధముగా ఆహారమును ప్రయోగించినచో అన్ని విధములైన శారీరక దుఃఖములను కలుగజేయును.

భవన్తి చాత్ర –

ఆరోగ్యం దోషసమతా సర్వాబాధనివర్తనమ్ ।
తదర్థమృషయః పుణ్యమాయుర్వేదమధీయతే ॥ 4 ॥

దోష సమావస్థ సమస్త రోగముల నివృత్తి అనబడును. ఈ ఆరోగ్యము కొరకు ఋషులు పుణ్యకారకమగు ఆయుర్వేదమును అధ్యయనము చేస్తారు.

రసాయనాని విధివత్తదర్థం చోపయుఞ్జతే ।
ధర్మార్థకామమోక్షాణామవాప్తిశ్చ తదాశ్రయా ॥ 5 ॥
తదాత్మ్యవాంస్తదర్థాయ ప్రయతేత విచక్షణః ।

ఈ ఆరోగ్యము కొరకు చెప్పినట్లుగా రసాయన ప్రయోగము ...యబడును. ధర్మార్థ కామ మోక్షములను పురుషార్థములు కూడ ...రోగ్యమువల్లనే లభించును. కావున బుద్ధి మంతుడైన మనుష్యుడు ఆరోగ్యము ...రకు ప్రయత్నించవలెను.

అన్నాభిలాషో భుక్తస్య పరిపాకః సుఖేన చ ॥ 6 ॥

సృష్టవిణ్మూత్రవాతత్వం శరీరస్య చ లాఘవమ్ ।
సుప్రసన్నేన్ద్రియత్వం చ సుఖస్వప్నప్రబోధనమ్ ॥ 7 ॥

బలవర్ణాయుషాం లాభః సౌమనస్యం సమాగ్నితా ।
విద్యాదారోగ్యలిఙ్గాని విపరీతే విపర్యయమ్ ॥ 8 ॥

...రోగ్యలక్షణములు : అన్నమునందభిలాష, భుజించిన ఆహారము సుఖముగా ...మగుట, మలమూత్ర వాతములు సరిగా వెడలుట, శరీరలఘుత్వము, ...ద్రియ ప్రసన్నత, సుఖపూర్వక నిద్ర, మేల్కొనుట, బలవర్ణ ఆయు ప్రాప్తి,

మనో ప్రసన్నము, అగ్ని సమానత్వము ఆరోగ్య లక్షణములు. దీనికి విపరీతము అనారోగ్యము.

ఆరోగ్యం భోజనాధీనం భోజ్యం విధిమపేక్షతే ।
విధిర్వికల్పం భజతే వికల్పస్తు ప్రవక్ష్యతే ॥ **9** ॥

ఆరోగ్యము భోజనముపై ఆధారపడియుండును. భోజనవిధిననుసరించి ఉండును. భోజనవిధి దాని వికల్పముపై ఆధారపడి ఉండును. కావున భోజన వికల్పములను వ్యాఖ్యానించెదము.

స్వస్థానస్థేషు దోషేషు స్రోతఃసు విమలేషు చ ।
జాతాయాం చ ప్రకాంక్షాయామన్నకాలం విదుర్బుధాః ॥ **10** ॥

**అన్న కాలము :** దోషములు తమస్థానములో స్థితమైనప్పుడు స్రోతస్సులు మల రహితమైనపుడు, భోజనము నందు ఇచ్ఛ కల్గినపుడు అన్నకాలమని పండితులు చెప్పినారు.

కాలేఽశ్నతోఽన్నం స్వదతే తుష్టిః పుష్టిశ్చ వర్ధతే ।
సుఖేన జీర్యతే న స్యుః ప్రతాన్తా జీర్ణజా గదాః ॥ **11** ॥

ఇప్పుడు భోజనము యొక్క 24 వికల్పములు వ్యాఖ్యానించబడును.

1. **యోగ్య కాలము :-** ఈ కాలమునందు భుజించిన ఆహారము రుచిగా, శరీరమునకు తుష్టిని కలగ జేయును. పోషణమును వృద్ధి పొందించును. సుఖపూర్వకముగా జీర్ణమగును. అతి భోజనము చేయుట వలన, అజీర్ణమువలన ఉత్పన్నమగు రోగములు కల్గవు.

సాత్మ్యం నామాహురౌచిత్యం సాతత్యేనోపసేవితమ్ ।
ఆహారజాతం యద్యస్య చానుశేతే స్వభావతః ॥ **12** ॥

2. **సాత్మ్య లక్షణము :** ఔచిత్యమును సాత్మ్యము అందురు. ఎల్లప్పుడు సేవించడం వలన ఏ ఆహారమైతే అనుకూల మగునో అది సాత్మ్యము.

సాత్మ్యాశీ సాత్మ్యసాద్గుణ్యాచ్ఛతం వర్షాణి జీవతి ।
న చాప్యనుచితాహారవికారైరుపసృజతే ॥ **13** ॥

(ఇతి తాడపత్రపుస్తకే **210**తమం పత్రమ్)

సాత్మ్యమును సేవించు వ్యక్తి శ్రేష్ఠ గుణ కారణమున 100 సం॥ ములు జీవించును. అనుచితమైన ఆహారము వలన కల్గు రోగములు రావు.

లఘూనాం నాతిసౌహిత్యం గురూణామల్పశస్తథా ।
మాత్రావదశ్నతో భుక్తం సుఖేన పరిపచ్యతే ॥ **14** ॥
స్వష్ఠ (స్వాష్ఠ్య) యాత్రాగ్నిచేష్టానామవిరోధి చ తద్భవేత్ ।

3. లఘు పదార్థములను కడుపు నిండుగా తినకూడదు. గురు పదార్థములను కూడ అల్పమాత్రలో సేవించవలెను. ఈ విధముగా ఉచిత మాత్రలో భుజించు వ్యక్తికి సుఖపూర్వకముగా జీర్ణమగును. స్వష్ఠయాత్ర, జఠరాగ్ని, శరీరచేష్టలకు విరోధము కలుగదు.

ఉష్ణం హి భుక్తం స్వదతే శ్లేష్మాణం చ జయత్యపి ॥ **15** ॥
వాతానులోమ్యం కురుతే క్షిప్రమేవ చ జీర్యతే ।
అన్నాభిలాషం లఘుతామగ్నిదీప్తిం చ దేహినామ్ ॥ **16** ॥

4. ఉష్ణభోజనము మనిషికి రుచిగా నుండును. కఫమును హరించును. వాతానులోమనము చేయును. శీఘ్రముగా జీర్ణమగును. అన్నమునందు అభిలాషను, శరీరమునందు లఘుత్వమును, అగ్నిని ప్రదీప్తము చేయును.

స్నిగ్ధం ప్రీణయతే దేహమూర్జయత్యపి పౌరుషమ్ ।
కరోతి ధాతూపచయం బలవర్ణౌ దధాతి చ ॥ **17** ॥

5. స్నిగ్ధ భోజనము ప్రీణనము చేయును. పౌరుషమును వృద్ధి పొందించును. ధాతు వృద్ధి చేయును. బలవర్ణములను ధారణము చేయును.

సుమృష్టమపి నాశ్నీయాద్విరుద్ధం తద్ధి దేహినః ।
ప్రాణానస్యాఽఽశు వా హన్యాత్తుల్యం మధుఘృతం యథా ॥ **18** ॥
అవిరుద్ధాన్నభుక్ స్వాష్ఠ్యమాయుర్వర్ణం బలం సుఖమ్ ।
ప్రాప్నోతి, విపరీతాశీ తేషామేవ విపర్యయమ్ ॥ **19** ॥

6. బాగా తయారు చేసినదైనా విరుద్ధ ఆహారము సేవించ కూడదు. విరుద్ధభోజనము శీఘ్రముగా ప్రాణములను నశింపచేయును, ఏవిధముగా నైతే మధుఘృతములు సమాన మాత్రలో చేయునో. అవిరుద్ధ అన్నమును సేవించువ్యక్తి స్వాస్థ్యము, ఆయువు వర్ణబలము సుఖము ప్రాప్తించును. దీనికి విపరీతముగా సేవించు వ్యక్తికి విపరీత ఫలితములు కల్గును.

శుచిపాత్రోపచరణాం శుచౌ దేశే శుచిః స్వయమ్ ।
భుఞ్జానో లభతే తుష్టిం పుష్టిం తేనాధిగచ్ఛతి ॥ **20** ॥

నానిష్టైరమనస్యైర్వా విఘాతం మనసోర్చ్ఛతి ।
తస్మాదనిష్టే నాశ్నీయాదాయురారోగ్యలిప్సయా ॥ **21** ॥

7. పవిత్ర పాత్రలో పవిత్రదేశములో పవిత్రమై భోజనముచేయు వానికి తుష్టి శరీరపోషణ ప్రాప్తించును. ఇష్టము కానిది, మనసుకు రుచించని ఆహారము సేవించ కూడదు. కావున ఆయురారోగ్యములు కోరు వారు అపవిత్ర స్థానములో భోజనము చేయకూడదు.

ప్రాఙ్ముఖోఽశ్నన్నరో ధీమాన్ దీర్ఘమాయురవాప్నుతే ।
తూష్ణీం సర్వేంద్రియాహ్లాదం మనఃసాత్మ్యం చ విన్దతి ॥ **22** ॥

8. తూర్పు వైపుముఖము చేసి భోజనము చేయువాడికి దీర్ఘాయు ప్రాప్తించును.

9. శాంతముగా భోజనముచేయు వానికి ఇంద్రియ ప్రసన్నత మనో సాత్మ్యత ప్రాప్తించును.

ఏతదేవ చ మాత్రాం చ పంక్తి యుక్తిం చ తన్మనాః ।
తస్మాత్తత్ప్రవణోఽజల్పన్ స్వస్థో భుఞ్జీత భోజనమ్ ॥ **23** ॥

10. మనసులగ్నము చేసి భోజనము చేయువాడు పూర్వోక్తగుణములను మరియు మాత్ర, పాచనము, శక్తి యుక్తులను తెలుసుకొనును. కావున స్వాస్థ్యము కొరకు మనసు పెట్టి భోజనము చేయవలెను.

ఆస్వాద్యాస్వాద్య యోఽశ్నాతి శుద్ధజిహ్వేంద్రియో రసాన్ ।
స వేత్తి రసనానాత్వం విశేషాంశ్చాధిగచ్ఛతి ॥ **24** ॥

11. శుద్ధమైన రసనేంద్రియము గల వ్యక్తి రసములను ఆస్వాదిస్తూ రసభేదములను చక్కగా గ్రహించును.

అతిద్రుతం హి భుఞ్జానో నాహారస్థితిమాప్నుయాత్ ।
భోజ్యానుపూర్వ్యం నో వేత్తి న చాన్నరససంపదమ్ ॥ 25 ॥
నాతిద్రుతాశీ తత్సర్వమనూనం ప్రతిపద్యతే ।
ప్రసాదమింద్రియాణాం చ తథా వాతానులోమతామ్ ॥ 26 ॥

12. అతిశీఘ్రముగా భుజించుటచే ఆహారము తన స్థితిని పొందదు. భోజ్యానుపూర్వము, అన్నరసగుణములను తెలుసుకొనజాలడు. శీఘ్రముగా భోజనము చేయువాడు ఇంద్రియ ప్రసన్నత వాతాను లోమనము మొ॥నవి సంపూర్ణముగా తెలుసుకొనలేడు.

శీతీకరోతి చాన్నాద్యం భుఞ్జానో ఽతివిలమ్బితమ్ ।
భుంక్తే బహు చ శీతం చ న తృప్తిమధిగచ్ఛతి ॥ 27 ॥
శైత్యాద్బహుత్వాద్వైరస్యాద్ భుక్తం క్లేశేన పచ్యతే ।

13. అతి మెల్లగా భోజనము చేయుటవలన భోజనము చల్లబడును. అన్నం అధిక మాత్రలో భుజింపబడును. చల్లని అన్నము తృప్తి నివ్వదు. చల్లని భోజనము అధికమాత్రలో సేవించుట వలన విరసము అగుట వలన భోజనము కష్టముగా పాచనము చెందును.

అత్యుష్ణభోజనాజ్జిహ్వాకణ్ఠోష్ఠహృదయోదరమ్ ॥ 28 ॥
దహ్యతే న రసం వేత్తి రోగాంశ్చాప్నోతి దారుణాన్ ।
ముఖాక్షిపాకవైసర్పరక్తపిత్తభ్రమజ్వరాన్ ॥ 29 ॥

14. అత్యుష్ణ భోజనము వలన జిహ్వా, కంఠము, ఓష్ఠము, హృదయము, ఉదరములో దాహము కల్గును. రసజ్ఞానము కల్గదు. ముఖపాకము, అక్షిపాకము, విసర్పము, రక్తపిత్తము, భ్రమ, జ్వరము మొదలగు భయంకర రోగములు కల్గును.

అతిశీతాశినః శూలం గ్రహణీమార్దవం ఘృణా ।
కఫవాతాభివృద్ధిశ్చ కాసో హిక్కా చ జాయతే ॥ 30 ॥

15. అతిశీత భోజనముచే శూల గ్రహణీ మృదుతా, ఘృణా, కఫవాత వృద్ధి కాసహిక్క ఉత్పన్నమగును.

రూక్షం కరోతి విష్టమ్భముదావర్తం వివర్ణతామ్।
గ్లానిం బహ్వాశితం వాయోః ప్రకోపం మూత్రనిగ్రహమ్ ॥ 31 ॥

16. రూక్షభోజనముచే విష్టంభము, ఉదావర్తము, వివర్ణతాగ్లాని, అధికముగా భుజించుట, వాయు ప్రకోపము మూత్రము నిలిచి పోవుట కల్గును.

అతిస్నిగ్ధాశినస్తంద్రీతృష్ణాజీర్ణోదరామయాః।
భవన్తి కఫమేదోత్థా రోగాః కణ్ఠోద్భవాస్తథా ॥ 32 ॥

17. అతి స్నిగ్ధ భోజనముచే తంద్రా తృష్ణా జీర్ణ ఉదరరోగములు కఫ మేద కంఠరోగములు కల్గును.

విష్టమ్భోద్వేష్టనక్లేశచేష్టాహానివిసూచికాః।
జ్ఞేయా వికారా జన్తూనామతిబహ్వాశనోద్భవాః ॥ 33 ॥

18. అధిక మాత్రలో భోజనముచేయుట వలన మనుషులకు విష్టంభము, ఉద్వేష్టనము, క్లేశము, చేష్టాహాని, విసూచిక మొదలగు రోగవములు ఉత్పన్నమగును.

అతిస్తోకాశినోఽత్యగ్నివికారాః కృశతా భ్రమః।
అతృప్తిర్లఘుతా నిద్రాశకృన్మూత్రబలక్షయః ॥ 34 ॥

19. అతి తక్కువ భోజనము చేయుటవలన అత్యగ్నివికారము, కృశత, భ్రమ, అతృప్తి, లఘుత్వము, నిద్ర, మల, మూత్ర, బలక్షయము కల్గును.

అతిద్రవాశనాజ్జన్తోరుత్క్లేశో బహుమూత్రతా।
పార్శ్వభేదః ప్రతిశ్యాయో విడ్భేదశ్చోపజాయతే ॥ 35 ॥

20. అతిద్రవ భోజనముచే ఉత్క్లేశము, బహుమూత్రము, పార్శ్వభేదము, ప్రతిశ్యాయము, విడ్భేదము ఉత్పన్నమగును.

అతిశుష్కాశనం చాపి విష్టభ్య పరిపచ్యతే।
పూర్వజాతరసం జగ్ధ్వా కుర్యాన్మూత్రకఫక్షయమ్ ॥ 36 ॥

21. అతిశుష్క భోజనముచే విష్టబ్ధమై పాచనము చెందును. మొదట ఉత్పన్నమైన రసమును దహించి మూత్ర కఫక్షయమును చేయును.

మోహాత్ ప్రమాదాల్లౌల్యాద్వా యో భుంక్తే హ్యప్రకాంక్షితః ।
అవిపాకారుచిచ్ఛర్దిశూలానాహాన్ సమృచ్ఛతి ॥ 37 ॥

22. భోజనము నందిచ్ఛ లేనిచో మోహము, ప్రమాదము జిహ్వాలౌల్యము వలన భుజించును. తద్వారా అవిపాకము, అరుచి, వమనము శూల కల్గును.

ప్రతాన్తభోక్తుస్తృణ్మూర్ఛా వహ్నిసాదోఽఙ్గసీదనమ్ ।
జ్వరః క్షయోఽతిసారో వా మన్దత్వం దర్శనస్య చ ॥ 38 ॥

23. నిరంతరము భోజనము చేయు వానికి తృష్ణ, మూర్ఛ, అగ్ని సాదము, అంగములందు పీడ, జ్వరము, క్షయము, అతిసారము, దృష్టి మాంద్యము కల్గును.

దౌర్బల్యమదృఢత్వం చ భవత్యేకరసాశనాత్ ।
దోషాప్రవబుద్ధిర్ధాతూనాం సామ్యం వృద్ధిర్బలాయుషోః ॥ 39 ॥
ఆరోగ్యం చాగ్నిదీప్తిశ్చ జన్తోః సర్వరసాశనాత్ ।
తస్మాదేకరసాభ్యాసమారోగ్యార్థీ వివర్జయేత్ ॥ 40 ॥

24. ఎల్లప్పుడు ఏక రససేవనచే దుర్బలత్వము అదృఢత్వము కల్గును. దీనికి విపరీతముగా అన్ని రసములను సేవించుటచే దోషములు ప్రకోపము చెందవు. ధాతువుల సమత్వము బల ఆయు వృద్ధి ఆరోగ్యము అగ్నిదీప్తి కల్గును. కావున ఆరోగ్యమును కోరువారు. ఏక రసాభ్యాసమును త్యజించవలెను.

కాలసాత్మ్యాదినాఽనేన విధినాఽశ్నాతి యో నరః ।
స ప్రాప్నోతి గుణాంస్తజ్జాన్న చ దోషైః ప్రబాధ్యతే ॥ 41 ॥

పైన చెప్పిన కాల సాత్మ్యాదులు విధి అనుసారము ఎవరు పాటించెదరో వారు ఆయా గుణయుక్తులగుదురు. వారికి ఆయాకాల సాత్మ్యాదుల సంబంధిత దోష కష్టములు కలుగవు.

**స్థిరత్వం స్పష్టతాఽఙ్గానామింద్రియోపచయం బలమ్।**
**కఫమేదోఽభివృద్ధిం చ కుర్యాన్మధురసాత్మ్యతా ॥ 42 ॥**

మధుర రస సాత్మ్యముచే శరీర స్థిరత, అంగస్పష్టత, ఇంద్రియ ఉపచయము, బల, కఫ మేదస్సు వృద్ధి చెందును.

**దన్తాక్షికేశదౌర్బల్యం కఫపిత్తామయోద్భవమ్।**
**లఘుతామగ్నిదీప్తిం చ జనయేదమ్లసాత్మ్యతా ॥ 43 ॥**

అమ్లరస సాత్మ్యముచే దంతములు నేత్రములు కేశములు దుర్బలమగును. కఫపిత్త రోగములుత్పన్నమగును. లఘుత్వము అగ్ని దీప్తి కల్గును.

**రక్తప్రకోపం తైమిర్యం తృష్ణాం దుర్బలశుక్రతామ్।**
**పాలిత్యం బలహానిం చ కుర్యాల్లవణసాత్మ్యతా ॥ 44 ॥**

లవణ రస సాత్మ్యముచే రక్త ప్రకోపము తిమిరము, తృష్ణ శుక్ర దుర్బలము, పాలిత్యము, బలహాని కల్గును.

**పంక్తేరుపచయం కార్శ్యం రౌక్ష్యం శుక్రబలక్షయమ్।**
**పిత్తానిలప్రవృద్ధిం చ కుర్యాత్ కటుకసాత్మ్యతా ॥ 45 ॥**

కటు రస సాత్మ్యముచే పాచన శక్తివృద్ధి, కృశత్వము, రూక్షత్వము శుక్ర క్షయము కల్గును. పిత్తవాత వృద్ధి కల్గును.

**క్లేదాల్పతాం వాతవృద్ధిం దృష్టిహానిం కఫక్షయమ్।**
**త్వగ్వికారోపశాన్తిం చ జనయేత్తిక్తసాత్మ్యతా ॥ 46 ॥**

తిక్త రస సాత్మ్యముచే క్లేదహాని, వాతవృద్ధి, దృష్టిమాంద్యము కఫ క్షయము, కల్గిత్వక్ రోగములు శాంతించును.

**కఫపిత్తక్షయం వాయోః ప్రకోపం పక్తిమార్దవమ్।**
**కుర్యాద్రక్తోపశాన్తిం చ కషాయరససాత్మ్యతా ॥ 47 ॥**

కషాయ రస సాత్మ్యము వలన కఫ పిత్త క్షయము, వాయు ప్రకోపము పాచన శక్తి మృదుత్వము కల్గి, రక్త రోగములు శాంతించును.

ఓజస్తేజో బలం వర్ణమాయుర్మేధా ధృతిః స్మృతిః ।
జాయతే సౌకుమార్యం చ ఘృతసాత్మ్యస్య దేహినః ॥ **48** ॥

ఘృత సాత్మ్యము గలవానికి ఓజస్సు, తేజస్సు, బల వర్ణములు ఆయువు మేధా ధృతి స్మృతి సుకుమారములు కల్గును.

తథైవ క్షీరసాత్మ్యస్య పరం చైతద్రసాయనమ్ ।
దృఢోపచితగాత్రశ్చ నిర్మేదస్కో జితశ్రమః ॥ **49** ॥

క్షీర సాత్మ్యము గలవానికి అది రసాయనము. శరీరము దృఢమగును. మేదస్సు తగ్గును. పరిశ్రమనోర్చుకొనును.

బలవాన్ తైలసాత్మ్యః స్యాత్ క్షీణవాతకఫామయః ।
చక్షుష్మాన్ బలవాన్ శ్లేష్మి దృఢసత్త్వో దృఢేంద్రియః ॥ **50** ॥

తైలసాత్మ్యము గలవాడు బలవంతుడు, వాతకఫరోగములు క్షీణించును. నేత్రములు స్పష్టముగా నుండి బలవంతుడగును. కఫవృద్ధి కల్గి సత్త్వము ఇంద్రియములు దృఢమగును.

దృఢాశ్రయో మన్దరుజో మాంససాత్మ్యో భవేన్నరః ।
(ఇతి తాడపత్రపుస్తకే 211 తమం పత్రమ్)
అహితం యస్య సాత్మ్యం స్యాదసాత్మ్యం చ హితం భవేత్ ॥ **51** ॥
స శనైర్హితమాదద్యాదహితం చ శనైస్త్యజేత్ ।

మాంస సాత్మ్యము కలవాడు దృఢాశ్రయుడు, రోగములు మందముగా నుండును. అహితకర్మ పదార్థములు సాత్మ్యము హితకర పదార్థములు అసాత్మ్యము గలవాడు క్రమముగా హితకరములను గ్రహించి అహితములను త్యజించవలెను.

ఆదౌ తు స్నిగ్ధమధురం విచిత్రం మధ్యతస్తథా ॥ **52** ॥
రూక్షద్రవావసానం చ భుఞ్జానో నావసీదతి ।

భోజన ఆరంభమున స్నిగ్ధమధుర పదార్థములు, మధ్యమమున నానావిధ భోజనము అంతము నందు రూక్ష ద్రవ పదార్థములను సేవించువాడు కష్టములను పొందడు.

భాగద్వయమిహాన్నస్య తృతీయముదకస్య చ ॥ 53 ॥
వాయోః సంచరణార్థం చ చతుర్థమవశేషయేత్ ।

కుక్షి నాల్గు భాగములందు, 2 భాగములు అన్నముతో 3 వ భాగము జలముతో నింపవలెను. 4 వ భాగము వాయు గతికొరకు ఖాలీగా నుంచవలెను.

తతో ముహూర్తమాశ్వస్య గత్వా పాదశతం శనైః ॥ 54 ॥
శ్వాసీనస్య సుఖేనాన్నమవ్యథం పరిపచ్యతే ।
వీణావేణుస్వనోన్మిశ్రం గీతం నాట్యవిడమ్బితమ్ ॥ 55 ॥
విచిత్రాశ్చ కథాం శృణ్వన్ భుక్త్వా వర్ధయతే బలమ్ ।
సుఖస్పర్శవిహారం చ సమ్యగాప్నోత్యతోఽన్యథా ॥ 56 ॥

భోజనానంతరము ఒక ముహూర్తము విశ్రాంతి తీసికొని మెల్ల మెల్లగా 100 అడుగులు నడవవలెను. తర్వాత సుఖపూర్వకముగా కూర్చునవలెను. తద్వార భుజించిన ఆహారం ఏ కష్టము లేక జీర్ణమగును. భోజన సమయమున, తర్వాత వీణా లేక వేణు శబ్ద మిశ్రితమైన గీతములు, వినుట నాటకములను చూచుట విచిత్ర కథలను వినుట వలన బలము వృద్ధి పొందును. అతడు సుఖకర స్పర్శను విహారమును చక్కగా అనుభవించును.

అతిస్నిగ్ధాతిశుష్కాణాం గురూణాం చాతిసేవనాత్ ।
జన్తోరత్యమ్బుపానాచ్చ వాతవిణ్మూత్రధారణాత్ ॥ 57 ॥
రాత్రౌ జాగరణాత్ స్వప్నాద్దివా విషమభోజనాత్ ।
అసాత్మ్యసేవనాచ్చైవ న సమ్యక్ పరిపచ్యతే ॥ 58 ॥

దీనికి విరుద్ధముగా అతి స్నిగ్ధ అతిశుష్క గురుపదార్థములను అతిగా సేవించుట వలన, వాతమూత్రముల ధారణము వలన రాత్రి జాగరణము దివాస్వప్నము విషమ భోజనము అసాత్మ్యసేవనము వలన భుజించిన ఆహారము సక్రమముగా జీర్ణముగాదు.

హితాహితం యద్వైకధ్యం భుక్తం సమశనం తు తత్ ।
పూర్వభక్తేఽపరిణతే విద్యాదధ్యశనం భిషక్ ॥ 59 ॥
క్షుత్తృష్ణోపరమే జాతే శాన్తేఽగ్నౌ ప్రమృతాశనాత్ (నమ్) ।
విషమం గుణసంస్కారాత్ క్రమసాత్మ్యవ్యతిక్రమాత్ ॥ 60 ॥

హితకరము అహితకరములైన పదార్థములను ఒకే సమయమున సేవించుట లేదా కలిపి భుజించుట సమాశనమనబడును. పూర్వ భోజనము పాచనమునకు ముందే తిరిగి భుజించుట అధ్యశనమందురు. క్షుత్ తృష్ణలు నష్టమైనప్పుడు లేదా అగ్ని శాంతించినపుడు భుజించుట ప్రమృతాశన మన బడును. గుణసంస్కారములను, సాత్మ్య క్రమమును వ్యతి రేకించుట విషమాశన మనబడును.

విరుద్ధం పయసా మత్స్యా యథా వా గుడమూలకమ్ ।
స్యాదజీర్ణాశనం నామ వ్యుష్టాజీర్ణే చతుర్విధే ॥ **61** ॥
తథైవాత్యశనం జ్ఞేయమతిమాత్రోపయోగతః ।
స...తాన్యామయోత్పత్తౌ మూలహేతుం ప్రచక్షతే ॥ **62** ॥

క్షీరము చేపలు పరస్పర విరుద్ధము. బెల్లము ముల్లంగి కూడ విరుద్ధము. 4 విధములైన వ్యుష్టా జీర్ణము (ప్రభాత కాలములో కలుగు అజీర్ణము) అజీర్ణాశనమనబడును. అధిక మాత్రలో సేవించిన భోజనము అత్యశన మనబడును. ఇవన్ని రోగోత్పత్తికి మూలకారణములుగా చెప్పబడినవి.

ఆహారసాత్మ్యం దేశేషు యేషు యేషు యథా యథా ।
ప్రోక్తం తథోపదేష్టవ్యం తేషు తేషు తథా తథా ॥ **63** ॥

ఏ దేశములో ఏ ఆహారము సాత్మ్యముగా చెప్పబడినదో అదే విధముగా ఉపదేశించవలెను.

చతుర్వింశతిరిత్యేతే వికల్పాః సముదాహృతాః ।
భిషజా హ్యుపదేష్టవ్యా రాజ్ఞో రాజోపమస్య వా ॥ **64** ॥
అన్యేషాం వా వసుమతాం యశోధర్మార్థసిద్ధయే ।

ఇవి ఆహారము యొక్క 24 వికల్పములు చెప్పబడినవి. యశో ధర్మార్థములకై వైద్యుడు వీటిని రాజులకు తత్సమానులకు ఉపదేశించవలెను.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ **65** ॥

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను. ఖిలేషు భోజ్యవిభాగీయాధ్యాయము సమాప్తము.

(ఇతి) ఖిలేషు భోజ్యవిభాగీయో (నామ పఞ్చమోఽధ్యాయః)

# రసదోషవిభాగాధ్యాయః - షష్ఠః

అథాతో రసదోషవిభాగీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము రసదోష విభాగీయమను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

రసదోషవిభాగజ్ఞః ప్రకోపోపశమం ప్రతి ।
భిషగ్భిషక్త్వం లభతే విపర్యయమథాన్యథా ॥ 3 ॥

రస దోష విభాగములను తెలుసుకొను వైద్యుడు రోగ ప్రకోప ప్రశమనముల వైద్యత్వమును ప్రాప్తించును. దీనికి విపరీతమైనచో అతడు వైద్యుడనబడడు.

తస్మాద్దోషవికల్పాంశ్చ వికల్పాంశ్చ రసాశ్రయాన్ ।
ప్రవక్ష్యామి యథాశాస్త్రం సవిశేషం సవిస్తరమ్ ॥ 4 ॥

కావున నేను రస, దోషముల భేదముల విశేష జ్ఞానమును శాస్త్రానుసారము సవిస్తరముగా తెలియ జేస్తాను.

వ్యాసతస్తు జ్వరాదీనాం వ్యాధీనాం దోషభేదతః ।
ద్విషష్టిధా కల్పనోక్తా స్థూలసంఖ్యా త్వతః పరమ్ ॥ 5 ॥

జ్వరాదులు దోష భేదానుసారము 62 కల్పనలు చెప్పబడినవి. తర్వాత దీని స్థూల సంఖ్య చెప్పబడును.

ఏకైకశస్త్రయో ద్వన్ద్వైర్నవ సర్వే త్రయోదశ।
క్షీణాధికసమైశ్చాన్యైర్ద్వశ ద్వా చ ప్రకీర్తితాః ॥ 6 ॥

దోషముల అనుసారము 3 వికారములు ద్వంద్వజ వికారము, 9 సన్నిపాతములు 13 వికారములు గానుండును. క్షీణ, అధిక సమత్వ భేదములతో 12 విధములుగా నుండును.

తేషాం విభాగం వక్ష్యామి విస్తరేణ యథాక్రమమ్।
ఏకైకశస్త్రయో జ్ఞేయా వాతపిత్తకఫైర్గదాః ॥ 7 ॥

సమైర్ద్వన్ద్వైస్త్రయః షట్ తు విషమైర్నవ తే స్మృతాః।
ద్వ్యధికైకాధికైః షట్ చ హీనమధ్యాధికైశ్చ షట్ ॥ 8 ॥

ఏకః సమైస్త్రిభిర్దోషైరిత్యాతజ్కాస్త్రయోదశ।
దోషైరేతైవివృద్ధైః స్యుర్వికల్పాః పఞ్చవింశతిః ॥ 9 ॥

ఇప్పుడు వాటి భేదములను క్రమముగా విస్తారముగా చెప్పెదను. దోష భేదముచే 3 విధములు 1. వాతవృద్ధము 2 పిత్తవృద్ధము 3. కఫ వృద్ధము.
ద్వంద్వజ వికారములు 9. ఇందులో రెండు దోషములు సమముగా వృద్ధి చెందును. 1. వాత పిత్త 2. వాతకఫ 3. పిత్తకఫ, దోషవిషమత్వము 6 విధములు. 4. వాత వృద్ధి పిత్త వృద్ధతర 5. పిత్త వృద్ధ వాత వృద్ధతర 6. కఫవృద్ధి పిత్త వృద్ధతర 7. పిత్త వృద్ధ కఫవృద్ధతర 8 వాతవృద్ధ కఫవృద్ధ తర 9 కఫ వృద్ధ వాత వృద్ధతర ఈ విధముగా వృద్ధ ద్వంద్వజ దోషములు 9.
సన్నిపాతములు 13- ఇందులో రెండు దోషముల ఆధిక్యత, ఒక దోషము ఆధిక్యముతో ఆరు వికారములగును.
1. కఫవృద్ధి వాతపిత్త అధిక వృద్ధి 2. పితవృద్ధి వాతకఫ అధిక వృద్ధి 3. వాత వృద్ధి పిత్తకఫ అధికవృద్ధి
1. పిత్తకఫవృద్ధి వాత అధికవృద్ధి 2. వాత కఫ వృద్ధి పిత్త అధికవృద్ధి 3. వాతపిత్తవృద్ధి కఫ అధిక వృద్ధి.
3 దోషముల హీనమధ్య అధిక భేధములతో 6 విధములగును.

1. వాత వృద్ధి, పిత్త వృద్ధతర, కషవృద్ధతరము

2. వాతవృద్ధి, కఫ వృద్ధతర, పిత్త వృద్ధతరము.

3. పిత్తవృద్ధ, కఫ వృద్ధతర, వాత వృద్ధతరము.

4. పిత్తవృద్ధ, వాతవృద్ధతర, కఫ వృద్ధతరము

5. కఫవృద్ధ, వాతవృద్ధతర, పిత్త వృద్ధతరము.

6. కఫవృద్ధ పిత్త వృద్ధతర, వాతవృద్ధతరము. (త్రిదోషములు ప్రకోపించి యుండును. కాని మూడింటిలో ఒకటి తక్కువ, ఒకటి మధ్యమము, ఒకటి అధికముగా వృద్ధి చెందియుండును.

| | | |
|---|---|---|
| ద్వి ఉల్బణ | = 3 | ఏకోల్బణా - 3 హీనుమధ్య అధిక = 6 |
| సమవృద్ధి | = 1 | మొత్తము =13 సన్నిపాతములు |
| ఏకదోషజము | = 3 | |
| ద్విదోషజ | = 9 | |
| సన్నిపాత | = 13 | |
| మొత్తము | = 25 | |

**దోషైః క్షీణైరపి గదా దృష్ట్వైవం పఞ్చవింశతిః ।**

ఇదే విధముగా క్షీణదోషములు కూడ 25 విధములుగా నుండును.

**ద్విక్షీణైరేకవృద్ధైః స్యురేకక్షీణైద్విరుద్బణైః ॥ 10 ॥**

**షట్ షట్ క్షీణాధికసమైర్దశ ద్వౌ చాపరే గదాః ।**

రెండు దోష క్షీణములు, ఒకటి వృద్ధము, మరియు ఒక దోష క్షీణము రెండు వృద్ధములు ఈ విధముగా ఆరు విధములు. ఒకటి క్షీణము ఒకటి వృద్ధి ఒకటి సమము- 6 విధములు మొత్తము 12 విధములు అగును.

25+25+12 = 62.

**ఇతి ద్విషష్టిసంఖ్యైషా వికారాణాం వికల్పశః ॥ 11 ॥**

**వాతపిత్తకఫైరేకో దశ స్యాత్ ప్రకృతిస్థితైః ॥**

ఈ విధముగా వికల్పములను సారము 62 అగును. ఇవి గాక వాతపిత్త కఫము ప్రాకృతముగా నుండునది ఒకటి.

**రసానాం తు వికల్పాః స్యురేకైకశ్యేన షట్ స్మృతాః ॥ 12 ॥**

**పూర్వః పూర్వః పరైర్యుక్తో ద్వికాః పఞ్చదశాపరే ।**

రసవికల్పములు ఏకరసములు =6

పూర్వమొకటి పరమొక్కటికలిసి ద్వికములు = 15

రసేషు త్రిషు పూర్వేషు వికల్పాః స్యుస్త్రయోఽధికాః ॥ 13 ॥

ద్వికేషు త్రిష్వథైకైకం సంయోజ్య కటుకాదిభిః।

కట్వాదిషు తథా పూర్వైః స్వాద్వమ్లలవణైః పృథక్ ॥ 14 ॥

అష్టాదశైతే ద్వాభ్యాం చ త్రికాభ్యాం వింశతిస్త్రికాః।

మధురామ్లలవణ రసములు మొదలు మొదటి 3 రసములలో 3 ద్వికములు అధికముగా ఏర్పడును. వీటితోపాటు కటుతిక్తకషాయములతో ఒక్కొక్కటి కలిసి 3 ఏర్పడును. మొత్తము 18 ద్వికములగును. ఇందులో 2 త్రికములు (మధురామ్లలవణ, కటుతిక్త కషాయము) కలిపినచో 20 అగును.

పూర్వోత్తరాభ్యాం మధురవ్యోషాదిభ్యాం యథాక్రమమ్ ॥ 15 ॥

యే ద్వికాస్త్రిషు పూర్వేషు యోజ్యాస్తే త్రిభిరుత్తరైః।

ప్రత్యేకశో నవైతే స్యుర్వికల్పాః షడిహాన్యథా ॥ 16 ॥

యుక్తాః స్వాద్వమ్లలవణాః పృథక్ కష్టాదిభిస్త్రిభిః।

కట్వాదయస్తథా పూర్వైరిత్యేతే దశ పఞ్చ చ ॥ 17 ॥

చతుష్కాః పఞ్చకాః షట్ స్యురేకైకస్య వివర్జనాత్।

పూర్వ మరియు ఉత్తర మధురము (మధుర, అమ్ల, లవణ) మరియు కటు (కటుతిక్త కషాయము) మొదలగువాటి ద్వికములు (అనగా మధురామ్ల మధురలవణ, ఆమ్లలవణ, కటుతిక్త, కటు కషాయ, మరియు తిక్తకషాయ) వీటిలో మొదటి మూడిటితో పాటు క్రమముగా కలుపుట వలన 9 చతుష్కములు అగును. మరియు సంయుక్త మధుర అమ్ల, లవణముల మూడింటికి కటు తిక్త కషాయములతో పాటు కటుతిక్తములు మరియు కషాయమునకు మధుర అమ్ల లవణముతో పాటు వేర్వేరుగా కలుపుటచే 6 చతుష్కములు అగును. ఈ విధము 9+6 =15 చతుష్కములు అగును.

షడ్భిరేకో రసైస్తేషాం కల్పనేయం త్రిషష్టిధా ॥ 18 ॥

పంచక ద్రవ్యములు: షడ్రసములలో ఒక్కొక్క రసమును విడుచుటచే పంచరస ద్రవ్యములు 6 అగును.

సంయోగాః సప్తపఞ్చాశదసంయుక్తాస్తు షడ్రసాః ।
షడేవ త్రిషు యుజ్యంతే రసా దోషేషు యోగతః ॥ 19 ॥

సంయుక్తరసములు 57 అగును. పై చెప్పిన 63లో వేర్వేరుగా ఒక్కొక్క రసమును విడిచిపెట్టిన మిగిలినవి 57 భేధములు అగును. ఇవి సంయోగములు రెండ్రెండు, మూడు మూడు, నాల్గునాల్గు, ఐదు ఐదు 6 రసములు సంయోగము అగును. అసంయుక్త రసములు 6 అగును. వాత పిత్త కఫ రూపములు 3టిలో వేర్వేరు యోగముల అనుసారము ఇవి 6 రసములే ప్రయుక్తమగును. ఒకచోట ఏకరసప్రయోగము, మరోసారి ద్విరస ప్రయోగము దోషముల అధిక వృద్ధి ఉన్నచో మూడు రసములు ఇత్యాది ప్రయోగములు చేయబడును.

క్వచిదేకః క్వచిద్ ద్వౌ చ దోషవృద్ధ్యా క్వచిత్రయః ।
హీనమధ్యాతివృద్ధానాం దోషాణాం తు యథాక్రమమ్ ॥ 20 ॥

హీనమధ్యాధికైరేవం రసైః కుర్యాదుపక్రమమ్ ।
ద్వ్యుల్బణైకోల్బణానాం చ సమానాం చైవ తద్విధైః ॥ 21 ॥

హీన మధ్య వృద్ధి దోషములు యథాక్రమముగా హీన మధ్య అధికరసముల ద్వారా చికిత్స చేయవలెను. ద్వ్యుల్బణ, ఏకోల్బణ మరియు సమాన వృద్ధి దోషములకు కూడ ఈ విధముగనే చికిత్స చేయవలెను.

వృద్ధానాం క్షపణం కార్యం మధ్యానాం యాపనం తథా ।
క్షీణానాం వర్ధనం చైవ రసవృద్ధిప్రమాణతః ॥ 22 ॥

రసవృద్ధి ప్రమాణానుసారము వృద్ధి చెందిన దోషములు తగ్గించుట, సమావస్థదోషములు స్థిరముగా నుంచుట క్షీణించిన దోషములను వృద్ధి పొందించుటకు ప్రయత్నించవలెను.

విశేషోఽత్ర యథాయోగం కార్యో రసవిపర్యయాత్ ।

(ఇతి తాడపత్రపుస్తకే 212 తమం పత్రమ్।)

ఏవం ద్విషష్టిదోషాణాం రసైరేషాం ద్విషష్టిభిః ॥ 23 ॥
సామ్యం తైః షట్కైరేవైకః స్వస్థవృత్తౌ ప్రయుజ్యతే ।

రస విపర్యయములయోగానుసారము ఇందులో పరివర్తనము చేయవలెను. ఈ విధముగా 62 రసముల ద్వారా 62 దోషముల చికిత్స చేయవలెను. కాని షడ్రసముల యోగముతో ఏకరసమగును. ఇందులో దోష సామ్యావస్థ స్థితమై యుండును. మరియు అదే స్వస్థ వృత్తములో ప్రయుక్త మగును. అనగా రసములు 63 కల్పనలు చెప్పబడినవి. మరియు కుపిత అకుపిత దోష భేదములు కూడ 63 చెప్పబడినవి. ఇందులో కుపిత 62 ప్రకారముల దోషములలో 62 విధముల రసకల్పనలు ఉపయోగించవలెను. 63వ దోషములో 63 వరసభేదము ఉపయోగించవలెను.

కటుతిక్తకషాయాంస్తు రసాన్ ప్రాజ్ఞో యథాక్రమమ్ ॥ **24** ॥
యోగతః కఫజే వ్యాధౌ భైషజ్యమవతారయేత్ ।

బుద్ధి మంతుడగువాడు కటు తిక్త కషాయ రసములను క్రమముగా సమ్యక్ యోగము ద్వారా కఫజవ్యాధులలో భైషజ్య రూపములో ఉపయోగించవలెను.

ప్రయుక్తః కటుకః పూర్వం పైచ్ఛిల్యం గౌరవం చ యత్ ॥ **25** ॥
శ్లేష్మణస్తం నిహన్త్యాశు తిక్తస్తస్మాదనన్తరమ్
హ్రాసయత్యాస్యమాధుర్యం కఫం సంశోషయత్యపి ॥ **26** ॥
సంగృహ్ణాతి కషాయశ్చ స్నేహం చాస్యాపకర్షతి ।

ఇందులో వాడబడిన కటు రసము సర్వ ప్రథమముగా శ్లేష్మము యొక్క పిచ్ఛిలము గౌరవమును శీఘ్రముగా నశింప చేయును. తిక్త రసము ముఖ మాధుర్యమును నశింపచేయును మరియు కఫమును శోషింపచేయును. కషాయ రసము దీనిని సంగ్రహించును. శ్లేష్మము యొక్క స్నేహమును అపకర్షణము చేయును మరియు స్నేహాంశమును తగ్గించును.

తిక్తస్వాదుకషాయాః స్యుః క్రమశః పైత్తికే హితాః ॥ **27** ॥
ఆమాన్వయత్వాత్ పిత్తస్య పూర్వం తిక్తోఽవచారితః ।
పాచయత్యాశు తం పక్వం తతస్తు మధురో రసః ॥ **28** ॥
శైత్యాద్ గురుత్వాత్ స్నేహాచ్చ మాధుర్యాచ్చ నియచ్ఛతి ।
తద్ద్రవత్వవిఘాతార్థం కషాయశ్చావచారితః ॥ **29** ॥

రౌక్ష్యాద్విశోషిభావాచ్చ విశోషయతి తైజసమ్।

తిక్త స్వాదు కషాయ రసములు క్రమముగా పిత్త రోగములలో హితకరముగా నుండును. పిత్తములో ఆమరస సంసర్గమగుటచే ప్రారంభములో ప్రయోగించిన తిక్తరసము ఆమమును శీఘ్రముగా పచింప చేయును. తర్వాత మధుర రసము శీతల, గురు, స్నిగ్ధ మాధుర్యమువలన పక్వమైన పిత్తమును శాంతింప చేయును. తర్వాత ద్రవత్వమును నశింపచేయుటకు కషాయరసమును ప్రయోగించవలెను. ఈ కషాయము తన రూక్ష విశోష స్వభావమున పిత్తమును శోషింప చేయును.

వాతికే లవణః పూర్వం సంయోగాదవచారితః ॥ 30 ॥
ప్రక్లేదిభావాజ్జయతి విబన్ధం మాతరిశ్వనః।
నిహన్తి శైత్యముష్ణత్వాద్ గురుత్వాచ్చాపి లాఘవమ్ ॥ 31 ॥
తథైవామ్లో రసః పశ్చాత్తస్మిన్నేవావచారితః।
జడీకృతాని స్రోతాంసి తైక్ష్ణ్యాదుద్ఘాట్య మారుతమ్ ॥ 32 ॥
అనులోమయతి క్షిప్రం స్నిగ్ధోష్ణత్వాద్విమార్గగమ్।
అమ్లాదనన్తరం పశ్చాత్ ప్రయుక్తో మధురో రసః ॥ 33 ॥
వాయోర్లఘుత్వం వైశద్యం రూక్షత్వం చ వ్యపోహతి।
గురుత్వాత్ పిచ్ఛిలత్వాచ్చ స్నిగ్ధత్వాచ్చ యథాబలమ్ ॥ 34 ॥
ఇత్యుక్తాః సర్వరోగేషు రసానాం ప్రవిచారణాః।

వాత రోగములలో మొదట సంయోగ రూపములో ప్రయోగించిన లవణ రసముక్లేదవశమున వాయు విబంధమును శాంతింపచేయును. ఇదే లవణ రసము ఉష్ణమగుటచే వాయు శీతలమును గురువగుటచే లఘుత్వమును నశింపచేయును. తర్వాత వాతరోగములో ప్రయోగించబడిన అమ్లరసము తన తీక్ష్ణ గుణముచే స్రోతస్సులను తెరచి స్నిగ్ధ ఉష్ణగుణముల వలన విమార్గగమన వాయువును శీఘ్రముగా అనులోమనము చేయును. తర్వాత ప్రయోగించిన మధురరసము బలానుసారము గురుత పిచ్ఛిలతా స్నిగ్ధత్వ కారణముల వలన లఘుత్వ విశదత్వము రూక్షమును నశింపచేయును. ఈ విధముగా సమస్త రోగములలో రసభేదములు చెప్పబడినవి.

దృశ్యన్తే ప్రాయశో యోగా రోగేష్వుక్తా జ్వరాదిషు ॥ 35 ॥
కటుతిక్తకషాయాశ్చ రసతో మధురాస్తథా ।
వాతజ్వరే యథాపూర్వం పేయాయూషరసాదిషు ।
లవణోఽమ్లశ్చ యుజ్యేతే రసౌ సంస్కారయోగినౌ ॥ 36 ॥
తతో విదారిగన్ధాదిర్మధురః సంప్రయుజ్యతే ।

జ్వరాది రోగములలో సామాన్యముగా కటుతిక్త కషాయ రసములు మధురరస యోగములు చెప్పబడినవి. వాతజ్వరములో మొదట పేయయూష రసాదులతో సంస్కార యుక్తమైన లవణ అమ్ల రసప్రయోగములను చేయవలెను. తర్వాత విదారిగంధాది మధుర ద్రవ్యములను ప్రయోగించవలెను.

**పిత్తజ్వరే యథా తిక్తః శార్ఙ్గేష్టాదిః ప్రయుజ్యతే ॥ 37 ॥**
**మధురః సారివాదిశ్చ, కషాయశ్చాభయాదికః ।**

పిత్తజ్వరములో శారంగేష్టా (కాకజంఘ కాకమాచి) మొదలగు తిక్త, సారిబాది మధుర, అభయాది కషాయ ద్రవ్యములను ప్రయోగించబడును.

**పిప్పల్యాదిర్యథాపూర్వం కటుకః కఫజే జ్వరే ॥ 38 ॥**
**ఆరగ్వధాదికస్తిక్తః, కషాయస్త్రిఫలాదికః ।**

కఫజ జ్వరములో మొదట పిప్పలీ మొదలగు కటురస ద్రవ్యములు తర్వాత ఆరగ్వధాది తిక్త రసద్రవ్యములు తర్వాత త్రిఫలాది కషాయ ద్రవ్యములను ప్రయోగించవలెను.

సర్వత్రైవానయా యుక్త్యా యథోద్దిష్టాన్రసాన్ బుధః ॥ 39 ॥
యథాదోషం యథాయోగం ప్రయుఞ్జీత యథేప్సితమ్ ।
ప్రక్షేపైరవకర్షైశ్చ ద్రవ్యాణామన్యథాఽన్యథా ॥ 40 ॥

వివేక వంతుడు పై చెప్పిన ప్రకారమే యుక్తిగా చెప్పిన రస దోషము మరియు యోగముల అనుసారము ద్రవ్యములను పెంచుట లేదా తగ్గించుట ఇచ్ఛానుసారము చేయవలెను.

యథా వా వీణయా వీణీ తంత్రీణాం స్వరకోవిదః ।
ఉత్కర్షంశ్చాపకర్షంశ్చ స్వరాన్ సమ్యక్ ప్రయోజయేత్ ॥ 41 ॥

విద్వన్ నానావికల్పైశ్చ గ్రామరాగాంశ్చ దర్శయేత్।
స్వరమణ్డలతత్త్వజ్ఞో వికల్పైర్బహువిస్తరైః ॥ 42 ॥

తథైవ శాస్త్రతత్త్వజ్ఞో యోగజ్ఞః ప్రతిపత్తిమాన్।
వ్యాధౌ బలాబలజ్ఞశ్చ ప్రకృతిజ్ఞశ్చ యోగవాన్ ॥ 43 ॥

ఉత్కర్షంశ్చాపకర్షంశ్చ ప్రయోగాంశ్చాస్త్రకోవిదః।
కేవలైః శీతవీర్యైశ్చ తథైవోష్ణైశ్చ వీర్యతః ॥ 44 ॥

శీతైరుష్ణైశ్చ సంపృక్తైర్ద్రవ్యైర్యోగాన్ ప్రయోజయేత్।
కార్త్స్న్యతశ్చ ప్రయుఞ్జీత యథావదనుపూర్వశః ॥ 45 ॥

ఏ విధముగా వీణాతంత్రువుల స్వరమును తెలిసిన వీణానాదకుడు ఆరోహ అవరోహముల ద్వారా స్వరమును సక్రమముగా వాయించునో మరియు స్వరమండల తత్త్వము తెలిసిన అనేక విస్తృత వికల్పముల ద్వారా జ్ఞానమును పొంది గ్రామ రోగ ప్రదర్శనమును ప్రదర్శించుననో అదేవిధముగా శాస్త్ర తత్త్వము, యోగ, యుక్తి రోగ బలాబలముల ప్రకృతిని తెలుసుకొను శాస్త్ర పండితులు ప్రయోగములు ఉత్కర్ష, అపకర్షములద్వారా కేవలశీతవీర్యము, కేవల ఉష్ణవీర్యము, రెండింటి సంయోగముల వలన చేయబడిన యోగములు సంపూర్ణ రూపములో క్రమక్రమముగా మెల్లమెల్లగా ప్రయోగించవలెను.

సముచ్చయైర్వికల్పైశ్చ నానారససముచ్చయైః।
యుఞ్జీత బహుధా యోగాన్నృత్తం గీతవశాదివ ॥ 46 ॥

నానారసములతో తయారు చేయబడిన యోగసముచ్చయము వికల్ప రూపములో నృత్య గీతములవలె ప్రయోగించవలెను.

సమస్యోక్తం పృథక్ప్రోక్తం సంప్రధార్య బలాబలమ్।
ద్విషష్టిర్దోషభేదా యే నిర్దిష్టాస్తానతః పరమ్ ॥ 47 ॥
స్థానాని దశ సంగృహ్య ప్రవక్ష్యామి సవిస్తరమ్।

ఈ విధముగా దోషముల బలా బలములను చూసి సమము, వేర్వేరుగా చెప్పబడిన 62 దోషములను 10 స్థానములలో విభజించి విస్తారముగా చెప్పబడును.

త్రయ ఏకైకశస్తేషాం యే చ వృద్ధాస్త్రయః సమాః ॥ 48 ॥
సమైరేకశ్చ సప్తైతే క్షయవృద్ధ్యా చతుర్దశ ।
స్థానవృద్ధ్యా భవేత్తేషాం చత్వారింశోత్తరం శతమ్ ॥ 49 ॥

ఈ దోషములు వేర్వేరుగా 3 విధములు. 1. వాత 2 పిత్త 3 కఫ. సమాన రూపముగా ఒక్కొక్క దోషవృద్ధి అనుసారము కూడ 3 విధములుగా ఉన్నవి. వాతవృద్ధి 2 పిత్తవృద్ధి 3. కఫవృద్ధి, దోష సమావస్థలో ఉండుట ఒక భేదము 1. సమవాత పిత్తకఫము ఇవి 7 విధములగును ఈ విధముగా వృద్ధి క్షయములు 7x2=14 అగును 10 స్థానముల వృద్ధి అను సారము 14 x10=140 భేదములగును.

వృదస్యైతానతః శేషా యే త్రింశద్దశ చాష్ట చ ।
తే భేదం యాన్త్యమేయత్వాచ్ఛతశోఽథ సహస్రశః ॥ 50 ॥

ద్వన్ద్వానాం విషమాణాం తు షణ్ణామన్యతమం బుధః ।
స్వస్థానాద్వర్ధయేత్తావద్యావత్ స్యాత్ స్థానమష్టమమ్ ॥ 51 ॥

ఈ 14 భేదములుకాక మిగిలినవి 62-14=48. వీటిని అపరిమిత మగుటచే 100లు, వేల భేదములగును. 6 విషమ ద్వంద్వములు (1. వాతవృద్ధి పిత్త వృద్ధతర 2. పిత్త వృద్ధవాత వృద్ధతర 3. కఫ వృద్ధ పిత్త వృద్ధతర 4. పిత్తవృద్ధ కఫవృద్ధతర. 5 వాతవృద్ధ కఫ వృద్ధతర 6 కఫ వృద్ధ వాత వృద్ధతర) ని ఒక్కొక్కటి తీసుకుని వాటి స్థానములో 8వస్థానము వరకు పోనంతవరకు వృద్ధి చెందించవలెను. ఈ విధముగా 6 x 8=48.

ఏకైకశో ద్విశశ్చైవ చతుర్వింశద్భవన్తి తే ।
హ్రాసేనైకైకశశ్చాపి వింశన్నవ చ భేదతః ॥ 52 ॥
ఏవమేతే త్రిపఞ్చాశద్ ద్వన్ద్వేనైకేన దర్శితాః ।

వేర్వేరుగా ఒక దోషము మరియు ద్వంద్వముల అనుసారము అవి 24 అగును. అనగా వేర్వేరు దోషములు 3 ద్వంద్వజములు 9 అగును. ఇవి మొత్తము 12 అగును వీటి వృద్ధి క్షయలు 12 x 2=24 అగును. ఒక్కొక్కదోషము క్షీణమగుటచే 29 భేదములగును. ఈ విధముగా ఒక ద్వంద్వముద్వారా 24+29=53 అగును.

ఏషైవ యుక్తిః శిష్టానాం ద్వన్ద్వానాం స్యాన్న సంశయః ॥ 53 ॥
శతత్రయం భవత్యేవమేషామష్టాదశోత్తరమ్ ।

మిగిలిన (6-1=5) ద్వంద్వము కూడ ఇదే విధముగా యోగము లగును.

ద్వ్యేద్వ్యల్బణైకోల్బణానాం చ తావదేవ వినిర్దిశేత్ ॥ 54 ॥

ఇట్లే సన్నిపాతములలో ద్వి ఉల్బణము ఏకోల్బణము (3+3=) దోష భేదములు కూడ ఇన్నే విధములుగా ఉండును.

హీనమధ్యాధికా దోషాః స్వే స్వే స్థానే వ్యవస్థితాః ।
స్వస్థానాత్ సప్తమం స్థానమేకైకశ్యేన యాన్తి తే ॥ 55 ॥
ద్వౌ చ ద్వౌ చ సమస్తాశ్చ తేషాం షట్ సప్తకాస్తథా ।
భవన్తి హ్రాసయేత్తాంశ్చ యథా(స్థా)నమధః క్రమాత్ ॥ 56 ॥
పఞ్చాశీతిమతస్తేషాం భేదానాం పరిచక్షతే ।
ఏష ఏవ వికల్పః స్యాచ్ఛేషాణాం ప్రవిభాగశః ॥ 57 ॥
శతాని సప్త షష్టిశ్చ ద్వౌ చ భేదా భవన్తి తే ।
ఏవం సహస్రం భేదానాం వృద్ధైస్త్రీణి శతాని చ ॥ 58 ॥
దోషైర్నవతిరష్టౌ చ క్షీణైస్తావన్త ఏవ తే ।

హీన మధ్యాది గానుసారము (తరతమ బేదము) తమ తమ స్థానములందున్న దోషములు ఒక్క ఒక్కటిగా 7వ స్థానము వరకు చేరును. అనగా సమస్త దోషములు కలిపి 4,6,7 అనగా 17 అగును. ఇట్లే వీటిని యదా స్థానమునుండి వెనుక క్రమముగా తగ్గిస్తూపోయినచో 17 x 5=85 భేదములు అగును. ఇట్లే మిగిలిన ద్వంద్వ ముల భేదము లేర్పడును. ఇవి 762 భేదములగును. ఈ విధముగా వృద్ధిదోషములు 618+618+762=1398 భేదములగును. క్షీణదోషములు కూడ 1398 భేదములగును.

ద్విక్షీణైరేకవృద్ధైః స్యుః షట్ చ త్రీణి శతాని చ ॥ 59 ॥
యావన్త్యేవ చ భేదానామేకక్షీణైర్ద్వి రుద్బలైః ।

2 క్షీణములు ఒక వృద్ధి దోషముల ద్వంద్వము 306 భేదములగును. ఈ విధముగా ఒక క్షీణ 2 వృద్ధి దోషముల ద్వందములు 306 అగును. పూర్వము చెప్పిన ద్వంద్వ క్రమానుసారము క్షీణ, అధిక, సమ దోషములు 612 భేదములగును.

క్షీణాధికసమైః షట్ చ షట్ చ షట్ చ శతాని చ ॥ 60 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 213 తమం పత్రమ్)
క్రమ ఏవాత్ర భాగః స్యాద్యో ద్వన్ద్వేషు నిదర్శితః ।
చతుర్దశ వినిర్దిష్టాః సవికల్పాస్త్రయోః పృథక్ ॥ 61 ॥
తైః సార్ధమేషాం సర్వేషాం కార్త్స్న్యేనైవ విభావయేత్ ।
సహస్రాణి చ చత్వారి శతం షష్ట్యుత్తరం తథా ॥ 62 ॥

ఇవి గాక మొదట చెప్పిన 14 భేదములు అనగా 14 x10=140 ఇవి వేరుగా భావించవలెను. ఈ 140 భేదములు కలిపి పై చెప్పిన మొత్తము భేదములు.

1398+1398+306+612+140=4160 భేదములగును.

ఏతావన్తో జ్వరాద్యానాం భేదాః ప్రోక్తా యథాగమమ్ ।
అథైతేషు చతుర్యోగవిభాగగతికర్మతః ॥ 63 ॥
సహస్రం సన్నిపాతానాం విద్యాత్ సనవకం భిషక్ ।

జ్వరాదులు కూడ శాస్త్రానుసారము ఇన్నిభేదములే అగును. ఇందులో యోగము విభాగము, గతి కర్మ ఈ 4 విధముల అనుసారము సన్నిపాతములను కూడ 9,000 భేదములుగా భావించవలెను.

అత ఊర్ధ్వం రసానాం తు వక్ష్యతే భేదవిస్తరః ॥ 64 ॥

ఇప్పుడు మనము రసభేదములను విస్తారముగా వర్ణించెదము.

కర్మస్థానాని దోషాణాం భావవృద్ధ్యా యథాక్రమమ్ ।
తథా రసానాం షట్ కుర్యాత్ స్థానానీతి వినిశ్చయః ॥ 65 ॥

యథాక్రమముగా వృద్ధి అను సారము దోషముల కర్మ స్థానముల వలెనే నిశ్చయముగా రసస్థానములు కూడ 6.

తదేవ కర్మ సర్వేషాం ద్వికాదీనాం క్షయం వినా ।
భవత్యేవం ద్వికానాం తు పఞ్చషష్ట్యుత్తరం శతమ్ ॥ **66** ॥

క్షయము వదిలేసి సంపూర్ణ ద్వికములు అవే కర్మ లగును. కావున 15 ద్వికములు 165 భేదములు అగును.

త్రికానాం చ సవింశాని షట్శతాని వినిర్దిశేత్ ।
చతుష్కానాం సహస్రం చ పఞ్చషష్ట్యుత్తరం వదేత్ ॥ **67** ॥

త్రికములు 620 భేదములు అగును. చతుష్కములు 1065 భేదములు అగును.

పఞ్చకాణాం శతాన్యష్టౌ స్యాచ్ఛతం చ షడుత్తరమ్ ।
షట్కానాం శతే ద్వే తు శతం చైకాదశోత్తరమ్ ॥ **68** ॥
సంయుక్తానాం వికల్పోఽయం సవికల్పాః షడేకకః ।

పంచకములు 906 భేదములు షట్కములు 311 భేదములు అగును. ఈ విధముగా సంయుక్త రసములు పై చెప్పిన భేదములు ఒక్కొక్కటి చొప్పున 6 అగును.

సమానాం రసభేదానామేకమేకం తు పిణ్డితమ్ ॥ **69** ॥
త్రిసప్తతిర్భవత్యేషాం సహస్రత్రయమేవ చ ।

ఈ విధముగా అన్ని రస భేదములు కలిపి 165+620+1065+906+311+6=3073 భేదములగును.

రసదోషవికల్పానామతిసౌక్ష్మ్యాదతః పరమ్ ।
న వక్ష్యామి మహాభాగ ! న తు బుద్ధిపరిక్షయాత్ ॥ **70** ॥

ఓ మహాభాగా! దీని తర్వాత బుద్ధి క్షీణమగుటచే కాదు కాని రసదోషములబేదములు అత్యంత సూక్ష్మమగుటచే వర్ణించుటలేదు.

అతః పరమిదానీం రసభేదాన్ విస్తరేణోపదేక్ష్యామః । తద్యథా – మధురామ్లలవణకటుకతిక్తకషాయాః షడ్రసాః । ఏషామిదానీం రసానాం వికల్పాస్త్రిషష్టిర్భవన్తి । తత్రైకైకశ్యేన షట్ । తద్యథా – మధుర ఏవ, ఆమ్ల ఏవ, లవణ ఏవ, కటుక ఏవ, తిక్త ఏవ, కషాయ ఏవ ॥ **71** ॥

తదనంతరము రసభేదములను విస్తారముగా వర్ణించెదను ఉదాహరణకు మధుర అమ్ల లవణకటు తిక్త కషాయములు ఇవి 6 రసములు. ఈ 6, 63 భేదములగును. వేర్వేరుగా 6 అగును. ఎట్లనగా 1. కేవల మధురము (సంతానికా, గోదుగ్ధాదులు, 2. కేవల ఆమ్లరసము (ఆమకరమర్దాదులు) 3. కేవల లవణం (రోమకాదులు) 4. కేవల కటు (చవ్యాధులు) 5. కేవల తిక్తము (నింబ పర్పాటకాదులు) 6. కేవల కషాయ (పద్మన్యగ్రోధాము).

**పూర్వః పూర్వః పరైర్యుక్తో ద్వికః, తే పఞ్చదశ భవన్తి । తత్ర మధురః పఞ్చభిరమ్లాదిభిర్యుజ్యతే । తద్యథా – మధురామ్లః, మధురలవణః, మధురకటుకః, మధురతిక్తః, మధురకషాయ ఇతి । ఆమ్లశ్చతుర్భిర్లవణాదిభిః; తద్యథా – అమ్లలవణః, అమ్లకటుకః, అమ్లతిక్తః, అమ్లకషాయ ఇతి । లవణస్త్రిభిః కటుకాదిభిః; తద్యథా – లవణకటుః, లవణతిక్తః, లవణకషాయ ఇతి । కటుకస్తిక్తకషాయాభ్యాం ద్వాభ్యాం; తద్యథా – కటుతిక్తః, కటుకషాయ ఇతి । తిక్తః కషాయేణ చ । తద్యథా తిక్తకషాయ ఇతి । తే పఞ్చదశ ఏవ । తే ద్వికాః పఞ్చదశవికల్పా భవన్తి; మధురసంయోగేన పఞ్చ భవన్తి, అమ్లసంయోగేన చత్వారః, లవణసంయోగేన త్రయః, కటుసంయోగేన ద్వౌ, తిక్తసంయోగేనైక ఇతి । పూర్వేషు త్రిషు రసేషు మధురామ్లలవణేషు త్రయోధికా నిష్పద్యన్తే । మధురామ్లః, మధురలవణః, అమ్లలవణ ఇతి ॥ 72 ॥**

పూర్వరసము దానితర్వాత రసము తోకలిసి ద్వికమగును. ఇవి 15. ఇందులో మధురరసము అమ్లాది 5 రసములతో సంయుక్తమగును. అనగా 1. మధురామ్ల 2. మధురలవణ 3. మధుర కటు 4. మధుర తిక్త 5. మధురకషాయ. అమ్లములవణాది 4 రసములతో సంయుక్తమగును.

1. అమ్లలవణ 2 ఆమ్లకటు 3. అమ్ల తిక్త 4. అమ్ల కషాయ.

లవణరసము కట్వాది 3 టితో సంయుక్త మగును.

1. లవణ కటు 2. లవణ తిక్త 3. లవణ కషాయ. కటు రసము తిక్త కషాయములతో సంయుక్తమగును.

1. కటు తిక్త 2. కటు కషాయ తిక్త రసము కషాయముతో సంయుక్తమగును.

1. తిక్త కషాయ.

ఈ విధముగా ద్వికములు 15 అగును.

ఇందులో మధుర రసముతో 5, ఆమ్లముతో 4, లవణముతో 3 కటుతో 2 తిక్త 1 మధుర ఆమ్ల లవణాది మొదటి 3 రసములలో 3 సంయోగములు అధికమగును. 1. మధురామ్ల 2. మధురలవణ 3. ఆమ్లలవణ.

ఏషాం త్రయాణాం ద్వికానామేకైకో ద్వికస్త్రిభిరితరైః కటుతిక్తకషాయై రసైర్యోజ్యః, తతస్త్రికా నిష్పద్యన్తే। తద్యథా – మధురామ్లకటుః, మధురామ్లతిక్తః, మధురామ్లకషాయః, మధురలవణకటుః, మధురలవణతిక్తః, మధురలవణకషాయః, అమ్లలవణకటుః, అమ్లలవణతిక్తః, అమ్లలవణకషాయ ఇతి। ఉత్తరేషు త్రిషు రసేషు కటుతిక్తకషాయేషు త్రయో ద్వికా నిష్పద్యన్తే; తద్యథా – కటుతిక్తః, కటుకషాయః, తిక్తకషాయః ఇతి; ఏషాం త్రయాణాం ద్వికానామేకైకో ద్వికస్త్రిభిరితరైర్మధురామ్లలవణై రసైర్యోజయితవ్యః, తత్ర త్రికా నిష్పద్యన్తే। తద్యథా – కటుతిక్తమధురః, కటుతిక్తామ్లః, కటుతిక్తలవణః; కటుకషాయమధురః, కటుకషాయామ్లః, కటుకషాయలవణః, తిక్తకషాయమధురః, తిక్తకషాయామ్లః, తిక్తకషాయలవణ ఇతి। పూర్వే చోత్తరే చ। పూర్వే చ త్రయః, మధురామ్లలవణత్రిక ఏకః, ఉత్తరే చ త్రయః, కటుకతిక్తకషాయత్రిక ఏకః। త ఏతే త్రికా వింశతిర్భవన్తి; ప్రథమేన సూత్రేణోక్తా నవ, నవ చ ద్వితీయేన, తృతీయేన ద్వావితి ॥ 73 ॥

ఈ పై చెప్పిన ద్వికములలో ఒక్కొక్క ద్వికము మిగిలిన మూడు కటు తిక్త కషాయ రసములతో కలిసి త్రికములగును.

1. మధురామ్ల కటు
2. మధురామ్ల తిక్త
3. మధురామ్ల కషాయ
4. మధుర లవణ కటు
5. మధుర లవణ తిక్త
6. మధుర లవణ కషాయ
7. అమ్ల లవణ కటు
8 అమ్ల లవణ తిక్త
9. అమ్ల లవణ కషాయ.

చివరి 3 కటు తిక్త కషాయములతో కలిసి 3 ద్వికములేర్పడును.

1 కటు తిక్త 2. కటు కషాయ, 3. తిక్త కషాయ. ఈ 3 ద్వికములలో ఒక్కొక్క ద్వికము మిగిలిన మధురామ్లలవణముల 3టితో కలిసి త్రికము

లేర్పడును. ఎట్లనగా 1. కటుతిక్తమధుర 2. కటుతిక్తామ్ల 3. కటు తిక్త లవణ 4. కటు కషాయ మధుర 5. కటు కషాయామ్ల 6. కటు కషాయ లవణ 7. తిక్త కషాయమధుర 8. తిక్త కషాయామ్ల 9. తిక్త కషాయ లవణ మొదటి 3 రసములతో ఒక త్రికము ఏర్పడును. 1. మధురామ్ల లవణ. మిగిలిన 3 రసములతో ఒక త్రికమేర్పడును. 2. కటు తిక్త కషాయ. ఈ విధముగా 20 త్రికములగును. ప్రథమసూత్రము ద్వారా 9 + ద్వితీయము ద్వారా 9 + తృతీయము ద్వారా 2 = 20 అగును.

పూర్వేషు త్రిషు రసేషు మధురామ్లలవణేషు త్రయోఽధికా యే పూర్వోక్తాస్తే పరేషాం త్రయాణాం రసానాం కటుకతిక్తకషాయాణాం పూర్వోక్తైస్త్రిభిర్ద్వికైః ప్రత్యేకైకశ్యేన యోజయితవ్యాః, తేన చతుష్కా నిష్పద్యన్తే। తద్యథా – మధురామ్లకటుతిక్తః, మధురామ్లకటుకషాయః, మధురామ్లతిక్తకషాయః, మధురలవణకటుతిక్తః, మధురలవణకటుకషాయః, మధురలవణతిక్తకషాయః, అమ్లలవణకటుతిక్తః, అమ్లలవణకటుకషాయః, అమ్లలవణతిక్తకషాయ ఇతి। పూర్వే మధురామ్లలవణా ఉత్తరైః కటుకతిక్తకషాయైరేకైకశో యుజ్యన్తే। తద్యథా – మధురామ్లలవణకటుః, మధురామ్లలవణతిక్తః, మధురామ్లలవణకషాయ ఇతి। ఉత్తరే త్రయః కటుకతిక్తకషాయాః పూర్వైర్మధురామ్లలవణైరేకైకశో యుజ్యన్తే, తతశ్చతుష్కా నిష్పద్యన్తే। తద్యథా – కటుతిక్తకషాయమధురః, కటుతిక్తకషాయామ్లః, కటుతిక్తకషాయలవణ ఇతి। ఏతే చతుష్కాః పఞ్చదశ, పూర్వసూత్రోక్తా నవ, ద్వితీయసూత్రోక్తాస్త్రయః, తృతీయసూత్రోక్తాస్త్రయః, ఇత్యేతే చతుష్కాః పఞ్చదశ ॥ 74 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 214 తమం పత్రమ్।)

పూర్వోక్త మధురామ్లలవణాది 3 రసములలో ఏవైతే 3 అధికముగా చెప్పబడినవో అవి మిగిలిన 3 కటు తిక్త కషాయ రసములలో ఏ పూర్వోక్త 3 ద్వికములున్నవో వాటిలో ప్రతి ఒకదానితో కలియుటచే చతుష్క సంయోగము ఏర్పడును ఎట్లనగా 1. మధురామ్ల కటు తిక్త 2. మధురామ్ల కటు కషాయ 3. మధురామ్ల తిక్త కషాయ 4 మధురలవణ కటుతిక్త 5. మధుర లవణ కటు కషాయ. 6. మధుర లవణ తిక్త కషాయ 7. ఆమ్ల లవణ కటు తిక్త 8. ఆమ్ల లవణ కటు కషాయ 9. ఆమ్ల లవణ తిక్త కషాయ మొదటి మధురామ్ల లవణములు మిగిలిన కటు తిక్త కషాయములతో ఒక్కొక్కదానితో వేరువేరుగా కలియును. ఎట్లనగా

1. మధురామ్ల లవణ కటు 2 మధురామ్ల లవణ తిక్త 3. మధురామ్ల లవణ కషాయ. మిగిలిన కటు తిక్త కషాయములతో మొదటి మధురామ్ల లవణములు ఒక్కొక్కటి ప్రత్యేకముగా కలియుట వలన చతుష్క సంయోగమేర్పడును. ఎట్లనగా -
1. కటు తిక్త కషాయ మధుర 2. కటు తిక్త కషాయామ్ల 3. కటు తిక్త కషాయ లవణ ఈ విధముగా, 5 చతుష్క సంయోగములగును.

| | |
|---|---|
| పూర్వసూత్రోక్త | - 9 |
| ద్వితీయసూత్రోక్త | - 3 |
| తృతీయసూత్రోక్త | - 3 |
| మొత్తము | - 15 |

**షట్ పఞ్చకాః । షణ్ణాం రసానాం మధురామ్లలవణకటుతిక్తకషాయాణా మేకైకమపనయితవ్యాః, షట్ పఞ్చకా నిష్పద్యన్తే । తద్యథా – అమ్లలవణకటుతిక్త కషాయః, మధురలవణకటుతిక్తకషాయః, మధురామ్లకటుతిక్తకషాయః, మధురామ్లలవణతిక్తకషాయః మధురామ్లలవణకటుకషాయః, మధురామ్లలవణకటు తిక్త ఇతి । త ఏతే షట్ పఞ్చకాః । షడ్భిర్మధురామ్లలవణకటుతిక్తకషాయైరేకః । తద్యథా – మధురామ్లలవణకటుతిక్తకషాయ ఇతి । త ఏవమేతే రసాస్త్రిషష్టిధా భిన్నాః, తత్ర సంయుక్తాః సప్తపఞ్చాశత్, అసంయుక్తాః షట్ ॥ 75 ॥**

పంచకములు 6 అగును. మధురామ్ల లవణ కటుతిక్త కషాయములు ఈ 6 రసములలో ఒక్కొక్క రసము తగ్గించవలెను. ఎట్లనగా 1. అమ్ల లవణ కటు తిక్త కషాయ 2. మధుర లవణ కటు తిక్త కషాయ 3 మధురామ్ల కటు తిక్త కషాయ 4. మధురామ్లలవణ తిక్త కషాయ 5. మధురామ్ల లవణ కటు కషాయ 6. మధురామ్ల లవణ కటు తిక్త మధురామ్ల లవణ కటు తిక్త కషాయముల సంయోగములు ఒక రసమేర్పడును. ఇది షటక సంయోగము ఈ విధముగా రసములు 63 భేదములగును. ఇందులో సంయుక్త రసములు 57 అసంయుక్తరసములు 6 అగును.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 76 ॥**
**(ఇతి) ఖిలేషు రసదోషవిభాగీయో నామ షష్ఠోఽధ్యాయః ॥ 77 ॥**

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

రసదోషవిభాగము సమాప్తము

# సంశుద్ధి విశేషణీయాధ్యాయః - సప్తమః

**అథాతో సంశుద్ధివిశేషణీయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥**

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥**

ఇప్పుడు మనము సంశుద్ధి విశేషణీయమగు అధ్యాయమును వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**సిద్ధౌ విశోధనాఖ్యాయామనుక్తం యద్విశేషణమ్ ।**
**ఊర్ధ్వానులోమయోః సర్వం తత్ ప్రవక్ష్యామ్యతః పరమ్ ॥ 3 ॥**

సిద్ధి స్థానములో విశోధన ప్రకరణములో ఊర్ధ్వ మరియు అనులోమన శోధనలో చెప్పని విషయములను ఇక్కడ చెప్పెదను.

**చయప్రకోపప్రశమాః పిత్తస్య ప్రావృడాదిషు ।**
**శ్లేష్మణః శిశిరాద్యేషు, వాయోర్గ్రీష్మాదిషు త్రిషు ॥ 4 ॥**

పిత్తము ప్రావృటాది ఋతువులలో క్రమముగా సంచయ ప్రకోప ప్రశమనము పొందును. శ్లేష్మము శిశిరాది ఋతువులలో సంచయ ప్రకోప ప్రశమనము పొందును. వాయువు గ్రీష్మాది ఋతువులలో క్రమముగా సంచయ ప్రకోప ప్రశమములు చెందును.

**ప్రావృట్‌శరద్ధేమన్తాఖ్యా విసర్గస్తృతవస్త్రయః ।**
**శిశిరశ్చ వసన్తశ్చ గ్రీష్మశ్చాదానసంజ్ఞితాః ॥ 5 ॥**

ప్రావృటో శరత్ హేమంతములు 3 విసర్గకాలము. శిశిర వసంత గ్రీష్మములు ఆదానకాలమనబడును.

విసర్గాదానయోర్మధ్యే బలం మధ్యం శరీరిణామ్ ।
ఆద్యన్తయోస్తు దౌర్బల్యమన్తాద్యోరుత్తమం బలమ్ ॥ 6 ॥

విసర్గ, ఆదాన కాలముల మధ్యలో ప్రాణుల బలము మధ్యమముగా ఉండును. విసర్గ కాల ఆదిలో ఆదానకాల అంతములో మనుష్యులు దుర్బలముగా నుందురు. విసర్గకాల అంతము ఆదాన కాల ప్రారంభము బలము ఉత్తమముగా నుండును.

హేమన్తే స్నిగ్ధశీతాభిరద్భిరోషధిభిస్తథా ।
చితోఽపి శైత్యాత్ ప్రస్కన్నః కఫో నాత్ర ప్రకుప్యతి ॥ 7 ॥
స కుప్యతి హిమాపాయే సంతప్తో భాస్కరాంశుభిః ।
తస్మాత్ సంశోధనం తత్ర కర్తవ్యం వమనోత్తరమ్ ॥ 8 ॥

హేమంత ఋతువులో స్నిగ్ధ శీతల జలము మరియు ఓషధుల ద్వారా కఫము సంచితమైనప్పటికి, శీతము ద్వార కఫము ఘనీభవించుటచే ప్రకోపించదు. ఆ సంచిత కఫము తర్వాత వసంతమున సూర్య కిరణములచే సంతప్తమై కఫ ప్రకోపము జరుగును. కావున ఈ ఋతువులో వమనము ద్వారా శరీర శోధనము చేయవలెను.

గ్రీష్మే నిష్పీతసారత్వాద్రసానాం విచితోఽపి సః ।
ఔష్ణ్యాతిరేకాత్ కాలస్య వాయురత్ర న కుప్యతి ॥ 9 ॥
రవేరమ్బుదసంరోధాత్ ప్రకుప్యత్యమ్బుదాగమే ।
బస్తికర్మోత్తరం తత్ర ప్రతికర్మ విశిష్యతే ॥ 10 ॥

గ్రీష్మ ఋతువులో సంపూర్ణ రసయుక్త పదార్థముల సారభాగమును సూర్య కిరణములు శోషింపచేసినప్పటికీ సంచితమైన వాయువు ఉష్ణత్వ కారణముచే ప్రకోపము చెందదు. వాయువు శీత గుణము కలదగుటచే వర్షఋతువులో ప్రకోపించును. కావున వస్తి కర్మ ద్వారా చికిత్స చేయవలెను.

అపాం చైవౌషధీనాం చ వర్షాస్వమ్లవిపాకతః ।
చితమప్యత్ర తత్ పిత్తం వర్షాశైత్యాన్న కుప్యతి ॥ 11 ॥

దివాకరాంశుసంతప్తం శరత్కాలే ప్రకుప్యతి ।
విరేచనోత్తరం చాత్ర విధాతవ్యం విశోధనమ్ ॥ **12** ॥

వర్ష ఋతువులో జలము మరియు ఔషధుల యొక్క అమ్లవిపాక కారణమున విదగ్ధమైనప్పటికి పిత్తము సంచితమగునే కాని శీతల కారణమున ప్రకోపము చెందదు. అదే పిత్తము సూర్య కిరణములచే సంతప్తమై శరత్కాలములో ప్రకోపించును. ఈ కాలములో విరేచనముచే శోధనము చేయవలెను.

దోషప్రకోపే సర్వస్మిన్ కాలే కార్యమనన్తరమ్ ।
న హి హేత్వీరితో దోషః కశ్చిత్కాలముదీక్ష్యతే ॥ **13** ॥

ఔచిత్యాదార్తవో దోషప్రకోపో న తథా భృశః ।
యథా హేతుకృతస్తస్మాత్ క్షిప్రమేనముపక్రమేత్ ॥ **14** ॥

దోషములు ప్రకోపించినపుడు అన్ని కాలములలో శోధనము చేయ వచ్చును. తన స్వకారణములచే ప్రకోపించిన దోషము కొంచెము కూడ ప్రతీక్షంచదు. ఋత్వనుసారము జరుగు దోషము అంత భయంకరముగా నుండదు. కావున స్వకారణ దోపప్రకోపమును వెంటనే శాంతింపచేయవలెను.

వమనైశ్చ విరేకైశ్చ నిరూహైః సానువాసనైః ।
తథా స్వాస్థ్యమవాప్నోతి రోగేభ్యశ్చ ప్రముచ్యతే ॥ **15** ॥

వమనము విరేచనము అనువాసన నిరూహవస్తుల ద్వారా స్వస్థత చేకూరును. రోగములచే ముక్తి పొందును.

స్థౌల్యామపాణ్డుతాకర్ణకోఠారుఃపిడకోద్భవః ।
నిద్రానాశోఽరతిస్తంద్రీరుత్క్లేశః కఫపిత్తయోః ॥ **16** ॥

శ్రమదౌర్బల్యదౌర్గన్ధ్యమాలస్యం సీదనం క్లమః ।
భక్తద్వేషోఽవిపాకశ్చ క్లైబ్యం బుద్ధేరుపప్లవః ॥ **17** ॥

బృంహణైస్తృప్యతోఽపి(స్యా)ద్బలవర్ణపరిక్షయః ।
దుఃస్వప్నదర్శనం చేతి బహుదోషస్య లక్షణమ్ ॥ **18** ॥

బహుదోషవ్యక్తి లక్షణములు : స్థూలము, ఆమదోషము పాండు కర్ణ రోగ, కోఠ

అరు (క్షతవ్రణ), పిటికా, నిద్రానాశం అరతి, తంద్ర కఫపిత్త ఉత్క్లేశము, పరిశ్రమ, దుర్బలత, దుర్గంధము, ఆలస్యము, అంగసదనము, క్లమ, భక్తద్వేషము, అవిపాకము, క్లైబ్యము, బుద్ధి విభ్రమము, బృంహణ ఆహారము ఇచ్చినప్పటికి బలవర్ణములు క్షీణించుట దుఃస్వప్నముల గాంచుట ఇవి దోషముల అధికమాత్ర లక్షణములు.

బలినః స్థిరదేహస్య తస్య సంశోధనం భిషక్।
కుర్యాత్, సంశమనం చైవ మధ్యదోషబలస్య తు ॥ **19** ॥
అల్పదోషబలస్యాపి యథాకాలం విశోషణమ్

రోగి బలవంతుడు స్థిర దేహము కలవాడైన చో సంశోధనము చేయవలెను. దోషములు బలము మధ్యమముగా నున్నచో సంశనముచేయవలెను. దోషము, బలము అల్పముగానున్నచో కాలానుసారము శోషణము చేయవలెను.

అథ సంశోధనార్హే తు స్నేహస్వేదోపపాదితే ॥ **20** ॥
వమనం స్రంసనం వాఽపి యథావదుపకల్పయేత్।

తదనంతరము సంశోధన యోగ్య రోగికి మొదట స్నేహనము స్వేదనము చేసి వమన విరేచనములు విధి అనుసారము చేయించవలెను.

స్నేహః పీతోఽనిలం హన్తి కురుతే దేహమార్దవమ్ ॥ **21** ॥
సఙ్గం మలానాం నిఘ్న(హ)న్తి, స్వేదః స్నిగ్ధస్య దేహినః।

స్నేహము వాయువును శాంతింప చేయును. శరీరమును మృదువుగా చేయును. నిరోధించబడినమలమును నశింపచేయును.

స్రోతఃసు లీనం సూక్ష్మేషు దోషం ద్రవయతి, ద్రవమ్ ॥ **22** ॥

స్నిగ్ధ మనిషికి స్వేదనము చేసిన సూక్ష్మ స్రోతస్సులందున్న దోషమును కరిగించును.

శోధనం హరతి క్షిప్రం యథావత్ సంప్రయోజితమ్।
మంత్రపూతమబీభత్సం చ హృద్యం కార్యం విరేచనమ్ ॥ **23** ॥
సబీభత్సం తు వమనం తథా తద్యోగమృచ్ఛతి।

శోధనము శీఘ్రముగా దోషములను హరింపచేయును. విరేచనము మంత్రముచే పవిత్రమై బీభత్సము కానిదై హృద్యముగా నుండ వలెను. బీభత్సమైన వమనము ద్వారా వమనాతి యోగమగును.

**స్నిగ్ధో వమేత్తృతీయేఽహ్ని చతుర్థే స్రంసనం పిబేత్ ॥ 24 ॥**
**వికారజాతే తద్యుక్తం స్వస్థవృత్తౌ తు కామతః ।**

స్నేహము తర్వాత 3వదినము వమనౌషధము, 4వ దినము విరేచనము చేయించవలెను. ఈ విధానము రోగోత్పన్నస్థితికి చెప్పబడినది. స్వస్థునిలో యధేచ్చగా ప్రయోగించవచ్చును.

**కఫవృద్ధికరం భోజ్యః శ్వః పాతా వమనం నరః ॥ 25 ॥**
**విరేచనం ద్రవప్రాయం స్నిగ్ధోష్ణావిశదం లఘు ।**
**తథోత్క్లిష్టకఫత్వాచ్చ పురీషస్య చ లాఘవాత్ ॥ 26 ॥**
**ఊర్ధ్వం చాధశ్చ దోషాణాం ప్రవృత్తిః స్యాదయత్నతః ।**

వమనము చేయించుటకు ముందు రోజు కఫవృద్ధికర భోజనము చేయించవలెను. విరేచన ఔషధము ద్రవము స్నిగ్ధము ఉష్ణము విశదము లఘువుగా నుండవలెను. ఈ విధముగా ఉత్క్లిష్టమైన కఫము ఉన్నప్పుడు పురీషము లఘువుగా నున్నప్పుడు దోషములను ఊర్ధ్వ అధోభాగములనుండి వెడలింప చేయవలెను.

**విషే విసర్పే శ్వయథౌ వాతరక్తే హలీమకే ॥ 27 ॥**
**కామలాపాణ్డురోగే చ నాతిస్నిగ్ధం విరేచయేత్ ।**

విష ప్రయోగము, విసర్పము, శోథ వాతరక్త హలీమక కామల పాండు రోగములో అతిస్నేహము చేయించకుండ విరేచనము చేయించవలెను.

**నాతిస్నిగ్ధశరీరాయ విదధ్యాత్ స్నేహసంయుతమ్ ॥28 ॥**
**స్నిగ్ధాయ రూక్ష(క్షం) రూక్షాయ కామం స్నేహవిరేచనమ్ ।**
**స్నిగ్ధాభారం రథాత్ (?) కో వా స్రంసనం సహతే నరః ॥ 29 ॥**

అతిస్నిగ్ధమైన వాడికి స్నిగ్ధ విరేచనము చేయించకూడదు స్నిగ్ధ శరీరము గలవాడికి రూక్ష విరేచనము ఇవ్వవలెను. రూక్ష శరీరము గలవాడికి యధేచ్చగా

స్నిగ్ధ విరేచనమివ్వవలెను. అతి స్నేహితుడైన వాడు విరేచనమును ఎలా భరించగలడు-

ఘృతకుమ్భాద్యథా తోయమయత్నేన నిరస్యతే ।
నిరస్యతే తథా దోషః స్నిగ్ధాద్దేహాద్విరేచనైః ॥ 30 ॥

ఘృత ఘటమునుండి నీటిని ఏ విధంగా అప్రయత్నంగానే తొలగించవచ్చునో అదే విధముగా స్నిగ్ధ దేహమునుండి విరేచనము ద్వారా దోషములను సుఖపూర్వకముగా తొలగించవచ్చును.

స్నిగ్ధం విష్యందయత్యగ్నం స్వేదో(దః) స్నిగ్ధార్ద్రమిన్ధనమ్ ।
తతః స్విన్నశరీరస్య దోషాన్ హరతి భేషజమ్ ॥ 31 ॥

స్నిగ్ధము ఆర్ద్ర ఇంధనమును అగ్ని విష్యందము చేయునట్లే స్నిగ్ధశరీరమును స్వేదనము విష్యందము చేయును. స్విన్నుడైన వానికి ఔషధము దోషములను హరింపచేయును.

యథా హి మలినం వాసః క్షారేణోత్క్లేశ్య వారిణా ।
శోధ్యతే శోధనైస్తద్వదుత్క్లేశ్య విధివద్బలాత్ ॥ 32 ॥

మలిన వస్త్రమునుండి క్షారము దోష ఉత్క్లిష్టము చేసి తర్వాత నీటి ద్వారా శుభ్రము చేసినట్లు, శరీరము కూడ మొదట స్నేహ స్వేదముల ద్వారా దోషోత్క్లిష్టము కల్గించి వమనాది శోధనముల ద్వారా బలపూర్వక శుద్ధి చేయబడును.

వామితం లఙ్ఘయేల్లఙ్ఘ్యం (లఙ్ఘితం) లఘు భోజయేత్ ।
తస్య వాన్తవిరిక్తస్య క్రమః పేయాదిరిష్యతే ॥ 33 ॥
తేనాగ్నిర్వర్ధతే సూక్ష్మైరిన్ధనారణయో యథా (రిన్ధనైరరణోర్యథా) ।
(ఇత తాడపత్రపుస్తకే 215తమం పత్రమ్)

వమనము తర్వాత లంఘనము తర్వాత లఘు భోజనము చేయవలెను. వమన విరేచనముల తర్వాత రోగికి పేయాది సంసర్జన క్రమముతో ఆహారము నివ్వవలెను. తద్వారా అగ్ని వృద్ధి చెందును. సూక్ష్మ ఇంధనముల ద్వారా అరణి నుండి అగ్ని ఉత్పన్నమైనట్లు అగ్ని ప్రదీప్తమగును.

**సముత్థితేఽగ్నౌ సంజాతే మ(బ)లే దేహే చ నిర్మలే ॥ 34 ॥**
**వాససీవార్పితో రాగః సిద్ధిం యాత్యుత్తరో విధిః ।**

ఎట్లైతే బాగా శుభ్రము చేసిన వస్త్రమునకు రంగు బాగా అతికినట్లు కాయగ్ని ప్రదీప్తమై, బలముత్పన్నమై, సంశోధనము ద్వారా నిర్మలమై యున్న శరీరమునకు చికిత్స చేసినచో సంపూర్ణముగా సఫలమగును.

**యశ్చాత్ర వా యదాబాధః స్యాదయోగాదియోగతః ॥ 35 ॥**
**సమాసవ్యాసతస్తస్య సిద్ధౌ సిద్ధిరుదాహృతా ।**

చికిత్సలో అయోగాది కారణములచే జనించు ఉపద్రవములు వాటి చికిత్స సంక్షిప్తముగా విస్తారముగా సిద్ధిస్థానములో చెప్పబడినది.

**తతోఽన్నప్రవిచారస్య వికల్పః సంప్రవక్ష్యతే ॥ 36 ॥**

తర్వాత అన్నము యొక్క ప్రకృష్ట విచారణ చెప్పబడును.

**సర్వత్ర త్రివిధా పేయా సంసర్గాదౌ విధీయతే ।**
**అకృతాదివికల్పేన తతో యూషస్తతో రసః ॥ 37 ॥**

సంపూర్ణ చికిత్సా శాస్త్రములో సంసర్జనాదులకు 3 ప్రకారములైన పేయ వర్ణించబడినది. 1. కృతయూష 2. అకృతయూష 3. మాంసరసము.

**వ్యపేతలవణా పూర్వా దీపనీయామ్బుసాధితా ।**
**తాని (సా చ) క్షుద్రా, ద్వితీయా స్యాత్ కిఞ్చిల్లవణదీపనా ॥ 38 ॥**
**తద్వదేవ తృతీయా తు సంస్కృతా స్నేహమాత్రయా ।**

ఇందులో మొదటిది (కృతయూషము) లవణ యుక్తమైనది. మరియు దీపనీయ జలముతో చేయబడినది. ఇది అల్పమైనది. ఇందులో రెండవదైన అకృతయూషము కొంచెం లవణయుక్త మైనది దీపనము. 3వది మాంసరసము అల్ప స్నేహముతో తయారు చేయబడినది.

**అవ్యక్తలవణస్నేహో యూషస్త్వకృతకో మతః ॥ 39 ॥**
**మన్దామ్లలవణస్నేహసంస్కారః స్యాత్ కృతాకృతః ।**
**వ్యక్తస్నేహోమ్లలవణః కృతయూషః సుసంస్కృతః ॥ 40 ॥**

ఏవమేవ రసం విద్యాదిమం పేయాదికం క్రమమ్ ।

యూషలో లవణ స్నేహములు అవ్యక్తముగా నున్నచో అకృత యూషమనబడును. స్వల్ప అమ్లలవణ స్నేహముల ద్వారా సంస్కృతమైనది కృతాకృతయూషమనబడును. స్నేహ ఆమ్లలవణములు స్పష్టముగా వ్యక్తమైనచో అది కృత యూష మనబడును. ఇదే విధముగా మాంసరసమునకు కూడ అన్వయించు కొనవలెను. పేయాది క్రమము చెప్పబడినది.

**సకృజ్జఘన్యా ద్విర్మధ్యా త్రిః శ్రేష్ఠా శుద్ధిమ్యచ్ఛతి ॥ 41 ॥**

జఘన్య (హీన) శుద్ధి వ్యక్తి ఇందులో ఒక దానిని సేవించవలెను. మధ్యశుద్ధివాడు ఇందులో రెండింటిని సేవించవలెను. శ్రేష్ఠ శుద్ధివాడు మూడింటిని సేవించవలెను.

ఇమాం పేయాదిసంసర్గీం సర్వసంశోధనోపగామ్ ।
ఆరోగ్యకామః సేవేత స్వాస్థ్యే ప్రకృతిభోజనమ్ ॥ 42 ॥
వర్జయిత్వా విరుద్ధాన్నం గుర్వసాత్మ్యం చ యద్భవేత్ ।

ఆరోగ్యమును కోరు వాడు సంశోధనములో తోడ్పడు పై చెప్పిన సంసర్జన క్రమము పాటించవలెను. తిరిగి స్వస్థత చేకూరినప్పుడు విరుద్ధ గురు అసాత్మ్య భోజనమును త్యజించి ప్రాకృత భోజనము చేయవలెను.

**అతః పరం ప్రవక్ష్యామి ప్రమాణాదిప్రయోజనమ్ ॥ 43 ॥**

తదనంతరము వమన విరేచనాదుల ప్రమాణము మాత్ర వర్ణించెదను.

**వమనీయకషాయస్య చత్వారోఽఞ్జలయః పరా ।**
**మాత్రా, మధ్యా త్రయో, హ్రస్వా ద్వౌ, తదర్ధా విరేచనే ॥ 44 ॥**

వమనమున కిచ్చెడు కషాయము యొక్క ఉత్కృష్టమాత్ర 4 అంజలులు. మధ్యమమాత్ర 3 అంజలులు. హీనమాత్ర 2 అంజలులు విరేచనౌషధమాత్ర ఇందులో సగము ఉండవలెను.

పురుషం పురుషం ప్రాప్య దోషాణాం చ బలాబలమ్ ।
మదనస్య ఫలక్వాథః పిప్పలీసర్షపాన్వితః ॥ 45 ॥

గ్రహాఘ్న్యా వా స ఏవాఽథ పటోలారిష్టవత్సకైః ।
యుక్తో వాఽథ ప్రియఙ్గూనాం కల్కేన మధుకస్య చ ॥ 46 ॥
వమనార్థే విధేయః స్యాన్మధుసైన్ధవమూర్చ్ఛితః ।

ప్రతి మనిషికి దోషముల బలాబలములను చూచి మదన ఫల క్వాథమును మధు సైంధవ లవణముతో కలిపి అందులో పిప్పలి, సర్షప, పటోల, నింబ, వత్సక, ప్రియంగు మధుక కల్కమును వేసి ప్రయోగించవలెను.

న త్వజీర్ణే, హితం త్వత్ర లవణోష్ణామ్బు కేవలమ్ ॥ 47 ॥
తద్ధి సర్వం సముత్క్లిశ్య ముఖేనాశు వినిర్హరేత్ ।

రోగికి అజీర్ణమైనచో పై ఔషధసేవన చేయకూడదు. అప్పుడు వమనార్థము కేవలము ఉష్ణ జలములో సాధారణ లవణమువేసి ప్రయోగించవలెను. ఇది సంపూర్ణ దోషములను ఉత్క్లేశము చేసి ముఖము నుండి వెడలించును.

యద్యేవమామం విష్టమ్భాన్నైతి తత ఉత్తరమ్ ॥ 48 ॥
వచాజగన్ధామదనపిప్పలీభిస్తదుద్ధరేత్ ।
అన్యైర్వా కల్క(ల్ప)విహితైర్బీభత్సోద్వేజనౌషధైః ॥ 49 ॥
అఙ్గుల్యుత్పలనాలాద్యైర్గలావతుదనైః సఖైః ।
తత్పార్శ్వోదరపృష్ఠానాం పీడనోన్మర్దనైరపి ॥ 50 ॥

ఒక వేళ ఆ దోషము ఆమావస్థలో నున్నందున బహిర్గతము కానిచో తర్వాత వచ అజగంధ మదన ఫలము పిప్పలి ద్వారా బైటకు వెడలించవలెను. లేదా అన్యకల్పములతో తయారు చేసిన బీభత్స ఉద్వేజన కారకములైన ఔషధములను లేదా వేలుతోగాని, కమలనాళముతోగాని కంఠములో సుఖస్పర్శ గావించి లేదా ఉదర పృష్ఠ ప్రదేశములను పీడన చేసి లేదా ఉద్వర్తనముచేసి దోషమును వెడలించవలెను.

పీతవన్తం చ వమనం ముహూర్తమనుపాలయేత్ ।
విదాహపూర్వః స్వేదోఽస్య యదా భవతి సర్వతః ॥ 51 ॥
విష్యన్దమానం జానీయాత్తదా దోషం భిషగ్వరః ।
లోమహర్షేణ చాన్వక్షం స్థానేభ్యశ్చలితం తథా ॥ 52 ॥

ఆధ్మానోద్వేష్టనాభ్యాం చ నిర్దిశేత్ కోష్ఠమాశ్రితమ్ ।
హృల్లాసాస్యపరిస్రావైశ్చాముఖీభూతముద్ధరేత్ ॥ 53 ॥
ఉష్ణామ్బు లవణోపేతం పీత్వాఽఽకణ్ఠం పునః పునః ।

వమనౌషధ సేవనానంతరము ముహూర్త కాలము ప్రతీక్షించవలెను. రోగికి మొదట వేడికల్గి తర్వాత శరీరమునందు చెమట వచ్చును. అప్పుడు దోషములు విలయమొందుచున్నదని గ్రహించవలెను. లోమహర్షముతో దోషములు తమ స్వస్థానమునుండి విచలితమైనవిగా గమనించవలెను. ఆధ్మాన ఉద్వేష్టనముల ద్వారా దోషములు కోష్ఠమును చేరుట హృల్లాసము లాలస్రావము ద్వారా దోషముల ఊర్ధ్వగమనము అప్పుడు లవణజలము కంఠ పర్యంతము పునః పునః త్రాగి వమనము చేసి దోషములను వెడలించవలెను.

యావత్ స్యురష్టౌ షడ్వాఽపి వేగాశ్చత్వార ఏవ వా ॥ 54 ॥
ఆపిత్తదర్శనాద్వాఽపి దోషోచ్ఛిత్తేరథాపి వా ।

వమన వేగము : వమనము 8,6,4 వేగములు రావలెను. లేదా పిత్త దర్శనము వరకు దోషములు నష్టమగునంతవరకివ్వవలెను.

మానప్రమాణతో వాకాధ్యర్ధద్విప్రస్థసంమితమ్ ॥ 55 ॥
పీతాదభ్యధికం యత్ స్యాత్ సదోషస్తద్వినిర్గమే ।

దోషముల ప్రమాణానుసారము సేవించిన ఔషధము కాక ఒక ప్రస్థము (హీన), 1½ ప్రస్థము (మధ్య), 2 ప్రస్థములు (ప్రవర) దోషములు నిర్హరణము కావలెను. వమనాదులవమాత్ర సేవించిన ఔషధముకన్నా అధికమైనచో దోషయుక్తమగును.

నిరామగన్ధం సోద్గారం యావత్ పీతమపిచ్ఛిలామ్ ॥ 56 ॥
యదా వికలుషం వాన్తం దృశ్యతేఽమ్బు ప్రతిగ్రహే ।
కుక్ష్యురఃకణ్ఠశిరసాం లాఘవం రోగమార్దవమ్ ॥ 57 ॥
క్లమకార్శ్యే న చాత్యర్థముత్సాహో విశదాత్మతా ।
సద్యో నిర్హృతదోషస్య లిఙ్గాన్యేతాని నిర్దిశేత్ ॥ 58 ॥

**దోష నిర్గమ లక్షణము :** సేవించిన ఔషధము ఆమగంధ రహితముగా వెడలుట, వమన జలము పిచ్ఛిల దోషరహితముగా నుండుట. కుక్షి ఉరస్సు కంఠము శిరమునందు లఘుత్వము, రోగము మృదువగుట, శరీర బడలిక, బలహీనము తక్కువగుట ఉత్సాహము ప్రసన్నముగా నుండుట. ఈ లక్షణముల వలన దోషములు వెడలినవని గ్రహించవలెను.

**శిరోగతం తతశ్చాస్య త(తై)లైః స్విన్నస్య దేహినః ।**
**దోషావశేషం నస్యేన ధూమపానేన వా హరేత్ ॥ 59 ॥**

తర్వాత శిరమునందు మిగిలిన దోషములను తైలముతో శిరస్సును స్విన్నము చేసి నస్యము ధూమపానము ద్వారా నశింపచేయవలెను.

**యథాశుద్ధి తతశ్చైనం సంసర్గేణోపపాదయేత్ ।**
**హరీతక్యా గ్రహఘ్న్యా వా కల్పోక్తం స్యాద్విరేచనమ్ ॥ 60 ॥**

సమ్యక్ శుద్ధి తర్వాత రోగి సంసర్జన క్రమము ననుసరించి భోజనము చేయించిన తర్వాత కల్పోక్తి హరీతకీ లేదా గ్రహఘ్న (శ్వేతసర్షక) ద్వారా విరేచనము చేయించవలెను.

**పిప్పలీసైన్ధవోపేతా పథ్యా వా త్రివృతాయుతా ।**
**శృతం చారగ్వధఫలం క్షీరేణాథ రసేన వా ॥ 61 ॥**
**త్రిఫలా వా త్రివృద్యుక్తా సఘృతవ్యోషసైన్ధవా ।**
**తథా గన్ధర్వతైలం వా శ్రేష్ఠం స్నేహవిరేచనమ్ ॥ 62 ॥**

లేదా పిప్పలీ సైంధవయుక్త హరీతకి, లేదా త్రివృత్ యుక్త హరీతకి నివ్వవలెను. లేదా ఆరగ్వధ ఫలగుజ్జును క్షీరముతో గాని మాంసరసముతో గాని ఇవ్వవలెను. లేదా త్రిఫలాత్రివృత్తులో ఘృతము త్రికటు కలిపి నివ్వవలెను. లేదా ఏరండతైలము శ్రేష్ఠ స్నేహ విరేచనము.

**దశమూలకషాయేణ జాఙ్గలానాం రసేన వా ।**
**ద్రాక్షాక్వాథేన వా యుక్తమథవా దీపనామ్బునా ॥ 63 ॥**
**త్రివృద్ద్రాక్షాభయానాం వా గవాం మూత్రేణ సంయుతా ।**
**సద్రాక్షా త్రివృతా వా స్యాదథవా త్రివృతాష్టకమ్ ॥ 64 ॥**

దశమూల క్వాథము జాంగల మాంసరసము ద్రాక్షాక్వాథము దీపనీయ జలము, లేదా గోమూత్రముతో త్రివృత్ ద్రాక్షా హరీతకిని ప్రయోగించవలెను. లేదా ద్రాక్షా త్రివృత్ లేదా త్రివృతాష్టక చూర్ణమునివ్వవలెను.

పథ్యా త్రిజాతకం వ్యూషం విడఙ్గామలకం ఘనమ్ ।
సమాని, షడ్గుణా త్వత్ర శర్కరాఽష్టగుణా త్రివృత్ ॥ **65** ॥

చూర్ణం జ్వరశ్రమశ్వాసకాసపాణ్డ్వామయక్షయాన్ ।
హన్యాత్ క్రిమివిషార్శాంసి మూత్రకృచ్ఛ్రం చ దేహినామ్ ॥ **66** ॥

త్రివృతాష్టక చూర్ణము : హరీతకి, త్రిజాతకములు ( దాల్చిన, ఏలా, తేజపత్ర) త్రికటు, విడంగ ఆమలకి ముస్త ఇవన్ని సమభాగములు గ్రహించి ఇందులో 6రెట్లు శర్కర, 8 రెట్లు త్రివృత్ చేర్చి చూర్ణం చేయవలెను. ఈ చూర్ణము ప్రాణుల జ్వరము, శ్రమ, శ్వాస, కాస, పాండు రోగ, క్షయ, కృమి, విష అర్శస్సు మరియు మూత్ర కృచ్ఛ్రమును నశింపచేయును.

దశావరే, పఞ్చదశ మధ్యమే, త్రింశదుత్తమే ।
వేగా ద్విత్రిచతుప్ప్రస్థప్రమాణాః స్యుర్విరేచనే ॥ **67** ॥

విరేచన వేగము : అవర విరేచనము 10, మధ్యవిరేచనము 15, ఉత్తమవిరేచనము 30 వేగములు. మానానుసారము హీనము 2 ప్రస్థములు, మధ్యమము 3 ప్రస్థములు ఉత్తమము 4 ప్రస్థములు కావలెను.

విట్పిత్తకఫసంమిశ్రాః సవాతాః స్యుర్యథాక్రమమ్ ।
పిత్తావసానా వమనే కషాయకఫమూర్ఛితాః ॥ **68** ॥

సమ్యగ్యోగేఽతియోగేఽతిప్రవృత్తిః శోణితోత్తరా ।
అయోగే త్వప్రవృత్తిః స్యాద్విపరీతాఽల్పశోఽపి వా ॥ **69** ॥

విభ్రంశః కర్మణో భ్రంశః కేవలౌషధనిర్గమః ।

విరేచనమునందు దోష నిర్గమనక్రమము : మొదట మలము తర్వాత క్రమముగా పిత్త కఫ వాతములు వెడలును. వమనము నందు మొదట కషాయ ఔషధము తర్వాత కఫము అంతమునందు పిత్తము వెడలును. ఆమాశయము రిక్తం అయిన తర్వాత కేవల వాతము వెడలును.

**విరేచన అతియోగము** - ఉపర్యుక్త దోషములు అత్యధికముగా వెడలును. అంతములో మలముతో రక్తము వచ్చుచుండును. **విరేచన అయోగ లక్షణములు!** విరేచనము మొత్తము కాకపోవుట విపరీత మార్గమున ప్రవృత్త మగుట, విరేచనము అల్పమాత్రలోనగుట విభ్రంశము (కోష్ఠాంగ గుదభ్రంశము), విరేచనము కాకపోవుట కేవలము ఔషధము మాత్రమే వెడలుట. ఇవి అయోగలక్షణములు.

**సర్పిష్పానం వికారే స్యాదతియోగానుబన్ధజే ॥ 70 ॥**
**మధుకాదివిపక్వం వా తైలం తత్రానువాసనమ్ ।**

విరేచన అతియోగ వికారములో ఘృతపానము చేయించవలెను. లేదా యష్ఠిమధు సిద్ధతైలముతో అనువాసన వస్తి నివ్వవలెను.

**దుర్వాన్త దుర్విరిక్తం వా స్నిగ్ధదేహం బలాన్వితమ్ ॥ 71 ॥**
**బహుదోషం దృఢాగ్నిం చ పాయయేదపరేఽహని ।**
**దుర్బలం క్రమశో భూయః స్నిగ్ధస్విన్నం విశోధయేత్ ॥ 72 ॥**
**(ఇతి తాడపత్రపుస్తకే 216 తమం పత్రమ్)**

దుర్వాంత దుర్విరిక్త (అవర) పురుషనకి శరీరము స్నిగ్ధ బలమైనచో దోషములు అధిక మాత్రలో నుండి జఠరాగ్ని ప్రదీప్తమై యున్నచో మరుసటి రోజు వమనము లేదా విరేచన ఔషధము మళ్లీ ఇవ్వవలెను. రోగి దుర్బలుడైనచో స్నేహ స్వేదనములు చేయించి మరల వమన విరేచనములు చేయించవలెను.

**న తు దుశ్ఛర్దనం జాతు క్రూరకోష్ఠమథాపి వా ।**
**తయోః సంశమనైర్దోషాన్ బస్తిభిర్వా శమం నయేత్ ॥ 73 ॥**

**అహృద్యమతిదుర్గన్ధమజీర్ణే చాతి వా బహు ।**
**యస్యానులోమికం పీతమూర్ధ్వం యాతి కఫావృతమ్ ॥ 74 ॥**
**తం వామితం లఙ్ఘితం వా పరిస్నిగ్ధం విరేచయేత్ ।**

దుర్వమ్య లేదా క్రూర కోష్ఠునకు ఎప్పుడూ రెండవసారి వమన లేదా విరేచనౌషధము నివ్వకూడదు. వారి దోషములను సంశమన ఉపాయముతో లేదా వస్తి ద్వారా శాంతింపచేయువలెను.

విరేచనౌషధము హృద్యము గానప్పుడు అత్యంత దుర్గంధ మైనప్పుడు, అజీర్ణమునందు ఔషధము నిచ్చినపుడు, అత్యధిక మాత్రలో నిచ్చిననపుడు కఫావృత ఔషధము ఊర్ధ్వగమనము చేయును. వానికి వమన లంఘనము స్నేహనములు చేయించి విరేచనము చేయించవలెను.

**అత్యర్థస్నిగ్ధదేహస్య విశుద్ధామాశయస్య వా ॥ 75 ॥**
**మారుతస్యానులోమ్యస్య యస్యాధో వమనం వ్రజేత్ ।**
**తస్య సంసర్గమాత్రేణ పరిశుద్ధిర్విధీయతే ॥ 76 ॥**
**దుర్బలస్యాల్పదోషస్య మృదు సంశోధనం హితమ్ ।**

అతిస్నిగ్ధుడైన వానికి, ఆమాశయ శుద్ధి కల్గిన వానికి వాయు అనులోమనముచే వమనౌషధము అధోమార్గమున విరేచనమగును. అతనికి సంసర్జన మాత్రతో శుద్ధి అగును. దుర్బలుడు, అల్పదోషములు గలవానికి మృదు సంశోధనము నివ్వవలెను.

**విగృహీతాచిరాద్దోషైః స్తోకం స్తోకం వ్రజత్యధః ॥ 77 ॥**
**ఉష్ణామ్బుపానం తత్ర స్యాదానులోమ్యకరం పరమ్ ।**

ఔషధిని దోషములు శీఘ్రముగా గ్రహించపోవుట వలన దోషములు మెల్లమెల్లగా క్రిందికి వచ్చును. ఆ ఆవస్థలో ఉష్ణ జలమును త్రాగించవలెను. ఇది మలమును దోషగతిని అనులోమనము చేయును.

**దోషో భవేద్వా సోద్గారో నోర్ధ్వం నాధశ్చ గచ్ఛతి ॥ 78 ॥**
**సశూలే భేషజే జన్తోః స్వేదం తత్రావచారయేత్ ।**

ఔషధ సేవనచే ఉద్గారమైనచో దోషమును పైకి గాని క్రిందకు గాని రాక, ఉదరశూల ఉన్నచో స్వేదనము చేయించవలెను.

**మాత్రావిరిక్తే సోద్గారమౌషధం క్షిప్రముద్ధరేత్ ॥ 79 ॥**

యోగ్యమాత్రలో విరేచనమైనపుడు ఇంకా ఔషధ ఉద్గారమైనచో వెంటనే వమనము చేయించి ఔషధమును వెడలింపచేయవలెను. లేనిచో విరేచన

అతియోగమగును. అతియోగమైనపుడు ఔషధము జీర్ణమైనపుడు స్తంభన ద్రవ్యములచే స్తంభింప చేయవలెను.

దీప్తాగ్నేః క్రూరకోష్ఠస్య బహుదోషస్య దేహినః ॥ **80** ॥
సోదావర్తస్య నిర్వాహ్య పురీషం ఫలవర్తిభిః ।
సుస్నిగ్ధస్విన్నగాత్రస్య భిషగ్దద్యాద్విరేచనమ్ ॥ **81** ॥

అగ్నిదీప్తునికి, క్రూరకోష్ఠునికి, దోషాధిక్యము గలవానికి ఉదావర్తము కల్గినచో ఫలవర్తులచే దోషములను వెడలించవలెను. స్నేహస్వేదనము చేసి విరేచనము చేయించవలెను.

యదసక్తం మహావేగైః సుఖేనాశు ప్రవర్తతే ।
అనాబాధకరం నాతిగ్లపనం దోషసోధనమ్ ॥ **82** ॥

అవ్యాపన్నగుణోదర్కం మాత్రాయుక్తం సుసంస్కృతమ్ ।
పీతమేకాగ్రమనసా సమ్యకచ్ఛుద్ధికృదావహేత్ ॥ **83** ॥

సమ్యక్ శుద్ధి ఔషధ లక్షణము : ఔషధను శరీరము నందే నిల్చి పోనిది, అతివేగమును సుఖపూర్వకముగా ప్రవృత్తము చేయునది, శరీరమునకు కష్టము కల్గించనిది అతిగ్లానిని ఉత్పన్నము చేయనిది, దోషశోధనము చేయునది మంచి గుణముల నష్టము కానిది యోగ్యమాత్రలో సేవించినది, మంచిగ సంస్కరించ బడినది ఏకాగ్ర మనసుతో సేవించిన ఔషధము సమ్యక్ శుద్ధి ఔషధముగా తెలుసు కొనవలెను.

దీప్తాగ్నయః కర్మనిత్యా యే నరా రూక్షభోజినః ।
శశ్వద్దోషాః క్షయం యాన్తి తేషాం వాయ్వగ్నికర్మభిః॥ **84** ॥
విరుద్ధాధ్యశనాజీర్ణదోషానపి సహన్తి తే ।
స్వస్థవృత్తా న తే శోధ్యా రక్ష్యా వాతవికారతః ॥ **85** ॥
విజ్ఞాయైవంవిధం వైద్యః సంశుద్ధిం కర్మ(ర్తు)మర్హతి ॥

అగ్ని ప్రదీప్తమైన వానికి నిత్యము శ్రమ చేయువానికి రూక్ష భోజనము చేయువానికి దోషములు వాయు అగ్ని వ్యాయామాది కర్మలచే శాంతించును.

వారు విరుద్ధ భోజనము, అధ్యశనము అజీర్ణాది దోషములను కూడ సహించును. వారి స్వాస్థ్యావస్థలో శోధనము చేయించకూడదు. వాత వికారములనుండి రక్షించవలెను. వైద్యుడు ఇవన్ని తెలిసికొని సంశోధనము చేయవలెను.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ।**

అని భగవాన్ కశ్యపుడు సప్తమాధ్యాయమును చెప్పెను. ఖిలస్థాన మందలి సంశుద్ధివిశేషణీయానామాధ్యాయము సమాప్తము.

**(ఇతి) ఖిలేషు సంశుద్ధివిశేషణీయో నామ సప్తమోఽధ్యాయః ॥ 7 ॥**

# అథ వస్తివిశేషణీయో నామాష్టమోऽధ్యాయః ।

# వస్తి విశేషణీయాధ్యాయః

అథాతో వస్తివిశేషణీయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము వస్తి విశేషణీయాధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

బస్తిదానాత్ పరం నాస్తి చికిత్సాऽఙ్గసుఖావహా ।
శాఖాకోష్ఠగతా రోగాః సర్వార్ధాఙ్గగతాశ్చ యే ॥ 3 ॥
తేషాం సముద్భవే హేతుర్వాతాదన్యో న విద్యతే ।

వస్తికి మించిన చికిత్స శరీరాంగములకు సుఖము కల్గించుటలో మరేదీ లేదు. శాఖాగత కోష్ఠగత సంపూర్ణ శరీరగత అర్ధ శరీరగత వ్యాధుల ఉత్పత్తి హేతువు వాతము గాక మరేది ఇతర కారణము లేదు.

తథా కఫస్య పిత్తస్య మలానాం చ రసస్య చ ॥ 4 ॥
విక్షేపణో సంహరణో వాయురేవాత్ర కారణమ్ ।

కఫ పిత్తముల రసముల విక్షేర సంఘాతములకు ( వియోగ, సంయోగ) వాయువే కారణము.

జేతా చాస్య ప్రవృద్ధస్య బస్తితుల్యో న కశ్చన ॥ 5 ॥

తదుపార్థం చికిత్సాయాః సర్వం వాతచికిత్సితమ్ ।

ప్రకోపించిన వాయువును జయించుటకు వస్తి సమానమైన మరో ఉపాయము లేదు. వస్తి క్రియ సంపూర్ణవాత రోగములలో అర్ధచికిత్సగా నెంచబడినది.

కర్మ కాలశ్చ యోగశ్చ తిస్రః సంజ్ఞా యథాక్రమమ్ ॥ 6 ॥
వక్ష్యే నిరుక్తనిర్దేశసంఖ్యాదోషవికల్పతః ।

నిరుక్త, నిర్దేశ, సంఖ్యా మరియు దోషాను సారము క్రమముగా కర్మవస్తి, కాలవస్తి, యోగవస్తులను నేను వర్ణించెదను.

బాహు . . . . . . . తేః కర్మసంజ్ఞితమ్ ॥ 7 ॥
అత్యుదీర్ణబలే జాతే ప్రయోజ్యం తద్యథావిధి ।

కర్మవస్తి : శరీర బలము అధికముగా నున్నప్పుడు కర్మవస్తిని ప్రయోగించవలెను.

తదర్ధకలనాత్ కాలః స హి మధ్యబలాన్వయే ॥ 8 ॥
పవనే పిత్తసంసృష్టే విధాతవ్యో విజానతా ।

**కాలవస్తి :** కర్మ వస్తి సంఖ్యలో సగము ఉండుట వలన దీనిని కాలవస్తి అందురు. శరీర బలము మధ్యముగా నున్నపుడు మరియు వాయువుతో పిత్తము సంసర్గమైనపుడు వివేక వంతుడు దీనిని ప్రయోగించవలెను.

అల్పత్వాత్ స్నేహబస్తీనాం యుక్తేర్యోగః స లాఘవాత్ ॥ 9 ॥
ప్రయోజ్యః కఫసంసృష్టే నాతితీవ్రబలేఽనిలే ।

యోగ వస్తి : స్నేహ వస్తి కంటె తక్కువ గుట మరియు లఘుత్వ- మగుటచే దీనిని యోగవస్తి అందురు. కఫ సంసర్గమై వాతము తీవ్రముగా లేనప్పుడు దీనిని ప్రయోగించవలెను.

అన్వాసనాశ్చతుర్వింశతిర్నిరూహాః షట్ చ కర్మణి ॥ 10 ॥
(ద్వాదశాఽన్వాసనాః కాలే) నిరూహాశ్చాత్ర వైత్రయః ॥ 11 ॥
త్రయ ఏవ నిరూహాః స్యుర్యోగే పఞ్చానువాసనాః ।
కర్మాదీనాం త్రిపఞ్చాశద్వస్తిసంఖ్యా నిదర్శితా ॥ 12 ॥

కర్మ వస్తి సముదాయములో అనువాసన వస్తి 24, నిరూపవస్తి 6 అగును. కాలవస్తి యోగవస్తుల మొత్తము సంఖ్య 53. కర్మవస్తి = 30 కాలవస్తి =15 యోగవస్తి=8

పశ్చాదా కర్మణి స్నేహాశ్చత్వారోఽన్తే తథాఽనయోః।
మధ్యే షణ్ణాం నిరూహాణామన్తరేషు త్రయస్త్రయః ॥ 13 ॥
ఆదావన్తేఽన్తరే చైవ కాలే స్నేహాస్త్రయస్త్రయః।
యోగే నిరూహాన్తరితాస్త్రయోఽన్తే ద్వావితి క్రమాత్ ॥ 14 ॥
ప్రోక్తో విభాగనిర్దేశస్తద్వికల్పమతః శృణు।

కర్మ వస్తిలో ప్రారంభములో 5, అంతములో 4 స్నేహవస్తులుండును మరియు 6 నిరూహవస్తుల మధ్యలో 3 స్నేహవస్తువులుండును అనగా 5 అనువాసన+1 నిరూహ+ 3 స్నేహ+1 నిరూహ+3 స్నేహ+1 నిరూహ+3 స్నేహ+1 నిరూహ+3 స్నేహ+1 నిరూహ+3 స్నేహ+1 నిరూహ+4 స్నేహ=30

కాలవస్తిలో ప్రారంభమున 3 అంతమున 3 మధ్యమున 3, 3 స్నేహవస్తులుండును.

3-స్నేహ
1-నిరూహ
3-స్నేహ
1-నిరూహ
3-స్నేహ
1-నిరూహ
3-స్నేహ
15

యోగవస్తిలో ఒక స్నేహ వస్తి ఒక నిరూపవస్తి చొ॥న ఉండి అంతమున 2 స్నేహవస్తులుండును.

1 స్నేహ
1 నిరూహ
1 స్నేహ

ఈ విధముగా కర్మ, కాల, యోగ అనుసారము వస్తివిభాగము చెప్పబడినది.

1 నిరూహ　　　　　　　　ఇప్పుడు విపులముగా వినుము.
1 స్నేహ
1 నిరూహ
2 స్నేహ
8

సప్త పఞ్చ త్రయో వాఽఽదౌ వాతే (స్నేహాస్త్వ) గర్హితాః ॥ 15 ॥
జఘన్యౌ పిత్తకఫయోరేతావేవ కదాచన ।

వాతప్రకోపమున 7,5,3 స్నేహవస్తులు నిందితము కాదు. కాని ఇవే సంఖ్యలు పిత్త, కఫ ప్రకోపములో ప్రారంభమున ఇచ్చినచో అప్పుడప్పుడు నిందితముగా చెప్పబడినవి.

తాం తామవస్థామన్వీక్ష్య దోషకాలబలాశ్రయామ్ ॥ 16 ॥

ఉత్కర్షేచ్చావకర్షేచ్చ బస్తీన్ ద్రవ్యాణి వా భిషక్ ।
కుర్యాద్యోగే తథోత్కర్షమపకర్షం తు కర్మణి ॥ 17 ॥
కాలే తదుభయం చైవ వీక్ష్య దోషబలాబలమ్ ।

కావున దోష కాల రోగి బల అవస్థలను జూచి వస్తి మరియు వస్తి ద్రవ్యములను తగ్గించుట లేదా వృద్ధి చేయుట నిర్ణయించవలెను. యోగవస్తిలో ఉత్కర్ష కర్మ వస్తిలో అపకర్ష మరియు కాలవస్తిలో దోషముల కాలబలములను చూసి, వృద్ధి హ్రాసలను చేయవలెను.

వాతే సమాంశః స్నిగ్ధోష్ణో నిరూహః పానతైలికః ॥ 18 ॥
షడ్భాగస్నైహికా పిత్తే సక్షీరా స్వాదుశీతలా ।
త్రయః సమూత్రాస్తీక్ష్ణోష్ణాః శ్లేష్మణ్యష్టాఙ్గతైలికాః ॥ 19 ॥
సకృత్ ప్రణిహితో వాతమాశయస్థం నిరస్యతి ।
సపిత్తం సకఫం ద్విస్త్రిరత ఊర్ధ్వం న శస్యతే ॥ 20 ॥

వాత రోగములలో నిరూహవస్తిలో సమాన మాత్రలో తైలమును వేసి స్నిగ్ధ ఉష్ణముగా ఒక వస్తి నివ్వవలెను. పిత్త వ్యాధులలో 6 భాగముల తైలమును క్షీరముతో స్వాదు శీతలము చేసి 2 వస్తులనివ్వవలెను. శ్లేష్మ వ్యాధులలో

8 భాగములు తైలమును గోమూత్రముతో తీక్ష్ణోష్ణము చేసి 3 వస్తుల నివ్వవలెను. వాతరోగములో నిచ్చిన ఒకవస్తి ఆశయములనుండి వాత దోషమును నిర్హరించును. పిత్త వ్యాధులలో 2 కఫవ్యాధులలో 3 వస్తుల నివ్వవలెను. ఇంతకన్న అధికముగా వస్తులనివ్వరాదు.

శస్యతేఽత్ర రసక్షీరయూషాశనవిధిః క్రమాత్ ।
అథవా బలకాలాగ్నిదేశప్రకృతిసాత్మ్యతః ॥ **21** ॥

వస్తి అనంతరము క్రమముగా మాంసరసము, క్షీరము, యూషముల భోజనమునివ్వవలెను. లేదా రోగి బల, కాల, అగ్ని, దేశ, ప్రకృతి, సాత్మ్యాను సారము తగిన భోజనమునివ్వవలెను.

ఏతా దోషవికల్పాన్తా నిర్దిష్టా బస్తియుక్తయః ।
ఏష చాప్యపరః కల్పశ్చతుర్భద్ర ఇతి స్మృతః ॥ **22** ॥

ఈ విధముగా దోషములననుసరించి ఈ వస్తులు నిర్దేశించబడినవి ఇవిగాక వస్తులలో ఈ క్రింది చతుర్భద్రమను కల్పము చెప్పబడినది.

చత్వారో బస్తయః పూర్వమన్తే చత్వార ఏవ చ ।
తయోరాస్థాపనం మధ్యే కల్పం సోఽయం నిరత్యయః ॥ **23** ॥
ద్విస్త్రిర్వాఽర్థవశాదేష క్రియమాణః సుఖావహః ।

ప్రారంభమున 4 స్నేహవస్తులు+ మధ్యలో 4 ఆస్థాపనవస్తులు+ అంతములో 4 స్నేహవస్తులు - ఈ చతర్భద్రకల్పము ఉపద్రవ రహితము. అవసరానుసారము ఈ కల్పము 2 లేదా 3 సార్లు ఇచ్చినచో సుఖకారకముగా నుండును.

జ్వరాదిభిః పరిక్లిష్టే హీనవర్ణబలౌజసి ॥ **24** ॥
జాతానువాసనావస్థే బలపుంస్త్వాగ్నివర్ధనాః ।

జ్వరాదులచే పీడితుడైన వానికి వర్ణ బల ఓజస్సులు హీనమైనప్పుడు అనువాసనవస్తి చేసినచో బలము, పుంస్త్వ శక్తి, జఠరాగ్ని వృద్ధి పొందును.

అయుగ్మా బస్తయో దేయా న తు యుగ్మాః కథఞ్చన ॥ **25** ॥
విషమా విషమైరేవ హన్యన్తే బస్తిభిర్గదాః ।
ఏకస్త్రయో వా కఫజే, పైత్తికే పఞ్చ సప్త వా ॥ **26** ॥

వాతే న్వైకాదశ వా యో యదాప్నోతి వా సమమ్ ।

(ఇతి తాడపత్రపుస్తకే 217 తమం పత్రమ్)

రోగికి ఎల్లప్పుడు విషమసంఖ్యలో వస్తులనివ్వవలెను. సమసంఖ్యలో ఎప్పుడూ ఇవ్వకూడదు. విషమవ్యాధులు లేదా విషమ దోష కారణములచే ఉత్పన్నమైన రోగము విషమ వస్తులతో మాత్రమే నష్టమొందును. కఫ జరోగములో ఒకటి లేదా 3, పిత్తజ రోగములో 5 లేదా 7 వాతవ్యాధిలో 9 లేదా 11 వస్తుల నిచ్చినచో రోగి దోషధాతువులు సమావస్థలో నుండును.

ఇతి సూక్ష్మవిచిత్రార్థముక్తం వ్యాససమాసతః ॥ 27 ॥
విజ్ఞాయైతత్ ప్రయోక్తవ్యం యథా వక్ష్యామ్యతః పరమ్ ।

ఈ విధముగా సూక్ష్మమైన అనేకమైన విషయములను వివరముగా సంక్షిప్తముగా చెప్పినాను. ఇవన్ని తెలుసుకొని వస్తిని ప్రయోగించవలెను. ఇకముందు చెప్పునట్లుగాక!

గమ్భీరానుగతా యస్య క్రమేణోపచితా మలాః ॥ 28 ॥
కుపితా వాతభూయిష్ఠా బస్తిసాధ్యా విశేషతః ।
సంపన్నస్య సహిష్ణోశ్చ కర్మ తస్య పరాయణమ్ ॥ 29 ॥

క్రమముగా ఉపచిత గంభీరమైన ధాతువులలోని మలములు కుపితమైనప్పుడు వాతము ప్రధానముగా నున్నప్పుడు ఆ దోషములు విశేషముగా వస్తిసాధ్యమగును. రోగి సంపన్నుడు సహిష్ణుడైనప్పుడు కర్మవస్తి శ్రేష్ఠము.

అతో మధ్యస్య కాలః స్యాదవ(ర)స్యావరస్తథా ।
స్నేహస్వేదోపపన్నస్య వామితస్య యథాక్రమమ్ ॥ 30 ॥
స్నిగ్ధస్విన్నస్య తు పునర్విరిక్తస్య క్రమే గతే ।
దత్తానువాసనస్యాస్య యథాయోగం తతస్త్ర్యహాత్ ॥ 31 ॥
క్షణికస్య ప్రశాన్తస్య నిరూహముపలక్షయేత్ ।

మధ్యబలము, మధ్యదోషము, మధ్యసాధన సంపన్నవ్యక్తికి కాలవస్తి నివ్వవలెను. అవర బలము, అవరదోషము మరియు అవర సాధన యుక్త వ్యక్తికి

క్రమముగా మొదట స్నేహనము, స్వేదనము మరియు వమనము చేయించి తిరిగి క్రమముగా స్నేహనము, స్వేదనము విరేచనము తర్వాత అనువాసన వస్తినిచ్చి 3 రోజుల తర్వాత నిరూహవస్తి నివ్వవలెను.

త్రిభిరన్వాసితస్యాతః సప్తాహః కర్మకాలయోః ॥ **32** ॥
పునరాస్థాపనం కార్యం యోగః స్యాత్ పఞ్చమేఽహని ।
స్వభ్యక్తస్విన్నగాత్రస్య కాల్యమప్రాతరాశినః ॥ **33** ॥
కోష్ఠాను సాఽఽమం శాఖాభ్యః సమ్యక్సంవాహితస్య చ ।

3 రోజుల తర్వాత అనువాసన వస్తి నిచ్చిన వాడికి 7 రోజుల తర్వాత కర్మకాలవస్తి నివ్వవలెను. మళ్లీ ఆస్థాన వస్తి నిచ్చి స్నేహస్వేదనములు చేసి ప్రాతఃకాలమున ఆమప్ర కోపమున్నచో ఆమాశయము రిక్తముగా నున్నప్పుడు శాఖలందు సంవాహనము చేసి 5వదినము యోగవస్తి నివ్వవలెను.

నిరూహం యోజయేత్ ప్రాజ్ఞః సర్వోపకరణాన్వితః ॥ **34** ॥
హైమే రౌప్యేఽథవా కాంస్యే సుమృష్టే భాజనే సమే ।
ప్రక్షిప్యైకైకశో ద్రవ్యం యత్ క్రమేణోపదేక్ష్యతే ॥ **35** ॥

బుద్ధివంతుడైన వాడు అన్ని ఉపకరణములను సమకూర్చుకుని బంగారు, వెండి కంచు పాత్రలను శుభ్రము చేసి ముందు వర్ణించు ద్రవ్యములను వేసి నిరూహవస్తి తయారు చేసుకొనవలెను.

భిషఙ్నిరూహం ముద్రీయాత్ ప్రాఙ్ముఖః సుసమాహితః ।
పూర్వమేవాత్ర నిక్షేప్యం మధునః ప్రసృతద్వయమ్ ॥ **36** ॥
సైన్ధవస్యార్ధకర్షం చ తైలం చ మధునః సమమ్ ।
తతశ్చ కల్కప్రసృతం క్వాథం కల్కచతుర్గుణమ్ ॥ **37** ॥
ప్రసృతౌ మాంసనిర్యూహాన్మాత్రప్రసృతమేవ చ ।
ద్వాదశప్రసృతో బస్తిరిత్యేవం ఖజమూర్ఛితః ॥ **38** ॥
యథార్థం చ యథావచ్చ ప్రణిధేయో విజానతా ।

వస్తి ఉపదానద్రవ్యములను కలుపు పద్ధతి. చికిత్సకుడు తూర్పునకు ముఖము చేసి చిత్తశుద్ధితో కూర్చుని ద్రవ్యములను చేతులతో నలిపి నిరూహమును

తయారు చేసుకొనవలెను. మొదట 2 ప్రసృతముల మధును వేయవలెను. అందులో ఆర్ధ కర్షము సైంధవలవణమును రెండు ప్రసృతముల తైలమును వేయవలెను. అందులో ఒక ప్రసృతము కల్కము, కల్కమునకు 4 రెట్లు క్వాథ ద్రవ్యమును కలుపవలెను. ఇందులో 2 ప్రసృతములు మాంసరసము ఒక ప్రసృతము గోమూత్రమును కలుపవలెను. ఈ విధముగా మొత్తము 12 ప్రసృతములు వస్తి ద్రవ్యమగును. బుద్ధిమంతుడైన వ్యక్తికి వీటన్నిటిని ఖోంచము ద్వారా బాగా మెదిపి యథావిధి వస్తి తయారు చేసుకొనవలెను.

స్యాచ్చేద్వివక్షా ద్రవ్యాణాం ప్రక్షేపం ప్రతి కస్యచిత్ ॥ 39 ॥
తత్ర వాచ్యమిదం వ్యస్తక్రమసంయోగకారణమ్ ।

ఒక వేళ ఏ వ్యక్తికైన ద్రవ్య ప్రక్షేప విషయములో జిజ్ఞాస ఉన్నచో ద్రవ్యమును క్రిందచెప్పిన క్రమములో కలుపవలెను.

మఙ్గల్యం మఙ్గలార్థాయ మధు పూర్వం నిషిచ్యతే ॥ 40 ॥
పైచ్ఛిల్యం బహులత్వం చ కషాయత్వం చ మాక్షికే ।
భినత్తి లవణం తైక్ష్ణ్యాత్ సఙ్ఘాతం చ నియచ్ఛతి ॥ 41 ॥

మధునోఽనన్తరం తస్మాల్లవణాంశో నిషిచ్యతే ।25
తతస్తైలం వినిక్షిప్తమేకీభావాయ కల్పతే ॥ 42 ॥

కల్కః సంసృజ్యతే చాశు క్వాథశ్చ సమతాం వ్రజేత్ ।
స్నేహకల్కకషాయాణామేవం సంమూర్ఛనే కృతే ॥ 43 ॥

మూత్రం పటుత్వం కురుతే వీర్యం చోద్భావయత్యపి ।
సమ్యగేవం విమృదితః స్రోతోభ్యః కఫమారుతౌ ॥ 44 ॥

విష్యన్దయతి పిత్తం చ క్షిప్రం చైవ హరత్యపి ।
అతోఽన్యథా మృద్యమానో న శ్లేషమధిగచ్ఛతి ॥ 45 ॥

మధు మంగళకర ద్రవ్యముగా చెప్పబడినది. కావున మధు అన్నిటి కంటె మొదట వేయబడును. మధు పిచ్ఛిలత్వము బహులత కషాయత్వమును తీక్ష్ణగుణముల కారణమున లవణము నష్టపరుచును. మరియు దానిని సంఘాతము

చేయును. కావున అందులో మధు తర్వాత లవణము వేయబడును. దీని తర్వాత వేయబడు తైలము అన్ని ద్రవ్యములలో ఏకీభావము ఏకాత్మత ఉత్పన్నము చేయును. కల్కము శీఘ్రముగా సంసర్జనమగును. క్వాథము సమరూపములో నుండును. కావున స్నేహము కల్కము కషాయము ఇందులో వేయబడును. ఇందులో వేయబడిన మూత్రము దీని గుణవృద్ధిని వీర్యవృద్ధిని చేయును. ఈ విధముగా తయారు చేయబడిన వస్తి స్రోతస్సులనుండి శీఘ్రముగా త్రిదోషములను వెడలింపచేయును. దీనికి విరుద్ధముగా తయారు చేయబడిన వస్తి శ్లేష్మమును అధిగమించ లేదు.

అసమ్యఙ్మథితః శ్లిష్టో బస్తిర్నార్థాయ కల్పతే ।
తత ఏష క్రమో దృష్టో నిరూహస్యోపయోజనే ॥ **46** ॥

సరిగా మథితము చేయని పరస్పరము సరిగా కలవని వస్తి తన ప్రయోజనమును కలగజేయదు. కావున నిరూహవస్తి నిర్మాణము పై క్రమములో చెప్పబడినది.

ప్రమాణం చ ప్రకృష్టస్య ప్రసృతేర్యదుదాహృతమ్
తస్మాత్ ప్రమాణాదుత్కర్షో (వయోబలవ) దిష్యతే ॥ **47** ॥

అపకర్షస్తు కర్షస్తు కర్తవ్యః సంప్రధార్య వయోబలమ్ ।
గుణతస్తూభయత్వే తు దృష్ట్వా వ్యాధిబలాబలమ్ ॥ **48** ॥

ప్రకృష్ట ప్రసృతి ప్రమాణము చెప్పబడినది. ఈ ప్రమాణము రోగావస్థ, బలానుసారము వృద్ధి చేయవచ్చును. మాత్ర ఎప్పుడైనా రోగి అవస్థ బలానుసారము ఇవ్వవలెను. ఈ విధముగా రోగి బలాబలమును వీక్షించి వృద్ధి లేదా హ్రాసలు చేయవలెను.

ఉత్కర్షణం యదఙ్గేన తదఙ్గేనాపకర్షయేత్ ।
శీతోష్ణస్నిగ్ధరూక్షాణాం ద్రవ్యాణాముపకల్పయేత్ ॥ **49** ॥

శీత, ఉష్ణ, స్నిగ్ధ రూక్ష ద్రవ్యములలో ఏక్రమములో మాత్ర వృద్ధి చేయబడునో అదే క్రమములో తక్కువ కూడ చేయవలెను.

స్వాద్వమ్లలవణోష్ణానాముత్కర్షం నాతిమాత్రశః ।
వాతవ్యాధౌ భిషక్కుర్యాత్ స్నేహస్య తు విధాపయేత్ ॥ 50 ॥
రూక్షాణాం శీతవీర్యాణామపకర్షం చ యుక్తితః ।

వాత వ్యాధులలో మధుర అమ్ల లవణ ఉష్ణ ద్రవ్యముల మాత్రను వృద్ధి పొందించకూడదు. స్నేహమును సమావస్థలో నుంచవలెను. సూక్ష్మ శీతవీర్య ద్రవ్యములను యుక్తి పూర్వకముగా తగ్గించవలెను.

స్వాదుతిక్తకషాయాణాం వ్యాధౌ పిత్తోత్తరే భిషక్ ॥ 51 ॥
ఉత్కర్షమపకర్షం తు కుర్యాత్తీక్ష్ణోష్ణయోగ్యథా ।

పిత్త ప్రధాన వ్యాధులలలో వైద్యులు మధుర, తిక్త కషాయ ద్రవ్యముల వృద్ధి మరియు తీక్ష్ణ ఉష్ణ ద్రవ్యములను తగ్గించవలెను.

తీక్ష్ణోష్ణరూక్షద్రవ్యాణాముత్కర్షం తు కఫోత్తరే ॥ 52 ॥

కఫ ప్రధాన వ్యాధులలో తీక్ష్ణ ఉష్ణ రూక్ష ద్రవ్యములను వృద్ధి చేయవలెను.

విపర్యయం విపర్యయే గుణానాం చ ప్రకల్పయేత్ ।
సంసృష్టదోషే సంసృష్టగుణద్రవ్యాణి యోజయేత్ ॥ 53 ॥

విపరీత అవస్థలో విపరీత గుణములను వృద్ధి చేయవలెను. సంసృష్ట దోషములలో సంసృష్ట గుణములు కల ద్రవ్యములను ఇవ్వవలెను.

ఆస్థాపనం దుష్ప్రయుక్తం భవత్యాశీవిషోపమమ్ ।
సుప్రయుక్తం తదేవేహ ప్రాణినామమృతోపమమ్ ॥ 54 ॥

అస్థాపన వస్తిని సరిగా ఇవ్వనిచో అది సర్ప విష సమంగా ఉండును. సక్రమంగా ఇచ్చినచో ప్రాణులకు అమృతతుల్యమై గుణకారిగా ఉండును.

ప్రాయో యత్ర గుణాధిక్యం సమ్యగ్యోగేన లక్ష్యతే ।
తదప్రమాదం కుర్వీత బస్తికర్మణి బుద్ధిమాన్ ॥ 55 ॥

వివేకవంతుడైనవాడు సమ్యక్ యోగం ద్వారా అధిక గుణవంతములు ప్రమాద రహితమైన ద్రవ్యములను వస్తి కర్మలో ఉపయోగించవలెను.

**న హి తాదృగ్విధం కిఞ్చిత్ కర్మాన్యదుపపద్యతే ।**
**క్షిప్రం రోగాభిఘాతాయ రోగాణాం చోపపత్తయే ॥ 56 ॥**

రోగంను శీఘ్రముగా నశింపచేయుటకు మరియు కొత్తవి ఉత్పన్నం చేయుటకు ఆస్థాపన వస్తి సదృశమైనది మరియొకటి లేదు. సక్రమంగా ఉపయోగించినచో శీఘ్రముగా రోగములను నశింపచేయవలెను. విపరీతంగా ప్రయాగించినచో రోగములను శీఘ్రంగా ఉత్పన్నం చేయును.

**వ్యాధ్యాతురాగ్నిభైషజ్యబలం ప్రకృతిమేవ చ ।**
**వయః శరీరమౌచిత్యం సౌకుమార్యం సహిష్ణుతామ్ ॥ 57 ॥**

**ప్రధార్య బుద్ధ్యా మతిమాంస్తత్తత్కార్మావచారణమ్ ।**
**అవస్థాయామవస్థాయాం కుర్యాత్ సమ్యగతంద్రియః ॥ 58 ॥**

బుద్ధి మంతుడైనవాడు రోగం, అగ్ని, ఔషధం, బల, ప్రకృతి అవస్థ శరీరం, ఔచిత్యము సుకుమారత మరియొక సహిష్ణుతలను బుద్ధిపూర్వకంగా విచారించి ప్రమాదరహితముగా సమ్యక్ ప్రకారంగా ఆయా వస్థలలో ఆయా కర్మలను చేయవలెను.

**నాతిశీతం న చాత్యుష్ణం నాతితీక్ష్ణం నచేతరమ్ (త్) ।**
**నాతిరూక్షమతిస్నిగ్ధం నాతిసాంద్రం న చ ద్రవమ్ ॥ 59 ॥**
**నాతిమాత్రం న చాత్యల్పం నిరూహముపకల్పయేత్ ।**

నిరూహవస్తిప్రయోగం : అతి శీతము, అత్యుష్ణం, అతితీక్ష్ణం, అతిమృదు, అతిరూక్ష, అతిస్నిగ్ధ, అతిసాంద్ర, అతిద్రవ, అత్యధిక మాత్రలో అత్యల్ప మాత్రలో నిరూహవస్తిని ప్రయోగించకూడదు.

**అతిశీతోఽతిశైత్యేన స్కన్నో వాతబలావృతః ॥ 60 ॥**
**భృశం స్తమ్భయతే గాత్రం కృచ్ఛ్రేణ చ నివర్తతే ।**
**అత్యుష్ణః కురుతే దాహం మూర్చ్ఛాం చాశు నిరేతి చ ॥ 61 ॥**

ప్రతిదాని వేరేవేరు కారణములు అతిశీతల వస్తి - అధిక శీత కారణమున ఘనీభవించి వాయు బలవముతో ఆవృతం అగును. దానివలన శరీరవము

స్తంభించును. అది శరీరం నుండి కష్టముగా బయలు వెడలును. అతి ఉష్ణ వస్తి దాహం కలిగించును. మరియు శీఘ్రంగా మూర్ఛను కలుగచేయును.

**అతితీక్ష్ణస్తథైవాస్య జీవాదానం కరోతి వా ।**
**మందో న దోషాన్ హరతి దూషయత్యేవ కేవలమ్ ॥ 62 ॥**

అతి తీక్ష్ణవస్తి జీవరక్తమును శరీరం నుండి ప్రవహింపచేయును. అతి మందవస్తి శరీర దోషములను నశింపచేయదు. మరియు శరీరమును మరింత దూషింపచేయును.

**కర్షయత్యతిరూక్షశ్చ మారుతం చ ప్రకోపయేత్ ।**
**స్నిగ్ధోఽతిజాడ్యం కురుతే వ్యాపాదయతి చానలమ్ ॥ 63 ॥**

అతి రూక్షవస్తి శరీరమును అతి కర్షణమును చేయును. మరియు వాయువును ప్రకోపింపచేయును. అతి స్నిగ్ధమైన వస్తి జడత్వమును ఉత్పన్నం చేయును. జఠరాగ్నిని నశింపచేయును.

**క్షపయత్యతిసాంద్రస్తు న వా నేత్రాద్వినిష్క్రమేత్ ।**
**అతిద్రవోఽల్పవీర్యత్వాదయోగాయోపపద్యతే ॥ 64 ॥**

అతి సాంద్ర వస్తి - గడ్డకట్టును. మరియు వస్తినేత్రం నుండి బయటికి రాదు.

అతిద్రవవస్తి - అల్ప వీర్యం అగుటచే శరీరము నందు అయోగలక్షణములను ఉత్పన్నం చేయును.

**అల్పమాత్రో న(చా)ప్యేతి కృచ్ఛ్రాద్వాఽపి నివర్తతే ।**
**అతిమాత్రోఽతియోగాయ తస్మాదేతే విగర్హితాః ॥ 65 ॥**

అల్పమాత్రలో ఇచ్చిన వస్తి తిరిగి బహిర్గతముకాదు. లేదా కఠినంగా బహిర్గతమగును. అధికమాత్రలో ఇచ్చిన వస్తి అతియోగ లక్షణములను ఉత్పన్నం చేయును. కావున పైన చెప్పిన వస్తులన్ని నిందితములు.

**యథావన్మూర్ఛితో మృత్స్నో భోజ్యోష్ణలవణః సమః ।**
**(ఇతి తాడపత్రపుస్తకే 218 తమం పత్రమ్)**
**బాలకాష్ఠోష్ఠజిహ్వానాం యోనిదాహప్రవర్తకః ॥ 66 ॥**

సమ్యక్ ప్రకారముగా స్నేహ మూర్ఛితము చేయబడిన వస్తిని వేడి చేసి సమభాగము లవణము కలిపి సేవించినచో బల, కోష్ఠము, ఓష్ఠము, జిహ్వా, యోనిలో దాహము ఉత్పన్నం చేయదు.

శ్రోణిబస్తికటీపార్శ్వనాభిమూలోదరాశ్రితః ।
సమ్యక్సముచ్ఛ్రయం కృత్స్నం వీర్యతః ప్రతిపద్యతే ॥ 67 ॥

ఈ వస్తి శ్రోణి, వస్తి, కటి, పార్శ్వ, నాభిమూలము ఉదరములో సమ్యక్ ప్రకారముగా ఆశ్రితమైతన వీర్యము ద్వారా సంపూర్ణముగా ఊర్ధ్వ భాగము వరకు చేరును.

ఊర్ధ్వభాగైర్బలాత్ క్షిప్తో మారుతైరివ పావకః ।
పిత్తస్థానమతిక్రమ్య స్వల్పమాక్షిపతే కఫమ్ ॥ 68 ॥

శరీర ఊర్ధ్వ భాగంలో ఉన్న వాయువు ద్వారా బలపూర్వకముగా అగ్ని పిత్త స్థానం నుండి అతిక్రమించి అల్పముగా కఫమును వ్యాప్తి నొందించును.

తీక్ష్ణో మాత్రాశతాదూర్ధ్వం నాతితీక్ష్ణః (ప్రయుజ్యతే) ।
న తిష్ఠతి, మృదుస్తిష్ఠత్యధికం వాఽపి యాపనః ॥ 69 ॥

తీక్ష్ణ వస్తి 100 మాత్రల కన్నా అధికంగా శరీరం నందు నిలవదు. కావున అతి తీక్ష్ణ వస్తిని ప్రయోగించకూడదు. దీనికి విపరీతముగా మృదువస్తి శరీరము నందు చాలా కాలము వరకు ఉండును.

ఆనులోమ్యాదపానస్య గుదస్యారోపణాద్ భృశమ్
తద్ద్వితీయస్తృతీయో వా కాలమల్పతరం తథా ॥ 70 ॥
దోషాన్ స్థూలాంశ్చ సూక్ష్మాంశ్చ గమ్భీరానుగతానపి ।
విష్యన్దయతి విషక్తాన్ (ష్టబ్ధాన్) సపురీషాన్ ప్రకర్షతి ॥ 71 ॥

అపాన వాయువు అనులోమము నొందుటచే గుదమునకు అతిసమీపము నందు ఉండుటచే కొద్దిసేపటికే 2వ సారి, 3వ సారి ఇచ్చిన వస్తులు శరీరమునందు విష్టబ్ధం అయిన స్థూల, సూక్ష్మ గంభీరధాతువులలో ఉన్న దోషములను మల సహితముగా బయటకి వెడలింపచేయును.

న కుర్యాద్వ్యాపదః కాశ్చిత్ సుఖేన చ నివర్తతే ।
యుక్తో యుక్తేన భిషజా స బస్తిః సంప్రశస్యతే ॥ 72 ॥

శ్రేష్ఠవస్తి- శరీరం నందు ఎలాంటి ఉపద్రవములను ఉత్పన్నం చేయక, సుఖపూర్వకంగా శరీరం నుండి బయలు వెడలునది యోగ్య చికిత్సకుడి ద్వారా ప్రయోగించబడినది శ్రేష్ఠవస్తి.

వయసః స్థాపనో వృష్యః స్వరవర్ణబలాగ్నికృత్ ।
వాతపిత్తకఫానాం చ మలానాం చాపకర్షణః ॥ 73 ॥

బాలవృద్ధవయస్థానాం క్షిప్రమూర్జస్కరః పరమ్ ।
సర్వేంద్రియాణాం వైశద్యం కురుతే చాఙ్గమార్దవమ్ ॥ 74 ॥
ఏవమేతే సమాఖ్యాతా నిరూహస్య గుణాగుణాః ।

వస్తి వయస్థాపకం, వృష్యము, స్వరవర్ణ, అగ్ని బల వృద్ధికరం బాలురు, వృద్ధులు యువకులలో శీఘ్రమయుగా బలమును వృద్ధి నొందించును. సర్వేంద్రియములను విషదము చేయును. శరీరాంగములను మృదువుగా చేయును. ఈ విధంగా నిరూహవస్తి గుణదోషములు చెప్పబడినవి.

పురీషం మారుతః పిత్తం కఫశ్చ క్రమశో యదా ॥ 75 ॥
ప్రవర్తన్తే చ ఫేనం చ శఙ్ఖస్ఫటికసన్నిభమ్ ।
సమ్యఙ్నిరూఢగాత్రాణాం మార్దవం జనయేత్ పరమ్ ॥ 76 ॥
అన్నాభిలాషో వైశద్యం లఘుతా వాఽథ మార్దవమ్
సృష్టవిణ్మూత్రవాతత్వమింద్రియాణాం ప్రసన్నతా ॥ 77 ॥

నిరూహవస్తి సమ్యక్ యోగ లక్షణములు : పురీషము, వాయువు, పిత్తము, కఫము, క్రమంగా బయలు వెడలుట. తర్వాత శంఖము, మరియు స్ఫటిక సమాన నురుగు వెడలుట. శరీరమున అత్యంత మృదువగుట, అన్నాభిలాష, వైషద్యము, లఘుత్వము, మార్దవం కలుగుట. మల మూత్రవాతములు సరిగా వెడలుట. సమస్త ఇంద్రియములు ప్రసన్నంగా ఉండును.

అయోగే విపరీతం స్యాదతియోగేఽతివర్తనమ్ ।
కఫపిత్తాసృజాం మాంసప్రక్షాలననిభస్య వా ॥ 78 ॥

హిక్కా కమ్పస్తృషా గ్లానిర్గాత్రభేదస్తమః క్లమః ।
నిద్రానాశః ప్రలాపశ్చ యత్ర యాప్యుపజాయతే ॥ 79 ॥

**అతియోగ లక్షణములు :** నిరూహ అయోగంలో విపరీత లక్షణము లుండును. కఫ పిత్త రక్తము లేదా మాంసం కడిగిన జల సమానము అధిక మాత్రలో బయలు వెడలును. హిక్క, కఫం, తృష్ణ, గ్లాని, అంగవియోగము తమస్సు, క్లమ, నిద్రానాశము, ప్రలాపము మొదలగు లక్షణములు ఉత్పన్నం అగును.

సమ్యఙ్నిరూఢమాశ్వస్తం పరిషిక్తం సుఖామ్బునా ।
తను వా(నా) భోజయేన్మాత్రాం జాఙ్గలానాం రసేన వా ॥ 80 ॥

సరిగా నిరూహ వస్తినిచ్చిన తర్వాత రోగికి ఆశ్వాసనము ఇచ్చి కొంచెం ఉష్ణ జలముతో పరిషేచనము చేసి తగిన మాత్రలో పలుచటి జాంగల మాంసరసంతో భోజనం ఇవ్వవలెను. నిరూహవస్తిలో విరేచనము వలె అగ్నిమాంద్యం కాదు. కావున ఇందులో పేయాది సంసర్జన క్రమము అవసరం లేదు.

భుక్తవన్తం చ తైలస్య ప్రసృతేనానువాసయేత్ ।
వాయుః ప్రశామ్యతే తేన నిరూహేణ ప్రచాలితః ॥ 81 ॥

జాంగల మాంసరస భోజనం తర్వాత ప్రసృత తైలము ద్వారా అనువాసన వస్తిని ఇవ్వవలెను. దీని వలన శరీరము నందు నిరూహవస్తిచే విచలితం అయిన వాయువు శాంతించును.

ఆస్థాపనో బస్తిరయం గుదనిర్వాపణం నరః ।
ఏకాన్తరం తతశ్చోర్ధ్వం యథోక్తమనువాసనమ్ ॥ 82 ॥

నిరూహవస్తి ఇచ్చిన ఒకటి లేదా రెండు రోజుల తర్వాత గుద నిర్వాపణము చేయు అనువాసన వస్తిని చేయవలెను.

దీప్తాగ్నేర్దృఢదేహస్య సోదావర్తే విమార్గగే ।
శ్రోణివఙ్క్షణసక్తే చ వాతే శస్తం దినే దినే ॥ 83 ॥

జఠరాగ్ని, ప్రదీప్తమైన వాడికి, దృఢ శరీరునికి, ఉదావర్త వ్యాధిలో వాయువు విపరీత మార్గంలో ఉన్నపుడు మరియు శ్రోణి వంక్షణములో స్థితమైనపుడు ప్రతిదినము అనువాసన వస్తిని ఇవ్వవచ్చును.

తస్య పక్వాశయగతః స్నేహమాత్రాం ప్రభఞ్జనః ।
బలవాన్ బలవత్యగ్నౌ వారివత్ స విశోధయేత్ ॥ **84** ॥

ఆరోగికి పక్వాశయములో స్థితమైన వాయువు బలంగా ఉన్నచో జఠరాగ్ని కూడా బలంగా ఉన్నపుడు మాత్రా స్నేహమును ఇవ్వవలెను.

న చ తైలాత్ పరం కిఞ్చిద్ద్రవ్యమస్త్యనిలాపహమ్ ।
స్నేహాద్రౌక్ష్యం గురుత్వాచ్చ లఘుత్వం మారుతస్య తు ॥ **85** ॥.

ఔష్ణ్యాచ్ఛైత్యం నిహన్త్యాశు తైలం పుష్టిం కరోతి చ ।
మనఃప్రసాదః(దం) స్నేహం చ బలవర్ణమథాపి చ ॥ **86** ॥

అనువాసన వస్తి గుణములు వాయువును నశింపచేయు ద్రవ్యములలో తైలమును మించినది మరి ఒకటి లేదు. తైలము స్నేహం కావున వాయువు యొక్క రూక్షమును, గురుత్వము అగుటచే వాయువు యొక్క లఘుత్వమును ఉష్ణము అగుటచే వాయువు యొక్క శీతమును శీఘ్రంగా నశింపచేసి శరీరపుష్టిని మనోప్రసన్నత గల వర్ణములను వృద్ధి చేయును.

స్యాత్ స్నిగ్ధవిటపస్కన్ధః కోమలాఙ్కురపల్లవః ।
మూలే సిక్తో యథా వృక్షః కాలే పుష్పఫలప్రదః ॥ **87** ॥

స్నేహబస్తేర్నరస్తద్వద్ దృఢకాయో దృఢప్రజః ।
వాతా మకైవికారైశ్చ పూర్వోక్తైనాభిభూయతే ॥ **88** ॥

వృక్ష మూలమునందు నీరు పోసినచో శాఖలు కోమల అంకురములు, పల్లవములు, కొత్త ఆకులు వచ్చి ఉచితకాలములో ఫల పుష్పములు కాయును. అదేవిధంగా స్నేహవస్తి ద్వారా శరీరము దృఢమై సత్సంతానము కలుగును. పూర్వోక్త వాతవికారములు బాధించవు.

పఞ్చమూలాఢకేఽర్ధ్వర్ధం ఫలానామాఢకం భవేత్ ।
యవకోలకులత్థానాం కుడవాః స్యుస్త్రయః పృథక్ ॥ **89** ॥

చతుర్భాగావశిష్టం తు పశ్చాదష్టగుణో జలే ।
మస్తునశ్చాఢకేనైతత్తైలప్రస్థం విపాచయేత్ ॥ **90** ॥

కుష్ఠస్య శతపుష్ప్యాయా వచాయా మధుకస్య చ।
కుటజస్య చ బీజానాం బీజానాం మదనస్య చ ॥ 91 ॥

యవాన్యాః పిప్పలీనాం చ హరేణ్వా దేవదారుణః।
బిల్వస్య దేవపుష్పస్య రాస్నాయా ముస్తకస్య చ ॥ 92 ॥

సూక్ష్మైలాయాః ప్రియఙ్గ్వాశ్చ భాగైరక్షసమైః పృథక్।
సిద్ధం సులవణం పూతం నిదధ్యాద్భాజనే శుచౌ ॥ 93 ॥

ఏతన్మందనిరూఢానాం వస్తివ్యాపత్సు చోత్తమమ్।
ఫలతైలమితి ఖ్యాతముదావర్తనివర్తనమ్ 94 ॥

తథైవోదరిణాం సిద్ధం గుల్మినాం క్రిమికోష్ఠినామ్।
పృష్ఠశ్రోణ్యూరుజఙ్ఘాసు వాతేష్వప్రగుణేషు చ ॥ 95 ॥

నిరూహసాధ్యా యే కేచిద్వికారాః సముదాహృతాః।
తాఞ్జయేద్వస్తినాऽనేన మూత్రాఘాతాంశ్చ నాశయేత్ ॥ 96 ॥

**ఫల తూల నిర్మాణము ఉపయోగము :**

లఘుపంచయాలములు - 1 ఆఢకము,

మదనఫలం - 1½ ఆఢకము, యవ, కోల, కులుత్థములు

వేరు వేరుగా 3 కుడవములు, వీటిని అష్ట గుణజలములో పక్వం చేసి చతుర్థాంశ శేషముగా మిగుల్చుకొనవలెను. అందులో ఒక ఆఢకము దధి, మస్తు, 1 ప్రస్థము తిల తైలము వేయవలెను.

ఇంకా కుష్టము, శతపుష్ప, వచ, యష్టిమధు, ఇంద్రియవ, మదన ఫల, బీజము, అజామోద, పిప్పలీ, హరేణు, దేవదారు, బిల్వ, లవంగము, రాస్న, ముస్త, ఏలకులు, ప్రియంగు, ఇవి వేరు వేరుగ ఒక్కొక్క అక్షము (2 తులాలు) వేసి తైల సిద్ధము చేసికొని ఇందులో మెత్తగా దంచిన శనగలు, లవణము వేసి పరిశుద్ధమైన పాత్రలో ఉంచవలెను. ఇది ఫల తైలము అనబడును. ఈ తైలముతో విధిప్రకారం నిరూహవస్తిని ఇవ్వనచో, వారికి వస్తి కారణమున వచ్చిన ఉపద్రవములను ఉదావర్త రోగములను నశింపచేయుటలో ఉత్తమమైనది. ఇంకా

ఉదర, గుల్మ, కృమి కోష్ఠము, పృష్ఠ, శ్రోణి, ఊరు, జంఘా లలో ప్రకుపిత వాతము నిరూహ సాధ్య వ్యాధులను శమింపచేయును.

ఏరణ్డమూలత్రిఫలాబలారాస్నాపునర్నవాః ।
గుడూచ్యారగ్వధో దారు పలాశో మదనం ఫలమ్ ॥ **97** ।

మూలం తురఙ్గగన్ధాయాః పఞ్చమూలం కనీయసమ్ ।
పలప్రమాణాన్యేతాని జలద్రోణే విపాచయేత్ ॥ **98** ॥

అష్టభాగావశేషం తం పరిపూతం సమాహరేత్ ।
కర్షప్రమాణాన్యేతాని శ్లక్ష్ణపేష్యాణి కారయేత్ ॥ **99** ॥

శతాహ్వా మధుకం ముస్తా ప్రియఙ్గుర్హపుషా వచా ।
రసాఞ్జనం తార్క్ష్యశైలం పిప్పల్యః కౌటజం ఫలమ్ ॥ **100** ॥

ఖజేన మథితః కోష్ణః సతైలమధుసైన్ధవః ।
సమూత్రమాంసనిర్యూహో నిరూహః సాధుయోజితః ॥ **101** ॥

లేఖనో దీపనో బల్యో గ్రహణ్యర్శోవికారనుత్ ।
పార్శ్వపృష్ఠకటీశూలం పార్శ్వజఙ్ఘోరుజా రుజః ॥ **102** ॥

ఏరణ్డబస్తిః శమయేన్మారుతం చ కఫావృతమ్
యుక్తమాత్రోష్ణలవణః స్నేహబస్తిర్విధీయతే ॥ **103** ॥

**ఏరండవస్తి నిర్మాణము మరియు ప్రయోగము** : ఏరండమూలము, త్రిఫలా, బల, రాస్నా, పునర్నవ, గుడూచి, ఆరగ్వధము, దేవదారు, పలాశ, మదనఫల, అశ్వగంధ, లఘు పంచమూలములు ఇవన్ని ఒక్కొక్క పలము. వీటిని ఒక ద్రోణజలములో పక్వము చేయవలెను. అష్టమాంశ శేషముగా ఉన్నపుడు తీసి హపుష, వచ, తార్క్ష్యశైలముపై ఉత్పన్నమగు రసాంజనము, పిప్పలి, ఇంద్రయవ, ఈద్రవ్యములన్ని ఒక కర్షప్రమాణములో తీసికొని వాటిని సూక్ష్మంగా చూర్ణించి అందులో వేసి, బాగుగా మర్దించవలెను. వేడిగా ఉన్నపుడే తిలతైలము, మధు, సైంధవలవణము, గోమూత్రము, మాంసరసము, బాగా కలిపి నిరూహము తయారుచేసుకొనవలెను. ఈ ఏరండవస్తి లేఖనము, అగ్నిదీపనము, బల్యము, మరియు గ్రహణి, అర్శోరోగము, పార్శ్వ శోధ, పృష్ఠశోధ, కటిశూల,

పార్శ్వజంఘ, ఊరు భేదనము నశింపచేయును. ఇదే స్నేహవస్తిని యోగ్య మాత్రలో ఉష్ణము చేసి అందు లవణము కలిపి ఇచ్చినచో కఫావృత వాతమును నశింపచేయును.

> సమాసతః స ద్వివిధస్తస్య మాత్రా ప్రవక్ష్యతే।
> ప్రకుఞ్చః కన్యసీ మాత్రా, తతోఽధ్యర్ధా తు మధ్యమా ॥ **104** ॥
> (ఇతి తాడపత్రపుస్తకే **219** తమం పత్రమ్।)

> ఉత్తమా ద్విపలా మాత్రా మాత్రాబస్తౌ తు భార్గవ।
> అపస్తనస్యార్ధపలం (లాఽ)పరిహార్యా నిరత్యయా ॥ **105** ॥

సంక్షిప్తంగా స్నేహవస్తి 2 రకములుగా ఉండును. దాని మాత్ర వర్ణించబడును. ఓ భార్గవా మాత్రావస్తి లో హ్రస్వమాత్ర 1 ప్రకుంచము. మధ్యమమాత్ర 1½ ప్రకుంచము, ఉత్తమమాత్ర 2 పలములు. పాలుత్రాగని బాలునికి ఇది అర్ధపలము. దీనిని నిస్సంకోచముగా అన్ని అవస్థలలో ప్రయోగించవచ్చును. ఇందులో ఎలాంటి ఉపద్రవం ఉండదు.

> కర్షత్రయం త్రివర్షస్య, చతుర్వర్షస్య వై పలమ్।
> షడ్వర్షస్య తు బాలస్య స్వ ఏవ ప్రసృతః స్మృతః ॥ **106** ॥

> ద్వౌ ద్వౌ ద్వాదశవర్షాణాం చత్వారః ప్రసృతాస్తథా।
> దేయాః షోడశకాదీనాం పూర్వాహ్ణే వాఽన్తరేషు చ ॥ **107** ॥

> యావన్మధ్యం వయో, వార్ధే త్వపకర్షేద్యథాక్రమమ్।
> సమీక్ష్య దేహదోషాగ్నిబలం ప్రకృతిమేవ చ ॥ **108** ॥

స్నేహవస్తి, నిరూహవస్తి మాత్ర- 3 సంవత్సరముల బాలునికి స్నేహవస్తి మాత్ర 3 కర్షములు. 4 వర్షముల బాలునికి 1 పలము, 6 సం॥ బాలునికి 1 ప్రసృతము 12సం॥ బాలునికి 2 ప్రసృతములు. 16 సం॥ మొదలుకొని మధ్యమావస్థవరకు పూర్వాహ్నము, దాని మధ్యమధ్యలో 4 ప్రసృతముల మాత్రనివ్వాలి. వృద్ధావస్థలో రోగి శరీరదోష అగ్నిఫలము ప్రకృతిని చూసి మాత్రను యథాక్రమంగా తగ్గించాలి.

స్నేహప్రమాణం యద్వస్తౌ నిరూహాస్త్రిగుణస్తతః ।
అతివ్యవాయవ్యాయామపానయానాధ్వసజ్జినః ॥ 109 ॥
వయస్థాః స్నేహసాత్మ్యాశ్చ యేషాం చాగ్నిబలం దృఢమ్ ।
యేషాం చాధః ప్రకుపితో వాయుర్వాతాత్మకాశ్చ యే ॥ 110 ॥
తేషూత్తమాం ప్రణిదధేత్ స్నేహమాత్రాం విచక్షణః ।
య ఏభ్యో మధ్యమావస్థాః పురుషాస్తేషు మధ్యమామ్ ॥ 111 ॥
వయోవ్యాధిబలావేక్షామితరామితరేషు చ ।
ఇతి కర్మాదిబస్తీనాం త్రితయం సముదాహృతమ్ ॥ 112 ॥

స్నేహ ఉత్తమ మాత్ర ఎవరికివ్వవలెను? అతిమైథునం, వ్యాయామము, మద్యపానము, మార్గగమనము చేయువాడు, స్థిరమైన ఆయువు కలవాడు, స్నేహసాత్మ్యము కలవాడు, జఠరాగ్ని దృఢముగా ఉన్నవాడు, అథోభాగమున వాయువు కోపించినవాడు వాత ప్రకృతి కలవాడు, వాత గుల్మము కలవాడు. వీరికి స్నేహం ఉత్తమ మాత్రలో ఇవ్వవలెను. పైన చెప్పిన విషయములో మధ్యస్థముగా ఉన్నవాడికి మధ్యమమాత్రలో ఇవ్వవలెను. అవస్థ, రోగము, బలము నికృష్టముగా ఉన్నవాడికి హీనమాత్రలో ఇవ్వవలెను. ఈ విధముగా కర్మ, కాల, యోగములను అనుసరించి వస్తి 3 విధములుగా చెప్పబడినది.

నిర్దేశశ్చ వికల్పశ్చ ప్రవిభాగశ్చ కార్త్స్న్యతః ।
యచ్చ యస్మిన్ విధాతవ్యం యా మాత్రా యేషు యుజ్యతే ॥ 113 ॥
నిరూహయుక్తిః స్నేహశ్చ నిరూహశ్చ ప్రకీర్తితః ।
ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 114 ॥ అడ (111)

ఈ సమస్త వస్తుల గురించి నిర్దేశము వికల్పము, విపాకము చెప్పబడినది. ఏవసిన్తి ఎవరికి ఇవ్వవలెనో చెప్పబడినది. సమస్త నిర్మాణము చెప్పబడినది. అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

ఇతి ఖిలేషు వస్తివిశేషణీయో (నామాష్టమోధ్యాయః ॥ 8 ॥)

వస్తి విశేషణీయాధ్యాయము సమాప్తం.

# రక్త గుల్మ వినిశ్చయాధ్యాయః - నవమః

అథాతో రక్తగుల్మవినిశ్చయమధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ **1** ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ **2** ॥

ఇపుడు మనము రక్త గుల్మ అధ్యాయమును వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

భగవన్తమృషిశ్రేష్ఠం సర్వశాస్త్రవిదాం వరమ్ ।
కశ్యపం భార్గవో ధీమాన్ పర్యపృచ్ఛత్ ప్రజాపతిమ్ ॥ **3** ॥

ఐశ్వర్య యుక్తుడు సంపూర్ణ శాస్త్ర జ్ఞాత ఋషులలో శ్రేష్ఠుడైన ప్రజాపతి కశ్యపునితో బుద్ధిమంతుడైన భార్గవుడు ఈ విధముగా ప్రశ్నించెను.

రక్తగల్మః కథం స్త్రీణాం జాయతే దురుపద్రవః ।
అథ కస్మాత్ కుమారాణాం కన్యానాం చ న జాయతే ॥ **4** ॥

రక్తగుల్మః కథం చాసౌ రక్తగుల్మ ఇతి స్మృతః ।
కస్మాన్నిశ్చేతనత్వేఽపి గర్భచేష్టా విచేష్టతే ॥ **5** ॥

దూరాన్తరం న త్వనయోశ్చేతనాచేతనావతోః ।
విప్రకృష్టాన్తరేఽప్యస్మిన్ గర్భశోణితగుల్మయోః ॥ **6** ॥

కేచిద్విశేషం నేచ్ఛన్తి కేచిదిచ్ఛన్తి లిఙ్గతః ।
తయోర్విశేషో యద్యస్తి కిమర్థం స ఉపేక్ష్యతే ॥ **7** ॥

యుక్తో గర్భే దోహదస్య క్షీరస్య చ సముద్భవః ।
ఆపాణ్డుగణ్డతాదీనాం లిఙ్గానాం చ సముద్భవః ॥ 8 ॥
న యుక్తమివ పశ్యామి తస్మిన్నేషాం సముద్భవమ్ ।
రక్తగుల్మేఽథ దృశ్యన్తే లిఙ్గాన్యేతాని తత్ కథమ్ ॥ 9 ॥
కస్మాదాదశమాన్మాసాత్ పరిపాకం నియచ్ఛతి ।
ఏకద్విత్రిచతుష్పఞ్చషట్సప్తాష్టనవాదిషు ॥ 10 ॥
మాసేషు భేదం నాప్నోతి ప్రాయో గర్భవదాస్థితః ।
నారీణాం సుకుమారీణాం స కష్ట ఇతి మే మతిః ॥ 11 ॥
ఉపక్రమ్యః కథమయం కస్యాస్యోపక్రమః స్మృతః ।
కస్యాం కస్యామవస్థాయాం కా కా వాఽస్యావచారణా ॥ 12 ॥
కస్మిన్ కాలే చ నిర్భేద్యో భేదనీయం చ కిం భవేత్ ।
వినిర్భిన్నే చ కిం కార్యమేతదాచక్ష్వ మే విభో ॥ 13 ॥

స్త్రీలలో భయంకర ఉపద్రవ రూపమైన రక్తగుల్మము ఏ విధముగా ఉత్పన్నము అగును? ఇది బాలకులలో ఎందుకు రాదు? రక్తగుల్మము అని దీనికి ఎందుకు పేరు? అచేతనమైనప్పటికి ఇందులో గర్భచేష్టలు ఎందుకుండును? ఇందులో చేతన అచేతన గర్భము రక్తగుల్మములలో స్వల్ప భేదమైనప్పటికి అధికమైన భేదము కాదు. కొందరు ఈ రెంటిని వేరుగా పరిగణించరు. కొందరు లక్షణముల ద్వారా వేరువేరుగా చెప్పుదురు. ఈ రెంటిలో భేదమున్నచో ఎందుకు ఉపేక్షచేయుదురు? ఇందులో గర్భములో ఉండు దౌహృద, స్తన దుగ్ధ ఉత్పత్తి పాండుత్వము మొదలగు లక్షణములు ఉత్పన్నం అగును. రక్తగుల్మంలో ఈ లక్షణము ఉండకూడదు. మరి ఎందుకు కనపడతాయి? ఇది 10 నెలవరకు ఎందుకు పరిపక్వం చెందుతుంది? 1,2,3,4,5,6,7,8,9 ఈ నెలల్లో దీని భేదన ఎందుకు కాదు? ఇది ఎందుకు గర్భం వలె ఉండును? సుకుమార స్త్రీలలో ఇది అధిక కష్ట దాయకంగా ఉండును. ఇందులో ఎలాంటి చికిత్స చేయవలెను? అది ఏమి? ఏయే అవస్థలో ఏయే చికిత్స చేయవలెను? ఎపుడు దీని భేదన చేయవలెను? భేదన ద్రవ్యములు ఏవి? భేదన చేసిన తర్వాత ఏమి చేయవలెను?

ఓ సర్వవ్యాపి భగవాన్! నా ఈ ప్రశ్నలకు సమాధానం ఇవ్వగలవు.

> ఇతి పృష్టః స శిష్యేణ ప్రోవాచ వదతాం వరః ।
> రక్తగుల్మస్తు నారీణాం జాయతే యేన హేతునా ॥ 14 ॥
> యేన చైవ కుమారాణాం కన్యానాం చ న జాయతే ।
> తత్ సర్వమభిధాస్యామి విస్తరేణ నిబోధ మే ॥ 15 ॥

ఈ విధముగా ప్రశ్నించబడిన జ్ఞాని అయిన కశ్యపుడు స్త్రీలలో ఏవిధముగా రక్తగుల్మము వచ్చునో ఏకారణమున బాలురలో కన్యలలో రాదో అన్ని విషయములను విస్తారముగా వర్ణించెదను వినుము, అని చెప్పెను.

> విణ్మూత్రక్రిమిపక్వామకఫవాతాశయాః పృథక్ ।
> సప్తైతే దేహినాం కోష్ఠే స్త్రీణాం గర్భాశయోఽష్టమః ॥ 16 ॥

అన్ని ప్రాణుల కోష్ఠములో మల, మూత్ర, కృమి, పక్వ, ఆమ, కఫ, వాయు, అను ఏడు ఆశయములు ఉండును. ఇవేకాక స్త్రీలలో 8 వది గర్భాశయము ఉండును. ఇందులో అధోవహ స్రోతస్సులు రజస్సును తెచ్చును.

> రజోవహాః సిరా యస్మిన్ రజః ప్రవిసృజన్త్యతః ।
> పుష్పభూతం హి తద్దైవాన్మాసి మాసి ప్రవర్తతే ।
> విపర్యయాత్తదేవేహ తత్రైవ తు నిచీయతే ॥ 17 ॥

దైవ వశమున ఈ రజస్సు పుష్ప రూపములో ప్రతిమాసం వ్యక్తమగును. ఏదైనా వ్యాధి వలన కాని అన్యకారణములచే వ్యక్తము కానిచో ఆరజస్సు గర్భాశయంలోనే సంచితము అగును.

> అనేన హేతునా స్త్రీణాం రక్తగుల్మో హి జాయతే ।
> తదాశయస్య చాభావాత్ పురుషాణాం న జాయతే ॥ 18 ॥

పై చెప్పిన కారణలముల వలన స్త్రీలలో రక్త గుల్మము ఉత్పన్నమగును దీనికి విరుద్ధముగా పురుషులలో గర్భాశయ అభావము వలన రక్త గుల్మము కల్గనేరదు.

> హీనయోన్యాస్తు బాలాయాః కాయం గచ్ఛతి శోణితమ్ ।

**అథ పూర్ణస్వభావాయాః కాయం యోనిం చ గచ్ఛతి ॥ 19 ॥**

బాలికలలో యోని స్వల్పముగావున రక్తము శరీరమునందే ఉండును. శరీరావయవములు సంపూర్ణముగా వృద్ధి పొందిన స్త్రీలలో రక్తము శరీరమునందు యోని యందును ఉండును.

**గర్భమజ్జే భావయతి, కిఞ్చిత్ స్తన్యాయ కల్పతే ।**
**పక్తయే శోణితాద్య(దే)స్తు శేషః కాయం సమిన్ధతి ॥ 20 ॥**

స్త్రీలలో రక్తము కొంత గర్భమును, మరికొంత స్తన్యమును పోషించును. మిగిలినది శరీరమునందు ప్రసరించును.

**తథైవ గర్భః సూతాయాః సద్యః స్తన్యాయ కల్పతే ।**
**శేషం తు రుధిరీభూతం కాయం యోనిం చ సర్పతి ॥ 21 ॥**

ఈ విధముగా గర్భము యొక్క కొంతభాగము ప్రసవానంతరము శీఘ్రముగా క్షీర నిర్మాణము చేయును. మిగిలినది శరీరమునందు యోనియందు వ్యాపించును.

**ధాతుషు ప్రతిపూర్ణేషు శరీరే సమవస్థితే ।**
**సంచితం రుధిరం యోనిః పునః కాలేన ముఞ్చతి ॥ 22 ॥**

అప్పుడు ధాతువులు రక్తము పూర్ణమగుటచే శరీరము సమావస్థలో నున్నపుడు సంచితమైన రక్తము తిరిగి సకాలములో యోనిని వదిలి బహిర్గతమగును.

**యదా రక్తవహో రక్తం ప్రదోషాన్నానుపద్యతే ।**
**విమార్గాద్యోనిమన్వేతి (వికృతి)స్తేన జాయతే ॥ 23 ॥**
**తథైవ రక్తగుల్మోఽపి హేతునాఽనేన జాయతే ।**

దోషముల వలన ఆ రక్తము రక్తవహాసిరలను చేరక అప్పుడది విపరీత మార్గములో పోవుటచే తిరిగి యోనిలో చేరును. తద్వారా వికారములనుత్పన్నము చేయును. ఈ విధముగా పై కారణమున రక్త గుల్మము కూడ ఏర్పడును.

**యదా ఋతుమతీ నారీ ప్రాప్తాన్ వేగాన్ విధారయేత్ ॥ 24 ॥**

హ్రియా త్రాసాద్వ్యవాయాద్వా వర్తమానానధోగతాన్।
ఏవమాదిభిరప్యన్యైరుదావృత్తైః ప్రకోపితః ॥ 25 ॥

వాయుః శోణితమాదాయ ప్రతిస్రోతః ప్రపద్యతే।
గర్భాశయముదావృత్తస్తస్యా వహతి శోణితమ్ ॥ 26 ॥

మారుతశ్చ్యుతగర్భాయా యదా మిథ్యోపచర్యతే।
తస్యాః స వాయురుద్వృత్తః ప్రతిఘాతాత్ సశోణితః ॥ 27 ॥
గత్వా గర్భాశయం రుద్ధః స్థిరత్వముపపద్యతే।
సంవృత్తం శోణితం తత్ర మారుతో విషమం గతః ॥ 28 ॥
రజోవహాః సమావృత్తః సంస్తమ్భయతి గర్భవత్।

ఋతుకాలములో స్త్రీ లజ్జా భయ మైథున కారణములచే శరీర అధోభాగములలో కలుగు వేగములను నిరోధించినచో ఉదీర్ణమైన ప్రకుపిత వాయువు దూషిత రక్తమును స్రోతస్సులలో తీసికొని వెళ్లును. గర్భాశయములో చేరి ఆ రక్తము వృద్ధిచెందును. లేదా సద్యః గర్భపాతమైన వారికి వాతము మరియు మిథ్యోపచారము వలన ప్రకోపించును. ప్రకోపించిన వాయువు రక్త సహితము గర్భాశయమునందు నిల్చిపోవును. ఈ రక్తవాతములో రజోవహ సిరలను ఆక్రమించి గర్భమువలె వృద్ధి చెందును.

స గుల్మః స్పన్దతేఽభీక్ష్ణం మారుతేన సమీరితః ॥ 29 ॥
దర్శయన్ యాని రూపాణి తాని వక్ష్యామి సర్వశః।

వాయువుతో ప్రేరితమైన గుల్మము నిరంతరము స్పందించును. దాని స్వరూప లక్షణములు విస్తారముగా చెప్పెదను.

కాసతే శూల్యతే చైవ జ్వర్యతేఽథాతిసార్యతే ॥ 30 ॥
మన్యతే సర్వగాత్రాణి మూర్ఛితాని గురూణి చ।
తమోఽస్యా జాయతేఽభీక్ష్ణం కార్శ్యం చైవ నిగచ్ఛతి ॥ 31 ॥
వమత్యభీక్ష్ణశో భుక్తమన్నం చాస్యై న రోచతే।
జాయన్తే చోదరే గణ్డా నీలం చాస్యాః ప్రదృశ్యతే ॥ 32 ॥

స్తనాన్తరం చ నాభిశ్చ లోమరాజీ చ మూర్ఛితా ।
ఓష్ఠౌ చ కృష్ణౌ భవతస్తథైవ స్తనచూచుకౌ ॥ 33 ॥
పయోధరౌ ప్రసిచ్యేతే దోహదం చ నిగచ్ఛతి ।
(ఇతి తాడపత్రపుస్తకే 220 తమం పత్రమ్)
నానారమాన్ ప్రార్థయతే నిష్ఠీవతి ముహుర్ముహుః ॥ 34 ॥
శుభాదుద్విజతే గన్ధాద్వర్ణశ్చాస్యాః ప్రసీదతి ।
గర్భిణ్యా యాని రూపాణి తాని సందృశ్య తత్త్వతః ॥ 35 ॥
వర్షాణి హరతి వ్యాధిం గర్భోఽయమితి దుఃఖితా ।

రక్తగుల్మ లక్షణములు - కాస, శూల, జ్వర, అతిసారము, సర్వ శరీరము మూర్ఛితము బరువుగా ఉండును. కళ్ళముందు చీకటి కనిపించును. లేదా తమోగుణము వృద్ధి చెందును. శరీరము కృశించి నిరంతరము వమనం కలుగును. భుజించిన ఆహారం రుచించదు. ఉదరము నందు గడ్డలు ఏర్పడి శరీరం నీలంగా మారును. స్తనమధ్య భాగము నాభి రోమరాజి మూర్ఛితముగా కనిపించును. ఓష్ఠములు, స్తన చూచుకముల నలుపుగా మారును. స్తనములనుండి క్షీరము ఉత్పన్నం అగును. దౌహృద లక్షణములు ఉత్పన్నం అగును. నానావిధములైన అమ్లాది రసములను కోరును. మాటి మాటికి ఉమ్మివేయును. వర్ణము నిర్మలముగా ఉండును. సుగంధము సహించదు. మొదలగు గర్భిణీ లక్షణములను చూచి అనేక సంవత్సరముల వరకు ఈ వ్యాధిని గర్భముగా అనుకొని దుఃఖింతురు.

కేనచిత్త్వథ కాలేన నిర్భేదం యది గచ్ఛతి ॥ 36 ॥

ఏ కారణమునైనా ఈ గుల్మము భేదనం అయినచో గుల్మముతో ముక్తి పొందినట్లుగా భావింతురు.

తతో గుల్మప్రముక్తా సా జ్ఞాతిమధ్యే ప్రభాషతే ।
గర్భిణ్యాహం చిరం భూత్వా ప్రచ్యుతే గర్భశోణితే ॥ 37 ॥

ఈ స్త్రీ ఈ విధముగా చిరకాలము గర్భిణిగా ఉండి తరువాత గర్భస్థ శోణితము బహిర్గతం అయినపుడు గర్భలక్షణములు కానరావు. అపుడు స్త్రీకి సందేహము కలుగును.

గర్భరూపం న పశ్యామి తత్ర మే సంశయో మహాన్ ।
తామిదం ప్రతిభాషన్తే సర్వగ్రామకుతూహలామ్ ॥ 38 ॥
దివ్యో గర్భో వ్యతిక్రాన్తో నైగమేషేణ తే హృతః ।
ఇత్యేనామబుధాః ప్రాహుర్హృతం సర్వమశోభనమ్ ॥ 39 ॥
పరిప్లుత ఇతి ప్రాహుః కుశలా యే మనీషిణః ।

ఈ ఆశ్చర్యజనకమైన విషయాకాంచి అజ్ఞానులు ఆస్త్రీతో దివ్యగర్భము ఉత్పన్నం అయి నైగమేషము దానిని హరించినదని చెప్పెదరు. అశుభ విషయములన్ని హరణమయినవి. జ్ఞానులు దీనిని పరిప్లుత అందురు.

గుల్మశ్చయ ఇతి ప్రోక్తో రక్తం రుధిరముచ్యతే ॥ 40 ॥

రక్తస్య సంచయస్తేన రక్తగుల్మ ఇతి స్మృతః ।
గర్భవచ్చేష్టతే నాయం కింతు సాదృశ్యదర్శనాత్ ॥ 41 ॥

గుల్మము అనగా సమూహము, రక్తమనగా రుధిరము ఈ విధముగా రక్త సంచయము జరుగుటచే దీనిని రక్త గుల్మం అందురు. ఇది గర్భము వలె గోచరించును. కాని ఇది వాస్తవముగా గర్భము కాదు.

గర్భోఽయమితి మన్వానా మనసా తద్విభావినీ ।
నారీ విచేష్టతే తాస్తా గర్భచేష్టాః పృథగ్విధాః ॥ 42 ॥

ఈ రక్త గుల్మమును గర్భముగా భావించి దానిని మనసులో ధ్యానించి స్త్రీ నానావిధ గర్భ చేష్టలు చేయును.

దోహదం యత్ కరోతీతి శృణు తత్రాపి కారణమ్ ।
య ఏవ హి రసాః ప్రాయో ధాతూనాం వృద్ధిహేతవః ॥ 43 ॥
తేషామేవాభిలాషః స్యాద్యోనిసాధర్మ్యతత్త్వతః ।
వాతపిత్తాన్వితం రక్తం చీయమానం వికారవత్ ॥ 44 ॥
కట్వామ్లలవణాదీనాం రసానాం వృద్ధిమావహేత్ ।

**రక్త గుల్మములో దౌహృద కారణములు :** దౌహృదకారణములు నానుండి వినుము. రసధాతువులను వృద్ధి పొందించునది ఉత్పత్తి ధర్మ సమానత్వం వలన అవే రసముల యొక్క ఇచ్ఛను కలిగించును. ఉదాహరణమునకు ఉత్పన్నం అయిన

గుల్మములను ఉన్న దూషిత రక్తమును వాతపిత్త ప్రాధాన్యముగా ఉన్నచో ఆ స్త్రీకి కటు అమ్ల లవణ రసములందు ఇచ్ఛకలుగును.

గర్భిణ్యస్మీతి తస్త్రీతి ప్రేమసంకల్పసంభృతః ॥ 45 ॥
ప్రస్రుతో జాయతే నార్యాస్తేన స్తన్యం ప్రవర్తతే ।

రక్త గుల్మము నందు స్తన్యోత్పత్తి కారణము- స్త్రీ తనకుతాను గర్భిణీగా భావించును. కావున ఈ కల్పితం అయిన ప్రేమ సంకల్పం వలన స్త్రీలు స్తన్యము స్రావము నొందును.

సర్వా రసవహా నాడ్యః సమన్తాన్నాభిమాశ్రితాః ॥ 46 ॥
గర్భో వివర్ధమానశ్చ సంపీడయతి తాః స్త్రియాః ।
తద్వచ్చ రక్తగుల్మోఽపి పీడయన్నుపచీయతే ॥ 47 ॥
తాభిశ్చ పీడ్యమానాభిర్న సమ్యగ్వర్తతే రసః
ఆపాణ్డుగణ్డతాదీని లక్షణాని భవన్త్యతః ॥ 48 ॥

రక్తగుల్మంలో పాండుత్వ కారణము - సమస్త రసవహా నాడులు నలువైపులనుండి వచ్చి నాభిలో ఆశ్రిత అగును. స్త్రీలో వృద్ధి పొందుతున్న గర్భము ఆరసవహా-నాడులను పిండి వేయును. అదే విధముగా రక్తగుల్మంలో రసవహానాడుల పీడనము కారణమున వృద్ధిపొందు చుండును. శరీరంలో రసప్రసరణము సరిగా జరగదు. పాండుత్వం, గండత మొదలగు లక్షణములు కలుగును.

కథం ప్రకర్షతే కాలమితి తత్రాపి మే శృణు ।
వివృద్ధేరిహ సారూప్యాద్గర్భోఽయమితి నిశ్చితా ॥ 49 ॥
సంరక్షతేఽభిఘాతేభ్యః కుక్కుట్యణ్డమివాఙ్గనా ।
తదపాయకరాన్ హేతూన్న కథంచన సేవతే ॥ 50 ॥
శ్రమోపవాసతీక్ష్ణోష్ణక్షారాదీని చ సర్వశః ।
స ఏవం యాప్యమానస్తు యథాకాలం ప్రకర్షతే ॥ 51 ॥
వ్యాపత్తిహేతుమాసాద్య కాలేనాల్పేన వా పునః ।
భేదం గచ్ఛత్యథస్తాద్ధి జలకుమ్భ ఇవ క్షతః ॥ 52 ॥

రక్త గుల్మము ఏ విధముగా వృద్ధి పొందునో నానుండి వినుము. వృద్ధి అను సమాన కారణముతో స్త్రీ గర్భముగా భావించి కోడి తన గుడ్లను కాపాడినట్లు

అభిఘాతాదుల నుండి హాని కలిగించు కారణములను శ్రమ ఉపవాసము, తీక్ష్ణ, ఉష్ణ, క్షీర ద్రవ్యమును తక్కువగా సేవించును. ఈ విధముగా రక్షించుకొనును. కావున రక్తగుల్మము మెల్లగా వృద్ధి చెందును. ఉపఘాతకర భావముల ద్వారా కొంతకాలము తర్వాత జలకుంభం కింద పగిలినట్లు రక్తగుల్మ భేదము జరుగును.

కేచిదిచ్ఛంతి గుల్మస్య మాసాదాదశమాత్ పరమ్ ।
పరిపాకం ఫలస్యేవ స్వకాలపరిణామతః ॥ **53** ॥

తస్మింశ్చ కాలే స వ్యాధిః స్యాన్నాతిదురుపక్రమః ।
తత్రోపక్రమమిచ్ఛంతి తస్య కర్తుమతో బుధాః ॥ **54** ॥

కొందరు ఫలముతో సమానముగా గుల్మము తన పరిణామము అనుసారముగా 10వ నెల పరిపక్వము చెందునని చెప్పెదరు. ఆ సమయంలో రక్త గుల్మము అధిక కష్టసాధ్యముగా ఉండదు. కావున విద్యావంతులైన వారు ఆ విధముగా చెప్పెదరు.

అప్రాప్తకాలో యాప్యః స్యాద్గర్భవద్యక్తికోవిదైః ।
నాపక్వో భిద్యతే వ్యాధిరితి మత్వా యథాభవమ్ ॥ **55** ॥

రక్త గుల్మ చికిత్స 10వ మాసము వరకు గర్భము వలె యాప్యముగా చెప్పబడినది. పక్వం అయిన తర్వాత దాని భేదనం అగును.

విశేషం రక్తగుల్మస్య గర్భస్య చ నిబోధ మే ।
అఙ్గప్రత్యఙ్గవాన్ గర్భస్తైరేవ చ విచేష్టతే ॥ **56** ॥
రక్తగుల్మస్తు వృత్తః స్యాల్లోష్టవచ్చ విచేష్టతే ।
స్థానాత్ స్థానం వ్రజన్ గర్భో వ్యావిద్ధం పరివర్తతే ॥ **57** ॥
నాభేరధస్తాద్గుల్మోఽయమవ్యావిద్ధం వివర్తతే ।
ఆనుపూర్వేణ గర్భశ్చ అహన్యహని వర్ధతే ॥ **58** ॥
విపరీతం హి గుల్మస్తు మందం మందం వివర్ధతే ।
తాం తామవస్థాం గర్భస్తు మాసి మాసి ప్రపద్యతే ॥ **59** ॥
గర్భిణీ నానిమిత్తం చ జ్వర్యతే దహ్యతేఽపి వా ।
గుల్మినీ హ్యానిమిత్తం తు జ్వర్యతే దహ్యతేఽపి వా ॥ **60** ॥

ఇపుడు రక్త గుల్మము మరియు గర్భము యొక్క భేదములు వినుము.

1. గర్భము అంగ ప్రత్యంగములతో కూడి ఉండి తద్వార చేష్టలు కలిగి ఉండును. రక్తగుల్మము గుండ్రటి మాంసపు ముద్దవలె ఉండి తత్సమానముగా చేష్టలు కలిగి ఉండును. గర్భము ఒక స్థానము నుండి ఒక స్థానమునకు పోయినట్లుగా గోచరించును. కాని గుల్మము నాభిక్రింది భాగము అవ్యావిద్ధముగా ఉండును.
2. గర్భము ప్రతిదినము వృద్ధి పొందుచుండును. గుల్మము చాలా వృద్ధి చెందును. గర్భము ప్రతి మాసము వివిధ అవస్థలను పొందుచుండును. గర్భిణికి అకారణముగా జ్వర దాహములు కలగవు. కాని గుల్మములో అకారణముగా జ్వరదాహములు ఉత్పన్నం అగును.

**అస్మిన్ విశేషేఽపి సతి సందేహో జాయతే మహాన్ ।**
**నానాగర్భవికారాణాం సఙ్కరాద్భిషజే మతః ॥ 61 ॥**

పై చెప్పిన భేదములు ఉన్నప్పటికి గర్భ సంబంధము అగు వికారములు కలిసి ఉండుటచే వైద్యునకు పెద్ద సందేహము కలుగును.

**సంభూయ సహ సంమన్త్ర్య భిషగ్భిః శాస్త్రకోవిదైః ।**
**కాలే చికిత్సాం కుర్వీత యథా వక్ష్యామ్యతః పరమ్ ॥ 62 ॥**

**అల్పాన్తరావుభావేతౌ గర్భో గుల్మశ్చ రక్తజః ।**
**తద్యథావద్విదిత్వాఽఽదౌ క్రియాం కుర్యాద్భిషగ్వరః ॥ 63 ॥**

కావున శాస్త్రజ్ఞులైన వైద్య సమూహము ఏకత్రితమై పరస్పర తర్కముతో విచారించి రక్తగుల్మమును చికిత్సించవలెను. నేను ముందు చెప్పినట్లుగా గర్భంలో రక్తగుల్మంలో అతి తక్కువ భేదము ఉండును. కావున మొదట బాగా తెలిసికొని చికిత్స చేయవలెను.

**యో హి గుల్మే గర్భ ఇతి గర్భే వా గుల్మ ఇత్యపి ।**
**క్రియాం కుర్యాదయశసా ఏనసా చైవ యుజ్యతే ॥ 64 ॥**

**అతస్తు సంశయే జాతే కుర్యాత్ సాధారణీః క్రియాః ।**
**నోపక్రమేదవిదితం రోగం కశ్చిచ్చికిత్సకః ॥ 65 ॥**

గుల్మం నందు గర్భ చికిత్స గర్భం నందు గుల్మచికిత్స చేయువాడు అపకీర్తి మరియు పాపమును పొందువాడగును. కావున గుల్మ, గర్భముల పరస్పర సంశయమున్నపుడు సాధారణ చికిత్స చేయవలెను. అజ్ఞాత గుల్మరోగికి చికిత్స చేయకూడదు.

అథ కాలే త్వసంపూర్ణే సందిగ్ధే చాపి దర్శనే ।
హేతునా కేనచిద్రక్తం స్రవేత్తం చాశు వారయేత్ ॥ **66** ॥
పూర్ణే ప్రసవకాలే తు న రక్తం ప్రతివారయేత్ ।
తత్రానువాసనం దద్యాద్ ద్రవం స్నిగ్ధం చ భోజనమ్ ॥ **67** ॥

ఏ కారణము చేతనయినా పూర్తి సమయం కాక ముందే రక్తము వచ్చి దానితో పాటు గర్భమా గుల్మమా అను సందేహమున్నపుడు వెంటనే ఆరక్తమును స్తంభింపచేయవలెను. ఒకవేళ ప్రసవ సమయము పూర్తయినచో ఆ రక్తము స్తంభింపచేయకూడదు. ఆ అవస్థలో అనువాసన వస్తి ద్రవస్నిగ్ధ భోజనమును చేయించవలెను.

విధినాఽనేన గర్భశ్చేత్ సుఖేన ప్రసవిష్యతి ।
అథవా రక్తగుల్మః స్యాత్ సోఽప్యకృత్స్నేన భేత్స్యతే ॥ **68** ॥
ఏతస్మాత్ కారణాద్రక్తం ప్రవృత్తం న నివార్యతే ।

పై చెప్పిన విధిచే గర్భమైనచో సుఖపూర్వకముగా ప్రసవము జరుగును. రక్తగుల్మమైనచో పూర్తిగా భేదనమగును. కావున 10వ మాసానంతరము రక్తస్రావమును ఆపకూడదు.

రక్తగుల్మే ప్రథమతో యుక్త్యా స్నేహోపపాదనమ్ ॥ **69** ॥
శస్తం బాహుసిరాయాశ్చ వేధనం పాకవారణమ్ ।
తథా శంశమనీయం చ దోషశేషావకర్షణమ్ ॥ **70** ॥

రక్తగుల్మములో మొదట యుక్తి పూర్వకముగా స్నేహనము చేయవలెను. గుల్మ పక్వము కొరకు బాహువు నందు సిరావేధనము చేయవలెను. శేషదోషమును తొలగించుటకు సంశమన చికిత్సను ప్రయోగించవలెను.

కల్యాణకం పఞ్చగవ్యం షట్పలం తిక్తమేవ వా ।
సరుజాం పాయయేన్నారీం దోషవిత్ కర్మకోవిదః ॥ **71** ॥

తీక్ష్ణైరాస్థాపయేదేనాం యుక్తితశ్చానువాసయేత్ ।
పథ్యాని భోజయేచ్చైవ క్షీరయూషరసాదిభిః ॥ 72 ॥

దోష మరియు చికిత్స కర్మలను తెలుసుకొనుటకు ఆ స్త్రీకి కళ్యాణక, పంచగవ్య, షట్పల లేదా తిక్తక ఘృతమును పానము చేయించవలెను. తీక్ష్ణద్రవ్యముల ద్వారా ఆస్థాపన వస్తినిచ్చి యుక్తి పూర్వకముగా అను వాసన వస్తి నివ్వవలెను. పాలు, యూష, మాంస రసాదుల ద్వారా పథ్య భోజనము నివ్వవలెను.

అన్నపానాని రూక్షాణి విదాహీని గురూణి చ
వ్యాయామం మైథునం చిన్తాం గుల్మినీ తు వివర్జయేత్ ॥ 73 ॥

రక్త గుల్మమునందపథ్యము. రూక్ష విదాహ గురు అన్న పానము వ్యాయామము మైథునము చింతలను వర్జించవలెను.

జ్వరారుచిశ్వాసకాసశోషకార్శ్యారతివ్యథాః ।
శోఫశ్చోపద్రవా గుల్మే తాంశ్చికిత్సేత్ స్వభేషజైః ॥ 74 ॥

**గుల్మ ఉపద్రవములు :** జ్వరము, అరుచి, శ్వాస, కాస శోష కృశతా అరతి, పీడ శోకాది ఉపద్రవములు కలుగును. వైద్యుడు వాటిని ఔషధముల ద్వారా చికిత్సించవలెను.

బిల్వశ్యోనాకనిర్యూహే సాధితైర్జాఙ్గలై రసైః ।
శైథిల్యకరణార్థం చ రక్తగుల్మస్య భోజయేత్ ॥ 75 ॥

**రక్త గుల్మము నందు పథ్యములు** - గుల్మము శిథిలం చేయుటకు జాంగల మాంసరసముతో సిద్ధం చేసిన బిల్వ శ్యోనాక క్వాథములను త్రాగించవలెను.

యూషేణ వా కులత్థానాం లావసంస్కారకేణ వా ।
చాలనార్థం విరేకం చ త్రివృత్త్రిఫలయా పిబేత్ ॥ 76 ॥

గుల్మమునకు గతి ఉత్పన్నం చేయుటకు కులుత్థ యూషము లావుకంతో సంస్కరించిన త్రివృత్ త్రిఫలములతో విరేచనం చేయించవలెను.

వాయోరుపశమార్థం చ ఫలతైలానువాసితామ్ ।
ఆస్థాపయేత్ సకృద్ ద్విర్వా శూలాటోపనివృత్తయే ॥ 77 ॥

వాత శాంతికొరకు ఫలతైలము ద్వారా అనువాసనము ఇచ్చి శూల ఆటోపమును తొలగించుటకు ఒకటి, 2 సార్లు అస్థాపన వస్తి ఇవ్వవలెను.

**తుల్యం మధు చ తైలం చ తాభ్యాముష్ణోదకం సమమ్ ।**
**ద్వౌ కర్షౌ శతపుష్పాయాః కర్షార్ధం సైన్ధవస్య చ ॥ 78 ॥**
**ఏతేనాస్థాపయేన్నారీం దశమూలాదికేన వా ।**
**బలం చాప్యాయయేత్తస్యా రసైః క్షీరైశ్చ సంస్కృతైః ॥ 76 ॥**

అస్థాపన యోగములు - మధు-తైల సమాన మాత్రలో తీసికొని వీటికి సమానముగా ఉష్ణ జలమును కలపవలెను. ఇందులో 2 కర్షములు సోంపు ½ కర్షము సైంధవముతో అస్థాపన వస్తినివ్వవలెను. తర్వాత సంస్కారయుక్త మాంసరసము లేదా పాలతో బలమును వృద్ధి పొందించవలెను.

**ఉపక్రమేత్తతశ్చూర్ణైరేతైః శోధనపాతనైః ।**
**హరీతకీ వచా హిఙ్గు సైన్ధవం సామ్లవేతసమ్ ॥ 80 ॥**
**యవానీ యావశూకం చ చూర్ణముష్ణామ్బునా పిబేత్ ।**

తర్వాత శోధనం కలిగించునవి మరియు గుల్మంను బహిర్గతము చేయు ఈ క్రింది చూర్ణముల ద్వారా చికిత్సించాలి. హరీతకి, వచ, హింగు, సైంధవ లవణము, అమ్లవేతసం, అజామోదము, యవాక్షారము వీటి చూర్ణములు ఉష్ణజలముతో సేవించవలెను.

**హరీతకీయవక్షారసౌవర్చలమితి త్రయమ్ ॥ 81 ॥**
**ఘృతయుక్తం పిబేద్యుక్త్యా రక్తగుల్మస్య భేదనమ్ ।**

రక్తగుల్మ భేదనం కొరకు హరీతకి యవాక్షారం సౌవర్చలవణము వీటిని యుక్తి పూర్వకముగా ఘృతముతో సేవించాలి.

**పత్రైలాపిప్పలీశుణ్ఠీచూర్ణం వా విడసంయుతమ్ ॥ 82 ॥**
**నాగరం శుక్తిచూర్ణం వా పిబేద్గోమూత్రసంప్లుతమ్**

తేజపత్రము, పిప్పలీ, శుంఠి చూర్ణములో విడా లవణం కలిపి లేదా శుంఠి యుక్త శుక్తి చూర్ణమును గోమూత్రముతో కలిపి సేవించవలెను.

**సూక్ష్మైలాకుఞ్చికాచవ్యపిప్పలీచిత్రకస్య వా ॥ 83 ॥**
**కల్కం బల్వజయూషాద్యైః పిబేన్మణ్డోదకేన వా ।**

ఏల, కుంచిక, చవ్య, పిప్పలీ, చిత్రక, కల్కమును బల్వజ యూషముతో లేదా బియ్యంతో చేసిన మండముతో సేవించవలెను.

అపరాపాతనోద్దిష్టైరౌషధైశ్చాపి భేదయేత్ ॥ 84 ॥

అపరాపాతనం కొరకు చెప్పిన ఔషధములతో భేదనం చేయవలెను.

అతిప్రవృత్తం రుధిరం గ్లానిం జనయతే యది ।
విన్ర్ప్రుతే గుల్మదోషే సావశేషేఽపి వా భిషక్ ॥ 85 ॥
పునరాస్థాపనోక్తేన తత్ర కుర్యాద్భిషగ్జితమ్ ।
అనుబన్ధభయాచ్చైవ శనైస్తదనుశోధయేత్ ॥ 86 ॥

గుల్మదోషములు బహిర్గతం అయిన తర్వాత లేదా కించిత్ శేషం యున్నపుడు అతిప్రవృత్తం అవుతున్న రక్తము శరీరము నందు గ్లానిని ఉత్పన్నం చేసినపుడు ఆస్థాపన వస్తివిధితో చికిత్స చేయవలెను. అనుబంధ భయకారణమున తర్వాత మెల్లమెల్లగా శోధనము చేయవలెను.

పద్మాదీని సమూలాని దగ్ధ్వా తద్భస్మ సంహరేత్ ।
గాఢయిత్వా చ తత్క్వాథం చూర్ణైరేతైర్విపాచయేత్ ॥ 87 ॥
శుణ్ఠీపిప్పలికుష్ఠైశ్చ చవ్యచిత్రకదారుభిః ।
దర్విప్రలేపితం సిద్ధమభ్యాసేత్తేన శుద్ధ్యతి ॥ 88 ॥
శిలాజత్వభయారిష్టం కల్పేనాభ్యస్య ముచ్యతే ।

మూలముతో సహ పద్మాదులను కాల్చి భస్మం చేసి దాని క్వాథమును గాఢముగా తయారు చేసికొని అందులో శుంఠి, పిప్పలి, కుష్ఠ, చవ్య, చిత్రక, దేవదారు, మొదలగు చూర్ణములను వేసి పక్వం చేయవలెను. అవి పాత్రకు లిప్తము అవుతున్నపుడు తీసి ప్రయోగించవలెను. దీనివలన రోగికి శోధనం అగును. శిలాజిత్, అభయారిష్ట కల్కములు సేవన వలన కూడా రక్తగుల్మం నశించును.

యచ్చాపి పఞ్చగుల్మీయే చికిత్సితముదాహృతమ్ ॥ 89 ॥
తదిహాపి ప్రయోక్తవ్యం ప్రసమీక్ష్య బలాబలమ్ ।
ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 90 ॥

ఇవి కాక పంచ గుల్మీయాధ్యాయములో చెప్పబడిన చికిత్సను రోగి బలాబలములను చూసి ప్రయోగించవలెను అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

(ఇతి) ఖిలేషు రక్తగుల్మవినిశ్చయో (నామ నవమోఽధ్యాయః)

రక్తగుల్మీయాధ్యాయము సమాప్తము.

# అంతర్వత్నీ చికిత్సితాధ్యాయః - దశమః

అథాతోఽన్తర్వత్నీచికిత్సితమధ్యాయం వక్ష్యామః ॥ 1 ॥

యథోవాచ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇపుడు మనము అంతర్వత్నీ చికిత్సితాధ్యాయము వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

సూక్ష్మాం చికిత్సాం వక్ష్యామి గర్భిణీనాం విభాగశః ।
తథా గర్భశ్చ నారీ చ వర్ధతే రక్ష్యతేఽపి చ ॥ 3 ॥

ఇపుడు నేను గర్భిణీ స్త్రీ యొక్క సూక్ష్మ చికిత్సను విభాగపూర్వకముగా వర్ణించెదను. ఇందులో గర్భము, గర్భిణీ స్త్రీ వీరిద్దరి వృద్ధి కలిగి రక్షింపబడుదురు.

గర్భిణీనాం జ్వరః కష్టః సర్వవ్యాధిషు పార్థివ ।
జ్వరోష్మణాఽభితప్తస్తు గర్భో యాత్యేవ విక్రియామ్ ॥ 4 ॥
తస్మాజ్జ్వరచికిత్సాం తు పూర్వమేవ నిబోధ మే ।

ఓ పార్థివా! గర్భిణీ స్త్రీల అన్ని రోగములలో జ్వరము అత్యధిక కష్టదాయకము. జ్వరోష్ణముతో సంతప్తమైన గర్భములో వికృతి ఉత్పన్నం అగును. కావున ప్రప్రథమముగా నీవు జ్వర చికిత్సను వినుము.

క్షుచ్ఛ్రమాభ్యఞ్జనాద్రౌక్ష్యాదౌష్ణ్యాపక్వవిధారణాత్ ॥ 5 ॥

స్నేహస్వేదౌషధానాం చ విభ్రమాత్తేజసోఽపి చ ।
సన్తాపాన్మనసశ్చాపి పర్వతానాం తథైవ చ ॥ 6 ॥

గన్ధాచ్చ తృణపుష్పాణాం గర్భిణ్యా జాయతే జ్వరః ।

క్షుధ, శ్రమ, అభ్యంగనము, రూక్షత, ఉష్ణత, అపక్వ ధారణము, స్నేహనము, స్వేదనము, ఔషధము, మరియు తేజ విభ్రమనము, మనస్సంతాపము, పర్వతారోహణము తృణ పుష్ప గంధాదులతో గర్భిణీ స్త్రీకి జ్వరము కలుగును.

గర్భిణీం జ్వరితాం నారీమేకాహముపవాసయేత్ ॥ 7 ॥
తతో దద్యాదలవణాం పేయాం స్నేహవివర్జితామ్ ।

జ్వరయుక్త గర్భిణీస్త్రీకి మొదట ఒకదినం ఉపవాసం చేయించి తర్వాత లవణ స్నేహ రహిత పేయము నివ్వవలెను.

తీక్ష్ణాని త్వన్నపానాని స్వేదమాయాసమేవ చ ॥ 8 ॥
వర్జయేజ్జ్వరితా నారీ యవాగూం కేవలాం పిబేత్ ।

గర్భిణి జ్వరం వచ్చినపుడు తీక్ష్ణ అన్నపానం, స్వేదనము, ఆయాసం, త్యజించవలెను. కేవలం యవాగు సేవనం చేయవలెను.

యవాగ్వా హ్రసతే దోషే యూషైరన్నాని దాపయేత్ ॥ 9 ॥
యూషైస్తు హ్రసితే దోషే రసం వా క్షీరమేవ వా ।
దాపయేన్మతిమాన్ ప్రాజ్ఞో న త్వౌషధవిధిర్హితః ॥ 10 ॥
అనుబన్ధే తు దోషస్య గర్భకాలమపేక్ష్య చ ।
మాసాచ్చతుర్థాత్ ప్రభృతి భిషగ్భేషజమాచరేత్ ॥ 11 ॥

బుద్ధి మంతులైన వారు, యవాగు ద్వార దోషములు ఉపశమించినపుడు యూషతో అన్నమును ఇవ్వవలెను. యూషద్వార దోషములు బాగా శమించి నపుడు మాంస రసమును లేదా పాలను ఇవ్వవలెను. ఈ అవస్థలో ఔషధములు ప్రయోగించుట మంచిది కాదు. దీని తర్వాత కూడ దోషానుబంధం శేషముగా ఉన్నచో గర్భ సమయం చూసి, నాల్గవ మాసం నుండి ఔషధ ప్రయోగము చేయవచ్చును.

శారీరం తు జ్వరం జ్ఞాత్వా వాతపిత్తకఫాత్మకమ్ ।
మధ్యాం క్రియాం ప్రయుఞ్జీత సంచిన్త్య గురులాఘవమ్ ॥ 12 ॥

ఉపద్రవబలం జ్ఞాత్వా సత్త్వం చాపి సమీక్ష్య తు ।
గర్భావస్థాం తు విజ్ఞాయ లేఖనాని ప్రదాపయేత్ ॥ **13** ॥

గర్భిణీ స్త్రీకి వాతపిత్త శ్లేష్మాది శరీరక జ్వరములు వచ్చినపుడు గురు లఘుద్వాదులను విచారించి మధ్య చికిత్సను ప్రయోగించవలెను.

ఉత్పన్నాయాం తు తృష్ణాయాం నాత్యుష్ణం ప్రపిబేజ్జలమ్ ।
వాతశ్లేష్మసముత్థే తు జ్వరే నీరం విషాయతే ॥ **14** ॥

అథ పిత్తకృతే చాపి శృతశీతం ప్రశస్యతే ।
కుప్యపాషాణనిష్పక్వం శీతం తృష్ణానిబర్హణమ్ ॥ **15** ॥

జ్వరములో తృష్ణ కలిగినపుడు లఘు ఉష్ణ జలమును త్రాగవలెను. విశేషించి వాత కఫ జ్వరములో శీతల జలం విషతుల్యముగా ఉండును. పిత్తజ్వరములో కూడా వేడి చేసి చల్లార్చిన జలము ప్రశస్తము అని చెప్పబడినది. రాతి పాత్రలో వేడిచేసి చల్లార్చిన జలం దాహమును శమింపచేయును.

జ్వరే తు తరుణో దృష్టో విధిరేష విశేషతః ।
భగ్నవేగే తు కర్తవ్యం తృష్ణాప్రశమనైః శృతమ్ ॥ **16** ॥
జ్వరం జ్వరం సమాసాద్య శీతం వా యది వేతరమ్(త్) ।

పై చెప్పిన విధానము తరుణ జ్వరములో ఇవ్వవలెను. అన్య జ్వరములో ఈ విధి కొద్దిగా సడలింప వచ్చును. జ్వరవేగం సమాప్తమయినపుడు ప్రత్యేక జ్వరాను సారము తృష్ణ శామక ఔషధములద్వార పక్వం చేయబడిన శీతల లేదా ఉష్ణ జలం ఇవ్వవలెను.

శిరోరోగే తు కర్తవ్యో యథావద్భేషజక్రమః ।
భగ్నవేగే జ్వరే కృత్స్నే గురు నైవ ప్రశస్యతే ॥ **17** ॥

గర్భిణికి శిరోరోగము కలిగినచో యథావిధి చికిత్స చేయవలెను. జ్వర వేగము పూర్తిగా శాంతించినప్పటికి గురుభోజనము ఇవ్వకూడదు.

తరుణే తు జ్వరే నార్యా అభ్యఙ్గో న ప్రశస్యతే ।
గర్భే తు తరుణే దత్తో గర్భఘాతాయ కల్పతే ॥ **18** ॥

తరుణజ్వరంలో గర్భవతిని అభ్యంగము చేయకూడదు. గర్భావస్థలో తరుణ జ్వరము నందు అభ్యంగము చేసినచో గర్భం నష్టం అగును.

గర్భిణీనాం తు నారీణాం నస్యతో నానుసేచయేత్ ।
నస్యదానేన గర్భిణ్యాః ప్రాణస్తు పరిహీయతే ॥ **19** ॥

నస్యం ద్వారా గర్భిణి స్త్రీ కి దోషమును బయటికి వెడలించ కూడదు. నస్యము ఇచ్చినచో గర్భిణికి ప్రాణనష్టం కలుగును.

కుణిర్వా యది వాఽన్ధశ్చ జాయతే దుర్బలేంద్రియః ।
**ధూమపానేన గర్భిణ్యా ధూమతేజోహతో భృశమ్ ॥ 20 ॥**
**వివర్ణో జాయతే గర్భః పతేద్వాఽపి విశాంపతే ।**

ఓ రాజా! గర్భిణీ ధూమపానం చేయుటచే ఉత్పన్నం అయిన సంతానము ధూమ్ర తేజంతో నష్టం అయిన కుణి ( హస్తములు బలహీనం అయిన) అంధుడు, దుర్బల ఇంద్రియుడు వివర్ణముగా లేదా గర్భపాతం జరుగును.

**శిరోవిరేకే గర్భిణ్యాః సంక్షోభాత్తు భయేన వా ॥ 21 ॥**
**మారుతః కుపితో దేహే గర్భఘాతాయ కల్పతే ।**
**అథవా వాతరోగీ తు గర్భో భవతి పార్థివ ॥ 22 ॥**

ఓ పార్థివా! గర్భిణి శిరోవిరోచనముచే సంక్షోభము మరియు భయంవలన గర్భిణి శరీరంనందు వాయువు ప్రకోపించి గర్భమును నష్టమునొందించును. ఒకవేళ పుట్టినచో వాడికి వాత వ్యాధి కలుగును.

స్వేదేన తరుణే గర్భే పిత్తం ప్రకుపితం భృశమ్ ।
చ్యావయేదాశు గర్భం తు తస్మాత్ స్వేదం వివర్జయేత్ ॥ **23** ॥
స్వేదః స్థిరే తు విహితో గర్భవైవర్ణ్యకారకః ।

తరుణ గర్భము నందు స్వేదము చేసిన పిత్తము ప్రకోపించును. తద్వారా శీఘ్రముగా గర్భపాతము జరుగును. కావున స్వేదమును వర్జించవలెను. గర్భము స్థిరమైన తర్వాత ఇచ్చిన స్వేదము గర్భమునందు వివర్ణము చేయును.

వమనం తరుణే గర్భే స్వైర్గుణైర్గర్భఘాతకమ్ ॥ **24** ॥

తరుణ గర్భం నందు ఇచ్చిన గర్భము నష్టం నొందించును.

నాభిప్రపీడనోత్కారాత్ సంక్షోభాచ్చ విశేషతః ।
గర్భిణ్యాస్తరుణే గర్భే స్రంసనం న ప్రశస్యతే ॥ 25 ॥
గురుత్వాదుష్ణతీక్ష్ణత్వాద్వాహనాచ్చాస్య ఘాతకమ్ ।

తరుణ గర్భం నందు ఇచ్చిన విరేచనము నాభి కింద పీడను కలిగించి సంక్షోభము చేయుటవలన అప్రస్తుతము ఇది గురు ఉష్ణ తీక్ష్ణ వాహన గుణముల వలన గర్భమును నష్టమునొందించును.

ఆస్థాపనం తు తరుణే గర్భే నార్యా న శస్యతే ॥ 26 ॥
అనువాసనం చ మతిమానితి శాస్త్రవినిశ్చయః ।

తరుణ గర్భములో స్త్రీకి ఆస్థాపన అనువాసన వస్తి అప్రశస్తమని శాస్త్రములందు చెప్పబడినది.

ఆస్థాపనం సానువాసం కరోతి స్వేన తేజసా ॥ 27 ॥
హీనాఙ్గం స్రావిణం వాఽపి గర్భమిత్యేష నిశ్చయః ।

తరుణ గర్భావస్థలో ఆస్థాపన అనువాసన వస్తి నిచ్చిన చో నిశ్చయముగా హీనాంగములు కల్గును మరియు గర్భస్రావము కల్గును.

తస్మాదేతాని మతిమాన్ గర్భిణ్యా న ప్రదాపయేత్ ॥ 28 ॥

కావున బుద్ధిమంతుడు గర్భిణికి ఇవి ప్రయోగించకూడదు.

ఇమాని దద్యాత్ సంచిన్త్య రోగావస్థావిశేషవిత్ ।
విదారిగన్ధాం కలశీం తథా గన్ధర్వహస్తకమ్ ॥ 29 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 222 తమం పత్రమ్)

మధుకం భద్రదారుం చ క్వాథః శర్కరయా యుతః ।
వాతజ్వరహరో దేయో మాతులుఙ్గరసాప్లుతః ॥ 30 ॥

రోగి వివిధ అవస్థలు పరీక్షించి వీక్షించి గర్భిణికి ఈ క్రింది వస్తువుల నివ్వవలెను. వాతజ్వర హరక్వాథము- విదారి గంధ, కలశీ (పృశ్నిపర్ణి) ఏరండ, యష్ఠిమధు, దేవదారు క్వాథములో శర్కర మరియు మాతులుంగ రసమును కలిపి ఇచ్చుటచే వాత జ్వరము నశించును.

వర్గో విదారిగన్ధాదిః క్వథితో నాతిశీతలః ।
భద్రదారుసమాయుక్తో వాతజ్వరహరో మతః ॥ 31 ॥

విదారి గంధాది ఓషధులతో క్వాథము చేసి దేవదారు కలిపి కొంచెము ఉష్ణముగా నున్నప్పుడు ఇచ్చినచో వాత జ్వరము నశించును.

ఏరణ్డో వరుణశ్చైవ బృహత్యౌ మధుకం తథా ।
వాతజ్వరహరః క్వాథో రాస్నాకల్కసమాయుతః ॥ 32 ॥

ఏరండ, వరుణ, బృహతీద్వయం, యష్ఠి, రాస్నా కల్కము, క్వాథము వాత జ్వరమును హరింప చేయును.

ద్విపఞ్చమూలనిష్క్వాథః కోష్ణో వా యది వా హిమః ।
రాస్నాకల్కసమాయుక్తో వాతజ్వరహితో మతః ॥ 33 ॥

దశముల క్వాథములో రాస్నా కల్కము కలిపి కించిదుష్ణము లేదా శీతము అవస్థలో ఇచ్చిన వాత జ్వరమునందు హితకరము.

జీర్ణే తు భోజనే పేయా తన్వీ లవణవర్జితా ।
కుష్ఠం సయష్టీమధుకం రాస్నా గిరికదమ్బకః ॥ 34 ॥
శతాహ్వే పద్మకం చైవ సారివోశీరముత్పలమ్ ।
ముస్తా శృగాలవిన్నా చ కరవిన్దీ తథా వచా ॥ 35 ॥
పయస్యా హంసపాదీ చ తథా పున్నాగమేవ చ ।
కర్షప్రమాణాన్యేతాని దధిమణ్డేన పేషయేత్ ॥ 36 ॥
తత(సమ)స్తమేషామఙ్గానాం నిష్క్వాథం క్వాథయేద్భిషక్ ।
భాగాశ్చ దశమూలస్య కార్య ద్విపలసంమితాః ॥ 37 ॥
బలాతిబలయోశ్చైవ కుర్యాదర్ధపలం భిషక్ ।
కోరణ్డమధుశిగ్రూణి మదయన్తీ చ తే త్రయః ॥ 38 ॥
యవకోలకులత్థానాం భాగాః స్యుః ప్రస్థసంమితాః ।
నిష్క్వాథ్యైతానపాం ద్రోణే శేషమాఢకసంమితమ్ ॥ 39 ॥

తత్ర దద్యాత్ ప్రతీవాపం యత్ పూర్వముపకల్పితమ్ ।
క్షీరం తథైవ గోమూత్రం వారుణీం దధి చోత్తమమ్ ॥ 40 ॥

భిషక్కుడవమాత్రాణి తిలతైలేన యోజయేత్ ।
అవహృత్యాగ్నినా సిద్ధమీషత్క్షోదాయితం యది ॥ 41 ॥
ఉష్ణేనైతేన తైలేన సర్వగాత్రాణి మర్దయేత్ ।
వాతజ్వరం నిహన్త్యేతన్మ్రక్షణైస్త్రిభిరేవ తు ॥ 42 ॥
ఏషోఽభ్యఙ్గః స్థిరే గర్భే యథావత్ సంప్రశస్యతే ।

భోజనానంతరము పల్చటి లవణ రహిత పేయనివ్వవలెను. అభ్యంగార్థము తైలము- కుష్ఠ, యష్టి, రాస్నా, భూకదంబ, సోంపు, పద్మకము, సారిబ, ఉశీర, ఉత్పల, ముస్త, పృష్నిపర్ణి కరవెళ్ళి, వచ, పయస్య, హంసపాది, నాగకేశరములు ఒక్కొక్కటి ఒకకర్షము చొ॥న తీసికొని పెరుగు నీటితో కల్కం చేసికొనవలెను. వీటితో క్వాథము చేయవలెను. దశమూలములు 2 పలములు, బల, అతిబల ఒక్కొక్కటి అర్ధపలము, ఏరండ, మధు శిగ్రు, మదయంతి యవ, కోల, కుళుత్థ ఒక్కొక్కటి ఒక్క ప్రస్థము, వీటిని ఒక ద్రోణ జలములో క్వాథము చేసి ఆడకజల శేషముగా ఉంచుకొనవలెను. ఈ క్వాథములో పై చెప్పిన కుష్ఠాది క్వాథమును కలపవలెను. ఇందులో పాలు గోమూత్రము వారుణి మద్యము పెరుగు ఒక్కొక్కటి ఒక కుడవము మరియు తిలతైలము వేసి పక్వం చేయవలెను. తైల సిద్ధము అయిన తర్వాత ఉంచుకొని ఉష్ణతైలమును సంపూర్ణ శరీరమునకు మర్దనం చేసికొనవలెను. మూడు దినములు మర్దనం చేసికొన్నచో వాతజ్వరం నశించును. స్థిరమైన గర్భము నందు ఈ అభ్యంగం యథావిధిగా ప్రయోగించినచో ప్రశస్తము.

క్షీరం క్షీరయవాగూర్వా రసో వా జాఙ్గలో హితః ॥ 43 ॥
జీర్ణజ్వరే సదా నార్యా వాతఘ్నైరౌషధైః శృతః ।

జీర్ణజ్వరములో గర్భవతికి ఎల్లపుడు వాతనాశక ఔషధములతో సిద్ధం అయిన క్షీరం, క్షీరయవాగు, జాంగల మాంస రసము ఇవ్వవలెను.

అథ పిత్తకృతే చాపి క్వథితం సారివాదికమ్ ॥ 44 ॥
శర్కరామధుసంయుక్తం పాయయేత్ కల్యముత్థితమ్ ।

జ్వరములో పిత్త ప్రకోపము ఉన్నచో సారిబాది క్వాథమును శర్కర మధు కలిపి ప్రాతః కాలమున త్రాగించవలెను.

పయస్యా క్షీరకాకోలీ మృద్వీకా మధుకాని చ ॥ **45** ॥
శర్కరామధుసంయుక్తం పానకం పైత్తికే జ్వరే ।

పిత్తజ్వరములో పయస్య, క్షీరకాకోలి, మృద్వీక ద్రాక్ష, యష్టిమధు, శర్కర మధు కలిపి పానకమును ఇవ్వవలెను.

నీలోత్పలం పయస్యా చ సారివా మధుకం మధు ॥ **46** ॥
పిప్పల్యో మరిచోశీరం లోధ్రం లాజా సశర్కరా ।
ఏతత్ క్షీరసమాయుక్తం ఖజేన మథితం పిబేత్ ॥ **47** ॥
గర్భిణీ జ్వరితా క్షిప్రం పిత్తార్తేన ప్రశామ్యతి ।

జ్వరావస్థలో గర్భిణికీ నీలోత్పల, పయస్య, సారిబ, యష్టి మధు, మధు, పిప్పలీ మరిచ, ఉశీర, లోధ్ర, లాజ, శర్కర వీటినన్నిటి పాలలో కలిపి కవ్వముతో చిలికి త్రాగించవలెను. దీని వలన పిత్తప్రకోపము శీఘ్రముగా శాంతించును.

నలవఞ్జులమూలాని గుంద్రామూలాని చాహరేత్ ॥ **48** ॥
సహాం చ సహదేవాం చ మార్కవం పాటలీం తథా ।
క్షీరిణాం చ ప్రవాలాని తథా జమ్బ్వామ్రయోరపి ॥ **49** ॥
ఉత్పలం సారివోశీరం చందనం పద్మపత్రకమ్ ।
శ్లక్ష్ణాన్యేతాని పిష్టాని ప్రదేహః శీతలో భవేత్ ॥ **50** ॥
పిత్తజ్వరహరో నార్యాస్తర్పణో ఘృతసంయుతః ।

నల, ఉంజల మూలము, గుంద్రామూలము, సహదేవి, సహ, మొక్కజొన్న, పాటల, క్షీరి వృక్షములు, ఆమ్ర, జంబు పత్రములు, ఉత్పలములు, సారిబ, ఉశీర, చందనం, పద్మక, పత్రక వీటిని బాగుగా కల్కం చేసి నెయ్యికలిపి ప్రదేహము చేసిన శీతలముగా ఉండును. తర్పణము, పిత్తహరంగా ఉండును.

యవపిష్టస్య కుడవో మఞ్జిష్ఠార్ధపలం తథా ॥ **51** ॥

అమ్లప్రస్థశతే తైలం తైలప్రస్థం విపాచయేత్।
దాహజ్వరహరం తైలం ప్రశస్తం జ్వరనాశనమ్ ॥ 52 ॥

పిండి చేసిన యవలు 1 కుడవము, మంజిష్ట అర్ధపలం అమ్లకాంజికము 100 ప్రస్థములు తిలతైలము ఒక ప్రస్థము తైలపాక విధిలో తైలం సిద్ధం చేసికొనవలెను. ఇది ఉత్తమ జ్వర నాశకము. ఇది జ్వరము, దాహము నశింపచేయును.

అథ శ్లేష్మజ్వరే నారీం రాస్నాక్వాథం సుశీతలమ్।
క్షౌద్రేణ సహ సంయుక్తం పాయయేదితి కశ్యపః ॥ 53 ॥

శ్లేష్మజ్వరములో గర్భవతికి రాస్నా క్వాథమును చల్లార్చి అందులో మధుని కలిపి త్రాగించవలెనని కాశ్యపుని మతము.

భద్రదారుకనిష్క్వాథో రాస్నాక్షౌద్రసమాయుతః।
అథవా చందనక్వాథః పిప్పలీక్షౌద్రసంయుతః ॥ 54 ॥
శ్లేష్మజ్వరహరః పేయో రాస్నావాసాఽమృతాశృతః।

శ్లేష్మ జ్వరములో క్వాథము- రాస్నా, మధు, దేవదారు క్వాథము, పిప్పలి, మధు- చందన క్వాథము, రాస్న, వాస, గుడూచి క్వాథము త్రాగించవలెను.

శ్రీపర్ణికామృతానాం తు నిష్క్వాథో మధుయోజితః ॥ 55 ॥
పేయః సయష్టీమధుకో జ్వరే శ్లైష్మికపైత్తికే।

శ్లేష్మ పిత్త జ్వరములో శ్రీపర్ణిక, అమృత, యష్టిమధు క్వాథములో మధుని కలిపి ఇవ్వవలెను.

మహతః పఞ్చమూలస్య క్వాథః శ్లైష్మికవాతికే ॥ 56 ॥
రాస్నాకల్కసమాయుక్తః పేయః కల్యమితి స్థితిః।

శ్లేష్మ వాత జ్వరములో బృహత్ పంచమూల క్వాథములో రాస్న కల్కము కలిపి ప్రాతః కాలమున ఇవ్వవలెను.

క్వాథో విదారిగన్ధాదేః శర్కరామధుయోజితః ॥ 57 ॥
వాతపిత్తజ్వరే పేయ ఇతి హ స్మాహ కశ్యపః।

వాతపిత్త జ్వరములో విదారి గంధాది క్వాథములో శర్కర మధు కలిపి ఇవ్వవలెనని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**పిత్తజ్వరే హిమా పేయా పథ్యా క్షీరమథాపి చ ॥ 58 ॥**
**జీర్ణే పిత్తహరైః పక్వో యూషస్తుచణకైస్తథా ।**

పిత్త జ్వరములో శీతల క్రియ, లేదా క్షీరం పథ్యము. జీర్ణపిత్త జ్వరములో పిత్త హర ఔషధ సిద్ధ లేదా శనగలతో చేసిన యూషము పథ్యము.

**శ్లేష్మజ్వరే సుఖోష్ణా తు పేయా నార్యాః ప్రశస్యతే ॥ 59 ॥**
**తథైవ ముద్రయూషోఽథ మూలకో రస ఏవ చ ।**
**సుసాత్మ్యైశ్చేతి కర్తవ్యో వ్యాధావస్మిన్ విశేషతః ॥ 60 ॥**

శ్లేష్మ జ్వరములో గర్భిణికి సుఖోష్ణ క్రియ ముద్గయూష లేదా మూలీస్వరసం ఇవ్వాలి. ఈ రోగములో విశేషించి శరీరంనకు సాత్మ్యమైన ద్రవ్యములను ఇవ్వవలెను.

**సంసృష్టే తు భిషక్ ప్రాజ్ఞో యోజయేత యథాబలమ్ ।**
**సన్నిపాతసముత్థానే త్రిదోషశమనం హితమ్ ॥ 61 ॥**

సంసృష్ట దోషములో వివేకవంతుడైన వాడు బలానుసారము ఔషధములను ఇవ్వవలెను. సన్నిపాతములో త్రిదోషశాంతి చికిత్స చేయవలెను.

**అథ యా మద్యపా నారీ శృణు తస్యాశ్చికిత్సితమ్ ।**
**వాతికే పైత్తికే వాఽపి శ్లైష్మికే చ విశాంపతే ! ॥ 62 ॥**
**జ్వరే దద్యాత్ సురాం నార్యా జలేనార్ధేన యోజితామ్ ।**
**సురయా వాసయిత్వైనాం తతః కల్పం ప్రదాపయేత్ ॥ 63 ॥**

ఓ రాజా ! మద్యము సేవించిన స్త్రీ చికిత్సను వినుము. వాత పిత్త కఫ జ్వరములో గర్భవతికి మద్యములో సగం నీరు కలిపి ఇవ్వాలి. లేదా వేరువేరు కల్పములను సురలో కలిపి సుగంధితము చేసి ఇవ్వవలెను.

**హరేణుముద్గచుచ్చూనాం కర్కట్యాశ్చ రసేన తు ।**
**రసేన కిఞ్చిదమ్లేన లఘూన్యన్నాని భోజయేత్ ॥ 64 ॥**
**లవణస్నేహహీనాని మృదూని సురభీణి చ ।**
**ఆహారేణ గదే భగ్నే మద్యస్యోపరమే కృతే ॥ 65 ॥**

పై చెప్పిన ఆహారము ద్వారా రోగనష్టము, రోగము నశించిన పిదప మద్యము శాంతించిన పిదప హరేణు, ముద్గ, చుచ్చు అను శాకము, కర్కాటక శృంగి స్వరసం లేదా అమ్లరసముతో లవణ స్నేహ వర్జితము, మృదు మరియు సుగంధయుక్త భోజనం చేయవలెను.

యథోక్తా తు క్రియా పథ్యా యథాస్వమితి కశ్యపః ।
అతిసారే తు గర్భిణ్యాః సముత్పన్నే భిషగ్జితమ్ ॥ **66** ॥
వాతికే పైత్తికే చైవ శ్లైష్మికే చ ప్రవక్ష్యతే ।

గర్భిణికి అతిసారం అయినచో వాత పిత్త కఫానుసారము ఆయా దోషముల యథోక్త చికిత్సను చేయవలెను.

విరుద్ధాధ్యశనాజీర్ణైస్తథైవాత్యశనాదపి ॥ **67** ॥
భయోద్వేగవిఘాతాద్వా సంఘాతాత్ పూరణాత్ క్షయాత్ ।
( ఇతి తాడపత్రపుస్తకే **223** తమం పత్రమ్)
కందమూలఫలైరామైర్దుష్టతోయనిషేవణాత్ ॥ **68** ॥
రౌక్ష్యాద్బుభుక్షయా ఛో(శో)కాద్గుర్వభిష్యందిభోజనాత్ ।
అబ్ధాతోశ్చ స(ము)ద్రేకాదతీసారః ప్రవర్తతే ॥ **69** ॥

**అతిసార కారణములు** - విరుద్ధ భోజనము, అధ్యశనము, అజీర్ణము, అధికభోజనము, భయోద్వేగములతో విఘాతము, సంఘాతము, సంతర్పణము, క్షయము పచ్చి కందమూల ప్రయోగము దూషిత జల సేవనము, క్షుధ చే ఉత్పన్న రూక్షత్వము శోకము గురు అభిష్యంది భోజనముతో అప్ ధాతువు ఉద్వేగ కారణమున అతిసారము కలుగును.

ఆమాతిసారే సఞ్జాతే పాచనాని ప్రదాపయేత్ ।
కుటజస్య చ బీజాని ముస్తా పాఠా తథైవ చ ॥ **70** ॥
అజమోదాఽథ సరలం తథా చాతివిషా శుభా ।
ఆమే శ్లేష్మాన్వితే పేయమేతత్ పిష్టం సుఖామ్బునా ॥ **71** ॥

అతిసారములో ఆమ శ్లేష్మ యుక్తం అయినపుడు ఇంద్రయవ, ముస్త,

పాఠ, అజమోద, సరళ, అతి విషాది పాచన ఔషధములను కల్కము చేసి ఈషద్ ఉష్ణజలముతో ఇవ్వవలెను.

పాఠాచందనభాగశ్చ కుటజస్య ఫలాని చ ।
తథా చాతివిషా ముఖ్యా పిష్టమేతద్ధ్వితామ్బునా ॥ 72 ॥
ఆమే పిత్తాన్వితే పేయమితి హ స్మాహ కశ్యపః ।

అతిసారంలో ఆమ్ల పిత్త యుక్తం అయినపుడు పాఠ చందన, కుటజబీజ, అతివిష, మొదలగు ఔషధములను కల్కం చేసి హితకర జలంతో ఇవ్వవలెనని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

హిఙ్గుసైన్ధవనాగాశ్చ బృహత్యా కౌటజం ఫలమ్ ॥ 73 ॥
తథా పిప్పలిమూలం చ ముఖ్యా చాతివిషా నృప ! ।
ఆమే వాతోత్థితే పేయమేతత్ పిష్టం సుఖామ్బునా ॥ 74 ॥

ఓ రాజా! ఆమాతిసారములో ఆమము వాతయుక్త మైనపుడు హింగు, నాగకేసరము సైంధవ లవణం బృహతి కల్కం, ఇంద్రయవ, పిప్పలీమూలం, అతివిషలను కల్కం చేసి ఉష్ణజలముతో ఇవ్వవలెను.

బృహత్యాదిస్తు పాతవ్యః సన్నిపాతసముత్థితే ।
పక్వసంగ్రహణః పథ్యః సర్వేషామితి నిశ్చయః ॥ 75 ॥

సన్నిపాత ఆమాతి సారములో బృహత్యాది గుణముల క్వాథమును త్రాగించవలెను. ఆమదోషం పక్వం అయినపుడు పక్వాతిసారములో స్తంభనం చేయవలెను. అని అందరి ఆచార్యుల మతము.

శ్లైష్మికే మధుసంయుక్తస్తణ్డులోదకసంయుతః ।
అమ్బష్ఠాదిగణః పేయో భిన్నవర్చోవిబన్ధనః ॥ 76 ॥

శ్లేష్మాతి సారంలో స్తంభనమునకు అంబష్టాది గణ ద్రవ్యములను క్వాథము చేసి మధు, తండులోదకము కలిపి త్రాగించవలెను. ఇది అతిసారమును బంధించును.

అథవా కౌటజం పిష్ట్వా ఫలం క్షౌద్రేణ సంయుతమ్ ।
ధాతకీ మరిచం లోధ్రం కట్వంఙ్గం దేవదారు చ ॥ 77 ॥

తణ్డులోదకసంయుక్తం శ్లేష్మాతీసారనాశనమ్।

లేదా ఇంద్రయవ, ధాతకీ పుష్పం, మరిచం, కల్కం చేసి తండులోదకంతో త్రాగించవలెను. ఇది శ్లేష్మాతి సారమును నశింపచేయును.

తణ్డులోదకపిష్టం వా కేసరం నలినస్య తు ॥ 78 ॥
మధుయుక్తం పిబేన్నారీ శ్లేష్మాతీసారనాశనమ్।

లేదా కమల కేసరములను తండులోదకముతో కల్కం చేసి మధు కలిపి త్రాగినచో శ్లేష్మాతి సారం నశించును.

న్యగ్రోధాదిస్తు నిర్యూహః క్షౌద్రేణ మధురీకృతః ॥ 79 ॥
పిత్తాతిసారశమనః కుశలైః పరికీర్తితః।

కుశల చికిత్సకుడు న్యగ్రోధాది గణ క్వాథముతో మధును కలిపి త్రాగినచో పిత్తాతిసారం నశించును అని చెప్పెదరు.

కణా ధాతకిపుష్పం చ మధుకం బిల్వపేశికా ॥ 80 ॥
శర్కరామధుసంయుక్తం పిత్తవృద్ధివినాశనమ్।

లేదా పిప్పలీ ధాతకీ పుష్పము యష్టి మధు బిల్వ మజ్జ వీటి క్వాథములో శర్కరా మధుని కలిపి త్రాగిన పిత్తాతిసారం నశించును.

పద్మకం సమఙ్గమామ్రాస్థి మధుకం పద్మకేసరమ్ ॥ 81 ॥
లోధ్రం మోచరసశ్చైవ శర్కరాక్షౌద్రసంయుతః।
పిత్తాతిసారశమనో యోగ ఏష విధీయతే ॥ 82 ॥

పద్మకము, మంజిష్ఠ, ఆమ్రాస్థి, యష్టిమధు, పద్మకేసరము, లోధ్ర, మోచరసము, వీటిని శర్కర మధుతో కలిపి ఇచ్చిన పిత్తాతిసారం శాంతించును.

ఏరణ్డవర్జం ఖుడ్డాకం పఞ్చమూలం శృతం హితమ్।
కాలాకట్వఙ్గసంయుక్తం వాతాతీసారనాశనమ్ ॥ 83 ॥

ఏరండమును వర్జించి ఖుడ్డాక పంచమూలముల క్వాథము అందులో కాలా, కట్వంగ కలిపి ఇచ్చినచో వాతాతిసారము నశించును.

పద్మకం సమఙ్గమామ్రాస్థి బృహతీ బిల్వపేశికా।
శ్లక్ష్ణపిష్టం పిబేద్దధ్నా వాతాతీసారనాశనమ్ ॥ 84 ॥

పద్మకము, మంజిష్ఠ, బృహత్ బిల్వమజ్జ వీటన్నిటిని పిష్ఠము చేసి పెరుగుతో సేవించిన వాతాతి సారము నశించును.

పిప్పల్యో ధాతకీ పద్మం సమఙ్గా మోచజో రసః ।
మత్స్యణ్డికేంద్రధాన్యం చ పిష్టమేతన్నృపోత్తమ ! ॥ 85 ॥
తణ్డులోదకసంయుక్తం సశూలే వాతికే హితమ్ ।

ఓ రాజా! వాతాతిసారవము పిప్పలీ, ధాతకి, పద్మకవము, మంజిష్ట, మోచరసం, మత్యండిక, ఇంద్రయవ, వీటిని పిష్టము చేసి తండులోదకములో ఇవ్వవలెను.

ముస్తాబిల్వశలాటూని అనంతా మధుకం తథా ॥ 86 ॥
శ్లక్ష్ణపిష్టం పిబేద్దధ్నా సర్పిర్గుడసమాయుతమ్ ।
వాతాతీసారశాన్త్యర్థం యథావదితి కశ్యపః ॥ 87 ॥

ముస్త, అపక్వబిల్వము, సారిబ, యష్టిమధు, వీటిని, మెత్తగా దంచుకొని ఘృతము గుడము కలిపి పెరుగుతో ఇచ్చిన వాతాతిసారం నశించునని మహర్షి కశ్యపుని మతము.

పిప్పల్యో ధాతకీ లోధ్రం సమఙ్గా పద్మకేసరమ్ ।
పద్మా మోచరసశ్చైవ దీర్ఘవృంతతరోస్త్వచః ॥ 88 ॥
కేసరం చేతి చూర్ణాని శ్లక్ష్ణాన్యేతాని చూర్ణయేత్ ।
ఘృతం మత్స్యణ్డికా క్షౌద్రం లేహీభూతాని లేహయేత్ ॥ 89 ॥
లేహః కల్యాణకస్త్వేష సర్వాతీసారనాశనః ।

కల్యాణ కావలేహవము- పిప్పలీ, ధాతకి, లోధ్ర, మంజిష్ట, పద్మ కేసరవములు, పద్మకవము, మోచరసం, శ్యోనాక, త్వక్, నాగకేసరవములు, వీటినన్నింటిని చూర్ణించి, ఘృతము మత్స్యండిక మధు కలిపి అవలేహము చేయవలెను. ఇది సర్వాతిసారములను నశింపచేయును.

కాశ్మర్యమూలత్వక్కల్కః శ్యామామూలం తథైవ చ ॥ 90 ॥
యవాగూం దధిమణ్డేన సిద్ధామల్పఘృతాం పిబేత్ ।
ప్రవాహికార్తా సతతం తథా సంపద్యతే సుఖీ ॥ 91 ॥

గంభారిమూల త్వక్కల్కము, త్రివృత్‌మూల దధి మండముతో యవాగు చేసి, కొంచెం ఘృతము కలిపి త్రాగినచో ప్రవాహిక రోగి స్వస్థుడగును.

**కిరాతతిక్తకం లోధ్రం యష్టీమధుకమేవ చ ।**
**ఫాణితం తిలకల్కశ్చ శర్కరామధుసంయుతమ్ ॥ 92 ॥**
**తణ్డులోదకమిత్యేతత్ ప్రతిహన్తి ప్రవాహికామ్ ।**

కిరాత తిక్త, లోధ్ర యష్టి మధు, ఫాణితము, తిలకల్కము వీటిని మెత్తగా దంచి, శర్కరామధులతో కలిపి సేవించిన ప్రవాహిక నశించును.

**కపిత్థబిల్వమాషాణాం కల్కానక్షసమాన్ పృథక్ ॥ 93 ॥**
**తథా కోమలమోచాఽపి పిప్పలీశృఙ్గబేరయోః ।**
**అర్ధప్రస్థం భవేద్దఘ్నో గౌడమద్యకృతః ఖటః (డః) ॥ 94 ॥**
**ఘృతక్షౌద్రేణ సహితః పీతో హన్తి చిరోత్థితామ్**
**వాహికాం జీర్ణభక్షాయాం ప్రాణస్య బలవర్ధనః ॥ 95 ॥**

కపిత్థ, బిల్వ, మాష, మోచరసము, పిప్పలీ, అర్ద్రక వీటి కల్కం ప్రత్యేకముగా ఒక అక్షము అర్ధ ప్రస్థము పెరుగు ఇందులో గుడ నిర్మితమైన మద్యము తయారుచేసి ఇందులో మధు ఘృతము కలిపి భోజనము జీర్ణమైన పిదప సేవించిన జీర్ణ ప్రవాహిక నశించును. ప్రాణుల బలము వృద్ధి పొందును.

**బాణమూలస్య నిష్క్వాథ(స్త్ర)పుషీబీజసంయుతః ।**
**శర్కరామధుసంయుక్తో రక్తాతీసారనాశనః ॥ 96 ॥**

రక్తాతిసార నాశక యోగము. సహచరముల క్వాథములో త్రపుషి (దోసకాయ) బీజములు, శర్కర, మధు కలిపి సేవించిన రక్తాతిసారం నశించును.

**పద్మం సమఙ్గా మధుకం చన్దనం పద్మకేశరమ్ ।**
**పయసా మధుసంయుక్తం రక్తాతీసారనాశనమ్ ॥ 97 ॥**

పద్మకము, సమంగ, యష్టిమధు, చందనము, పద్మకేశరము, వీటి చూర్ణం మధుతో కలిపి పాలతో కలిపి సేవించిన రక్తాతిసారము నశించును.

**తిలాన్ కృష్ణాన్ సమఙ్గా చ యష్టీమధుకముత్పలమ్ ।**
**పిబేదామేన పయసా రక్తాతీసారనాశనమ్ ॥ 98 ॥**

నల్ల నువ్వులు, సనుంగి, యష్టిమధు, ఉత్పలము, వీటిని దంచి పటికపాలతో సేవించిన రక్తాతిసారము నశించును.

**మోచో రసస్తిలా లోధ్రముత్పలం కమలం తథా ।**
**పిబేత్ క్షీరేణ సంయుక్తం రక్తాతీసారనాశనమ్ ॥ 99 ॥**

మోచరసం, నువ్వులు, లోధ్ర, ఉత్పలము, కమలము, వీటి చూర్ణం పాలతో సేవించిన రక్తాతిసారం నశించును.

**పయస్యా చందనం లోధ్రం పద్మకేసరమేవ చ ।**
**పయసా మధుసంయుక్తం పిబేద్రక్తాతిసారిణీ ॥ 100 ॥**

రక్తాతిసారంలో క్షీరకాకాకోలి, రక్తచందనం, లోధ్ర, పద్మకేసరములు వీటి చూర్ణమును మధుతో కలిపి పాలతోసేవించవలెను.

**రక్తం నిర్వా(ర్వ)హతే యావత్ కృచ్ఛ్రాత్ సగుదవేదనమ్ ।**
**కుప్యపాషాణతప్తేన పయసా భోజితాం తతః ॥ 101 ॥**
**మధుకం ఘృతమణ్డేన త్వథైనామనువాసయేత్ ।**

గుదములో వేదన ఉన్నంతవరకు కష్టపూర్వకముగా రక్తస్రావం జరుగును. అప్పటివరకు రాతిపాత్రలో వేసి చేసిన పాలతో యష్టిమధును సేవించవలెను. తరువాత ఘృతమండం ద్వారా అనువాసన వస్తినివ్వవలెను.

**గర్భిణ్యా వాతికీ యస్యా జాయతే పరికీ(క)ర్తికా ॥ 102 ॥**
**బృహతీబిల్వమానన్తైర్యూషం కృత్వా తు భోజయేత్ ।**

పరికర్తిక ఉన్న గర్భవతికి బృహతి బిల్వ, అనంతమూలంలో యూషను చేసి ఇవ్వవలెను.

**పరికీ(క)ర్తికాయాం గర్భిణ్యాః పైత్తికాయామిదం హితమ్ ॥ 103 ॥**
**మధుకం హంసపాదీ చ వితున్నమకథాపి చ ।**
**పాయయేన్మధుసంయుక్తం సుపిష్టం తణ్డులామ్బునా ॥ 104 ॥**

గర్భవతికి పైత్తిక పరికర్తికలో యష్టిమధు హంసపాది ధనియాలు బాగా మర్దించి మధుతో తండులోదకముతో ఇవ్వవలెను.

శ్లైష్మికాయాం తు కర్తవ్యం యథావత్తన్నిబోధత ।
కణ్టకారీ శ్వదంష్ట్రా చ అశ్వత్థం చేతి తత్ సమమ్ ॥ 105 ॥
సంపన్నలవణం కృత్వా భోజయేత్ పాయయేదపి ।

శ్లేష్మజ పరికర్తికలో చేయదగు చికిత్సను వినుము. కంటకారి, గోక్షుర, అశ్వత్థ, ఈ మూడిటిని సమాన మాత్రలో మర్దించి, అందులో లవణం కలిపి భోజన పానాదులలో ప్రయోగించవలెను.

అథ చేదత్ర గర్భిణ్యాః పార్శ్వస్యోపగ్రహో భవేత్ ॥ 106 ॥
శాలపర్ణీం పృశ్నిపర్ణీం బృహతీం కణ్టకారికామ్ ।
బిల్వాగ్నిమన్థశ్యోనాకం కాశ్మర్యమథ పాటలిమ్ ॥ 107 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 224 తమం పత్రమ్)
యూషం కృత్వా తు సంపన్నం భోజయేత్ పాయయేదపి ।

గర్భిణీ స్త్రీకి కలిగిన పార్శ్వగ్రహములో- శాలిపర్ణి, పృష్నిపర్ణి, బృహతి, కంటకారి, బిల్వ, అగ్ని మంథ, శ్యోనాక, గంభారి, పాటలా వీటితో యూషను చేసి గర్భిణి భోజన పానాదులలో ఇవ్వవలెను.

అథ చేదత్ర గర్భిణ్యా ముఖపాకో భవేదిహ ॥ 108 ॥
హరిద్రాదారునిష్క్వాథం గ్రాహయేత్ కవలం తతః ।
తతః స్నేహేన కృత్వా తు తతః స్యాచ్చర్కరోదకమ్ ॥ 109 ॥
లోధ్రోదకేన కృత్వా తు కుర్యాత్తత్ప్రతిసారణమ్ ।
అ నంతాం చ సమఙ్గాం చ ఘృషీం మోచరసం తథా ॥ 110 ॥
మధునా సహ(మ)చాశ్నీయాత్తతః సంపద్యతే సుఖీ ।

గర్భిణి ముఖపాకములో హరిద్ర దారుహరిద్రల క్వాథముతో కవల ధారణము చేయవలెను. తర్వాత స్నేహము మరియు శర్కర కలిపిన నీటితో చివరగా లోధ్రక్వాథంతో కవల ధారణము చేయాలి. తర్వాత లోధ్ర చూర్ణమును ముఖంలో ప్రతిసారణం చేయవలెను. తర్వాత సారిబ, మంజిష్ట, ఘృషి, మోచరస, వీటి చూర్ణములను మధుతో కలిపి సేవించవలెను. స్వస్థత చేయును.

ఆక్షేపకే సముత్పన్నే తథైవాప్యపతానకే ॥ 111 ॥

**మాతులుఙ్గరసః పేయో బిడసైన్ధవసంయుతః ।**
**అగ్నిమన్థస్య నిర్యూహః క్వథితో వరుణస్య వా ॥ 112 ॥**
**లావో వా తైత్తిరో వాఽపి రసః స్నిగ్ధః ప్రశస్యతే ।**
**పానార్థం వాతశమనో వాదూలో రస ఏవ చ ॥ 113 ॥**
**అసంసృష్టే తు కర్తవ్యో విధిరేష సుఖావహః ।**

గర్భిణీ ఆక్షేపములో, అపతానకములో మాదీఫల రసంలో బిడాలవణం, సైంధవలవణం కలిపి త్రాగించాలి లేదా అగ్నిమంథక్వాథం, లేదా వరుణ క్వాథము ఇవ్వాలి. లేదా లావుక, తిత్తిరి, మాంసరసంను స్నేహయుక్తంగా ఇవ్వవలెను. త్రాగుటకు వాతశమనం అయిన వాదూాల (చర్మ చట్యము) రసంతో ఇవ్వవలెను. పై చెప్పిన ఏ దోషము విశేష ప్రాబల్యము లేకున్నచో ఈ విధి లాభప్రదముగా ఉండును.

**పిత్తోపసృష్టే తు హితో జాఙ్గలో మధురో రసః ॥ 114 ॥**
**శృతో మధురకైః సర్వైర్దాడిమామ్లసమాయుతః ।**

పై చెప్పిన రోగములో పిత్త సంయోగమున్నచో మధుర జాంగల మాంసరసము సేవించవలెను. లేదా మధుర వర్గ సమస్త ఔషధములను క్వాథము చేసి అందులో దాడిమ గింజలను వేసి ఇవ్వవలెను.

**వాతశ్లేష్మసముత్థే తు వ్యమ్లస్తు కటుకో రసః ॥ 115 ॥**
**యవక్షారేణ సంయుక్తో జాఙ్గలః సతతం హితః ।**
**మృదవః పాణితాపాశ్చ పిత్తవర్జ్యే హితాస్తథా ॥ 116 ॥**

వాత కఫ సంసృష్టము ఉన్నచో అమ్ల కటు రస సేవనం చేయవలెను. జాంగల మాంసరసంలో యవక్షారం కలిపి ఇవ్వవలెను. చేతులు వేడి చేసి రోగికి మృదు తాపము కలిగించిన లాభదాయకం. కాని పిత్త ప్రకోపం కానివ్వకూడదు.

**ఘృతసేకోఽథవా కార్యో జీర్ణే గర్భే విశేషతః ।**
**ఉష్ణో వా యది వా శీతో వ్యాధిమాసాద్య తత్త్వతః ॥ 117 ॥**

లేదా జీర్ణ గర్భంలో విశేషించి ఘృతము సేకము చేయవలెను. ఇది వ్యాధి అనుసారం ఉష్ణంగా లేదా శీతముగా ఉండవచ్చును.

అథ ఛర్దిచికిత్సాం తు ప్రోచ్యమానాం నిబోధత ।
మాతులుఙ్గరసో లాజాః కోలమజ్జా తథాఽఞ్జనమ్ ॥ 118 ॥
తథా దాడిమసారశ్చ శర్కరా క్షౌద్రమేవ చ ।
ఏష వాతాత్మికాం ఛర్దిం హన్తి లేహో విశేషతః ॥ 119 ॥

ఇపుడు ఛర్ది చికిత్సను వినుము. మాదీఫల రసం లాజ, రేగు ఫల మజ్జ, అంజనము, దాడిమరసం శర్కర తేనెతో కలిపి అవలేహము చేసి ఇచ్చిన చో విశేషించి వాతిక ఛర్ది నశించును.

దాడిమామ్లో రసః పక్వో హృద్యో లవణవర్జితః ।
వాతాచ్ఛర్దిహరో రాజన్! మాహిషో వా సుసంస్కృతః ॥ 120 ॥

ఓ రాజా! హృద్యము, లవణ వర్జితము అయిన అమ్లదాడిమరసం పక్వమాంసరసం లేదా సంస్కరించబడిన మహిష మాంసరసం తినిపించిన వాతిక ఛర్ది నశించును.

శర్కరామధుసంయుక్తం లాజచూర్ణసమాయుతమ్ ।
చాతుర్జాతకకల్కేన హృద్యం పుష్పైః సువాసితమ్ ॥ 121 ॥
పిత్తచ్ఛర్దిప్రశమనం హితం తణ్డులధావనే ।
హితా లాజమయీ పేయా సితాక్షౌద్రేణ సంయుతా ॥ 122 ॥
జాఙ్గలో వా రసః పథ్యః శర్కరామధురీకృతః ।

పిత్త ఛర్దిలో చాతుర్జాతకముల కల్కముతో లాజ చూర్ణము శర్కర, మధుకలిపి పుష్పముల ద్వారా హృద్యము, సుగంధితము చేసి తండులోదకముతో ఇవ్వాలి. లేదా శర్కర, మధు, లాజ పేయ చేసి ఇవ్వాలి. లేదా జాంగల పశు పక్ష మాంసరసమును శర్కరకలిపి మధురముగా చేసి ఇచ్చిన పథ్యము.

ఆమ్రజమ్బూప్రవాలాని సితాని సుశ్రుతాని తు ॥ 123 ॥
క్షౌద్రయుక్తాని పేయాని శ్లేష్మచ్ఛర్ద్యాం విశేషతః ।
భోజనార్థే హితం యూషం ముద్గైర్దాడిమసారి(ధి)తమ్ ॥ 124 ॥
వ్యపేతస్నేహలవణం హృద్యం ఛర్దివినాశనమ్ ।
కఫజ ఛర్దిలో మామిడి నేరేడు కోమల పత్రములను పక్వము చేసి మధును

కలిపి ఇవ్వవలెను. భోజనములో దానిమ్మ రసంతో సిద్ధం చేసిన స్నేహము, లవణ యుక్తం అయిన ముద్గ యూషం హితకరము. ఇది హృద్యము, ఛర్ది నాశనము.

**సన్నిపాతసముత్థాయాం సంసృష్టాన్యవచారయేత్ ॥ 125 ॥**

సన్నిపాతజ వమనంలో సంసృష్ట యోగములను ఇవ్వవలెను.

**క్రిమిజాయాం తు కర్తవ్యం యత్ పురస్తాత్ ప్రవక్ష్యతే ।**
**వర్షాభూమూలనిషాక్వథం యోజయేద్భద్రదారుణా ॥ 126 ॥**
**తత్ పిబేన్మధుసంయుక్తం శోఫం స్త్రీ పూర్వయా సహ ।**

గర్భిణికి కృమి జన్య వమనంలో పునర్నవ మూలము, దేవదారు క్వాథములో మధు కలిపి ఇవ్వవలెను. శోఫ ఉన్నచో కేవలం పునర్నవా క్వాథం ఇవ్వవలెను.

**పిప్పల్యఙ్కోఠమూలాని వాజిలిణ్డరసస్తథా ॥ 127 ॥**
**దధి మాహిషమిత్యేతత్ కామలాయాశ్చికిత్సితమ్ ।**

గర్భిణికి కామల ఉన్నచో పిప్పలి, అంకోటమూలము, గుర్రపు పురీషరసము, మహిషక్షీరముతో చేసిన పెరుగును కలిపి ఇవ్వవలెను.

**మాతులుఙ్గరసః పేయః సైన్ధవేన సుయోజితః ॥ 128 ॥**
**వాతికే హృది శూలే తు ప్రధాన ఇతి నిశ్చయః ।**

గర్భిణి వాతిక హృచ్ఛూలలో మాతులుంగ రసం, సైంధవలవణం కలిపి త్రాగించవలెను. ఇది నిశ్చయముగా ప్రధాన ఔషధం.

**ప్రియఙ్గవోఽథ పిప్పల్యో భద్రముస్తా హరేణవః ॥ 129 ॥**
**క్షౌద్రం బదరచూర్ణం చ పిబేత్ పిత్తార్దితే హృది ।**

పైత్తిక హృచ్ఛూలలో ప్రియంగు, పిప్పలీ, భద్రముస్త, హరేణు, మధు, బదరీ చూర్ణం వీటిని ప్రయోగించవలెను.

**పిప్పలీచూర్ణకల్కాస్తు పత్రం చోచం ప్రియఙ్గవః ॥ 130 ॥**
**మాతులుఙ్గరసశ్చైవ లేహః శ్లేష్మార్దితే హృది ।**

శ్లేష్మక హృచ్ఛూలలో పిప్పలి చూర్ణము, తేజపత్ర చౌద, (దాల్చిన),

మరియు సమంగా మాదీఫల రసంలో కలిపి అవలేహ్యాము చేసి ఇవ్వవలెను.

**కులీరశృఙ్గీ శరటం భార్గీ పిప్పల్య ఏవ చ ॥ 131 ॥**
**వాతకాసహరో లేహో మాతులుఙ్గరసప్లుతః ।**

కర్కాటక శృంగి, శరట, భారంగి, పిప్పలీ, వీటి చూర్ణంను మాదీఫల రసంలో కలిపి అవలేహము చేసి ఇచ్చిన వాతజ కాస నశించును.

**మధూలికా తు గోక్షీరీ పిప్పలీ శర్కరా తథా ॥ 132 ॥**
**ద్రాక్షాక్షౌద్రసమాయుక్తో లేహో వై పిత్తకాసహా ।**

యష్టిమధు, గోక్షుర, పిప్పలీ, శర్కర వీటి చూర్ణమును ద్రాక్ష మధుతో కలిపి అవలేహము చేసి ఇచ్చిన పైత్తిక కాస నశించును.

**పిప్పల్యస్త్రిఫలా రాస్నా భద్రదారు సమాక్షికమ్ ॥ 133 ॥**
**శ్లేష్మకాసహరో లేహః కుశలైః పరికీర్తితః ।**

పిప్పలి, త్రిఫలా మరియు భద్రదారు చూర్ణమును మధుతో కలిపిన అవలేహము కఫజ కాసను హరించునని చికిత్సా కుశులచే చెప్పబడినది.

**మధుకం శఙ్ఖచూర్ణం చ జీవలాక్షాఽథ మాక్షికమ్ ॥ 134 ॥**
**లేహః శర్కరయా యుక్తః క్షతకాసవినాశనః ।**

యష్ఠి మధు, శంఖపుష్పి అశ్వత్థలాక్ష తేనె శర్కర కలిపి లేహము చేసి ఇచ్చిన క్షతజ కాస నశించును.

**మయూరస్య తు రోమాణి శ్వావిచ్ఛల్యకయోరపి ॥ 135 ॥**
**పిప్పలీతణ్డులాశ్చైవ కోలమూలం చ తత్సమమ్ ।**
**చూర్ణితం మధుసర్పిర్భ్యాం లిహేచ్ఛ్వాసకఫాపహమ్ ॥ 136 ॥**

మయూర రోమములు శ్వవి, శల్యక రోమములు, పిప్పలి, బియ్యము బదరీమూలం సమానమాత్రలో తీసుకుని చూర్ణించి వాటిని మధు ఘృతముతో కలిపి అవలేహము చేసి సేవించుటచే శ్వాస, కఫ రోగములు నశించును.

**గుడో రస్నాఽథ పిప్పల్యో ద్రాక్షా సమరిచా తథా ।**
**హరిద్రా చ సమఙ్గాని చూర్ణాన్యేతాని లేహయేత్ ॥ 137 ॥**
**తైలేన శ్వాసకాసేషు తమకే చైవ పూజితః ।**

గుడము, రాస్నా, పిప్పలీ, ద్రాక్ష, మరిచం, హరిద్ర, మంజిష్ఠ, వీటి చూర్ణమును తైలముతో కలిపి శ్వాస, కాసలలో నాకించవలెను.

అభయాఽఽమలకం వాఽపి శల్యకస్య త్వచా యుతమ్ ॥ 138 ॥
అంతర్గృహం సహోష్ట్రాస్థి దధితైలేన లేహయేత్ ।
పిప్పల్యామలకీ ముస్తా తథా ఫాణితశర్కరా ॥ 139 ॥
హరీతకీతి చూర్ణాని మధుతైలేన లేహయేత్ ।
శమనం సర్వకాసానాం శ్వాసానాం చ ప్రశస్యతే ॥ 140 ॥

సమస్త శ్వాస కాసలలో హరిద్ర, ఆమలకి, శల్యక, త్వక్, గృహధూమము, ఉష్ట్రాస్థి వీటిని చూర్ణించి పెరుగు తైలముతో నాకవలెను. పిప్పలి, అమలకి, ముస్త, ఫాణితము, శర్కర, హరీతకి, చూర్ణమును మధుతో కలిపి నాకించవలెను.

భద్రదారుహరీతక్యా సైన్ధవం కుష్ఠమేవ చ ।
ఘృతం చ ఫాణితం చైవ లేహ ఊర్ధ్వానిలాపహః ॥ 141 ॥

భద్రదారు, హరీతకి, సైంధవలవణము, కుష్టము, ఘృతము, కలిపి తయారుచేసిన అవలేహము ఊర్ధ్వవాతమును హరించును.

పిప్పలీ గైరికం భార్గీ హిఙ్గు కర్కటకీ తథా ।
సమాని చ భవేల్లేహో హిక్కాప్రశమనః స్త్రియాః ॥ 142 ॥

పిప్పలీ, గైరికము, భారంగి, హింగు, కర్కాటక శృంగి, సమాన మాత్రలో తీసికొని అవలేహము చేసి ఇచ్చిన గర్భిణీహిక్కను శాంతింప చేయును.

(పిప్పలీ) పిప్పలీమూలం ముస్తా తగరమేవ చ ।
దీపనీయం భవేదేతత్ క్షీరేణ తు సమాక్షికమ్ ॥ 143 ॥

పిప్పలి, పిప్పలీమూలము, ముస్త, తగరము, మధుతో కలిపి పాలతో సేవించిన అగ్నిదీప్తి కలుగచేయును.

శతావరీ దర్భమూలం మధుకం క్షీరమోరటః ।
పాషాణభేదకోశీరం కతకస్య ఫలాని చ ॥ 144 ॥

**ఏషాం క్వాథరసం కల్కం క్షీరం వా పాయయేద్భిషక్ ।**
**మూత్రగ్రహేషు సర్వేషు సిద్ధమిత్యాహ కశ్యపః ॥ 145 ॥**

అన్ని మూత్రగ్రహ రోగములలో శతావరీ, దర్భమూలము, యష్టిమధు, క్షీరమోరట, (మూర్వభేదము) పాషాణభేదము, ఉశీరము, నిర్మల భేదము వీటి క్వాథము కల్కమును, లేదా క్షీరపాకమును ఇవ్వవలెనని మహర్షి కాశ్యపుని మతము.

**వాతగుల్మస్య భైషజ్యం యోనిగుల్మస్య చాప్యథ ।**
**యథావత్ పూర్వముద్దిష్టం సమాసేన చికిత్సితమ్ ॥ 146 ॥**

వాత గుల్మము, యోని గుల్మము చికిత్స, సంక్షేపముగా ముందుగానే చెప్పబడింది.

**వాతికే పైత్తికే చైవ శ్లైష్మికే చ విశేషతః ।**
**(ఇతి తాడపత్రపుస్తకే 225 తమం పత్రమ్)**
**చతుర్థే మాసి నారీణామిదం కుర్యాచ్చికిత్సితమ్ ॥ 147 ॥**

నాల్గవ మాసములో గర్భిణీస్త్రీకి వాత, పిత్త, శ్లేష్మిక గుల్మము యొక్క చికిత్స ఈ క్రింది విధముగా చేయవలెను.

**సర్పిభిరన్నపానైర్వా క్షీరేణేక్షురసేన వా ।**
**వామయేత్ ఫలయుక్తేన యథావదితి కశ్యపః ॥ 148 ॥**

మదనఫల యుక్త ఘృతము అన్నపానము, పాలు, ఇక్షురసము ద్వారా వమనం చేయించవలెను అని మహర్షి కాశ్యపుడు చెప్పెను.

**చతురఙ్గలసిద్ధేన రసేన పయసాఽపి వా ।**
**విరేచయే త్తు మతిమాన్ య ఇచ్ఛేత్ సుఖమాత్మనః ॥ 149 ॥**

లేదా స్వాస్థ్యమును కోరువాడు ఆరగ్వధ రసముతో చేయబడిన మాంసరసము లేదా క్షీరపాకము ద్వారా గర్భిణీస్త్రీకి విరేచనం చేయవలెను.

**పూతీకపత్రైర్బృహ్మైర్వా పుష్పైర్వాట్యాలకస్య వా ।**
**ఆమ్లాం యవాగూం ప్రపిబేన్నాతివేగా యథా భవేత్ ॥ 150 ॥**

పూతీ కరంజ పత్రములను వేయించి లేదా పత్ర, మూల పుష్పములతో చేయబడిన యవాగును దాడిమతో ఆమ్లముగా చేసి త్రాగవలెను. తద్వారా విరేచన అతియోగము కాదు.

ఏరణ్డ(పత్రం) క్షీరేణ వాతరోగాన్వితా పిబేత్ ।
వాతమూత్రవిరోధే తు శూలే వాఽపి సముత్థితే ॥ **151** ॥

గర్భిణీ స్త్రీకి వాతరోగము, వాతిక మూత్రగ్రహము, లేదా శూల కలిగినచో క్షీరముతో ఏరండ పత్రచూర్ణమును ఇవ్వవలెను. లేదా క్షీరములో ఏరండ పత్రములను పక్వం చేసి ఇవ్వాలి.

పఞ్చమే మాసి గర్భిణ్యా వ్యక్తామ్లలవణం తతః ।
ఆస్థాపనం హితం నార్యా మధురం చానువాసనమ్ ॥ **152** ॥

5వ మాసంలో గర్భిణీ స్త్రీకి అమ్లలవణ ద్రవ్యముక్త ఆస్థాపన వస్తి, మధురద్రవ్యములతో అనువాసన వస్తి ఇవ్వాలి.

గ్రంథీనాం పిడకానాం చ శోథే చైవ విశామ్పతే ।
రోహిణ్యాం విద్రధౌ వాఽపి షష్ఠమాసే విశేషతః ।
యథాస్వం భేషజం కుర్యాద్దారుణం శాస్త్రపారగః ॥ **153** ॥

ఓ రాజా! శాస్త్ర కుశలుడైన వాడు గర్భిణీ 6వ మాసంలో గ్రంధి రోగము పిడక, శోథ రోహిణీ అను విద్రది రోగముల చికిత్సను ఆయారోగానుసారం దారుణ చికిత్స చేయవలెను.

పీనమాంసోపశమనం క్షారకర్మాగ్నికర్మ చ ।
భగ్నాస్థిశ్లేషణం చైవ శస్త్రకర్మ తథైవ చ ॥ **154** ॥

7వ మాసంలో గర్భిణీ స్త్రీకి, పెరిగిన మాంసం ను శాంతింప చేయుటకు క్షార, అగ్ని కర్మలు, అస్థి భగ్నము, సంధానము చేయుట మొదలగు శస్త్రకర్మలు చేయవచ్చును.

దష్టా సర్పేణ పీతా వా యా విషం గర్భిణీ నృప ॥ **155** ॥
వమనాదిర్విషఘ్నైస్తు సంసృష్టః స్యాదుపక్రమః ।

గర్భవతికి పాముకాటు లేదా విషపానము చేసినచో విషనాశక వామక ఔషధముల ద్వారా సంసర్జనక్రమములో చికిత్స చేయవలెను.

పాఠాఽమృతా సోమవల్క్యం ద్వే సహే కుటజం తథా ॥ **156** ॥
క్షీరక్వథితమేతత్తు పేయం నార్యా విషాపహమ్ ।

పాఠా, గుడూచి శ్వేతఖదిరము, సహా, అతిసహా, కుటజ, వీటిని క్షీరపాకము చేసి త్రాగించిన విషమును హరించును.

శిరీషం పాటలీమూలం తణ్డులీయకమేవ చ ॥ **157** ॥
సిందువారితమూలం చ మూలం సహచరస్య చ ।
నిష్క్వాథ్య సాధయేత్ పేయాం ప్రక్షుద్రాం విషనాశనీమ్ ॥ **158** ॥

శిరీష, పాటలీమూలము, బియ్యము, నిర్గుండి, సహచరమూలము వీటి క్వాథమును చేసి పలుచటి పేయను తయారు చేసి ఇచ్చిన విషమును నశించును.

ఖడయూషాదికం చాపి యుక్త్యాఽన్నమశితం హితమ్ ।
ద్వితీయే వక్ష్యతే యచ్చ స్థానే తచ్చాపి కారయేత్ ॥ **159** ॥

ఇందులో ఖడయూషము మరియు యుక్తి పూర్వకముగా సేవించిన అన్నం హితకరం, ఈ విషయంలో అన్యస్థానములలో చెప్పబడిన యోగములను కూడా ప్రయోగించవలెను.

గర్భిణీ దుర్బలాకారా యా భవత్యాసితా సతీ ।
జ్వరశ్చాభిద్రవత్యేనాం తస్యా గర్భో విపద్యతే ॥ **160** ॥

గర్భవతి దుర్బలము, పాండుత, జ్వరము కలిగినపుడు గర్భం నశించును.

బహు భుంక్తే తు యాఽత్యర్థం బహుశో బహుమూర్ఛితా ।
భవేత్తస్యాః పతేద్గర్భో గర్భిణ్యాస్తు న సంశయః ॥ **161** ॥

అధికముగా భుజించుట, మాటి మాటికి భుజించుట, మూర్ఛితము అగునంతవరకు తినుటవలన గర్భిణికి నిస్సందేహముగా గర్భపాతము కలుగును.

నేత్రే ముస్తోత్థితాకారే కర్ణౌ పాదౌ చ శీతలౌ ।
కేశాశ్చ జటిలా యస్యాస్తస్యా గర్భో విపద్యతే ॥ **162** ॥

గర్భిణీ నేత్రములు ముస్త సమానముగా వాచుట కర్ణపాదములు చల్లబడుట, వెంట్రుకలు చిక్కుపడినచో ఆమె గర్భము నశించును.

ఉపరిష్టాత్తు యో నాభ్యా ఉభే పార్శ్వే నిషేవతే ।
మధ్యే వా తిష్ఠతే నార్యాః సోఽపి గర్భో విపద్యతే ॥ **163** ॥

గర్భవతికి ఉదరములో నాభి పైభాగమున ఇరుపార్శ్వములలో లేదా మధ్యలో గర్భము స్థితమైనచో గర్భము నశించును.

రుక్ సంధిమోక్షే యస్యాః స్యాన్మృష్టాన్నే చారుచిస్తథా ।
నిశ్చేష్టస్వప్నకామాయాస్తస్యా గర్భో విపద్యతే ॥ **164** ॥

సంధి బంధనముల యందు పీడ కలుగుట అన్నమునందు అరుచి చేష్టా శూన్యత అధికముగా పడుకొను ఇచ్ఛ కలిగిన స్త్రీకి గర్భం నశించును.

**సంధిశోథో౽ఙ్గపాకశ్చ వి(క్రామశ్చ గురుర్భవేత్।**
**యస్యాస్తస్యాః సుతో జాతో మ్రియతే నాత్ర సంశయః ॥165 ॥**

సంధుల యందు శోథ, అంగపాకము, పదన్యాసము బరువుగా ఉండుట, వీటి ఉత్పన్నము వలన పుత్రుడు నిస్సందేహముగా నశించును.

శోచన్త్యాః పరిదేవిన్యాః ప్రధ్యాయిన్యాస్తథైవ చ ।
**అఙ్గులీస్ఫోటశీలాయా జాతః పుత్రో న జీవతి ॥ 166 ॥**

చింత, శోకము, దుఃఖము, మరియు, అంగుళీస్ఫుటనము గర్భిణీ స్త్రీకి కలిగినచో ఆమె పుత్రుడు జీవించడు.

**దుర్గంధి చ పయో యస్యా జటిలాశ్చ శిరోరుహాః ।**
**మలినాశ్చ తతస్తస్యా జాతః పుత్రో న జీవతి ॥ 167 ॥**

గర్భిణీ స్త్రీ దుర్గంధయుక్తమైనచో వెంట్రుకలు జటిలము మలిన యుక్తమైనచో అమెకు పుట్టబోయే బిడ్డ జీవించడు.

**పూతిగంధి ముఖం యస్యాః శూలం చైవోపజాయతే ।**
**నిద్రా వా౽భిద్రవత్యేనాం మూఢగర్భా న జీవతి ॥ 168 ॥**

గర్భిణీ ముఖము నుండి దుర్గంధము వచ్చుట, ఉదర శూల ఎల్లపుడూ నిదురించుట ఈ మూఢ గర్భం జీవించదు.

**మయూరగ్రీవసంకాశం యా పశ్యతి హుతాశనమ్ ।**
**శూనపాదముఖీ చైవ మూఢగర్భా న జీవతి ॥ 169 ॥**

గర్భిణీ స్త్రీ అగ్నిని మయూరగ్రీవము వలె నీలముగా చూచినచో మరియు ఆమె పాదములు ముఖము వాపు కలిగినచో ఆమూఢగర్భ జీవించదు.

పార్శ్వశూలం చ తృష్ణా చ సంజ్ఞానాశస్తథైవ చ ।
శ్వాసశ్చ వర్త్మరోధశ్చ యస్యాః సాఽపి న జీవతి ॥ 170 ॥

కటి గ్రహము, పార్శ్వశూల, తృష్ణ, సంజ్ఞానాశ, శ్వాస, మార్గావరోధము కలిగిన గర్భిణి కూడా జీవించదు.

కటిగ్రహో యోనిశూలం పూతిగంధి ముఖం తథా ।
సంజ్ఞానాశః ప్రలాపో వా గర్భిణ్యాః సా న జీవతి ॥ 171 ॥

కటి గ్రహము, యోని శూల, ముఖం దుర్గంధ యుక్తంగా సంజ్ఞానాశము, ప్రలాపము కలిగిన గర్భిణీ స్త్రీ జీవించదు.

నాసా తు కాకవద్యస్యాః స్రస్తనేత్రా చ యా భవేత్ ।
తథా శకుంతగంధా చ గర్భః శస్త్రేణ ముచ్యతే ॥ 172 ॥

గర్భవతి ముక్కు కాకి ముక్కువలె ఉండి, నేత్రములు కంపించునది, పక్షివలె గంధము వచ్చుచున్న, స్త్రీ గర్భమును శస్త్రముల ద్వారా బయటకు తీయవలెను.

అజాశ్వగంధా శ్వేతా యా మాయూరం మాంసమిచ్ఛతి ।
గర్భస్తస్యాపి శస్త్రేణ నార్యా నిర్హ్రియతే నృప ॥ 173 ॥

ఓ రాజా! మేకవలె లేదా గుఱ్ఱము వలె గంధం వచ్చు గర్భిణీపాదములు పాండుత్వం కలిగి మయూర మాంసమును కోరు గర్భిణీ గర్భములు కూడా శస్త్రము ద్వారా బయటకు తీయవలెను.

రక్తవస్త్రపరీధానా రక్తమాల్యానులేపనా ।
స్మయతే సా శయానా వా శ్మశానం యాఽధిరోహతి ॥ 174 ॥

ఎఱ్ఱని వస్త్రములు ధరించు గర్భిణీ ఎఱ్ఱని మాలలు ధరించునది నిద్రించునపుడు నవ్వునది లేదా శ్మశానము వైపు పోవునది ఆమూఢ గర్భము కలిగిన స్త్రీ గర్భసహితముగా నశించును.

ఖరం వరాహం మహిషం శ్వానముష్ట్రం తథైవ చ ॥ 175 ॥
స్వప్నేఽధిరోహతే యా తు సగర్భా సా వినశ్యతి ।

స్వప్నములో గాడిదలు, పందులు, గేదెలు, కుక్కలు, లేదా ఒంటెపై స్వారీ చేయునట్లు కలిగినస్త్రీ గర్భసహితముగా నశించును.

నిత్యస్నాతా చ మృష్టా చ శుక్లవస్త్రధరా శుచిః ॥ **176** ॥
దేవవిప్రపరా సౌమ్యా గర్భిణీ తు సదా భవేత్ ।

గర్భిణీ స్త్రీ నిత్యస్నానముచే శరీరము తుడుచుకొని శ్వేత వస్త్రములను ధరించి పవిత్రము సౌమ్యమై ఎల్లపుడు దేవతలు బ్రాహ్మణులను పూజించాలి.

బహుపుత్రామనన్తాం చ ఈశ్వరీం ముదితాం తథా ॥ **177** ॥
బ్రాహ్మీం చ సహదేవాం చ తథా చైవేంద్రవారుణీమ్ ।
జీవకర్షభకౌ భార్గీం సమఙ్గాం చ తథైవ చ ॥ **178** ॥
రోహపాదాన్ వటశుఙ్గానాత్మగుప్తాం తథైవ చ ।
అరిష్టం పూతనాం కేశీం శతవీర్యాం చ పార్థివ ॥ **179** ॥
సహస్రవీర్యాం చైతాని ప్రాజాపత్యేన సంహరేత్ ।
సందధేదథ పుష్యేణ ధారయేదుత్తరేషు చ ॥ **180** ॥

ఓరాజా! గర్భిణీ స్త్రీ కంటకారి, అనంతమూలము శివలింగి, బ్రాహ్మి, సహదేవి, ఇంద్రవారుణి, జీవకము, ఋషభకము, భారంగి, మంజిష్ట, రోహపాదము, వటాంకురము, క్రౌంచము, వేప, హరీతకి, జటామాంసి, శతవీర్య, సహస్రవీర్య మొదలగు ఔషధములను ప్రజాపత్యవిధితో గ్రహించి తర్వాత వాటిని పుష్యమీ నక్షత్రము నందు ధరించవలెను.

త్రివృతం తు మణిం కృత్వా తం శ్రోణ్యాం గర్భిణీ సదా ।
ప్రజాతా శిరసా రాజన్! ధారయేత్ కారయేత్తథా ॥ **181** ॥
సూతికాయా విశేషేణ రక్షోఘ్నాని హితాని చ ।

ఓ రాజా! గర్భిణీ త్రివృత్‌ను మణిగా చేసి శ్రోణి యందు ధరించవలెను. ప్రసవానంతరము శిరస్సు నందు ధరించవలెను. ప్రసూతి స్త్రీ విశేషించి హితకరం మరియు రక్షోఘ్న విధానమును పాటించవలెను.

జ్వరాద్యానాం వికారాణాం యత్ర యత్రేహ లక్షణమ్ ॥ **182** ॥

**అన్నాదానాం ప్రవక్ష్యామి తజ్జ్ఞేయం గర్భిణీష్వపి ।**
**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 183 ॥**

జ్వరాది వికారములలో అన్నాద బాలకులకు చెప్పబడిన లక్షణములనే గర్భిణికి కూడా అన్వయించు కొనవలెను. అని భగవాన్ కశ్యపుడు చెప్పవలెను.

**(ఇతి) ఖిలేష్వంతర్వత్నీచికిత్సితం నామ దశమోఽధ్యాయః ॥ 10 ॥**

అంతర్వత్నీ అధ్యాయము సమాప్తము.

# సూతికోపక్రమణీయాధ్యాయః - ఏకాదశః

అథాతః సూతికోపక్రమణీయం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥
ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము సూతికోపక్రమణీయమను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

ఉపక్రమం తు సూతానాం సవిశేషమతః పరమ్ ।
సంప్రవక్ష్యామి కార్త్స్న్యేన తన్నిబోధ యథాక్రమమ్ ॥ 3 ॥

ఇప్పుడు నేను ప్రసూతస్త్రీ విశేష చికిత్సను విస్తృతముగా వర్ణించెదను. నీవు క్రమముగా వినుము.

గర్భాత్ ప్రభృతి సూతాయాం భిషగ్భవతి కార్యవాన్ ।
కథం ను కాలే సంపూర్ణే సూయేదిత్యపరాపరమ్ ॥ 4 ॥

ప్రాప్తే ప్రసవకాలే చ భయముత్పద్యతే యతః ।
అస్మిన్నేకః స్థితః పాదో భవేదన్యో యమక్షయే ॥ 5 ॥

చికిత్సకుడు స్త్రీలలో గర్భధారణము మొదలు కొని ప్రసవ పర్యంతము ఇదే కార్యములో లగ్నమైయుండును. ఎప్పుడు ప్రసవము జరుగుతుంది. కాలాతీతమైనచో ప్రసవకాలస్థితి ఇంకా భయముగానుండును. ఆ సమయములో ఆ స్త్రీ ఒక పాదము ఈ లోకము మరోపాదము యమలోకములో నుండును.

సూతాయాశ్చాపి తత్ర స్యాదపరా చేన్న నిర్గతా ।
ప్రసూతాఽపి న సూతా స్త్రీ భవత్యేవం గతే సతి ॥ 6 ॥

ప్రసూత స్త్రీకి అపరాపతనము జరగనిచో ఆసమయములో అప్రసూతతో సమానముగానుండును.

దుష్ప్రజాతామయాః సంతి చతుఃషష్టిరితి స్థితిః ।
యోనిర్భ్రష్టా క్షతా చైవ విభిన్నా మూత్రసఙ్గినీ ॥ 7 ॥
సశోఫస్రావిణీ చైవ ప్రసుప్తా వేదనావతీ ।
పార్శ్వపృష్ఠకటీశూలం హృది శూలం విషూచికా ॥ 8 ॥
ప్లీహా మహోదరత్వం చ శాఖావాతోఽఙ్గమర్దకః ।
భ్రూక్షేపకో హనుస్తమ్భో మన్యాస్తమ్భోఽపతానకః ।
(ఇతి తాడపత్రపుస్తకే 226 తమం పత్రమ్)
మక్కల్లో విద్రధిః శోఫః ప్రలాపోన్మాదకామలాః ॥ 9 ॥
దౌర్బల్యం భ్రమలీ కార్శ్యం భక్తద్వేషోఽవిపాచకః ।
జ్వరాతిసారౌ వైసర్పశ్ఛర్దిస్తృష్ణా ప్రవాహికా ॥ 10 ॥
హిక్కా శ్వాసశ్చ కాసశ్చ పాణ్డుర్గుల్మశ్చ రక్తజః ।
ఆనాహోధ్మాపనే చోభే వర్చోమూత్రగ్రహోపి ॥ 11 ॥
ముఖరోగోఽక్షిరోగశ్చ ప్రతిశ్యాయగలగ్రహౌ ।
రాజయక్ష్మాఽర్దితం కమ్పః కర్ణస్రావః ప్రజాగరః ॥ 12 ॥
ఉష్ణవాతో గ్రహోవాధస్తనరోగోఽథ రోహిణీ ।
వాతాష్ఠీలా వాతగుల్మరక్తపిత్తవిచర్చికాః ॥ 13 ॥

దుష్ప్రజాతస్త్రీకి 64 రోగములుండును. 64 రోగముల సంఖ్య కేవలము ఉపలక్షణమాత్రముండును. దీనికతిరిక్తముగా కూడ రోగములుండును. అవి 1. యోనిభ్రష్ట 2. యోనిక్షత 3. యోని భేదన 4. మూత్ర సంగ 5. శోథ 6. యోనిస్రావము 7. ప్రసుప్త 8. వేదన 9. పార్శ్వశూల 10. పృష్ఠశూల 11. కటిశూల. 12. హృత్‌శూల 13. విషూచిక. 14. ప్లీహ 15. మహోదర 16. శాఖావాత 17. అంగమర్ద 18. భ్రూక్షేప 19. హనుస్తంభ 20. మన్యాస్తంభ

21. అపతానక 22. మక్కల్ల 23. విద్రది 24. శోఫ 25. ప్రలాప 26. ఉన్మాద 27. కామలా 28. దుర్బలతా 29. భ్రమ 30. కృశతా 31. భక్త ద్వేషము 32. అవిపాకము 33. జ్వర 34 అతిసారము 35. విసర్ప 36. ఛర్ది 37. తృష్ణ 38. ప్రవాహికా 39. హిక్క 40. శ్వాస 41. కాస 42. పాండు 43. రక్తగుల్మ 44. ఆనాహ 45. ఆధ్మాన 46. వర్చగ్రహ (మలబంధ) 47. మూత్రగ్రహ 48. ముఖ రోగ 49. అక్షిరోగ 50. ప్రతిశ్యాయ 51 గలగ్రహ 52. అర్దిత 53. రాజయక్ష్మ 54. కంపన 55. కర్ణ స్రావ 56. ప్రజాగర 57. ఉష్ణవాత 58. గ్రహబాధ 59. స్తనరోగ 60. రోహిణి 61. వాతష్ఠీల 62. వాతగుల్మ 63. రక్తపిత్త 64. విచర్చిక.

**ఇత్యేతే సూతికారోగాశ్చతుష్షష్టిరుదాహృతాః ।**
**తేభ్యః సర్వేభ్య ఏవాసౌ రక్షితవ్యా కథం త్వితి ॥ 14 ॥**

ఈ విధముగా 64 రోగములు చెప్పబడినవి. ఈ రోగములనుండి ప్రసూత స్త్రీని ఏ విధముగా కాపాడవలెనన్నది ప్రశ్న.

**తద్విదామపి సమ్మోహో భిషజాముపజాయతే ।**
**కి పునర్యేఽల్పమతయః పరతంత్రోపశిక్షితాః ॥ 15 ॥**

ఈ విషయములో జ్ఞానులకు కూడ మతిభ్రమ కల్గును అల్ప బుద్ధి గల వారికి అన్య శాస్త్రముల సంప్రదాయము వారిని అడగ వలసినదేమున్నది.

**తస్మాత్ సునిశ్చితార్థేన తద్విద్యేతాఽనుదశినా ।**
**అప్రమత్తేన సంభావ్యం సూతికానాముపక్రమే ॥ 16 ॥**

కావున వైద్యులు ప్రసూతస్త్రీలలో నిశ్చితార్థము తెలుసుకొనుటకు తద్విద్య, అనుదర్శి మరియు అప్రమత్తుడై చికిత్స చేయవలెను.

**తదుపక్రమసామాన్యం విశేషోపక్రమం తథా ।**
**వక్ష్యామి వ్యాసతో దేశవిదేశకులసాత్మ్యతః ॥ 17 ॥**

ఇప్పుడు దేశ విదేశ కులసాత్మ్యములననుసరించి వాటి సామాన్య విశేష చికిత్సలను చెప్పెదను.

**ప్రజాతమాత్రామాశ్వాస్య సూతాం శక్లా విజా(ప్రసా)వికా ।**
**న్యబ్జాం శయానాం సంవాహ్యా పృష్ఠే సంశ్లిష్య కుక్షిణా ॥ 18 ॥**

పీడయోద్వట్టముదరం గర్భదోషప్రవృత్తయే ।
మహతాఽదుష్టపట్టేన కుక్షిపార్శ్వే చ వేష్టయేత్ ॥ **19** ॥
తేనోదరం స్వసంస్థానం యాతి వాయుశ్చ శామ్యతి ।

ప్రసవము చేయించు స్త్రీ మధుర భాషణము చేయునది ప్రసవానంతరము ఆశ్వాసన మిచ్చి అధోముఖమున పరుండ బెట్టి వీపుపై సంవాహనము చేసి గర్భము తర్వాత శేష దోషములను వెడలించుటకు కుక్షి మర్దనము చేసి శిథిలమైన ఉదరమును పీడనము చేసి పిండవలెను. శుభ్రమైన గుడ్డను కుక్షికి నలువైపుల చుట్టవలెను. దీనిద్వారా శిథిలమైన ఉదరము స్వస్థానమునకు వచ్చును. మరియు వాయువు శాంతించును.

చర్మావనద్ధామాసందీ బలాతైలోష్ణపూరితామ్ ॥ **20** ॥
అప్యాసీత సదా సూతా తథా యోనిః ప్రసీదతి ।
ప్రియఙ్గుకానాం కృసరైః స్వభ్యక్తాం స్వేదయోత్తతః ॥ **21** ॥

ప్రసూత స్త్రీ వేడి బలా తైలము గల పాత్ర( ఆసంది) లో కూర్చునవలెను. తద్వారా యోని నిర్మలమగును. తర్వాత తైలమర్దన చేసి పిరంగాది ఓషధులతో కృశరము చేసి స్వేదనము చేయవలెను.

స్విన్నాముష్ణామ్బునా స్నాతాం విశ్రాంతాం విగతక్లమామ్ ।
కుష్ఠగుగ్గుల్వగురుభిర్ధూపయేద్ఘృతసంయుతైః ॥ **22** ॥

స్వేదనానంతరము ఉష్ణ జలముతో స్నానము చేయించి విశ్రాంతి నిచ్చి, సేద తీరినపిదప కుష్ఠ, అగరు, గుగ్గులు ఘృతముతో కలిపి శరీరమునకు ధూపనము వేయవలెను.

తతోఽగ్నిబలవ(వి)ద్వీక్ష్య త్ర్యహం పఞ్చాహమేవ వా ।
మణ్డానుపానమన్వక్షం పిబేత్ స్నేహం హితాశినీ ॥ **23** ॥

అగ్ని బలమును తెలుసుకొను స్త్రీ తన అవస్థను చూచి 3 లేదా 5 దినములవరకు మండమును సేవించవలెను. తర్వాత హితకర భోజనము చేయుచు స్నేహపానము చేయవలెను.

స్నేహవ్యుపరమేఽశ్నీయాదల్పస్నేహామసైన్ధవామ్ ।
యవాగూం త్ర్యహమేవాత్ర పిప్పలీనాగరాశ్రితామ్ ॥ 24 ॥
స్యాద్వ్యపేతౌషధా పశ్చాత్ సస్నేహలవణోత్తరా ।

స్నేహము జీర్ణమైన పిదప 3 రోజులవరకు పిప్పలి శుంఠితో తయారైన యవాగును (లవణ వర్జితము, కించిత్ స్నేహముగల) సేవించవలెను. తర్వాత ఓషధులతో తయారైన లవణ స్నేహములు తగినంత మాత్రలో గల యవాగును సేవించవలెను.

కులత్థయూషః సస్నేహలవణామ్లస్తతః పరమ్ ॥ 25 ॥
తథైవ జాఙ్గలరసః శాకానీమాని చాప్యతః ।
ఘృతభృష్టాని కూష్మాణ్డమూలకైర్వారుకాణి చ ॥ 26 ॥

స్నేహలవణ అమ్లములు వేసిన కులుత్థ యూషమును జాంగల మాంసరసమును సేవించవలెను. తర్వాత ఘృతములో వేయించిన కూష్మాండము ముల్లంగి ఏరువారుకమును (దోస) భుజించవలెను.

స్నేహస్వేదౌ చ సేవేత మాసమేకమతంద్రితా ।
ఉష్ణోదకోపచారం చ స్వస్థవృత్తమతః పరమ్ ॥ 27 ॥

ప్రసవానంతరము ఒక మాసము వరకు ప్రమాద రహితమై స్నేహన స్వేదన ఉష్ణ జలమును సేవించవలెను. తర్వాత స్వస్థవ్యక్తి వలె ఆహార విహారములను సేవించవలెను.

త్రివిధం దేశమాశ్రిత్య వక్ష్యామి త్రివిధం విధిమ్ ।
ఆనూపదేశే భూయిష్ఠం వాతశ్లేష్మాత్మకా గదాః ॥ 28 ॥
తత్రాభిస్యన్దభూయస్త్వాదాదౌ స్నేహో విగర్హితః ।
మణ్డాదిరత్ర కర్తవ్యః సంసర్గోఽగ్నిబలావహః ॥ 29 ॥
స్వేదో నివాతశయనం సర్వముష్ణం చ శస్యతే ।

3 విధములైన దేశానుసారము 3 విధములగు స్వస్థవృత్తమును వర్ణించెదను. ఆనూపదేశములు వాత కఫ రోగములు కల్గును. అక్కడ క్లేద ప్రాధాన్యము గావున

మొదట స్నేహము నిందితము. ఈ అవస్థలో అగ్ని బలమును వృద్ధి పొందించు మండ ఆది సంసర్జన క్రమమును చేయవలెను. అక్కడ స్వేదము నివాత స్థానములో శమన ఆహార విహారాదులు ఉష్ణ విధితో చేయవలెను.

**నియతం జాఙ్గలే దేశే వాతపిత్తాత్మకా గదాః ॥ 30 ॥**
**తదత్ర స్నేహసాత్మ్యత్వాత్ స్నేహాదిః స్యాదుపక్రమః ।**
**కార్యః ప్రజాతమాత్రాయా విశేషశ్చాత్ర బుధ్యతే ॥ 31 ॥**

**జాఙ్గలదేశం** - జాఙ్గలదేశంలో వాత మరియు పిత్తమునకు సంబంధించిన రోగములుండును. ఇక్కడ స్నేహము శరీరము కొరకు సాత్మ్యమగుటచే సద్యః ప్రసూత స్త్రీని స్నేహాదులతో చికిత్స చేయవలెను. వీటి వివరణ ముందు చెప్పబడును.

**కుమారప్రసవే తైలం కుమారీప్రసవే ఘృతమ్ ।**
**పిబేజ్జీర్ణే యవాగూం చ దీపనీయోపసంస్కృతామ్ ॥ 32 ॥**
**పఞ్చాహం సప్తరాత్రం వా తతో మణ్డాద్యుపక్రమః ।**

ప్రసూతస్త్రీకి పుత్రుడుత్పన్నమైనచో తైలము, పుత్రిక ఉత్పన్నమైనచో ఘృతమును త్రాగించవలెను. ఘృతము జీర్ణమైన తర్వాత 5 లేదా 7 దినముల వరకు దీపనీయ ద్రవ్యములతో సిద్ధము చేయబడిన యవాగును ఇవ్వవలెను. తర్వాత మండాది క్రమమును పాటించవలెను.

**దేశే సాధారణో చాస్యా హితః సాధారణో విధిః ॥ 33 ॥**

సాధారణ దేశములో సాధారణ విధిని పాటించవలెను.

**వైదేశ్యాశ్చ ప్రయచ్ఛంతి వివిధా మ్లేచ్ఛజాతయః ।**
**రక్తం మాంసస్య నిర్యూహం కందమూలఫలాని చ ॥ 34 ॥**

అనేక విదేశ మ్లేచ్ఛ జాతివారు ఈ అవస్థలో రక్త మాంస నిర్యూహ కందమూల ఫలాదులను సేవింతురు.

**కులసాత్మ్యం చ బుధ్యేత యస్మిన్ యస్మిన్ యథా యథా ।**
**ఔచిత్యాత్ కులసాత్మ్యస్య తత్తథైవానువర్తతే ॥ 35 ॥**

ఆయా దేశములలో ఆయా కుల సాత్మ్యములను వారి ఔచిత్యమును జూచి వారి అనుసారము ఆచరణ గావింతురు.

అతో నైకాంతికత్వాచ్చ సూతికోపక్రమస్య చ ।
**దేశం చ జాతిసాత్మ్యం చ సంప్రధార్య ప్రయోజయేత్ ॥ 36 ॥**

కావున సూతికా చికిత్సను ఏకదేశీయమని భావించకూడదు. దేశ సాత్మ్యములను దృష్టిలో నుంచుకొని వాటిని ప్రయోగించవలెను.

ఉక్తం తద్వ్యాధిభైషజ్యం దుష్ప్రజాతోపచారికే ।
**కేషాంచిదిహ వక్ష్యామి వ్యాధీనామత ఉత్తరమ్ ॥ 37 ॥**

దుష్ప్రజాతాస్త్రీ ఉపచారములో ఆయా రోగముల చికిత్స చెప్పబడినది. ఇక్కడ నేను కొన్ని రోగముల చికిత్సను వర్ణించెదను.

సర్వేషామేవ రోగాణాం జ్వరః కష్టతమో మతః ।
**తదస్యాదౌ విధిం వక్ష్యే నిదానాకృతిభేషజైః ॥ 38 ॥**

సమస్త రోగములలో జ్వరము అన్నిటికంటే కష్టమైన వ్యాధిగా చెప్పబడినది. కావున ప్రథమమున నిదాన ఆకృతి ఓషధుల ద్వారా ఆ జ్వరచికిత్సను వర్ణించెదను.

షడ్విధస్తు ప్రసూతానాం నారీణాం జాయతే జ్వరః ।
**నిజాగంతువిభాగేన నిదానం తస్య మే శృణు ॥ 39 ॥**

నిజాంగంతుక భేదములతో సూతికకు ఆరు విధముల జ్వరము కల్గును. అది వినుము.

వేగసంధారణాద్రౌక్ష్యాద్వ్యాయామాదత్యసృక్క్షయాత్ ।
**శోకాదత్యగ్నిసంతాపాత్ కట్వమ్లోష్ణాతిసేవనాత్ ॥ 40 ॥**
దివాస్వప్నాత్ పురోవాతాద్గుర్వభిష్యందిభోజనాత్ ।
**స్తన్యాగమాద్గ్రహాబాధాదజీర్ణాద్దుష్ప్రజాయనాత్ ॥ 41 ॥**
జ్వరః సంజాయతే నార్యాః షడ్విధో హేతుభేదతః ।

జ్వరనిదానము : వేగావరోధము, రూక్షత, వ్యాయామము రక్త క్షయము, శోక, అగ్ని సంతాపము, అతి కటు అమ్ల రస ఉష్ణ ద్రవ్య సేవన, దివా స్వప్నము,

పురోవాతము, గురు అభిష్యంది భోజనము, క్షీరోత్పత్తి, గ్రహబాధ, అజీర్ణము, దుష్ప్రజాయనము, మొదలగు కారణములవలన సూతికలో ఆరు విధములగు జ్వరము కల్గును.

స ఏవ పూర్వరూపేషు వ్యభిచీర్ణో విరోధిభిః ॥ **42** ॥
సంసృష్టైః స్నేహశీతామ్బుస్నానపానాశనాదిభిః ।
సన్నిపాతజ్వరో ఘోరో జాయతే దురుపక్రమః ॥ **43** ॥

ఈ ఆరు జ్వరముల పూర్వరూపములు స్నేహన, శీతల జ్వరము, స్నానపానము, అశనాదులు పరస్పరము కలిసి ఉండును. ఇందులో సన్నిపాత జ్వరము అత్యంత భయంకరముగా ఉండును. దాని చికిత్స కూడా అత్యంత కఠినముగా ఉండును.

తస్య తీవ్రాభిరావీభిః ప్రతతం వాహనశ్రమైః ।
శైథిల్యం చాగతే దేహే సంక్షుబ్ధేష్వనిలాదిషు ॥ **44** ॥

క్లాన్తేష్వింద్రియామార్గేషు సారశూన్యేషు ధాతుషు ।
ఏకోఽపి దోషః కుపితః కృచ్ఛ్రతో వహతే మహత్ ॥ **45** ॥

తీవ్ర ప్రసవ వేదన వలన, 9 మాసముల వరకు గర్భధారణ శ్రమవలన దేహము శిథిలము అగుటచే వాతాది దోషములు ప్రకోపము చెందుట వలన సమస్త ఇంద్రియ మార్గములు అలసిపోవుట వలన ధాతువులు ప్రసవానంతరము సారరహితమగుటచే ఒక్క దోషము ప్రకోపించినప్పటికి శరీరమునకు అతి కష్టము కలిగించును.

పరిజీర్ణం యథా వస్త్రం మలదిగ్ధం సమన్తతః ।
క్లేశేన శోధ్యతే తజ్ఞైః ప్రదృశ్య తత్తదాశ్రయమ్ ॥ **46** ॥

తథా శరీరం సూతాయాః పరిక్లిష్టం పరిస్రుతమ్ ।
భృశం దోషబలైర్దిగ్ధం క్లేశేన పరిశోధ్యతే ॥ **47** ॥

జీర్ణవస్త్రము అంతట మలినమైనపుడు ఆ వస్త్రమును దృష్టిలో ఉంచుకొని ఉతుకునపుడు అతిశ్రద్ధతో కష్టముగా శుభ్రము చేయునపుడు ఉన్నట్లు

సూతికా శరీరము అలసి పరిశ్రుతము అగుటచే వాతాది దోషముల బలక్షీణము అగుటచే అతి జాగరూకతో శోధనము చేయవలెను.

యథా చ జీర్ణం భవనం సర్వతః శ్లథబన్ధనమ్ ।

(ఇతి తాడపత్రపుస్తకే 227 తమం పత్రమ్)

వర్షవాతవికమ్పానామసహం స్యాత్తథావిధమ్ ॥ **48** ॥

తథా శరీరం సూతాయాః ఖిన్నం ప్రస్రవణశ్రమైః ।

వాతపిత్తకఫోత్థానాం వ్యాధీనామసహం భవేత్ ॥ **49** ॥

లేనిచో పురాతన భవనము సకల బంధనములు శిధిలమగుటచే వర్ష, వాయు, భూకంపాదులను సహించలేనట్లుగా సూతిక శరీరము కూడా ప్రసవ కష్టముచే స్విన్నమై వాతపిత్త కఫములతో ఉత్పన్నం అగు రోగములను భరించలేదు.

దోషైరేవ శరీరాణి ధార్యంతే సర్వదేహినామ్ ।

తేషు క్షీణేషు సూతాయా జ్వరః సంతాపలక్షణః ॥ **50** ॥

దేహం సంతాపయత్యాశు శుష్కేన్ధనమివానలః ।

వాతాది దోషముల ద్వారా సమస్త ప్రాణుల శరీరము ధరించబడును. సూతికలో ఈ దోషములు క్షీణించుటవలన తాపలక్షణము కలిగిన జ్వరము కలుగును. ఏ విధంగానైతే అగ్ని శుష్కించిన ఇంధనమును ధరించునో అదే విధముగా జ్వరము కూడా సర్వశరీరమునందు సంతాపమును ఉత్పన్నం చేయును.

తద్ధేతుమాత్రవృద్ధానాం దోషాణాం తు యథోచ్ఛ్రయమ్ ॥ **51** ॥

కుర్యాదుపశమం ధీమాన్ ధాతూనాం చ ప్రసాదనమ్ ।

బుద్ధి మంతుడగు వాడు సాధారణ కారణములతో వృద్ధి చెందిన దోషములను కూడా శాంతింపచేయవలెను. మరియు ధాతువులను ప్రసాదనము చేయవలెను.

షడ్భిర్మాసైః ప్రసూతాయా ధాతవో రుధిరాదయః ॥ **52** ॥

ప్రత్యాగచ్ఛన్త్యరోగాయా యథాస్వం పరిసంస్థితిమ్ ।

ఏతచ్చాన్యచ్చ సంచిన్త్య చికిత్సాం సంప్రయోజయేత్ ॥ **53** ॥

రోగ రహితమైన సూతిక రక్తాది ధాతువులు ఆరు మాసములలో తిరిగి స్వాభావికావస్థకు చేరుకొనును. వీటినన్నింటిని దృష్టిలో ఉంచుకొని సూతికా చికిత్సను చేయవలెను.

అతః పరం జ్వరాణాం తు లక్షణం సంప్రవక్ష్యతే ।
విషమోష్మాఽఙ్గమర్దశ్చ జృమ్భథూ రోమహర్షణమ్ ॥ **54** ॥
కషాయవిరసాస్యత్వం శీతద్వేషోష్ణకామతే ।
దన్తహర్షః ప్రలాపశ్చ శుష్కోద్గారః ప్రజాగరః ॥ **55** ॥
ఆధ్మానమఙ్గసంకోచో వాతజ్వరనిదర్శనమ్ ।

ఇపుడు జ్వర లక్షణములు చెప్పబడును. వాతజ్వర లక్షణాలు - శరీరంలో ఉష్మ విషమ జ్వరంగా ఉండుట అంగమర్ద, జృంభ, రోమ- హర్షము, ముఖరసము- కషాయము లేదా విరసంగా ఉండుట. శీతద్వేషము, ఉష్ణకామతం, దంతహర్షము, ప్రలాపము, శుష్కోద్గారము, ప్రజాగరము, ఆధ్మానము, అంగసంకోచము.

తృష్ణా దాహః ప్రలాపశ్చ వమథుః కటుకాస్యతా ॥ **56** ॥
పీతాస్యనఖదంతాక్షివిణ్మూత్రత్వం చ లక్ష్యతే ।
కణ్ఠస్య శోషః సర్వం చ ప్రదీప్తమివ మన్యతే ॥ **57** ॥
భ్రమః శీతాభిలాషశ్చ పిత్తజ్వరనిదర్శనమ్ ।

పిత్తజ్వర లక్షణములు - తృష్ణ, దాహ, ప్రలాపము, వమన కటుకాస్యత, ముఖ, నఖ, దంత, నేత్ర, మలమూత్రముల రంగు పీతవర్ణము ఉండుట, కంఠశోష, సర్వశరీరము కాలినట్లుండుట, భ్రమ, శీతాభిలాష.

ఉష్ణాభికామతా కాసః శిరోరుగ్గాత్రగౌరవమ్ ॥ **58** ॥
మందోష్మతా ప్రతిశ్యాయః శుక్లమూత్రపురీషతా ।
నిద్రా తంద్రీర్హిమద్వేషః ష్ఠీవనం మధురాస్యతా ॥ **59** ॥
గాత్రసాదోఽన్నవిద్వేషః కఫజ్వరనిదర్శనమ్ ।

శ్లేష్మజ్వర లక్షణములు - ఉష్ణాభికామతా, కాస, శిరోవేదన శరీర గురుత్వము, శరీరము నందు మందోష్మత, ప్రతిశ్యాయము మూత్రమలములు

తెలుపుగా ఉండుట, నిద్రాధిక్యము, తంద్ర, శీతద్వేషము, ష్ఠీవనము, మధురాస్యత, గాత్రసాదము, అన్న విద్వేషము.

ముహుః శీతం ముహుర్దాహో ముహురూష్మా సమోఽసమః ॥ 60 ॥
కృచ్ఛ్రవిణ్మూత్రవాతత్వం వాతాఙ్గాన్త్రాభిసంజనమ్ ।
దాహస్తృష్ణా ప్రలాపశ్చ పిత్తాద్విక్షిప్తచిత్తతా ॥ 61 ॥
గురుత్వం కణ్ఠసంరోధః కఫాచ్చ ప్రతిశీతతా ।
సన్నిపాతజ్వరస్యైతల్లక్షణం సముదాహృతమ్ ॥ 62 ॥

సన్నిపాత జ్వర లక్షణములు- ఒకపుడు శీతము, ఒకపుడు దాహము ఒకపుడు సమోష్ణత మరి ఒకపుడు విషమంగా ఉండుట మలమూత్రవాతములు కష్టముగా వెలువడుట వాతముచే అంగములు, ఆంత్రము, కష్టమును అనుభవించును. పిత్తముచే దాహ తృష్ణ ప్రలాపము, చిత్త విక్షేపము కలుగును. కఫముచే గౌరవము, కంఠ సంక్షోభము, ప్రతిశ్యాయము ఇవి సన్నిపాత జ్వర లక్షణములు.

తృతీయేఽహ్ని చతుర్థే వా నార్యాః స్తన్యం ప్రవర్తతే ।
పయోవహాని స్రోతాంసి సంవృతాన్యభిఘట్టయేత్ ॥ 63 ॥
కరోతి స్తనయోః స్తమ్భం పిపాసాం హృదయద్రవమ్ ।
కుక్షిపార్శ్వకటీశూలమఙ్గమర్దం శిరోరుజామ్ ॥ 64 ॥
ఏతత్ స్తన్యాగమోత్థస్య జ్వరస్యోక్తం స్వలక్షణమ్ ।
స హి పీయూషసంశుద్ధౌ క్రమమాత్రేణ తిష్ఠతి ॥ 65 ॥

స్తన్యోత్పత్తి కారణమున జనించు జ్వరలక్షణములు- సూతికకు 3 లేదా 4వ దినమున స్తన్యము వచ్చును. దీనివలన దుగ్ధవహ స్రోతస్సుల మార్గావరోధము కలుగును. తద్వారా స్తన స్తంభము, పిపాసా, హృద్రవము, కుక్షి శూల, పార్శ్వ శూల, కటి శూల, అంగమర్ధము, శిరో వేదన కలుగును. క్షీరము యొక్క శోధనం అయినపుడు క్రమంగా జ్వరం శాంతించును.

గ్రహావలోకితత్రాసవాతాఘాతావధూననైః ।
జ్వర్యతే చేత్ ప్రసూతా స్త్రీ తస్య వక్ష్యామి లక్షణమ్ ॥ 66 ॥

ఉద్వేపకో నిష్టననం చక్షుషో విభ్రమః శ్రమః ।
కమ్పనం హస్తనేత్రాణాం హారిద్రముఖనేత్రతా ॥ 67 ॥

క్షణేన శ్యావతాఽఙ్గానాం క్షణేన చ సవర్ణతా ।
సుప్రబోధః సహ... క్రోశః కేశలుఞ్చనమ్ ॥ 68 ॥

పవనజ్వరరూపాణి భూయిష్ఠాని కరోతి చ ।
విధిర్గ్రహఘ్నోఽస్య హితః క్రమో యశ్చానిలజ్వరే ॥ 69 ॥

గ్రహోత్థ జ్వర లక్షణములు : గ్రహములను చూచుట వలన భయము, వాతము ఆహారము, కంపము, ఈ కారణముల వలన సూతికలో కలుగు జ్వరము యొక్క లక్షణములను చెప్పెదను- వేపథు, అంగపీడనము, నేత్ర విభ్రమణము, అలసి పోవుట, హస్త నేత్ర కంపనము, ముఖ నేత్రములలో హరిద్ర వర్ణముగా ఉండును. క్షణములో అంగములు కృష్ణ వర్ణము అగుట మరుక్షణంలో మామూలుగా ఉండుట అపుడు సమ్యక్ జ్ఞానం కలిగి ఉండుట క్రోశించుట, ఆ కుంచనము, విశేషించి వాత జ్వరలక్షణములు ఉత్పన్నం అగును అపుడు గ్రహనాశక ఉపచారం, వాతానాశక చికిత్స చేయవలెను.

శ్లేష్మాభిష్యందినీం స్థూలామక్లిన్నామల్పనిఃస్రుతామ్ ।
విదగ్ధభక్తాం స్నిగ్ధాం చ లఙ్ఘనేనోపపాదయేత్ ॥ 70 ॥

సూతికా స్త్రీ శరీరము కఫము, అభిష్యంద యుక్తమై స్థూలంగా క్లేద రహితమై స్రావం తక్కువగా ఉన్నచో భుజించిన అహార విదగ్ధం అగును. అపుడు స్నేహనం చేసి లంఘనం ప్రయోగించవలెను.

రూక్షాం నిఃస్రుతరక్తాం చ కృశాం వాతజ్వరాదితామ్ ।
క్షుత్తృష్ణాభిహతాం క్లాంతాం శమనేనోపపాదయేత్ ॥ 71 ॥

తస్యాస్తదహరేవేహ పేయాదిః క్రమ ఇష్యతే ।
లఙ్ఘితాయాశ్చ మణ్డాదిరిత్యేష ద్వివిధః క్రమః ॥ 72 ॥

రూక్ష రక్తస్రావము లేని కృశత్వము కలిగి వాతజ్వర పీడితం అయినచో ఆకలి దప్పులచే వ్యాకులమై ఉన్నపుడు శరీరము క్లాంతమైనపుడు సంశమన

ఔషధముల ద్వారా చేయవలెను. లంఘనం చేసినవారు మండాది భోజనము చేయవలెను. ఈ విధముగా 2 విధములైన భోజనక్రమము చెప్పబడింది.

**సూతికోపక్రమణీయాధ్యాయ ఏకాదశ :**

పేయా హి దీప్త్యగ్ని ధాతూన్ సంశమయత్యపి ।
గర్భదోషావశేషఘ్నో మండో దోషవిపాచనః ॥ 73 ॥

పేయ అగ్నిని దీప్తము చేసి ధాతువులను సంశమనం చేయును. మండము గర్భం యొక్క అవశిష్ట దోషములను నశింపచేయును. మరియు దోషపాచనము చేయును.

తస్మాత్ పేయా చ మణ్డశ్చ క్రమాదా విహితా హితా ।
అకృతశ్చ కృతశ్చైవ ద్విస్త్రిర్యూషరసౌ తథా ॥ 74 ॥

కావున చికిత్సా క్రమమునకు ప్రారంభమున పేయమండ ప్రయోగం హితకరం అని చెప్పబడినది. 2,3 దినముల వరకు అకృత, కృత యూషము మరియు మాంసరస సేవనం చేయవలెను.

స్వేదోఽపతర్పణం యుక్త్యా పాచనౌషధసేవనమ్ ।
కషాయోఽభ్యఞ్జనం సర్పిర్జ్వరఘ్నః పరమో విధిః ॥ 75 ॥

జ్వర నాశక ఉపాయములు- స్వేదము, యుక్తిపూర్వక అపతర్పణము, పాచనౌషధ సేవన, కషాయము, అభ్యంగము ఘృతము ఇవి శ్రేష్ట జ్వరనాశకములు.

శీతోపవాసే వ్యాయామమాయాసమహితాశనమ్ ।
తద్ధేతుసేవనం చైవ క్షిప్రం జ్వరబలావహమ్ ॥ 76 ॥

జ్వరమును వృద్ధి పొందించునవి - శీత ఉపవాసము, వ్యాయామము పరిశ్రమ, అహితకర భోజనము మరియు జ్వరమును వృద్ధి చేయు పదార్థముల సేవన వల్ల జ్వరము వృద్ధి పొందును.

గర్భాశయే చ్యుతే నార్యా దోషాస్తదనుగామినః ।
చ్యవన్తి తస్మాద్వమనం నస్యం బస్తిర్విరేచనమ్ ॥ 77 ॥
న కార్యమల్పదోషాయాః శరీరే పరిసంస్థితే ।
తదేవ యుక్తితః కార్యం వీక్ష్య దోషబలాబలమ్ ॥ 78 ॥

సూతిక గర్భాశయము స్వస్థానము నుండి చ్యుతమగుటచే శరీరస్థిత దోషములు కూడా గర్భాశయమును అనుసరించికిందివైపు వచ్చును. కావున వమనం నస్యము, వస్తి విరేచనాదులు చేయకూడదు. కాని, దోషములు అల్పమాత్రలో ఉన్నపుడు శరీరం స్థిరంగా ఉన్నపుడు దోషముల బలాబలములు చూచి యుక్తి పూర్వకముగా అన్నిటిని ప్రయోగించవచ్చును.

వమనం వా విరేకం వా తీక్ష్ణ తీక్ష్ణౌషధాన్వితమ్ ।
న హ్యతిచ్యుతదోషాయా జ్వరితాయాః ప్రశస్యతే ॥ **79** ॥

జ్వర యుక్త సూతికా దోషములు అధిక మాత్రలో స్వస్థానం నుండి చ్యుతమైనపుడు అధోభాగమునకు చేరినపుడు తీక్ష్ణ ఔషధములతో తీక్ష్ణ వమన విరేచనములు చేయకూడదు.

సంతప్తే తూష్మణా దేహే ధాతవః పరిపాచితాః ।
భూయస్తీక్ష్ణౌషధం ప్రాప్య గచ్ఛేయరమితాం గతిమ్ ॥ **80** ॥

జ్వరోష్మ వలన సంతప్తమైన శరీరంలో ధాతువులు పరిపక్వమొందును తీక్ష్ణౌషధములను ఇచ్చుటచే ధాతువులు అధికముగా పాకము చెందును.

ఉత్క్లిశ్యమానే హృదయే కఫే చాప్యురసి స్థితే ।
కఫజ్వరే క్షమే దేహే విదధ్యాద్వమనం మృదు ॥ **81** ॥

వమన ప్రయోగము- కఫ జ్వరములో హృదయోత్క్లేశము కఫము వక్షస్థలమున ఉండుట, శరీరము సహన శీలముగా ఉన్నపుడు మృదు వమనం చేయవలెను.

అరుచౌ కణ్ఠసంరోధే కఫే చైవ శిరోగతే ।
అశక్యమానే కవలే నస్యం తత్ర విధాపయేత్ ॥ **82** ॥

నస్య ప్రయోగము- అరుచి, కంఠావరోధము, కఫము శిరస్సు నందు ఉన్నపుడు కవల గ్రహము నిషేధము అయినపుడు నస్యము ప్రయోగించవలెను.

సంసర్గపాచితే దోషే జ్వరే చ మృదుతాం గతే ।
పఞ్చాహాత్ సప్తరాత్రాద్వా కషాయమువచారయేత్ ॥ **83** ॥
పాచనీయం తు పఞ్చాహాత్ సప్తాహాదానులోమికమ్ ।

సంసర్గము వలన దోషములు పక్వం అయినపుడు జ్వరము మృదువైనపుడు 5 లేక 7 దినములు కషాయ ప్రయోగము చేయవలెను. ఇందులో 5 దినములు పాచన కషాయము తర్వాత అనులోమన కషాయమును 7 దినముల వరకు చేయవలెను.

కఫపిత్తజ్వరే దద్యాత్ పఞ్చాహే శమనౌషధమ్ ॥ 84 ॥
స్వభావతైక్ష్ణ్యదల్పేన కాలేన పరిపచ్యతే ।
దుర్బలత్వాచ్చ ధాతూనాం చ్యుతత్వాదామయస్య చ ॥ 85 ॥

కఫ పిత్త జ్వరములో 5 వదినము సంశమన ఔషధములు ప్రయోగించవలెను. ఎందుకనగా ఈ రోగములో పిత్త స్వాభావిక తీక్ష్ణత వలన ధాతువులు దుర్బలమగుటచే రోగము చాలా వరకు బయటకు వెడలుటచే దోషపాచనం శీఘ్రముగా జరుగును.

వాతజ్వరే జితేఽభ్యఙ్గైస్తథైవ రసభోజనైః ।
పక్వాశయస్థే విమలే విదధ్యాదానులోమికమ్ ॥ 86 ॥
భోజయేల్లఘు చాప్యన్నం తనుభిర్జాఙ్గలై రసైః ।

వాతజ్వరములో అభ్యంగము, మాంసరస భోజనం ద్వారా శాంతించినపుడు పక్వాశయ స్థిత దోషము వెడలించుటకు అనులోమనం ప్రయోగించవలెను. తర్వాత పలుచటి జాంగల మాంసరసమును లఘు అన్నంతో భుజించవలెను.

యశ్చ నైవం శమం యాతి వాతపిత్తాత్మకో జ్వరః ॥ 87 ॥
సర్పిస్తం శమయేదాశు దావాగ్నిమివ తోయదః ।

పై చెప్పిన ఉపచారముల ద్వారా జ్వరము శాంతించినచో అది వాత పిత్తాత్మక జ్వరమని తెలుసుకొనవలెను. వాత పిత్తాత్మక జ్వరమును ఘృతముతో శీఘ్రముగా శాంతింపచేయవలెను. ఏ విధముగానైతే మేఘములు దావానలమును శాంతింపచేయునో అదే విధముగా.

విమలేఽగ్నౌ మృదౌ (వ్యాధౌ) సర్పి రేవ పరాయణమ్ ॥ 88 ॥
స్నేహవధ్యాస్తు భూయిష్ఠం వ్యాధయో దుష్ప్రజాతయః ।

జఠరాగ్ని నిర్మలముగా రోగము బలహీనముగా ఉన్నపుడు ఘృతమే ముఖ్య ఔషధము. దుష్ప్రజాత వ్యాధులు ప్రధానముగా స్నేహము ద్వారానే శాంతించును.

సన్నిపాతజ్వరే నార్యా మారుతే చ బలీయసి ॥ 89 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 228 తమం పత్రమ్)

సంస్కృతం రసయూషాభ్యాం పురాణం సర్పిరిష్యతే ।

సన్నిపాత జ్వరములో వాయు బలవుగా ఉన్నపుడు సూతిక మాంసరసము మరియు యూషద్వారా సంస్కరించబడిన పురాణ ఘృతము ప్రయోగించవలెను.

తత్ర వాతజ్వరే తావత్ ప్రవక్ష్యామి చికిత్సితమ్ ॥ 90 ॥
క్రవ్యాదానాం చ మాంసాని ధాన్యమాషతిలా యవాః ।
దశమూలమపామార్గభణ్డ్యేరణ్డాటరూషకాః ॥ 91 ॥

అశ్వగంధాం శ్వదంష్ట్రాం చ వంశపత్రం చ సంహరేత్ ।
ఇత్యేష సంకరస్వేదః సకరీషోఽమ్లసంయుతః ॥ 92 ॥

వాతజ్వరేఽవచార్యః స్యాత్ పంసర్గాదౌ సుఖావహః ।

ఇపుడు నేను వాతజ్వర చికిత్సను వర్ణించెదను. వాతజ్వరములో సంకరస్వేదము క్రవ్యాదుల మాంసము, ధాన్య మాష, తిల, యవ, దశమూల, అపామార్గ, మంజిష్ట, ఏరండ, వాస, అశ్వగంధ, గోక్షుర, వంశపత్రము, కరీష (పిడకల చూర్ణము) ఇందులో అమ్ల ద్రవ్యములను వేసి దాంతో సంకర స్వేదము చేయవలెను.

ద్వే పఞ్చమూల్యౌ వృశ్చీవమేకేషీకాం పునర్నవామ్ ॥ 93 ॥

సహస్రవీర్యాం నాదేయీం శతవీర్యాం శతావరీమ్ ।
విశ్వదేవాం శుకనసం సహదేవాం సనాకులీమ్ ॥ 94 ॥

రాస్నాఽజగంధే పూతీకం దేవాహ్వాం దేవతాడకమ్ ।
బలే ద్వే హంసపాదీం చ క్వాథార్థముపసంహరేత్ ॥ 95 ॥

కృష్ణాగరుం వ్యాఘ్రనఖం శతపుష్పాం పలఙ్కషామ్ ।
కాయస్థాం చ వయస్థాం చ చోరకం జటిలాం జటామ్ ॥ 96 ॥

అపేతరాక్షసీం యక్షగుహాం మహోష్ట్రలోమికామ్ ।
హరేణుకాం హైమవతీం కైరవం సువహాం వచామ్ ॥ 97 ॥

వృశ్చికాలీం చ భార్గీం చ శ్యామాం శిగ్రుం చ కల్కశః ।
సంహృత్య తైలం విపచేద్వాతజ్వరనిబర్హణమ్ ॥ 98 ॥

**వాతజ్వర నాశక తైలము** - దశమూలములు, వృశ్చీవ (శ్వేతపునర్నవ) ఏకేశిఖ (త్రివృత్), పునర్నవ, సహస్ర వీర్య, నాదేయ, శతవీర్య ( (ద్రాక్ష) శతావరీ, విశ్వదేవ, శ్యోనాక, సహదేవ, నాకులి, రాస్నా, అజగంధ, పూతీక, దేవదారు, దావతాడక, బల, అతిబల, హంసపాది వీటిని పాకము చేయవలెను. కాలాదులు, వ్యాఘ్రనఖము, సోంపు, గుగ్గులు, హరీతకి, చోరకము, గుడూచి, వచ, జటామాంసి, తులసి, యక్షగుహ, ఉష్ట్రలోమిక, హరేణుక, హైమవతి, విడంగ, శేఫాలిక, వచ, వృశ్చికారి, భారంగి శ్యామ, శిగ్రు, వీటి కల్కములను పై క్వాథములో వేసి యథావిధిగా తైలమును చేయవలెను. ఇది వాతజ్వరమును నశింపచేయును.

మహతః పఞ్చమూలస్య పిబేత్ క్వాథం ససైన్ధవమ్ ।
పేయో విదారిగంధాయా నిష్క్వథో వా ససైన్ధవః ॥ 99 ॥

ఇందులో బృహత్ పంచమూలము లేదా విదారి గంధాదిక్వాథము సైంధవ లవణము కలిపి త్రాగవలెను.

రాస్నాం సరలదేవాహ్వాయష్టీమధుకసంయుతామ్ ।
బృహతీం సరలం దారుం భార్గీం వరుణకం తథా ॥ 100 ॥
ఎరణ్డమూలం రాస్నాం చ వృశ్చికాలీం చ సంహరేత్ ।
ఏతదుత్క్వథితం కోష్ణం పిబేద్వాతజ్వరాపహమ్ ॥ 101 ॥
పిబేదంతరపానం చ బిల్వమూలశృతం జలమ్ ।

వాతజ్వరం నశింపచేయుటకు రాస్న, సరళ, దేవదారు, యష్టి మధు

క్వాథము లేదా బృహతి, సరళ, దేవదారు, భారంగి, ఏరండ మూలము, రాస్న, వృశ్చికారీ, క్వాథమును కొంచెం ఉష్ణముగా ఉన్నపుడు త్రాగవలెను. తర్వాత బిల్వమూలముతో సిద్ధం చేయబడిన జలము త్రాగవలెను.

పఞ్చముష్టికయూషేణ యుక్తామ్లలవణేన వ ॥ 102 ॥
భుఞ్జీత భోజనం కాలే జాఙ్గలానాం రసేన వా ।

ఉచితకాలములో యోగ్య మాత్రలో అమ్ల లవణములు కలిపిన పంచముష్టిక యూషను లేదా జాంగల మాంసరసంతో భోజనము చేయవలెను.

యవకోలకులుత్థానాం పఞ్చమూలద్వయస్య చ ॥ 103 ॥
క్వాథే దధియవక్షారచవ్యచిత్రకనాగరైః ।
పిప్పలీభిశ్చ తత్ సిద్ధం సర్పిర్జ్వరహరం పిబేత్ ॥ 104 ॥

వాతశ్లేష్మనిబంధఘ్నం గ్రహణీదీపనం పరమ్ ।
శ్యామాత్రివృత్కసిద్ధేన సర్పిషా చ విరేచయేత్ ॥ 105 ॥

యవ, కోల, కులుత్థ, దశమూల క్వాథములో దధి, యవక్షారం చవ్య, చిత్రక, శుంఠి, పిప్పలీ ఘృత సిద్ధము చేసి, త్రాగించవలెను. ఇది జ్వరమును తగ్గించును. వాతకఫ విబంధం తొలగించును. గ్రహణిని ఉత్తేజ పరచును. తర్వాత త్రివృత్ లోధ్రతో సిద్ధము చేయబడిన ఘృతము ద్వారా విరేచనము చేయించవలెను.

స చేద్వాతోల్బణత్వాచ్చ వేపథుర్నోపశామ్యతి ।
స్వభ్యక్తాముష్ణతైలేన ధూపయేత్ సురదారుణా ॥ 106 ॥
సుఖోష్ణైరమ్లపిష్టైశ్చ సర్వగన్ధైః ప్రలేపయేత్ ।

వాతప్రధాన జ్వరములో కంపనము శాంతించనిచో శరీరముపై ఉష్ణతైలమును మర్దన చేసి ధూపనం ఇవ్వవలెను. సర్వ కాంజికములో నూరి శరీరముపై ఈషదుష్ణముగా లేపనము చేయవలెను.

స్యోనాకవాసావంశానాం తర్కార్యేరణ్డయోస్తథా ॥ 107 ॥
అపామార్గస్య కాశ్మర్యా భజ్గోష్ణామ్లేఽవగాహయేత్ ।

శ్యోనాక, వంశలోచనము, వాస, అగ్నిమంథ, ఏరండ, అపామార్గ,

గంభారి, భంగ, వేడి చేసిన బాణలిలో కాంజికమును పోసి అవగాహనము చేయవలెను.

> సుఖావగాఢామాశ్వస్తాం మాంసాద్యాజినకమ్బలైః ॥ 108 ॥
> కుష్ఠగుగ్గులుధూపేన ఘృతమిశ్రేణ ధూపయేత్ ।
> ఉష్ణాని చాన్నపానాని . . . . . . ॥ 109 ॥

తదనంతరం మాంసరసము తినిపించి మృగచర్మముపై కూర్చొపెట్టి మరియు వేడి కంబలితో సుఖపూర్వకముగా కప్పి ఆశ్వాసనము ఇచ్చి ఘృతము, కుష్ఠ, గుగ్గులు, ధూపము వీటితో ధూపనం చేయవలెను. తర్వాత ఉష్ణ అన్న పానమును ఇవ్వవలెను.

> ఉష్ణో వర్జ్యశ్చ పవనః పిత్తే చోష్ణం విరుధ్యతే ।
> అతీక్ష్ణోపద్రవం తస్మాత్ పిత్తజ్వరముపక్రమేత్ ॥ 110 ॥
> కషాయతిక్తమధురైః ప్రదేహాభ్యఙ్గనౌషధైః ।

ఉష్ణము పిత్తవిరోధము మరియు ఉష్ణవాయువు కూడా ఇందులో వర్జ్యము, తీక్ష్ణ ఉపద్రవము కాని పిత్తజ్వరమును కషాయ తిక్త మధుర ద్రవ్యములు మరియు ప్రదేహము మరియు అభ్యంగన ఔషధముల ద్వారా చికిత్స చేయవలెను.

> శాఙ్గేష్టాం మరువాం పాఠాం నక్తమాలం సవత్సకమ్ ॥ 111 ॥
> నిమ్బమారగ్వధోశీరమాసుతం మధునా పిబేత్ ।

ఇందులో (కాకజంఘా) శాంగిష్ట, మరువవము, పాఠ, నక్తమాల (కరంజ) ఇంద్రయవ, నింబ, ఆరగ్వధ, ఉశీర, ఈ ఔషధములతో ఆసవము చేసి మధు కలిపి సేవించవలెను.

> స్థిరాద్యం పఞ్చమూలం చ కేసరం సకశేరుకమ్ ॥ 112 ॥
> గోపీం పర్పటకోశీరం ధాన్యకం చేతి సాధయేత్ ।
> పాదావశిష్టం తచ్ఛీతం పిబేత్ సమధుశర్కరమ్ ॥ 113 ॥

స్థిరా (శాలిపర్ణి) ఆది ఔషధములు, పంచమూలములు, నాగకేసరము, కశేరుక, సారిబ, పర్పాటక, ఉశీర, ధనియాలు, వీటితో క్వాథము చేసి చతుర్థావశేషము ఉన్నపుడు చల్లార్చి, మధు శర్కర కలిపి త్రాగించవలెను.

ముస్తద్విసారివోశీరయష్టికాలోధ్రపద్మకైః ।
ససప్తపర్ణైరష్టాభిర్ద్వార్యర్ధాఢకమాప్లుతమ్ ॥ 114 ॥
తన్నిశాముషితం పూతం పాతవ్యం శర్కరాయుతమ్ ।
కర్షేణ కటురోహిణ్యాః శ్లక్ష్ణపిష్టేన చాన్వితమ్ ॥ 115 ॥
సర్వాభిషవరాజోఽయం సర్వజ్వరనివారణః ।

ముస్త, కృష్ణ సారిబ, శ్వేతసారిబ, ఉశీర, యష్టిమధు, లోధ్ర, పద్మక, సప్తపర్ణి, ఈ 8 ద్రవ్యములలో అర్ధాఢక జలములో రాత్రంతయు నానబెట్టి ఉదయమున వడబోసి అందులో శర్కర ఒక కర్షము కటుకరోహిణి కలిపి త్రాగవలెను. ఇది ఉత్తమ అభిషవము ఇది అన్ని జ్వరములను నశింపచేయును.

మృద్వీకా నాగపుష్పం చ మరిచాన్యథ శర్కరా ॥ 116 ॥
పత్రమేలా చ చవ్యం చ పానకం పైత్తికే జ్వరే ।

పిత్తజ్వరములో ద్రాక్ష, నాగకేసరము, మరీచము, శర్కర, తేజ పత్రము, ఏల, చవ్యము పానకము చేసి త్రాగించవలెను.

భద్రశ్రీస్తిందుకో ముస్తా పయస్యా మధుకం వచా ॥ 117 ॥
కషాయ ఏషాం పాతవ్యో జ్వరాతీసారనాశనః ।
పిబేన్ముద్గరసం వాఽపి పృశ్నిపర్ణీస్థిరాయుతమ్ ॥ 118 ॥

జ్వరాతిసారములో చందనము, తిందుక, ముస్త, పయస్య, యష్టి, వచ, వీటి కషాయం త్రాగించాలి. లేదా పృష్ణిపర్ణి, శాలి పర్ణియుక్త, ముద్గ యూషమును త్రాగించవలెను.

సారివాచందనోశీరద్రాక్షాపద్మకసాధితమ్ ।
లాజపేయాం పిబేచ్ఛర్దిమూర్చ్ఛాదాహజ్వరాపహామ్ ॥ 119 ॥
ముద్గయూషేణ వాఽశ్నీయాన్మధురేణ రసేన వా ।

ఛర్ది, మూర్ఛ, దాహము, జ్వరము, నశింపచేయు సారిబ, చందన, ఉశీర, ద్రాక్ష, పద్మకవముచే సిద్ధం చేయబడిన లాజపేయ లేదా లాజపేయలో ముద్గయూషము లేదా మధురరస ద్రవ్యములను కలిపి త్రాగించవలెను.

మధుకం కేసరం గోపీ నిమ్బపత్రం కశేరుకమ్ ॥ **120** ॥
శర్కరామధుసంయుక్తో లేహో ముఖవిశోధనః ।

యష్టి, నాగకేసరములు, సారిబ, నింబపత్రములు, కశేరుక చూర్ణములో శర్కర, మధు, కలిపి ఇచ్చిన ముఖశోధనమును చేయును.

శాన్తవేగే జ్వరే చాస్మై ర్దద్యాన్మృదు విరేచనమ్ ॥ **121** ॥
చతురఙ్గులమృద్వీకాత్రివృత్కల్కేన బుద్ధిమాన్ ।
ప్రదిహేద్దారుసంయుక్తైస్తాలీసోశీరచందనైః ॥ **122** ॥

జ్వరవేగము శాంతించిన తర్వాత, ఆరగ్వధము, ద్రాక్ష, త్రివృత్ కల్కంతో మృదు విరేచనము చేయవలెను. శరీరముపై దేవదారు తాలిసపత్రి, ఉశీర, చందనముల లేపనమును చేయవలెను.

మధుకస్య చ కల్కేన కల్కేన తగరస్య చ ।
తైలమభ్యఞ్జనం సిద్ధం పీతం జ్వరమపోహతి ॥ **123** ॥

యష్టి తగర కల్కముతో సిద్ధం చేసిన తైలమును అభ్యంగనం పానము చేసిన జ్వరము నశించును.

పటోలస్య గుడూచ్యాశ్చ రోహిణ్యారగ్వధస్య చ ।
చన్దనస్య చ కల్కేన సిద్ధం సర్పిర్జ్వరాపహమ్ ॥ **124** ॥

పటోల, గుడూచి, కటుకరోహిణి, ఆరగ్వధ, చందన, కల్కముతో సాధించిన ఘృతము జ్వరమును నశింప చేయును.

చన్దనాద్యేన వా సిద్ధం పటోలాద్యేన వా ఘృతమ్ ।
పాయయేత్తిక్తసర్పిర్వా తిత్తిరాద్యమథాపి వా ॥ **125** ॥

చందనాది పటోలాది ఔషధములతో చేయబడిన ఘృతము, లేదా తిక్త సర్పి, లేదా తిత్తిరాధ్య ఘృతమును పానము చేయవలెను.

అమ్లాని చాన్నపానాని తథోష్ణకటుకాని చ ।
పిత్తజ్వరే వివర్జ్యాని ప్రత్యనీకాని చాచరేత్ ॥ **126** ॥

పిత్త జ్వరములో అమ్ల, ఉష్ణ, కటు అన్నపానములను త్యజించవలెను, దీనికి విపరీత గుణములు కలిగిన అన్న పానములను సేవించవలెను.

సమ్యక్సంసర్గయోగేన భగ్నవేగం కఫజ్వరమ్ ।
జయేద్భైషజ్యమానైశ్చ సర్పిషాఽభ్యఞ్జనేన చ ॥ 127 ॥

కఫజ్వరవేగము శాంతించిన తర్వాత ఔషధపాన, ఘృత, అభ్యంగనములతో సంసృష్ట యోగము ద్వారా శాంతింపచేయవలెను.

బృహత్యౌ పుష్కరం దారు పిప్పల్యౌ నాగరం శఠీ ।
క్వాథమేషాం పిబేదుష్ణమాదౌ దోషవిపాచనమ్ ॥ 128 ॥

కఫ జ్వర ప్రారంభమున దోషపాచనము చేయుటకు బృహతీ, పుష్కర మూలము దేవదారు పిప్పలీ, శుంఠి, శఠి ఉష్ణక్వాథమును త్రాగించవలెను.

ద్విపఞ్చమూలీం భార్గీం చ కర్కటాఖ్యాం దురాలభామ్ ।
నాగరం పిప్పలీం దారుం పిబేద్వా సైన్ధవాన్వితమ్ ॥ 129 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 229 తమం పత్రమ్)

లేదా దశమూలములు, భారంగి, కర్కాటకశృంగి, దురాలభా, శుంఠి, పిప్పలీ, దేవదారు క్వాథములో లవణము వేసి త్రాగించవలెను.

పటోలం ధాన్యకం ముస్తం మూర్వా పాఠా నిదిగ్ధికా ।
కషాయ ఏషాం పాతవ్యః షడఙ్గో మధుసంయుతః ॥ 130 ॥

పటోల, ధాన్యక, ముస్త, మూర్వ, పాఠ, నిదిగ్ధిక, ఈ ఆరింటితో కషాయం చేసి మధు కలిపి త్రాగించవలెను.

నాగరామరదారుభ్యాం శృతముష్ణం పిబేజ్జలమ్ ।
బాలమూలకయూషేణ జాఙ్గలానాం రసేన వా ॥ 131 ॥
కటూష్ణద్రవ్యయుక్తేన మన్దస్నిగ్ధేన భోజయేత్ ।

శుంఠి, దేవదారుతో పక్వం చేసిన ఉష్ణజలమును త్రాగవలెను. మూలీ యూషము లేదా జాంగల మాంసరసములో కటు ఉష్ణ ద్రవ్యములు కొంచెం స్నేహము కలిపి భోజనం చేయవలెను.

పిబేద్గోమూత్రసంయుక్తం త్రివృత్కల్కవిరేచనమ్ ॥ 132 ॥
కాలే కల్యాణకం సర్పిః పిబేద్వా దాశమౌలికమ్ ।

ఉచిత కాలములో విరేచనం కొరకు త్రివృత్ కల్కమును గోమూత్రంలో కలిపి త్రాగించవలెను. లేదా కల్యాణ ఘృతం లేదా దశమూల ఘృతం సేవించవలెను.

లాక్షా ముస్తా హరిద్రే ద్వే శతాహ్వా భద్రరోహిణీ ॥ 133 ॥
దేవపుష్పా వచా దారు సరలం చేతి తైః సమైః ।
పచేత్తైలం తదేతేన కుర్యాదభ్యఞ్జనం భిషక్ ॥ 134 ॥

లాక్షా, ముస్త, హరిద్రా, దారుహరిద్ర, శతాహ్వా, భద్రరోహిణి, (లవంగ) దేవపుష్పా, వచ, దేవదారు, సరళ అన్ని సమభాగములు తీసుకుని తైలపాకము చేయవలెను. వైద్యుడు ఈ తైలముతో అభ్యంగనము చేయవలెను.

కుష్ఠాగరువ్యాఘ్రనఖం మాంసీ ధాన్యకసామకమ్ ।
వక్రం హరేణుం హ్రీబేరం స్థౌణేయం కేసరం త్వచమ్ ॥ 135 ॥
ఏలే ద్వే సరలం దారు మూర్వా కాలానుసారివా ।
బర్హిష్ఠం శతపుష్పా చ పృథ్వీకా దేవపుష్పకమ్ ॥ 136 ॥
ఏతైర్హి సమభాగైస్తు తైలం ధీరో విపాచయేత్ ।
ఏతదభ్యఞ్జనాదేవ కఫజ్వరమపోహతి ॥ 137 ॥
శేషం వాతజ్వరహితం కార్యమత్ర చికిత్సితమ్ ।

కుష్ఠ, అగరు, వ్యాఘ్ర నఖ, జటమాంసి, ధనియాలు, సామత, వక్రీ (తగరు), హరేణు, గంధబాల (హ్రీబేరము) స్థౌణేయకము, నాగకేసరము, దాల్చిని, ఏల, బృహత్ ఏల, సరళ దేవదారు, మూర్వ, కాలానుసారిబ, బాలతిష్ఠ (నేత్రబాల) సోంపు, పృథ్వీక, లవంగ, సమభాగములుగా తీసికొని తైలపాకము చేయవలెను. ఈ తైలాభ్యంగనము చేసినచో కఫజ్వరం నశించును. శోష, మరియు వాత జ్వరములో హితకర చికిత్సనంతయు ఇందులో చేయవచ్చును.

మధురాణ్యన్నపానాని స్నిగ్ధాని చ గురూణి చ ॥ 138 ॥
కఫజ్వరే వివర్జ్యాని ప్రత్యనీకాని చాచరేత్ ।

**కఫజ్వరములో పథ్యాపథ్యములు** : మధురరస యుక్తమగు అన్నపానములను త్యజించవలెను. ఇందులో విపరీత గుణములు కలిగిన పదార్థములను సేవించవలెను.

సన్నిపాతజ్వరస్యాతః ప్రవక్ష్యామి చికిత్సితమ్ ॥ 139 ॥

స సర్వలక్షణోఽసాధ్యః కృచ్ఛ్రసాధ్యోఽల్పలక్షణః ।
బలహీనస్య నష్టాగ్నేః సర్వథా నైవ సిద్ధ్యతి ॥ **140** ॥
కిమఙ్గ ! సూతికానాం తు క్షీణధాతుబలౌజసామ్ ।
తథాఽపి యత్నమాతిష్ఠేదానృశంస్యాద్భిషగ్వరః ॥ **141** ॥

ఇపుడు నేను సన్నిపాతజ చికిత్సను చెప్పెదను. హే ప్రియా ! సంపూర్ణ లక్షణములు కలిగిన జ్వరము అసాధ్యము. అల్పలక్షణములు కలిగినది కృచ్ఛ సాధ్యము. శారీరబలము, అగ్ని బలము నశించిన వారికి ధాతు బల ఓజస్సు క్షీణించిన సూతికకు సన్నిపాత జ్వరము అసాధ్యము. వైద్యుడు రోగి మరణించు పర్యంతం తప్పక ప్రయత్నము చేయవలెను.

సన్నిపాతేషు దోషేషు యో దోషో బలవాన్ భవేత్ ।
తమేవాదౌ ప్రశమయేచ్ఛేషదోషమతః పరమ్ ॥ **142** ॥
అల్పాన్తరబలేష్వేషు దోషేషు (మతి)మాన్ భిషక్ ।
శ్లేష్మాణమాదౌ శమయేత్ స హ్యేషామనుబన్ధకృత్ ॥ **143** ॥
గురుత్వాత్ కృచ్ఛ్రపాకిత్వాదూర్ధ్వకాయాశ్రయాత్తథా ।
తస్మాజ్జ్వరేణ దుర్దిష్టం వాతపిత్తకఫాత్మకే ॥ **144** ॥

సన్నిపాత జ్వరములో అధికబలము కలిగిన దోషమునకు మొదట చికిత్స చేయవలెను. తరువాత శేష దోష చికిత్స చేయవలెను. ఒకవేళ వాతపిత్త కఫ రూప సన్నిపాతజ్వరములో దోషబలవములు సమానముగా ఉన్నపుడు మొదట వివేకవంతుడైన వాడు కఫ చికిత్సను చేయవలెను. ఎందుకనగా గురు కృచ్ఛ పాకము మరియు శరీర ఊర్ధ్వ భాగమున ఉండుటచే కఫము అనుబంధ కారకముగా ఉండును.

తస్యాం తస్యామవస్థాయాం తత్తత్ కార్యం చికిత్సితమ్ ।
సామాన్యేన తు వక్ష్యామి తద్విశేషం భిషగ్జితమ్ ॥ **145** ॥

కావున సన్నిపాత జ్వరములో ఆయా అవస్థలలో ఆయా చికిత్సను చేయవలెను. అయినా సామాన్యరూపములో అందులో ఉండు విశేషమును వర్ణించెదము.

కుశకాశశ్వదంష్ట్రార్కసుధైరణ్డపరు(షకైః) ।
. . . . న్నయవద్రోణం చర్మణ్యాస్తీర్య యుక్తితః ॥ **146** ॥
స్వేదయేత్ సూతికాం తత్ర గురుప్రావరణావృతామ్ ।

సన్నిపాత జ్వరములో స్వేదము :- కుశ, కాశ, గోక్షుర, అర్క, తూహర్, సుధ, ఏరండ, పలాశ, యవలు, ఒక ద్రోణ పరిమాణములో తీసికొని తోలుపై పరిచి సూతికను కంబళితో కప్పి యుక్తి పూర్వకముగా స్వేదము చేయవలెను.

నాగరం దశమూలం చ కట్ఫ్వఙ్గం దారుకద్వయమ్ ॥ **147** ॥

పిప్పల్యస్త్రిఫలా భార్గీ కర్కటాఖ్యా దురాలభా ।
ససైన్ధవః కషాయోఽయం జ్వరే పూర్వాపరాహ్ణికే ॥ **148** ॥
మధుహిఙ్గుసమాయుక్తో దేయః సాయాహ్నికే జ్వరే ।

పూర్వాహ్నము మరియు అపరాహ్న కాలములో వచ్చు సన్నిపాత జ్వరములో శుంఠి, శ్యోనాక, హరిద్ర, పిప్పలీ, త్రిఫల, భారంగి, కర్కాటకశృంగి, దురాలభ వీటి క్వాథములో లవణం కలిపి తాగించవలెను. సాయంత్రం వచ్చు సన్నిపాత జ్వరములో మధు హింగు కలిపి త్రాగించాలి.

పటోలముస్తామధుకరోహి . . . . . . . ॥ **149** ॥
సర్పిషా సహ పాతవ్యం సన్నిపాతేఽనిలోత్తరే ।

సన్నిపాత జ్వరములో వాత ప్రాధాన్యం ఉన్నచో పటోల ముస్త, యష్టి, రోహిణి మొదలగు ద్రవ్య క్వాథములో ఘృతం కలిపి సేవించవలెను.

ఏతదేవ త్రిఫలయా యుక్తం చ సురదారుణా ॥ **150** ॥
పాయయేన్మధునాఽఽలోడ్య సన్నిపాతే కఫోత్తరే ।

సన్నిపాతజ్వరంలో కఫప్రాధాన్యం ఉన్నచో త్రిఫలా దేవదారు మధు కలిపి సేవించవలెను.

ఏలామధూకమధుకశీతపాకీపరూషకైః ॥ **151** ॥

త్రిఫలాసారివాపాఠామఞ్జిష్ఠాచతురఙ్గులైః ।
పిత్తోత్తరే త్వభి(న్యాసే) పిబేత్ సమధుశర్కరమ్ ॥ **152** ॥

సన్నిపాతజ్వరములో పిత్తాధిక్యమున్నచో చిన్నేల, మధూక, యష్టి మధు, శతపాకి ( రుంజ), వాసా, త్రిఫలా, సారిబా, పాఠా మంజిష్ఠ, ఆరగ్వధ క్వాథములో మధు శర్కర కలిపి త్రాగవలెను.

**భార్గీ శృఙ్గీ త్రివృద్దంతీ దశమూలీ దురాలభా ।**
**కట్వఙ్గం త్రిఫలా శుణ్ఠీ పిప్పలీ చేతి తైః శృతమ్ ॥ 153 ॥**
**క్వాథం ససైన్ధవక్షారం పాయయేచ్చానులోమికమ్ ।**
**గోమూత్రయుక్తాం త్రివృతాం కేవలాం వా వచాం పిబేత్ ॥ 154 ॥**

అనులోమనం కొరకు భారంగి, కర్కాటక శృంగి, త్రివృత, దంతి, దశమూల, దురాలభ, శ్యోనాక, త్రిఫల, శొంఠి, పిప్పలీ, మొదలగు ఔషధముల ద్వారా పక్వం చేయబడిన క్వాథములో సైంధవలవణము క్షీరము కలిపి త్రాగించవలెను. లేదా గోమూత్రములో త్రివృత్ కలిపి కేవలం వచను సేవించవలెను.

**అనులోమం గతే దోషే సంజాతే గ్రహణీబలే ।**
**. . . తతః సర్పిర్వా సాధు సంస్కృతమ్ ॥ 155 ॥**

దోషములు అనులోమనము అయి గ్రహణి బలవ్వైనపుడు సంస్కరించబడిన ఘృతమును త్రాగించవలెను.

**మధుకేనాతివిషయా రోహిణ్యా భద్రదారుణా ।**
**సిద్ధం సర్పిః పిబేత్ కాలే సన్నిపాతజ్వరాపహమ్ ॥ 156 ॥**
**కల్యాణకం మహోక్తం వా పఞ్చగవ్యమథాపి వా ।**

సన్నిపాతజ్వరములో యష్టిమధు, అతివిష, రోహిణి, దేవదారుతో తయారు చేసిన ఘృతమును త్రాగించవలెను. లేదా మహా కళ్యాణ ఘృతమును, పంచగవ్య ఘృతమును సేవించవలెను.

**శీతోష్ణైరౌషధైస్తైలం సర్వైరేవోపసంస్కృతమ్ ॥ 157 ॥**
**అభ్యఙ్గనం విధాతవ్యం యచ్చాన్యత్రిమలాపహమ్ ।**

సమస్త శీత మరియు ఉష్ణ ఔషధములతో సిద్ధము చేయబడిన తైలముతో అభ్యంగము చేయువలెను. అన్య త్రిదోషహర ఆహార విహారాదులను ఆచరించవలెను.

హరీతక్యా ప్రియంగ్వా చ మాలత్యాఽఽమ(లకేన) చ ॥ 158
ము(ఖ) ప్రక్షాలనం కార్యం వాసయా ఖదిరేణ వా ।

హరీతకి, ప్రియంగు, మాలతీ, ఆమ్లకీ, వాస, ఖదిరతో ముఖప్రక్షాళనము చేయవలెను.

శ్లక్ష్ణపిష్టం తథాఽఽమ్రాస్థి రసాఞ్జనసమన్వితమ్ ॥ 159 ॥
దంతమాంసౌష్ఠజిహ్వానాం ప్రధానం ప్రతిపాదనమ్ ।

మెత్తగా పిష్టము చేయబడిన ఆమ్రాస్థి, రసాంజనము, దంత మాంసములు ఓష్ఠములు జిహ్వాను ప్రతిసారణం చేయవలెను.

సంతప్యమానే శిరసి దధిసర్జరసాక్షతైః ॥ 160 ॥
సాశ్వగంధైర్మధుయుతైర్లలాటముపలేహయేత్ ।

శిరస్సులో సంతాపము ఉన్నచో దధి సర్జరసం, బియ్యం, అశ్వగంధలను మధుతో కలిపి లేపనం చేయవలెను.

లఘ్వన్నకృతసంసర్గే నిరష్టాహపరే జ్వరే ॥ 161 ॥
సంసర్గే సన్నిపాతే వా సప్రలాపేఽనిలోత్తరే ।
సశూలబద్ధవిణ్మూత్రే సశ్వాసే చ విశేషతః ॥ 162 ॥
పురాణసర్పిః సంస్కారో విధేయో జాఙ్గలో రసః ।
దశమూలకులుత్థానాం యవానాంకువలస్య చ ॥ 163 ॥
కులీరశృఙ్గ్యా రాస్నాయాః శఠీపుష్కరమూలయోః ।
భర్గ్యా దురాలభాయాశ్చ నిర్యూహే సాధు సాధితః ॥ 164 ॥
తేనాస్య విగుణో వాయుర్జ్వరశ్చాస్య ప్రశామ్యతి ।

జ్వరంలో 8 దినముల తర్వాత లఘు అన్నం సేవించిన ప్రలాప యుక్తమై ద్వంద్వజ సన్నిపాత జ్వరములో వాత ప్రదానమై ఉండి శూల, మలమూత్ర బంధం, శ్వాస కృచ్ఛ్రత ఉన్నచో పురాణ ఘృతములో సంస్కృత జాంగల మాంసరసమును ఇవ్వవలెను. దశమూలము కులుత్థ, యవ, కువల, కర్కాటక

శృంగి, రాస్న, శఠి, పుష్కరమూలము, భారంగి, దురాలభ వీటిని సిద్ధము చేసి నిర్వ్యాహము చేయవలెను. తద్వార వికృత వాత జ్వరము నశించును.

**పాచనీయైరుపక్రాన్తే భగ్నవేగే సతి జ్వరే ॥ 195 ॥**
**పక్వాపశేషే చ మలే బలే మందత్వమాగతే ।**

పాచన ద్రవ్యములతో జ్వరవేగం శాంతించిన తర్వాత మలము పక్వం అయి శేషముగా ఉన్నపుడు బలహ్రాసమైనపుడు ఈ క్రింది సంశమన యోగములలో మధు కలిపి ఇవ్వాలి.

1. పిప్పలీ, దురాలభ 2. ద్రాక్ష+ పిప్పలి.

**పేయం సుశీతం సక్షౌద్రమిదం సంశమనద్వయమ్ ॥ 166 ॥**
**పిప్పలీ సదురాలమ్భా మృద్వీకా వా సపిప్పలీ ।**

గుడూచి, అమ్లకి, రసములో సారిబ, శుంఠి, లోధ్ర, దాడిమ, చందన కల్కము కలిపి ఘృతము చేయవలెను. ఇది మంగళీయ ఘృతము, దీనిని సేవించిన విషమ జ్వరము నశించును. ఇది అన్ని జ్వరములలో కూడ అమృతప్రాయం.

**గుడూచ్యామలకానాం చ స్వరసే సాధితం ఘృతమ్ ॥ 167 ॥**

**కల్కేన సారివాశుణ్ఠీలోధ్రదాడిమచందనైః ।**
**తద్ధి మజ్గల్యకం నామ విషమజ్వరనాశనమ్ ॥ 168 ॥**

**జ్వరాణాం చాపి సర్వేషామేతదేవామృతోపమమ్ ।**
**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ అచూష్క (174)**

174- అచూషిక

**(ఇతి) ఖిలేషు సూతికోపక్రమణీయో (నామైకాదశోఽధ్యాయః)**

సూతికోపక్రమణీయాధ్యాయం సమాప్తం.

# అథ జాతకర్మోత్తరాధ్యాయః - ద్వాదశః

అథాతో జాతకర్మోత్తరమధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇపుడు మనము జాతకర్మోత్తరాధ్యాయము వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

అథ ఖలు శిశోర్జాతస్య తత్కర్మణ్యభినిర్వృత్తే ప్రథమ ఏవ మాసి కృతరక్షాహోమమఙ్గలస్వస్త్యయనస్య సూర్యోదయదర్శనోపస్థానం, ప్రదోషే చంద్రమసః ॥ 3 ॥

ఇపుడు శిశువు జన్మానంతరము ప్రసవ కర్మ నివృత్తమైన తర్వాత ప్రథమ మాసములో రక్ష, హోమ, మంగళ, స్వస్త్యనము చేయించి సూర్యోదయ దర్శనము, పూజ, రాత్రిలో చంద్ర దర్శనము చేయవలెను.

చతుర్థే మాసి స్నాతాలఙ్కృతస్యాహతవాససా సంవీతస్య ససిద్ధార్థకమధుసర్పిషా రోచనయా చాన్వాలబ్ధస్య ధాత్ర్యా సహోత్సఙ్గగృహోన్నిష్క్రమణం దేవతాగారప్రవేశనం చ। తత్రాగ్నిం ప్రజ్వలన్తం ఘృతాక్షతైరభ్యర్చ్య బ్రహ్మాణమీశ్వరం విష్ణుం స్కన్దం మాతౄశ్చాన్యాని చ కులదైవతాని గంధపుష్పధూపమాల్యోపహారైర్భక్ష్యైశ్చ బహుభిర్బహువిధైః సంపూజ్య, తతో బ్రాహ్మణవాచనం కృత్వా, తేషామాశిషో గృహీత్వాఽభివాద్య చ గురూన్ పునః స్వమాగారం ప్రవిశేత్। ప్రవిష్టం చైనమనేన మన్త్రేణాభ్యుక్ష్య భిషగ్బ్రూయాత ॥ 4 ॥

శరచ్ఛతం జీవ శిశో ! త్వం దేవైరభిరక్షితః ।
ద్విజైరప్యా శిషా పూతో గురుభిశ్చాభినందితః ఇతి ॥ 5 ॥

4 వ మాసములో శిశువునకు స్నానం చేయించి అలంకరించి, నూతన వస్త్రములను ధరింపచేసి, సర్షప, మధు ఘృతము లేదా గోరోచన యుక్తము ధాత్రితో పాటు మొదటిసారి, ఇంటి బయటకు తీసికొని వెళ్ళవలెను. ఆ మందిరములో ప్రజ్వలితమైన అగ్నికి ఘృతము, అక్షింతలు ద్వారా అభ్యర్చన చేసి, బ్రాహ్మణ, విష్ణు, స్కంధ, మాతృకలు అన్య కులదేవతలను గంధ పుష్ప ధూప మాల్యాది ఉపహారములు వివిధ భక్ష్య పదార్థముల ద్వారా పూజించి బ్రాహ్మణులకు నమస్కారము చేసి వారి ఆశీర్వాదము తీసికొనవలెను. గురు ఆదులకు అభివాదము చేసి తిరిగి గృహప్రవేశం చేయవలెను. గృహం నందు ప్రవేశించిన తర్వాత శరత శతం జీవ శిశో అను మంత్రమును ఉచ్చరించవలెను. అనగా ఓ శిశు నీవు దేవతల ద్వారా సురక్షితులై బ్రాహ్మణ అశీర్వాదముతో పవిత్రమై గురువుల ద్వారా ప్రశంసించబడి 100 సం॥ జీవించుదువు గాక !

షష్ఠే మాసి పూణ్యాహేఽభ్యర్చ్య దేవతాం, ద్విజాంశ్చ భోజనేన సంతర్ప్య దక్షిణాభిః స్వస్తి వాచ్య చ, గృహమధ్యే వాస్తుమధ్యే వా శుచౌ దేశే గోమయేనాద్భిశ్చ చతుర్హస్తమాత్రం స్థణ్డిలముపలిప్య మణ్డలం చతురస్రం వా, హిరణ్యసువర్ణరజతతామ్రకాంస్యశీసాయసాని మణయో ముక్తాప్రవాలా(దయః) సర్వే, సర్వాణి ధాన్యాని వ్రీహయః సర్వసతాలేష్టక(?) క్షీరదధిఘృతమధు గోమయగోమూత్రకార్పాసాదీని, బాలక్రీడనకాని పిష్టమయాని, తద్యథా- గోగజో ష్ట్రాశ్వగర్దభమహిషమేషచ్ఛాగమృగవరాహవానరరురుశరభసింహవ్యాఘ్ర కపితరక్షు వృకకూర్మమీనశుకసారికాకోకిలకలవిఙ్కచక్రవాకహంసక్రౌఞ్చ సారస మయూర క్రకరచకోరకపిఞ్జలచరణాయుధవర్తకాకారాణి, శైలకగృహ(క)రథక యానకస్యన్దనకశల్లికాజిఙ్ఖిరికాఖైరకేశికాతుమ్బికా దుగ్ధవాహకభద్రక సంచోల్లకపీఠప . . . . న్దికాదుహితృకాకుమారకగోలగందుకా- దీన్యన్యాని చ స్త్రీకౌతుకానీతి, భిషక్ తస్య మణ్డలం సన్నిధాయ వసుధాయై అర్ఘ్యం దత్త్వాఽనేన మంత్రేణ- ॥6॥

త్వమగ్రజా త్వం ప్రభవాऽవ్యయా చ
లోకస్య ధాత్రీ సచరాచరస్య
త్వమీజ్యసే త్వం యజసే మహీహ
మాత్రేऽవ నః (పా) హి కుమారమేనమ్ ॥ 7 ॥

6వ మాసములో శుభ దినమున దేవతలకు పూజచేసి బ్రాహ్మణులకు భోజన క్షీరాదులతో సంతుష్ట పరిచి స్వస్తి వాచనం చేసి గృహ మధ్యమున పవిత్ర స్థానంలో పేడతో 4 హస్తముల ప్రమాణము గుండ్రముగా లేక చతురస్రాకారములో అలుకవలెను. ఆవేదిక వద్ద వైద్యుడు ఐశ్వర్యయుక్త స్వర్ణ రజత తామ్ర కాంస్య, సీసము, లోహము, యొక్క మరియు మణి ముక్త ప్రవాళాదులు అక్షితాది ధాన్యములు సర్వసతా లేహ్యము పాలు, పెరుగు, నెయ్యి, తేనె, పేడ, గోమూత్రం ప్రత్తి, పిండితో చేసిన క్రింది ఆకృతి కల ఆటవస్తువులను ఆవు, ఏనుగు, ఒంటె గుఱ్ఱము, గాడిద, గేదె, మేష, మేక, మృగము, పంది, రుమ, శరభ జాతి మృగము, సింహము పులి, సింహియు, వానర, కపి, చిరుతపులి, గొర్రె, తాబేలు, చేప, చిలుక, గొరింక, కోకిల, కలిగింక, చక్రవాక హంస, క్రౌంచ, సారస, మయూర, క్రకర, చకోర, కపింజల, చర్మాయుధ, వర్తకాకారములతో మరియు శిల గృహ, రథ, యాన, స్యందన, షలిక, జంఘర, భైరిక, ఈశిక, గోల గందుక ( బంతి) మొదలగు ఆకారములు కలిగి, అన్య స్త్రీలకిష్టం అయిన ఆట వస్తువులు ఉంచి మంత్రము ద్వారా పృథ్వికి అర్ఘ్యం ఇవ్వవలెను. త్వ అగ్రజా.... అను మంత్రము చదువవలెను. అనగా పృథ్వి నీవు ప్రప్రథమముగా పుట్టినావు. నీ పుట్టుక శ్రేష్టం అయినది అవ్యయం, అక్షయము. నీవు సమస్త జడ చేతనా వస్తువులను ధరించు దానివి. పోషించుదానివి. మేము నీకు పూజను యజ్ఞము చేయుదము. నీవు మాకు తల్లితో సమానం. నీవు ఈ బాలకున్ని రక్షించు. బ్రహ్మ దీనిని అమోదించుగాక.

తతస్తం మణ్డలమధ్యే తథైవ స్నాతమలఙ్కృతమహతవాససం కుమారం ప్రాఙ్ముఖముపవేశయేన్ముహూర్తం, ముహూర్తముపవిశ్య యద్దస్తాభ్యాం ప్రథమం గృహ్ణీత పరిమృశేద్వా కృష్యేద్వా తద్భాగీ భవిష్యతీతి హృది నిమిత్తం కృత్వోత్థాప్యో-త్తరకాలమవహితయా ధాత్ర్యాऽన్వితః కుమారేణ వా ఏతైరేవ క్రీడనకైస్తైజసైరితరైశ్చ లఘుభిరఘురైరతీక్ష్ణైరవక్రజ్ఞమైరనవోపస్కరైరాకర్షణాహరణశక్తై రుచిభిర్ఘోషవద్భిర్వి-

నోద్యమానః సోపాశ్రయాస్తరణోపేతాయా భూవౌ ప్రతిదినమభ్యాసార్థం సకృదుపవిశేదితి।

తర్వాత బాలునకు స్నానం చేయించి అలంకరించి, నూతన వస్త్రములు ధరింపచేసి మండల మధ్యములో తూర్పు ముఖం చేసి కొన్ని క్షణములు కూర్చుండబెట్టి, కూర్చున్నపుడు ఆ బాలుడు తన హస్తములతో ఏది పట్టుకొనునో స్పృశించునో లేదా లాగునో అదే అతని భాగ్యం అగును. అని మనసులో తలుచుకొనవలెను. తర్వాత బాలున్ని ప్రమాద రహిత దాత్రి తీసికొని, వేరే మరో బాలకునితో లేదా తీక్ష్ణం కాని తేజోవంతమైన, తేలికయిన కఠినము కాని అతి వక్రము కాని అతి కొత్తది కాని ఒక చోటనుండి మరి ఒక చోటకు లాగికొని పోగల ఆసక్తి కరమగు శబ్దయుక్త వివిధ ఆట వస్తువులతో వినోదం కలిగించవలెను. ప్రతిరోజు ఒకరి సహాయంతో పరిచిన చాప పై ఆట వస్తువులతో అభ్యాసము చేయించవలెను.

తత్ర శ్లోకాః –

ఉపలిప్తే శుచౌ దేశే శస్త్రతోయాగ్నివర్జితే।
ఉపవిష్టం సకృచ్చైనం న చిరాత్ స్థాపయేద్ బుధః ॥ **9** ॥

పేడ, మట్టి మొదలగు వాటితో అలికిన పవిత్ర శస్త్రజల అగ్ని రహితమైన భూమిపై కూర్చొన్న శిశువును చాలా కాలము వరకు కూర్చుండ బెట్టకూడదు.

స్తైమిత్యం కటిదౌర్బల్యం పృష్ఠభఙ్గః శ్రమో జ్వరః।
విణ్మూత్రానిలసంరోధాధ్మానం చాత్యుపవేశనాత్ ॥ **10** ॥

అధిక కాలం కూర్చుండటచే స్తైమిత్యం, కటి దౌర్బల్యం పృష్ఠ భంగము, శ్రమ, జ్వరం, మలమూత్ర వాత అవరోధము కలుగును. అధ్మానము కలుగును.

ఆసీనస్యాతిబాలస్య సతతం భూమిసేవనాత్।
ఆసన్నాన్యేవ దుఃఖాని నిర్ఘాతం గాత్రభేదనమ్ ॥ **11** ॥
నిర్ఘాతాజ్జర్జరాఙ్గత్వం వేదనా జ్వరసంభవః।
తతో న వృద్ధిర్బాలస్య కఠోరాఙ్గత్వమేవ చ ॥ **12** ॥

అతి చిన్న బాలున్ని, నిరంతరం కూర్చో బెట్టినచో శీఘ్రముగా

వ్యాధిగ్రస్తుడగును. తద్వార నిర్ఘాతము, అంగభేదము కలుగును. నిర్ఘాతము వలన జర్జరత, శరీర వేదన జ్వరం కలుగును. శరీరవృద్ధి కలుగదు. అంగములు కూడా దృఢముగా కావు.

మక్షికాక్రిమికీటానాం వేలాఝుంఝానిలస్య చ ।
సర్పాఖునకులాదీనాం గమ్యో భవతి నిత్యశః ॥ **13** ॥

మరియు బాలకుడు మాక్షిక, కృమి కీటకాదులతో ఉత్పన్నం అగువ్యాధులు ఝంఝావాతము, సర్ప, ఎలుక, ముంగీసాది ప్రాణులతో ఆక్రాంతమగును.

తస్మాన్నతిచిరం నైకో న బాలో న చ రోగితః ।
ఉపవేశ్యో భవేద్బాలో నాపుణ్యాహకృతాదికః ॥ **14** ॥ ఇతి ।

కావున బాలునికి రోగావస్థలో అశుభ సమయాదులలో ఒంటరిగా చాలా సేపటి వరకు కూర్చోపెట్టకూడదు.

తస్మిన్నేవ మాసి వివిధానాం ఫలానాం ప్రాశనం, భిషగనుతిష్ఠేత్ । తద్ది దన్తజాతస్యాన్నప్రాశనం దశమే వా మాసి ప్రశస్తేఽహని ప్రాజాపత్యే నక్షత్రేఽభ్యర్చ్య దేవతాం బ్రాహ్మణాంశ్చ సమాంసేనాన్నేన దక్షిణావతా స్వస్తి వాచ్యా గోమయోపలిప్తే స్థణ్డిలే దర్భానాస్తీర్య సుమనసోఽవకీర్య చతుర్షు స్థానేషు గన్ధమాల్యాలఙ్కృతాన్ పూర్ణకలశాన్ స్వస్తికాంశ్చ సంస్థాప్య క్రీడనకవిహితాని పూర్వవదుపకరణాని సర్వాణ్యేవోపకల్ప్య లావకకపిఞ్జలతిత్తిరచరణా-యుధానామన్యతమస్య మాంసేనాన్యైశ్చ విచిత్రసుసంస్కృత కామికైర్వ్యఞ్జనైః సముదితమన్నపానం మధ్యే నిధాయ తతో భిషక్సుతమలఙ్కృతమహతవస్త్ర-పరిహితమనుష్ఠితరక్షావిధానం కుమారం ప్రాఙ్ముఖః ప్రత్యఙ్ముఖముపవేశ్యాగ్నిం ప్రజ్వాల్యాన్నం సర్వవ్యఞ్జనోపేతం గృహీత్వాఽనేన మన్త్రేణ జుహుయాత్ ॥ **15** ॥

(ఇతి తాడపత్రపుస్తకే **231** తమం పత్రమ్)

వైద్యుడు అదేసమయంలో (6వ మాసంలో) బాలునికి ఫలసేవన చేయవలెను. తర్వాత దంతములు ఉత్పన్నం అయినపుడు 10వ మాసములో ప్రజాపతి నక్షత్రములో శుభ దినమునందు దేవత బ్రాహ్మణులను పూజించి

మాంసయుక్త అన్నమును దక్షిణా సహితముగా స్వస్తి వచనములు చేసి పేడతో అలికిన వేదికపై దర్భలను పరిచి మల్లెపూలను పరిచి నలువైపులా సుగంధ ద్రవ్యములను మరియు మాల్యాదులతో అలంకరించి జలపూర్ణ కుంభములు స్వస్తికాది చిహ్నములను స్థాపించి ఇంతకు పూర్వం చెప్పిన వివిధ ఆటవస్తువులు ఉపకరణములతో లావుక, గోరింక, కపింజల, తిత్తిరి పక్షి, కోడి, మొదలగు వాటితో చేయబడిన మాంసం, మరియు అన్య సంస్కృత ప్రసన్న వ్యంజనములతో చేయబడిన అన్న పానాదులను మధ్యలో ఉంచవలెను. తర్వాత వైద్యుడు తూర్పుముఖమున కూర్చొని అలంకరించి నూతన వస్త్రములను ధరింపజేసి రక్షావిధానము చేసి బాలుడిని పశ్చిమవైపు ముఖము చేసి కూర్చొనబెట్టవలెను. తర్వాత అగ్నిని ప్రజ్వలింపచేసి సమస్త వ్యంజన యుక్తమైన అన్నమును క్రింది మంత్రముల ద్వారా ఆహుతి నివ్వవలెను.

> **యథా సురాణామమృతం నాగేంద్రాణాం యథా సుధా ।**
> **తథాఽన్నం ప్రాణినాం ప్రాణా అన్నం చాహుః ప్రజాపతిమ్ ॥ 16 ॥**
> **తదుద్భవస్త్రివర్గశ్చ లోకాశ్చైవ యథా హ్యమీ ।**
> **జుహోమి తస్మాత్త్వ య్యన్నమగ్నేఽమృతసుఖోపగమ్ ॥ 17 ॥**
> **ప్రజాపతిరనుమన్యతాం స్వాహా ।**

(మంత్రములు)

దేవతలకు అమృతము, ఏనుగులకు సుధా వలె, ప్రాణులకు అన్నం ప్రాణముగా ఉండును. అన్నమునే ప్రజాపిత అందురు. ధర్మార్థ కామములు లోకోత్పత్తి జరుగునట్లుగానే అన్నం కూడా ఉత్పత్తి అగును. కావున ఓ అగ్ని ! అమృతం వలె సుఖం నిచ్చు అన్నంను నీకు అహుతినిస్తున్నాను. ప్రజాపతి దీనిని అమోదించును.

**హుతశేషస్యాఙ్గుష్ఠమాత్రం సుమృదితం కృత్వాఽఽలభ్య బాలం తతోఽస్య ముఖే దద్యాత్త్రీణి పఞ్చ వా వారాన్, ప్రాశ్యోపస్పృశేచ్చైనమ్; ఉర్ధ్వాప్యోర్ధ్వం ద్వాదశమాసికస్యాన్నమభిలషతోఽల్పశశ్చమాని దద్యాదితి ॥ 18॥**

అగ్నిని అహుతి నివ్వగా మిగిలిన అన్నం కొంచెం తీసికొని మెత్తగా చేసి

బాలునికి మూడు లేదా 5 సార్లు తినిపించవలెను. తర్వాత జలమును ఆచమనం చేయించవలెను. 12 వ మాసములో బాలునికి ఇష్టం కలిగినపుడు కొంచెం కొంచెం ఈ క్రింది పదార్థముల నివ్వవలెను.

తత్ర శ్లోకాః -

**శాలీనాం షష్టికానాం వా పురాణానాం విశేషతః ।**
**తణ్డులైర్నిస్తుషైర్భృష్టైః క్షాలితైః సాధితా ద్రవాః ॥ 19 ॥**
**సస్నేహలవణా లేహ్యా బాలానాం పుష్టివర్ధనాః ।**
**గోధూమానాం తథా చూర్ణం యవానాం వాఽపి సాత్మ్యతః ॥ 20 ॥**

పురాతన శాలి, షష్టిక ధాన్యములను కడిగి సిద్ధము చేసిన ద్రవములను స్నేహలవణము కలిపి బాలునికి అవలేహనం చేయవలెను. ఇది పుష్టి వర్ధకము. సాత్మ్యానుసారం గోధుముల, యవలను కూడా సేవించవచ్చును.

**విడఙ్గలవణస్నేహైః పక్వోష్ణం లేహనం హితమ్ ।**
**భృశం భిన్నపురీషస్య కోద్రవానాం(ణాం) నిధాపయేత్ ॥ 21 ॥**

విడంగము లవణము, స్నేహము కలిపి పక్వం చేయబడిన ఉష్ణ అవలేహము బాలునికి హితకరం. బాలునికి అతిసారం ఉన్నచో ఇందులో కోద్రవము కలిపి తినిపించవలెను.

**మృద్వీకామధుసర్పీంషి దద్యాత్ పిత్తాత్మనః సదా ।**
**మాతులుఙ్గరసోపేతం వాతే సలవణాశనమ్ ॥ 22 ॥**

పిత్తాధిక్యంలో ద్రాక్ష, ఘృతం, మధు కలిపి ఇవ్వాలి. వాతాధిక్యంలో మాతులుంగ రసంతో లవణ యుక్త భోజనం ఇవ్వాలి.

**ఏకాన్తరం ద్వ్యన్తరం వా దేశాగ్నిబలకాలవిత్ ।**
**యదా వా క్షుధితం పశ్యేత్తదైనం సాత్మ్యమాశయేత్ ॥ 23 ॥**
**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥**

దేశం, అగ్ని, శారీరక బలం, కాలం, తెలిసిన వ్యక్తి బాలునికి ఆకలి ఉన్నపుడు సాత్మ్య భోజనం ఇవ్వవలెను. అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**(ఇతి) ఖిలేషు జాతకర్మోత్తరం నామ (ద్వాదశోఽధ్యాయః)**

జాతకోత్తరం కర్మాధ్యాయం సమాప్తం.

# కుక్కూణక చికిత్సితాధ్యాయః - త్రయోదశః

అథాతః కుక్కూణకచికిత్సితం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము కుక్కూణక చికిత్సితాధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

యదా మాతా కుమారస్య మధురాణి నిషేవతే ।
మత్స్యం మాంసం పయః శాకం నవనీతం తథా దధి ॥ 3 ॥

సురాసవం పిష్టమయం తిలపిష్టామ్లకాఞ్జికమ్ ।
అభిష్యందీని సర్వాణి కాలే కాలే నిషేవతే ॥ 4 ॥

భుక్త్వా భుక్త్వా దివా శేతే విసంజ్ఞా చ విబుధ్యతే ।
తస్య దోషాః ప్రకుపితా దూరం గత్వా చ తిష్ఠతే ॥ 5 ॥

దోషేణావృతమార్గాయాస్తతః స్తన్యం చ దుష్యతే ।

మాతా ఎల్లప్పుడు మధురద్రవ్యములు, మత్స్యములు, మాంసము, క్షీరము, శాకములు, వెన్న, దధి, సురా, ఆసవ మాషపిష్టిచే చేయబడిన పదార్థములు, అమ్ల కాంజికము, సమస్త అభిష్యంది పదార్థ సేవన దివా స్వప్నము భోజనము వెంటనే చేయుట, సంజ్ఞా శూన్యమై పోవుట అపుడు త్రిదోషములు ప్రకోపించి శరీరవములో దూరవముగా స్థిరపడును. దోషవముల ద్వారా మార్గావరోధమగుటచే ఆ స్త్రీ క్షీరము దూషితమగును.

ప్రదుష్టదోషసంజ్ఞం తు యదా పిబతి దారకః ॥ 6 ॥
లవణామ్లనిషేవిత్వాన్మాతాపుత్రౌ రసాదిహ ।
ఆహారదోషాస్తస్యాస్తు బాలస్యాయన్నభోజినః ॥ 7 ॥
అనుప్రవేశాదాక్షేపాదుష్ణసత్త్వావనాదపి ।
జాయతే నయనవ్యాధిః శ్లేష్మలోహితసంభవః ॥ 8 ॥

దోషముల కారణమున దూషితమైన పాలు శిశివు త్రాగును. అపుడు తల్లి లవణామ్ల రససేవనముచే ఉత్పన్నమయిన ఆహారదోషములలో క్షీరమును సేవించు బాలునిలో ప్రవేశించి ఆక్షేపము ఉష్ణత్వ కారణముల వలన కఫరక్తములతో ఉత్పన్నం అగు నేత్రరోగములు కలుగును.

అభీక్ష్ణమస్రం స్రవతే న చ క్షీవతి దుర్మనాః ।
నాసికాం పరిమృద్నాతి కర్ణం వాఞ్ఛ(హ్యా)తి దుఃఖితః ॥ 9 ॥
లలాటమక్షికూటం చ నాసాం చ పరిమర్దతి ।
నేత్రే కణ్డూయతేఽభీక్ష్ణం పాణినా చాప్యతీవ తు ॥ 10 ॥
స ప్రకాశం న సహతే అశ్రు చాస్య ప్రవర్తతే ।
వర్త్మని శ్వయథుశ్చాస్య జానీయాత్తం కుక్కుణకమ్ ॥ 11 ॥

నిరంతరము అశ్రుస్రావము, తుమ్ములు రాకుండుట, మనస్సు అప్రసన్నముగా ఉండుట నాసిక కర్ణములు, లలాటము, నేత్రములపై పరిమర్దనము చేయును. నేత్రముల నుండి దురద అధికముగా ఉండును. ప్రకాశము సహించదు. వర్త్మ శోధ కలుగును.

తస్య చికిత్సితం శ్రేష్ఠం వ్యాఖ్యాస్యామి యథా తథా ।
ధాత్రీం తు తస్య వామయేద్యుక్తం చైవ విపాచయేత్ ॥ 12 ॥
తస్యా వాన్తవిరిక్తాయా నిర్దుహ్యా చ స్తనావుభౌ ।
భోజనాని చ సర్వాణి యథాయుక్తం ప్రదాపయేత్ ॥ 13 ॥
పథ్యం భుఞ్జీత ఖాదేత విపరీతం చ వర్జయేత్ ।
ప్రయతా శుద్ధవస్త్రా స్యాదక్లిష్టాఽమలినా తథా ॥ 14 ॥

దాని శ్రేష్ఠమైన చికిత్సను యథావిధిగా వర్ణించెదను. ఆబాలుని తల్లికి వమనం చేయించవలెను. మరియు యుక్తి పూర్వకముగా దోషపాచనము చేయించవలెను. వమన విరేచనముల తర్వాత ఆరెండు స్తనములను పిండి పాలను తీసివేయవలెను. తర్వాత యుక్తి పూర్వకముగ పథ్యభోజనమును ఇవ్వవలెను. అపథ్యమును త్యజించవలెను. నిర్మల వస్త్రధారణము చేసి క్లేశము లేకుండా పరిశుభ్రముగా ఉండవలెను.

తతో వర్త్మని బాలస్య నిర్భుజ్యాథ ప్రమృజ్య చ ।
నిర్మృచ్య రుధిరం దుష్టం కుర్యాద్ద్రోఽవసేచనమ్ ॥ 15 ॥

తరువాత ఆబాలునికి నేత్రములను తెరిచి శుభ్రము చేయవలెను దూషిత రక్తమును తీసి నీళ్ళతో అవసేచనము చేయవలెను.

ఏరణ్డం రోహిషం చైవ త్వక్క్షీరం వరుణం తథా ।
నిష్క్వాథమేతత్ కృత్వా చ కుమారం పరిషేచయేత్ ॥ 16 ॥

ఏరండ, రోహిష, తవాక్షీరి మరియు వరుణ క్వాథముతో బాలుని పరిషేచనము చేయవలెను.

ఫణిజ్జకస్య పత్రాణి సురసస్య చ పీడయేత్ ।
జాతిప్రసన్నామణ్డేన యష్టీమధుకమేవ చ ॥ 17 ॥
ఏతదాశ్చ్యోతనం తస్య శారదేన జలేన తు ।
త్ర్యహమేతత్ ప్రయుఞ్జీత ద్వ్యహం వాఽపి విధానవిత్ ॥ 18 ॥

చికిత్స తెలిసిన వైద్యుడు పణిజ్జకము (తులసి భేదము) తులసి పత్రములతో స్వరసము తీసి అందులో జాతీస్వరసము ప్రసన్న (మద్యవిశేషము) మండము, యష్టిమధు కలిపి దానితో లేదా శీతల జలము తో 2, లేదా 3 సార్లు ఆశ్చ్యోతనము చేయవలెను.

నే(భే)కరాజస్య పత్రాణి బిల్వస్యాచ్ఛవనాం తథా ।
సురాగ్రమణ్డసంపిష్టం శ్రేష్ఠమాశ్చ్యోతనం మతమ్ ॥ 19 ॥

భృంగరాజ పత్రవములు బిల్వ నిర్యాసవము పత్రస్వరసవము సురా మండముతో మర్దించిన అది ఉత్తమ అశ్చ్యోతనము.

కోలాన్యుత్క్వాథ్య కల్కం వా యష్టీమధుకసంయుతమ్ ।
నేత్రామయే ముఖాలేపః కశ్యపస్త్రత్ప్రశంసతి ॥ 20 ॥

రేగు క్వాథము లేదా కల్కమును యష్టిమధుతో కలపి నేత్రరోగములో ముఖం పై లేపనం చేయవలెను. ఈ లేపము మహర్షికశ్యపుడు ప్రశస్తముగా చెప్పెను.

నే(భే)కరాజీం చ నీలీం చ సురసం గౌరసర్షపాః ।
హరిద్రాం చైవ తత్ సర్వం కల్కం కుర్వీత భాగశః ॥ 21 ॥
ఏతదాలేపనం కుర్యాద్రోగఘ్నం నయనామయే ।
వేదనామక్షిరోగం చ క్షిప్రమేవాపకర్షతి ॥ 22 ॥

భృంగరాజ, నీల, తులసి శ్వేత సర్షప హరిద్ర యథాప్రమాణంలో తీసికొని కల్కం చేయవలెను. దీనితో లేపనం చేసిన నేత్ర వేదన అన్యనేత్ర రోగములు నశించును.

హరిద్రాత్వచమాహృత్య పిప్పలీం చాథ భాగశః ।
వరప్రసన్నయా మణ్డం కుర్యాదఞ్జనవర్తికామ్ ॥ 23 ॥
పిల్లికా చోపలేపశ్చ నేత్రయోస్తేన శామ్యతి ।
అథాస్యాశ్చ్యోతనం కుర్యాత్ సౌవీరకమనుత్తమమ్ ॥

హరిద్ర త్వచ పిప్పలిని యోగ్య పరిమాణంలో తీసికొని ఉత్తమ ప్రసన్న మండముతో కలిపి అంజన వర్తి తయారు చేయవలెను. ఈ అంజన ప్రయోగంతో నేత్రగత పిల్లిక ఉపలేప రోగములు శాంతించును. తరువాత శ్రేష్ఠ సౌవీరకముతో నేత్రములను ఆశ్చ్యోతనము చేయవలెను.

ప్రపౌణ్డరీకం లోధ్రం చ హరిద్రాం శర్కరాం మధు ॥ 24 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 232 తమం పత్రమ్)
పరిషేకో భవేచ్ఛ్రేష్ఠో జలేనోష్ణేన యోజయేత్ ।
అక్షిరోగేషు సర్వేషు యోగ ఏష ప్రశస్యతే ॥ 25 ॥
ఆచార్యానుమతం శ్రేష్ఠం రాత్రౌ చైనం ప్రయోజయేత్ ।

పుండరీకము, లోధ్ర, హరిద్ర, శర్కర, మధు ఉష్ణ జలముతో కలిపి నేత్రములను పరిషేకము చేయవలెను. సమస్త అక్షిరోగములలో దీనిని రాత్రులందు ప్రయోగించవలెను.

ఆటరూషకపత్రాణి మధుకం సైన్ధవం తథా ॥ 26 ॥
పుణ్డరీకస్య పత్రాణి తథా నీలోత్పలాని చ ।
సుఖోదకేన సంయుక్తః పరిషేకో హితో భవేత్ ॥ 27 ॥
కఫాత్మకే త్వభిష్యన్దే సిద్ధమేతం నరాధిప ।

ఓ రాజా! వాసా పత్రములు, యష్టిమధు సైంధవలవణము పుండరీకము, నీలోత్పలము వీటిని ఉష్ణ జలముతో కలిపి కఫాభిష్యందములో పరిషేకము చేయుట హితకరముగా చెప్పబడినది.

అమృతాయాస్తు నిష్క్వాథే కుష్ఠం చ గుడమేవ చ ॥ 28 ॥
వినీయ పిష్టం తోయేన పరిషేకో౽క్షిరోగిణామ్ ।

గుడూచి క్వాథములో కుష్టము, గుడమును మర్దించి జలముతో నేత్రరోగములను పరిషేకము చేయవలెను.

పరిషేకాస్తు బాలానాం దంతజన్మని యే మయా ॥ 29 ॥
కీర్తితాస్తే ప్రయోక్తవ్యాః పరిభూతాక్షిరోగిషు ।

బాలకులలో దంతోత్పత్తి సమయంలో నేను చెప్పిన పరిషేకములన్నియు అక్షిరోగములో ప్రయోగించవలెను.

గవ్యేన మధునా పిష్ట్వా శఙ్ఖేన సహ సైన్ధవమ్ ॥ 30 ॥
సప్తరాత్రం ప్రలేప్యం తు తేన స్రోతసమఞ్జనమ్ ।
తం పిష్ట్వా గుడికాం కృత్వా ఛాయాయాం పరిశోషయేత్ ॥ 31 ॥
పుష్యే సర్వాస్తు సిద్ధాస్తా గుడికాః పత్రసన్నిభాః ।
పృశ్నిపర్ణ్యాస్తు భాగౌ ద్వావంశుమత్యాస్తథా భవేత్ ॥ 32 ॥
త్రయశ్చైవోరుపూగస్య బృహత్యా భాగమేవ తు ।
రజసశ్చాయసశ్చాథ తథా తామ్రాయసస్య చ ॥ 33 ॥
అజాక్షీరేణ పిష్ట్వా తు శోషయేద్ గుటికాం కృతామ్ ।
అజానాం లిణ్డికాభిస్తాః శమీపత్రైశ్చ ధూపయేత్ ॥ 34 ॥
తథైవార్ద్రాశ్చ శుష్కాశ్చ బాలానామక్షిరోగకే ।
రసాఞ్జనం చ యన్ముఖ్యం హరిద్రాత్వచమేవ చ ॥ 35 ॥

ప్రసన్నయాఽఞ్జనం త్వేతత్ కుర్యాదఞ్జనవతికామ్ ।

గోఘృతము మధు మరియు శంఖముతో సైంధవలవణమును మర్దించి 7 దినములవరకు స్రోతోంజనము పై లేపనము చేయవలెను. ఆస్రోతోంజనమును జలంతో మర్దించి మాత్రలు చేసికొని నీడలో ఎండించవలెను. పుష్యమి నక్షత్రములో తయారయిన గుటికలను పృశ్నిపర్ణి మరియు శాలిపర్ణి 2 భాగములు శ్వేత ఏరండ, బృహతి 3 భాగములు లోహ చూర్ణము తామ్రచూర్ణం 3 భాగములు వీటిని మేకపాలతో మర్దించి గుటికలు చేసి ఉంచుకొనవలెను.

ఈ గుటికలను మేకపిటికలు, శమీ పత్రములతో ధూపనము చేయవలెను. ఈ విధముగా ఆర్ద్ర, శుష్క గుటికలను రసాంజనము హరిద్రాత్వచను సురామండముతో మర్దించి అంజన వర్తికను తయారు చేయవలెను.

పిప్పలీం శృఙ్గవేరం చ సమభాగాని పేషయేత్ ॥ 36 ॥
సురాగ్రేణ తతః కుర్యాత్ పిల్లికాఞ్జనవర్తికామ్ ।

ఇదే విధముగా పిప్పలీ అల్లము సమభాగములుగ తీసికొని సురామండముతో మర్దించి అంజనము చేయవలెను. ఇది పిల్లిక రోగమును నశింపచేయును.

అథవాఽతిభవేన్నేత్రశూలం బాలస్య లక్షయేత్ ॥ 37 ॥
స్తబ్ధనేత్రశ్చ దృశ్యేత తత్రేమం విధిమాచరేత్ ।
పిప్పలీం శృఙ్గబేరం చ పర్ణాని సురసస్య చ ॥ 38 ॥
కాలమాలకపర్ణాని తథైవ చ కుతేరకమ్ ।
తం ప్రపిష్య సురాగ్రేణ కుర్యాదఞ్జనవర్తికామ్ ॥ 39 ॥
పిల్లికాముపదేహం చ న చిరాదేవ నాశయేత్ ।

లేదా బాలునికి నేత్రశూల అధికముగా ఉన్నచో లేదా నేత్ర స్తబ్ధము ఉన్నచో పిప్పలీ ఆర్ద్రకము, తులసీ కృష్ణతులసి మకేరుకము వీటిని అన్నింటిని సురామండముతో మర్దించి అంజనము వర్తి చేయవలెను. ఇది పిల్లిక రోగమును ఉపదేహ రోగమును శీఘ్రముగా నశింపచేయును.

కపిత్థస్యాథ బిల్వస్య ఖదిరస్య చ పేషయేత్ ॥ 40 ॥

**అజాక్షీరస్య పాత్రం చ తతః శ్చ్యోతనముత్తమమ్ ।**

కపిత్థ బిల్వ ఖదిరలను మేక పాలతో మర్దించిన ఉత్తమ ఆశ్చ్యోతనమగును.

**కపిత్థస్యాఽటజీనాం చ పత్రాణి సురసస్య చ ॥ 41 ॥**
**అజాక్షీరేణ పిష్టాని కుర్యాదాశ్చ్యోతనం భిషక్ ।**

కపిత్థ, అటజీ, మరియు తులసి పత్రములను మేక పాలతో మర్దించిన ఆశ్చ్యోతనము తయారగును.

**మధుకం పర్వతీయాం చ హరిద్రాం పేషయేత్ సమామ్ ॥ 42 ॥**
**అజాక్షీరేణ తత్ కుర్యాదాశ్చ్యోతనమనుత్తమమ్ ।**

యష్టిమధు దారుహరిద్ర సమాన భాగములు గ్రహించి మేకపాలతో మర్దించిన ఉత్తమ ఆశ్చ్యోతనమగును.

**సర్పిర్మణ్డం సురాగ్రం చ ఐంద్రీం చందనమేవ చ ॥ 43 ॥**
**సలిలేన ప్రపిష్టాని కుర్యాదఞ్జనవర్తికామ్ ।**

ఘృతమండము, సురాగ్రము, ఐంద్రి, చందనమును నీటితో మర్దించి అంజన వర్తి చేయవలెను.

**పద్మకం చోత్పలం చైవ మధుకం చ ప్రపేషయేత్ ॥ 44 ॥**
**అక్షిరోగే ముఖాలేపమజాక్షీరేణ శర్కరామ్ ।**

పద్మకము ఉత్పలము, యష్టి మదు, శర్కరలను మేకపాలతో మర్దించి అక్షి రోగముల కొరకు ముఖలేపమును తయారుచేయవలెను.

**శృఙ్గబేరోఽథ మఞ్జిష్ఠా కార్పాసకులకాని చ ॥ 45 ॥**
**సలిలేన ప్రపిష్టాని ముఖాలేపన ముత్తమమ్ ।**

శృంగ భేరి ( అల్లము) మంజిష్టకార్పాస, పటోలమును నీటితో మర్దించిన ఉత్తమ ముఖలేపనము.

**త్రిఫలామఞ్జనం చైవ తథైవ చ రసాఞ్జనమ్ ॥ 46 ॥**
**మధునా సమభాగాని కుర్యాదాశు రసక్రియామ్ ।**

త్రిఫల, అంజనము, రసాంజనమును సమభాగములుగా తీసికొని మధుతో మర్దించి రసక్రియ చేయవలెను.

పిప్పలీం శృఙ్గబేరం చ మరిచాని తథాఽఞ్జనమ్ ॥ **47** ॥
త్రిఫలాం శఙ్ఖనాభిం చ సైంధవం తామ్రజం రజః ।
ఏతే భాగాః సమాః పిష్టాశ్ఛాయాయాం గుడికాః కృతాః ॥ **48** ॥
శోషయిత్వా వికారేషు నైకజేషు ప్రదాపయేత్ ।
తిమిరే తోయసంసృష్టా కోథకే మార్కవేన తు ॥ **49** ॥

పిప్పలీ, ఆర్ద్రక, మరీచ, అంజనం, త్రిఫల, శంఖనాభి, సైంధవలవణము సమభాగములుగా తీసికొని మర్ధించి గుటికలు తయారుచేసి నీడలో ఎండించవలెను. ఇది అనేక రోగములలో ఉపయోగము. ఉదాహరణకు తిమిర రోగములో నీటితో కోథ రోగములో మొక్క జొన్న రసముతో ప్రయోగించవలెను.

రసేన పిష్ట్వా సిద్ధస్య ద్రాక్షాక్షుద్రోదకేన తు ।
గుడికా కోకిలా నామ చక్షుర్వ్యాధిషు సంమతా ॥ **50** ॥
హితభోజిషు యోక్తవ్యా బాలేషు భిషగుత్తమైః ।

కోకిల గుడ్లు కృష్ణ దత్తూర రసం లేదా ద్రాక్ష మరియు రక్తపునర్నవా రసముతో గుటికలు చేయవలెను. ఇది నేత్రరోగములో ఉత్తమముగా చెప్పబడినది. శ్రేష్ఠవైద్యుడు పథ్యభోజనం చేయువానికి ఇది ప్రయోగించవలెను.

నిర్యాసో నక్తమాలస్య ఘృతమణ్డేన సాధితః ॥ **51** ॥
స్తన్యక్షీరేణ తిమిరే కణ్డ్వాం చైవ హితో భవేత్ ।

కరంజ నిర్యాసము ఘృతమండముతో సిద్ధము చేసి స్త్రీ క్షీరముతో ఇచ్చిన తిమిరము, నేత్రకండులో హితకరము.

సువర్ణగైరికం లాక్షా సైంధవం మరిచాని చ ॥ **52** ॥
సశర్కరం త్రికటుకం గుటికాం హ్యుపకల్పయేత్ ।
ఏషా లోహితికా నామ గుడికా తు స్మృతా బుధైః ॥ **53** ॥
ప్రయోక్తవ్యాఽక్షిసంరంభే క్షిప్రం నిర్వాణమిచ్ఛతా ।

లోభిత్తిక గుటిక- స్వర్ణగైరికము, లాక్ష, సైంధవము, మరీచము, శర్కర, త్రికటు వీటిని కలిపి గుటికలు చేయవలెను. శీఘ్రముగా ఆరోగ్యం కోరువారు అక్షి రోగములలో దీనిని ప్రయోగించవలెను.

పిప్పల్యస్త్రిఫలా చైవ వచా కటుకరోహిణీ ॥ **54** ॥
షడేతాః సమభాగాః స్యుః సప్తమం తామ్రజం రజః ।
జలపిష్టా భవేదేతాః సూర్యతప్తాః పునః పునః ॥ **55** ॥
గుడికాః కారయేత్తా హి ఛాయాయాం పరిశోషయేత్ ॥ **56** ॥

రూక్షాం ఘృతేన పిష్టాం దుగ్ధేనాజేన కోథకే దద్యాత్ ।
పాశవరసేన తిమిరే రాజిషు మధుకేన దేయా తు ॥ **57** ॥

కోథకే మర్మజే సర్వా సర్వాభిష్యంద ఏవ చ ।
సైన్ధవేన సమాయుక్తా హన్యాత్ కణ్డూం జలాన్వితా ॥ **58** ॥

పిప్పలీ, త్రిఫలా, వచ, కటు రోహిణి ఈ 6 సమభాగములు ఏడవది తామ్రచూర్ణం- వీటిని జలంతో మర్ధించి ఎండలో ఎండించి గుటకలు చేసి నీడలో ఎండించుకోవలెను. ఈ గుటికలను ఘృతముతో మర్ధించి మేకపాలతో ఇచ్చిన కోథ రోగము శమించును. తిమిర రోగములో దీనిని (గరిక) తృణ స్వరసముతో రాజి రోగములో యష్టి మధు కలిపి ఇవ్వవలెను. కోథ రోగము మర్మ మరియు అన్ని నేత్రాభిష్యంద రోగములలో సైంధవ లవణముతో నేత్ర కండులో జలముతో ఇవ్వవలెను.

ద్వీపిశత్రోశ్చ పత్రాణి నిష్క్వాథముపహారయేత్ ।
ఏతేన చాక్షిరోగం తు కోష్ణేన పరిషేచయేత్ ॥ **59** ॥

చిత్రక, అమ్లవేతస, పత్ర కషాయంతో నేత్రములను పరిషేచనము చేయవలెను.

సరలం మధుకం చైవ దేవదారుం చ పేషయేత్ ।
కల్కేనైతేన వదనం వేదనాసు ప్రలేపయేత్ ॥ **60** ॥

సరళ, యష్టి మధు దేవదారు మర్ధించి కల్కం చేసి వేదనలో ముఖ లేపనముగా ఉపయోగించవలెను.

రసాఞ్జనం తార్క్ష్యశిలాం క్షౌద్రేణ సహ సంయుతామ్ ।
ఆశ్చ్యోతనం ప్రయుఞ్జీత నేత్రవ్యాధివినాశనమ్ ॥ **61** ॥

నేత్రరోగములను నష్టము చేయుటకు తార్క్ష్య పర్వతముపై ఉత్పన్నం అయిన రసాంజనమును మధుతో కలిపి ఆశ్చ్యోతనము చేయవలెను.

శర్కరాం శృఙ్గబేరం చ స్తన్యం గోపిత్తమేవ చ ।
రసాఞ్జనం సమధుకం కుర్యాదాశ్చ్యోతనం భిషక్ ॥ **62** ॥
**(ఇతి తాడపత్రపుస్తకే 233 తమం పత్రమ్)**

శర్కర, ఆర్ద్రక, స్తన్యము, గోఘృతము రసాంజనాదులను మధుతో కలిపి ఆశ్చ్యోతనము చేయవలెను.

హరిద్రాం శంఖనాభిం చ సలిలేన ప్రపేషయేత్ ।
క్షీరస్య మాత్రయా చైవ కుర్యాదాశ్చ్యోతనం హితమ్ ॥ **63** ॥

హరిద్ర, శంఖనాభి, నీళ్ళతో మర్దించి కొంచెం క్షీరములో కలపవలెను. ఇది ఆశ్చ్యోతనమునకు హితము.

హరిద్రాం పర్వతీయా తు సూర్యతేజసి పాచయేత్ ।
తామ్రపట్టేషు పిష్టాం చ సారసేనావసేచయేత్ ॥ **64** ॥
శీతం చ పరిపూతం చ స్తన్యేన సహ సంయుతమ్ ।
ఆశ్చ్యోతనం ప్రయుఞ్జీత నేత్రవ్యాధివినాశనమ్ ॥ **65** ॥

దారుహరిద్రను సూర్యతాపములో పక్వం చేసి, తామ్రరేకులపై మర్దించవలెను. అందులో తటాక జలం కలిపి చల్లగా ఉన్నపుడు వడబోసి పాలతో కలిపి ఆశ్చ్యోతనము చేయవలెను. ఇది నేత్ర రోగములను నశింపచేయును.

సర్పిషశ్చ భవేద్భాగః క్షౌద్రేణ ద్విగుణం భవేత్ ।
తత్కాలే ప్రలిపేద్బాలో నేత్రవ్యాధౌ ప్రముచ్యతే ॥ **66** ॥

నేత్రరోగములలో ఒక భాగము ఘృతము, 2 భాగములు మధు కలిపి లేపనం చేసిన బాలునికి తత్కాలము రోగముక్తి కలుగును.

హరిద్రాం శఙ్ఖనాభిం చ భద్రముస్తం చ కాథకమ్ ।
పిష్ట్వా వ్యాఘ్రనఖం చైవ మధుకం చైవ భాగశః ॥ **67** ॥
శిరీషబీజం ప్రథమం తాభ్యాం కుర్వీత పూపికామ్ ।
తామ్రపాత్రే సతైలాస్తాః సూర్యతేజసి పాచితాః ॥ **68** ॥

ద్వాదశేఽహ్ని నివాతే చ నీరజస్కే ప్రయత్నతః ।
శిలామయే తతో భాణ్డే తైలం తాం చైవ పూపికామ్ ॥ 69 ॥
ఆతురాణ్యథ నేత్రాణి తైలేనానేన పూరయేత్ ।
వ్యాధిమాశు నృణాం హన్తి ప్రయోగశ్చేత్ ప్రశస్యతే ॥ 70 ॥

హరిద్ర, శంఖనాభి, ముస్త, వ్యాఘ్రనఖి, యష్టిమధు, శిరీషబీజము, యధా యోగ్య పరిమాణములో తీసికొని మర్దించి అపూపములు (పూరి) చేసి తామ్ర పాత్రలో తైలము పోసి వాటిని సూర్యతాపములో పక్వం చేయవలెను. 12 దినములు వాయు, ధూళి లేని స్థానవములో అపూపవములను తైలవమును రాతిపాత్రలో ఉంచవలెను. 12వ దినము ఈ అపూపములను రోగికి తినిపించి తైలముతో నేత్రపూరణము చేయవలెను. ఈ యోగము ప్రశస్తముగా ఉన్నచో రోగము శీఘ్రముగా నశించును.

హరీతకీమామలకీం హరిద్రాం గిరిజామపి ।
మధుకం చ సమం సర్వం సలిలేన ప్రపేషయేత్ ॥ 71 ॥
ఏతదాశ్చ్యోతనం ముఖ్యం వ్యాధీనాం శమనం హితమ్ ।
స్థవిరాణాం శిశూనాం చ ఏతదాశ్చ్యోతనం హితమ్ ॥ 72 ॥

హరిద్ర, ఆమలకి, దారుహరిద్ర, యష్టిమధు సమభాగములుగా గ్రహించి నీటితో మర్దించాలి. ఇది ముఖ్యమైన ఆశ్చ్యోతనము. ఇది నేత్ర రోగములను శాంతింపచేయును ఇది వృద్ధులకు, శిశువులకు హితకరము.

హరిద్రాశకలీకానామార్ద్రాణాం కర్షమావపేత్ ।
తామ్రపాత్రే మితం దద్యాత్ సారమస్యాఢకం మితమ్ ॥ 73 ॥
దశభాగావశేషం తు మృద్వగ్నిముపసాధితమ్ ।
శీతం చ పరిపూతం చ ముఖ్యమాశ్చ్యోతనం హితమ్ ॥ 74 ॥

ఒక తామ్ర పాత్రలో హరిద్ర, శకలీ (మత్స్యము) ఒక్కొక్క కర్షము తీసికొని ఇందులో ఒక ఆఢకము పైన చెప్పిన ద్రవ్యముల రసమును వేయవలెను. దానిని మృద్వగ్ని పై పక్వము చేసి 10వ భాగము శేషముగా ఉన్నపుడు దానిని చల్లార్చి వడబోసినచో ముఖ్యమైన ఆశ్చ్యోతనము తయారగును.

శకలీకమథాక్షీణాం ధారయేన్నయనామయే ।
గ్రీవాయాముత్తమాఙ్గే వా తథా రోగాత్ ప్రముచ్యతే ॥ 75 ॥

నేత్ర రోగములో నేత్రము, గ్రీవ, ఉత్తమాంగముపై శకులీ చేపను ధారణము చేయవలెను.

ఆలంకృతకమూలాని వాస్తుకస్య యవస్య చ ।
ఆఘృష్య నవ (?) ఏషాం తు మూర్ధ్ని కుర్వీత కణ్టకాన్ ॥ 76 ॥
అక్షిరోగం శిరోరోగం సర్వమేతేన శామ్యతి ।

హరితాళము, నిర్మలీ, వాస్తుకము, యవ, వీటి మూలములు తీసికొని సాది దానిని శిరస్సుపై కంటకాకార చిహ్నముగా పూయవలెను. దీని వలన సమస్త నేత్ర రోగములు, శిరోరోగములు శాంతించును.

బలామతిబలాం చైవ త్రివృతాం చైవ గర్భిణీ ॥ 77 ॥
సవ్యే పాణిపుటే కృత్వా పీడయేత్తమపూర్వశః ।
తం రసం క్షౌద్రసంసృష్టం కణ్ఠమస్యాః ప్రలేపయేత్ ॥ 78 ॥

ఒక గర్భిణీ స్త్రీ బల, అతిబల, త్రివృత్‌ను తన ఎడమ చేతిలో తీసికొని రసమును పిండవలెను. ఈ రసములో మధు కలిపి గర్భిణీ స్త్రీ కంఠము నందు లేపము చేయవలెను.

సపిప్పలీశృఙ్గబేరాం హరితాలమనఃశిలామ్ ।
రసాఞ్జన తార్క్ష్యశిలాం సుమనాకోరకాణి చ ॥ 79 ॥
సప్తమోఽత్ర గుడస్యాంశో మధునా సహ పేషితః ।
ఏషా కల్యాణికా నామ సర్వరోగరసక్రియా ॥ 80 ॥

పిప్పలీ, ఆర్ద్రకము, హరితాళము, మణఃశిల, తార్క్ష్య శైలోద్భవ రసాంజనము, మల్లెమొగ్గలు, 7వది గుడము వీటిని మధులో మర్దించవలెను. ఇవన్నీ రోగములను నశింపచేయు, కళ్యాణికా అను రసక్రియ.

మరిచం శృఙ్గబేరం చ సమభాగాని కారయేత్ ।
దధినాఽమ్లేన పిష్ట్వా తు తామ్రమపట్టం ప్రలేపయేత్ ॥ 81 ॥

సప్తరాత్రం ప్రలిప్యైవ తతో దధ్నా ప్రపేషయేత్।
వర్త్యోఽథ తనుకాః కార్యా దద్యాత్ కౌతుకమఞ్జనమ్ ॥ 82 ॥

మరిచము, ఆర్ద్రకము సమభాగములుగా తీసికొని, పెరుగు, కాంజికముతో మర్దించి తామ్ర రేకులపై లేపము చేయవలెను. 7 దినముల వరకు లేపనము చేసి వాటిని పెరుగుతో మర్దించవలెను. వీటిని చిన్న చిన్న వర్తులుగా చేయవలెను. నేత్రములలో అంజనము చేయవలెను. ఇది అశ్చర్యజనక అంజనము.

మృదుపూర్వమదోషం తు మాత్రాయుక్తం చ భేషజమ్।
సాదేశ్యాత్తత్కులీనాం (?) చ కుర్యాద్బాలే భిషక్ క్రియామ్ ॥

వైద్యుడు బాలునికి మొదట మృదువు దోషరహితము యోగ్య మాత్రలో ఔషధమును ప్రయోగించవలెను.

కటుకీయా హి కేచిత్ స్యాన్మ(స్యుర్మ) ధూరీయాస్తథాఽపరే।
మృదు తస్మై ఉపక్రామ్యంస్తీక్ష్ణమప్యల్పమాచరేత్ ॥ 84 ॥

కొందరు బాలునికి కటు ఔషధములను కొందరు మధుర రసములను ప్రయోగింతురు. బాలునికి మృదు ఔషధములతోనే చికిత్స చేయవలెను. తీక్ష్ణౌషధములను సాధ్యం అయినంత తక్కువగా ప్రయోగించవలెను.

ఇతి వార్యోవిదాయేదం మహీపాయమహాన్ఋషిః।
శశంస సర్వమఖిలం బాలనామాథ భేషజమ్ ॥ 85 ॥

ఈ విధంగా మహర్షి కశ్యపుడు వాయోర్విదుడను రాజునకు సమస్త బాలురకు ఔషధములను ఉపదేశము చేసెను.

లోధ్రం సయష్టీమధుకం తు పిష్టం
ఘృతేన భృష్టం తు నిబధ్య వస్త్రే।
క్వాథం గుడూచ్యాం పరిమృజ్య తప్తే
నిహంతి సర్వాక్షిగతాన్వికారాన్ ॥ 86 ॥

లోధ్ర యష్టిమధును మర్దించి ఘృతములో వేయించవలెను. దానిని వస్త్రములో కట్టి గుడూచి క్వాథము నందు వేలాడ దీసి వేడి చేసి శుద్ధము చేయవలెను. దీని ప్రయోగము వలన సర్వ నేత్ర రోగములు నశించును.

ఇతి హ స్మాహ భగవాన్కశ్యపః ॥ 87 ॥

(ఇతి) వృద్ధకాశ్యపీయాయాం సంహితాయాం

కుక్కూణక చికిత్సాధ్యాయ స్త్రయోదోషః ॥ 13 ॥

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

కుకూ్కణక చికిత్సితాధ్యాయము సమాప్తం

(ఇతి) వృద్ధకాశ్యపీయాయాం సంహితాయాం

కుక్కూణకచికిత్సాధ్యాయస్త్రయోదశః ॥ 13 ॥

# విసర్ప చికిత్సితాధ్యాయః - చతుర్దశః

**అథాతో వైసర్పచికిత్సితం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥**

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥**

ఇపుడు మనము విసర్ప చికిత్సను వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**కశ్యపం భిషజాం శ్రేష్ఠమాదిత్యసమతేజసమ్ ।**
**హుతాగ్నిహోత్రమాసీనమపృచ్ఛద్ వృద్ధజీవకః ॥ 3 ॥**

సూర్య సమానమైన తేజస్వి అగ్నిహోత్రము చేసి ఆసీనుడైన వైద్య శ్రేష్ఠులు మహర్షి కశ్యపునితో వృద్ధ జీవకుడు ఈ క్రింది విధముగా ప్రశ్నించెను.

**భగవన్ మణ్డలీభూతం త్వగ్రక్తం మాంసమేవ చ ।**
**విదహన్ దృశ్యతే వ్యాధిరాశీవిషవిషోపమః ॥ 4 ॥**
**దుఃసహః సుకుమారాణాం కుమారాణాం విశేషతః ।**

భగవాన్! సర్ప విషతుల్యమైన ఈ వ్యాధి మండలీ భూత త్వచ రక్త, మాంసములను దహింపచేయునట్లు కనిపించును.

**తస్య దారుణరూపస్య దీప్తాగ్నిసమతేజసః ॥ 5 ॥**
**సముత్పత్తిం చ రూపం చ చికిత్సాం చ మహామునే ! ।**
**వక్తుమర్హసి తత్త్వేన బాలానాం హితకామ్యయా ॥ 6 ॥**

మహాముని! బాలుర హితవు దృష్టిలో ఉంచుకొని, అగ్ని సమానమైన తేజస్సుకల మీరు భయంకర రూపమైన ఆ రోగోత్పత్తి లక్షణములను చికిత్సను విస్తారముగా ఉపదేశించండి.

ఇతి పృష్టః స శిష్యేణ ప్రోవాచేదం మహామునిః ।
దక్షక్రోధాద్భగవతో రుద్రస్యామితతేజసః ॥ 7 ॥

సందష్టౌష్ఠపుటస్యోష్ఠాద్యద్రక్తం ప్రాపతద్ భువి ।
లోహితాఖ్యో౽భవత్తస్మాద్విసర్పశ్చాగ్నిసన్నిభః ॥ 8 ॥

తస్మాన్నిర్దాహినావేతౌ భృశం పీడాకృతౌ నృణామ్ ।

ఈ విధముగా శిష్యునితో ప్రశ్నించబడి మహాముని కశ్యపుడు ఉత్తరమిచ్చెను. అఖండ తేజో వంతుడైన రుద్రభగవానుడు దక్షునిపై క్రోధము ఉదయించినపుడు దంతముల ద్వారా ఓష్టములపై ఒత్తిడి కలిగి రక్తము స్రవించి భూమిపై పడినది. ఆ రక్తమే అగ్ని సమానము అగు విసర్పరోగలక్షణములను ఉత్పన్నం చేయును. కావున ఈ రెండు, మనుష్యులను దహించునవి, అతిపీడ కలిగించునవి.

వివిధం సర్పణాద్దేహే వైసర్పస్తు నిరుచ్యతే ॥ 9 ॥

ఈ రోగము శరీరము నందు నానావిధములుగా విస్తరించును కావున విసర్పము అనబడును.

క్షతాద్భుగ్నాదథోత్పిష్టాదామచ్ఛేదాద్విధారణాత్ ।
దధ్యమ్లమందకసురాశుక్తసౌవీరకస్య చ ॥ 10 ॥

తిలమాషకులుత్థానాం పలాణ్డోర్లశునస్య చ ।
గ్రామ్యానూపౌదకానాం చ మాంసానామతిసేవనాత్ ॥ 11 ॥

విరోధిగుర్వభిష్యందపూతిపర్యుషితాశనాత్ ।
దివాస్వప్నాదజీర్ణాచ్చ శాకపిష్టాన్నసేవనాత్ ॥ 12 ॥

విషోపహతవాయ్వమ్బువస్త్రపానాన్నసేవనాత్ ।
ఏవమాదిభిరప్యన్యైర్దుష్టా వాతాదయః శిశోః ॥ 13 ॥

వైసర్పం జనయన్త్యాశు రక్తాదీన్ సంప్రదూష్య తు ।
ఏవమేవ ప్రకుపితైర్దోషైర్దుష్టం యదా పయః ॥ 14 ॥

సేవతే తస్య తద్దోషాద్విసర్పః సంప్రజాయతే ।

విసర్ప కారణములు - క్షతము అస్థి భగ్నము, లేదా పీడనముతో శరీరము నందలి శరీరభాగము కోసుకొని పోవుట, వేగధారణము, పుల్లని పెరుగు, మంథకము (పూర్తిగా ఏర్పడనిపెరుగు), నువ్వులు, మినుములు, కులుత్థ, ఉల్లి, లశునము, గ్రామ్య ఆనూప, ఔదక, పశుపక్షుల మాంసము అధికముగా సేవించుట విరుద్ధ భోజనము, గురు, అభిష్యంది, పూతీ, పర్యూషిత భోజనము చేయుటచే దివాస్వప్నము, అజీర్ణము, శాక, మాషపిష్ట్యాదులతో చేయబడిన పదార్థములను అధికముగా సేవించుట విషదూషిత వాయు, జలము, వస్త్రము, అన్నము, అధికముగా సేవించుట ఈ కారణములతో దూషితమైన వాతాది దోషములు బాలుర శరీరములో రక్తాదులను దూషింపచేసి విసర్పమునుత్పన్నం చేయును. అదేవిధముగా ప్రకుపిత దోష దూషితమైన స్తన్యము శిశువు సేవించిన విసర్పరోగము కలుగును.

వాతికః పైత్తికశ్చైవ శ్లైష్మికో ద్వంద్వజాస్త్రయః ॥ 15 ॥
సన్నిపాతాచ్చ సప్తైతే వైసర్పాః సముదాహృతాః ।

విసర్ప భేదములు : 1. వాత 2. పిత్త 3 శ్లేష్మ 4-5-6 ద్వంద్వజ 7. సన్నిపాతక ఈ విధముగా 7 విసర్పభేదములు.

న వినా రక్తపిత్తాభ్యాం వైసర్పో జాతు జాయతే ॥ 16 ॥
రక్తాశ్రయో రక్తభవః పిత్తం రక్తే వ్యవస్థితమ్ ।
తస్మాద్రక్తావసేకోఽత్ర భేషజం పరముచ్యతే ॥ 17 ॥
బలకాలవయోదోషదేశదేహవ్యపేక్షయా ।

రక్త, పిత్తములు లేక విసర్పము కాజాలదు. ఇది రక్తాశ్రితము మరియు రక్తముచే ఉత్పన్నమగును. కావున ఇందులో రోగిబలము, కాలము, అవస్థ, దోష, దేశ శరీరానుసారము రక్త మోక్షణము చేయవలెను.

లక్షణాన్యత ఊర్ధ్వం తు ప్రవక్ష్యామ్యనుపూర్వశః ॥ 18 ॥

ఇప్పుడు నేను ప్రతి విసర్ప యొక్క లక్షణములను క్రమముగా చెప్పెదను.

రక్తాదీన్యభిదూష్యాశు వై . . . . . ॥ 19 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 234 తమం పత్రమ్)

పూర్వోక్త వాత ప్రకోపక కారణములచే వాతము ప్రకుపితమై రక్తాదులను దూషించును. అప్పుడు శీఘ్రముగా విసర్పముత్పన్నమగును.

**వాతరక్తజ్వర . . . స్ఫోటాంశ్చైష న . . . .యేత్ ॥ 20 ॥**

వాతిక విసర్ప లక్షణములు: శరీరములో వాతరక్తము జ్వర స్ఫోటాదులు కల్గును.

**ఊర్ధ్వాధఃశుద్ధదేహానాం బహిర్మార్గాశ్రితే మలే ।**
**ఆదితశ్చాల్పదోషాణాం క్రియాం కుర్యాదిమాం భిషక్ ॥ 21 ॥**

దోషములు బహిర్మార్గా శ్రితములైనప్పుడు మొదట దోషాల్పత కారణముచే ఊర్ధ్వ అధః శోధనము చేసి వైద్యుడు ఈ క్రింది చికిత్సను చేయవలెను.

**లఙ్ఘయిత్వా యథాకాలం కషాయైః సముపక్రమేత్ ।**
**ప్రదేహైః పరిషేకైశ్చ స్నేహైరభ్యఙ్గనైరపి ॥ 22 ॥**
**రక్తావసేకైః పథ్యైశ్చ పానాన్నౌషధసేవనైః ।**

రోగికి ఉచిత కాలములో లంఘనము చేసిన తర్వాత కషాయ, ప్రదేహ, పరిషేక, స్నేహ, అభ్యంగ, రక్తమోక్షణము పథ్యకర అనుపానములు ఔషధముల ద్వారా చికిత్స చేయవలెను.

**వాతవైసర్పిణం పూర్వమనుబంధవిశేషతః ॥ 23 ॥**
**పురాణం ప్రపురాణం వా కౌమ్భం వా పాయయేద్ ఘృతమ్ ।**

వాత విసర్పములో మొదట అనుబంధ విశేష కారణమున పురాణ ప్రపురాణ లేదా కుంభ సర్పిని ఉపయోగించవలెను.

**తైలం సలవణం చాస్య క్షిప్రమభ్యఙ్గనే హితమ్ ॥ 24 ॥**
**ఆరనాలేన సురయా బలయా వా విపాచితమ్ ।**

కాంజి, సుర, బలాతో పక్వం చేసిన తైలమును లవణం వేసి దానితో శీఘ్రముగా రోగికి అభ్యంగము చేయించవలెను.

**మధుకస్య చ కల్కేన గుడూచ్యా స్వరసేన చ ॥ 25 ॥**
**తుల్యక్షీరం పచేత్తైలం తదస్యభ్యఙ్గనే హితమ్ ।**

యష్టిమధు కల్కము గుడూచి స్వరసంలో సమాన మాత్రలో పాలన కలిపి తైలం సిద్ధం చేయవలెను. ఇది అభ్యంగమునకు హితకరము.

బలాం రాస్నాం బృహత్యౌ ద్వే వర్చీవం సపునర్నవమ్ ॥ 26 ॥
పాటలాం సుషవీం చైవ మధుకం దేవదారుకమ్ ।
పిష్ట్వా విపక్వం దధ్నా చ తైలమభ్యఞ్జనే హితమ్ ॥

బలా, రాస్న, బృహతీద్వయము వర్చీవ, పునర్నవ, పాటల, కృష్ణ జీరక, యష్టి మధు, దేవదారు వీటిని అన్నింటిని మర్దించి పెరుగు తో పక్వం చేసి తైలము సిద్ధం చేయవలెను. ఇది అభ్యంగమునకు హితకరం.

బిల్వాగ్నిమంథకాశ్మర్యశ్యోనాకైరణ్డపాటలైః ।
పయసా చామ్బునా వాఽపి శృతేన పరిషేచయేత్ ॥ 27 ॥

బిల్వ, అగ్నిమంథ, కాశ్మర్య, శ్యోనాక, ఏరండ, పాటలా వీటిని పాలతో జలముతో సిద్ధము చేసి క్వాథము తయారుచేయవలెను. దీనితో పరిషేచనము చేయవలెను.

భృష్టైః పయసి నిర్వాతైరతసీతిలసర్షపైః ।
క్షీరపిష్టైః ప్రలిమ్పేద్వా వాతవైసర్పపీడితమ్ ॥ 28 ॥

వాత రహిత స్థానములో అతసీ, తిల సర్షపములను నీటితో పక్వము చేసి పాలతో మర్దించి వాత విసర్పరోగికి లేపము చేయవలెను.

సుషవీం సురభీం రాస్నాం వర్చీవం సపునర్నవమ్ ।
ఏకాష్ఠీలాం పలాశం చ దేవదారుం చ పేషయేత్ ॥ 29 ॥
జలేనామ్లేన వా తేన స్నిగ్ధోష్ణేన ప్రలేపయేత్ ।

కృష్ణ జీరక, సురభి, రాస్నా, వర్చీవ, పునర్నవ, ఏకాష్ఠీల, పలాశ దేవదారును జలము లేదా కాంజికములో మర్దించవలెను. స్నిగ్ధ, ఉష్ణముచేసి లేపనము చేయవలెను.

తిల్వకేన త్రివృతయా నీలిన్యా వా పృథక్పృథక్ ॥ 30 ॥
విపక్వం పాయయేత్ సర్పిః సమస్తైర్వా విరేచనమ్ ।

లోధ్ర, త్రివృత్, నీలిని వీటిని వేర్వేరుగా లేదా సమ్మిళితముగా ఘృత పక్వము చేసి త్రాగించవలెను. ఇది విరేచనము చేయును.

ఆభిః క్రియాభిః ప్రశమం న ప్రయాతి యదాఽనిలః ॥
స్వభ్యక్తం స్వేదయే ద్వస్త్రైర్వేశవారేణ వా పునః ।

పై చెప్పిన అన్ని క్రియలు చేసినప్పటికి వాయువు శాంతించనిచో శరీరముపై స్నేహముతో మర్దనము చేయవలెను. లేదా వేశవారము ద్వారా స్వేదనము చేయవలెను.

ఉక్తాభిరాభిః స్నిగ్ధాభిః పాయసైః కృసరేణ వా ॥
శుష్కమూలకకల్కైర్వా కల్కైః శోభాఞ్జనస్య వా ।
సుఖోష్ణైః ప్రదిహేదేనం నాత్యుష్ణం వాఽఽచరేద్విధిమ్ ॥
స్వేదైః ప్రశాన్తే త్వనిలే ప్రకుప్యేత్ పిత్తమగ్నివత్ ।
యథా న చ ప్రకుప్యేత పిత్తం వాయుశ్చ శామ్యతి ॥ **31** ॥
తథా భిషక్ ప్రయుఞ్జీత వాతపిత్తహరీం క్రియాత్ ।

పై చెప్పిన స్నిగ్ధ ద్రవ్యములు లేదా సుఖోష్ణ పాయసం, కృశర, ఎండిన ముల్లంగి కల్కము, లేదా శోభాంజన కల్కము లేపము చేయవలెను. కాని ఈ లేపము అత్యుష్ణముగా ఉండకూడదు. పై చెప్పిన స్వేదముల ద్వారా వాతము శాంతించిన ఎడల అగ్ని సమానమైన పిత్తము ప్రకోపించును. చికిత్సకుడు ఈ విధముగా వాతపిత్త నాశక చికిత్సను చేయవలెను. పిత్తము ప్రకోపించకుండ వాతమును శమింపచేయవలెను.

పైత్తికే తిక్తకం సర్పిరుక్తం జ్వరచికిత్సితే ।
నిరామం పాయయేద్వైద్యః స్నిగ్ధం జ్ఞాత్వా విరేచయేత్ ॥ **32** ॥

పిత్త విసర్ప చికిత్స, రోగి నిరామము అయిన పిదప వైద్యుడు జ్వర చికిత్సలో చెప్పిన తిక్తక ఘృతమును తాగించవలెను. ఈ ఘృతము ద్వార స్నేహనము అయిన తరువాత విరేచనము చేయవలెను.

చందనం పద్మకోశీరం తథా చందనసారివామ్ ।
మృద్వీకాం చ విదారీం చ కాశ్మర్యాణి పరూషకమ్ ॥ **33** ॥
వాసాశృతం పిబేదేతద్వైసర్పజ్వరనాశనమ్ ॥

చందనము, పద్మకము, ఉశీర, రక్త చందనము, సారిబ, ద్రాక్ష,

విదారిగంధ, కాశ్మర్య, పరూషక, వీటిని అన్నిటిని వాసతో పక్వము చేసి కషాయం తయారు చేయవలెను. ఇది విసర్ప జ్వరములను నశింప చేయును.

ఉశీరం మధుకం ద్రాక్షాం కాశ్మర్యాణ్యుత్పలాని చ ।
కశేరుకామిక్షుగణ్డం పరూషకఫలాని చ ॥ 34 ॥
పూర్వకల్పేన పేయాని జ్వరవైసర్పశాంతయే ।

ఉశీర, యష్టి, ద్రాక్ష, గంభారి, ఉత్పల, కశేరుక ఇక్షుగండ ( కాశ), పరూషక, వీటిని పై చెప్పిన విధితో పక్వం చేసిన విసర్ప జ్వరములో ఇవ్వవలెను.

కైరాతం మధుకం లోధ్రం చందనం సబిభీతకమ్ ॥
పద్మోత్పలం నాగపుష్పం నాగరం సదురాలభమ్ ।
నిష్క్వాథ్య శీతం మధునా పేయం వైసర్పశాన్తయే ॥ 35 ॥

కిరాతతిక్త, యష్టి మధు, లోధ్ర, రక్తచందన, విభీతకి, పద్మక, ఉత్పల, నాగకేసర, శుంఠి, దురాలభ, వీటిని అన్నిటిని క్వాథము చేసి చల్లార్చి, మధును కలిపి ఇచ్చినచో విసర్పము శాంతించును.

పటోలం చందనం మూర్వా గుడూచీం కటురోహిణీమ్ ।
ముస్తాం పాఠాం సయష్టీకాం పూర్వకల్పేన పాచయేత్ ॥ 36 ॥

పటోల, చందన, మూర్వ, గుడూచి, కటుక రోహిణి, ముస్త, పాఠ యష్టి మధు వీటిని అన్నిటిని పై చెప్పిన విధముగా పక్వం చేసి త్రాగించవలెను.

వ్యాఘాతకం హరిద్రే ద్వే కుటజం కటురోహిణీమ్ ।
గుడూచీం మధుకం చైవ నందనం చేతి తత్ పిబేత్ ॥ 37 ॥

వాఘాతకము ( ఆరగ్వధ) హరిద్ర, దారుహరిద్ర, కుటజ, కటుక రోహిణి, గుడూచి, యష్టిమధు, రక్తచందన, వీటిని క్వాథము చేసి త్రాగించవలెను.

పిచుమందం పటోలం చ దార్వీం కటుకరోహిణీమ్ ।
గుడూచీం మధుకం చైవ చందనం చేతి తత్ పిబేత్ ॥ 38 ॥

వేప, పటోల, దారు హరిద్ర, కటుకరోహిణి, గుడూచి , యష్ఠ మధు, రక్త చందన వీటి క్వాథము త్రాగించవలెను.

పిచుమందం పటోలం చ దార్వీం కటుకరోహిణీమ్ ।
త్రాయమాణాం సయష్టీకాం పిబేద్వైసర్పశాంతయే ॥ 39 ॥

వేప, పటోల, దారుహరిద్ర, కటుకరోహిణీ, త్రాయమాణ. యష్టిమధు వీటి క్వాథము చేసి ఇచ్చిన విసర్ప జ్వరము శాంతించును.

పటోలనిమ్బముస్తానాం చందనోశీరయోరపి ।
ముస్తకామలకోశీరసారివాణామథాపి వా ॥
దద్యాత్ కషాయం పానేన పిత్తవైసర్పశాంతయే ।
పటోలముస్తామలకశృతం వా సఘృతం పిబేత్ ॥ 40 ॥

1. పటోల, నింబ, ముస్త 2. చందన ఉశీర 3. ముస్తా ఆమలకి, ఉశీర, సారిబ కషాయమును త్రాగించవలెను. ఇది పిత్త విసర్పమును శాంతింపచేయును. లేదా పటోల ముస్తా, ఆమలకి క్వాథములో ఘృతమును కలిపి త్రాగించవలెను.

ఉదుమ్బరత్వఙ్మధుకం ప్రియఙ్గ్వో నాగకేశరమ్ ।
పద్మోత్పలానాం కిఞ్జల్కం ప్రదేహః సఘృతో హితః ॥ 41 ॥

ఉదుంబర త్వక్, యష్టిమధు, ప్రియంగు, నాగకేసర, పద్మక ఉత్పల కింజల్క వీటిచూర్ణమును ఘృతముతో కలిపి ( ప్రదేహం) లేపము చేయవలెను.

అశ్వత్థోదుమ్బరప్లక్షవటవేతసజామ్బవైః ।
త్వగ్భిః సుపిష్టైరాలేపః శతధౌతఘృతాప్లుతైః ॥ 42 ॥

అశ్వత్థ, ఉదుంబర, ప్లక్ష, వట, వేతస, నేరేడు, వృక్షముల త్వక్ను బాగా మర్దించి, శతధౌత ఘృతములో కలిపి లేపనం చేయవలెను.

శ(క) కుభోదుమ్బరాశ్వత్థవటలోధ్రత్వచః సమాః ।
వేతసత్వక్ సశాలూకా నఽ. . . . . . పేషయేత్ ॥ 43 ॥
సహావిష్కః ప్రలేపోఽయం దాహరాగనివారణః ।

అర్జున, ఉదుంబర, అశ్వత్థ, వట, లోధ్ర, వేతస, శారూక, వీటిని అన్నింటిని మర్దించి, ఘృతముతో కలిపి ప్రలేపము చేసిన దాహరాగములు శమించును.

ఉశీరం చందనం చైవ శాద్వలం శఙ్ఖముత్పలమ్ ॥ **44** ॥
వేతసస్య చ మూలాని ప్రదేహః స్యాత్ సతణ్డులః ।

ఉశీర, చందన, దూర్వ, శంఖ పుష్పి, ఉత్పలము, వీటిత్వక్‌ను బియ్యముతో మర్ధించి లేపనం చేయవలెను.

హ్రీబేరం చందనోశీరం మఞ్జిష్ఠా కుముదోత్పలమ్ ॥ **45** ॥
శారివాం పద్మకిఞ్జల్కం ప్రలేపనమనుత్తమమ్ ।

హ్రీబేర, చందనం, ఉశీర, మంజిష్ట, కలమంద, ఉత్పల, సారిబ పద్మ కేసరములు వీటిని మర్ధించి ఉత్తమ ప్రలేపము చేయవలెను.

విదారీం చందనోశీరం తథా చందనసారివామ్ ॥ **46** ॥
మధుకం క్షీరశుక్లాం చ దద్యా(దాలేప)నం భిషక్ ।

విదారి, చందన, ఉశీర, రక్త చందన, సారిబ, యష్టి మధు క్షీరశుక్ల, వీటిని మర్ధించి లేపనం చేయవలెను.

తాలీశం పద్మకోశీరం మఞ్జిష్ఠాం చందనద్వయమ్ ॥ **47** ॥
ప్రపౌణ్డరీకం మధుకం ప్రలేపో దాహనాశనః ।

తాలీశం, పద్మక, ఉశీర, మంజిష్ట, శ్వేత చందనం, రక్త చందనం, పుండరీక, యష్టి మధు, వీటిని ప్రలేపము చేసిన దాహము శాంతించును.

ముక్తాశఙ్ఖప్రలేపైశ్చ శుక్తిస్ఫాటికగైరికైః ॥ **48** ॥
సఘృతైః ప్రదిహేదేనం సమస్తైర్లాభతోఽపి వా ।

ముక్త, శంఖ, శుక్తి, స్ఫటిక, గైరిక, వీటిని వేరు వేరుగా కలిపి లేదా యథా లభ్యముగా తీసికొని ఘృతముతో కలిపి లేపనం చేయవలెను.

కదలీకుశకాశానాం తథైవ నడ(ల)వేత్రయోః ॥ **49** ॥
మూలాని చందనోశీరం పద్మకర్షభజీవకమ్ ।
కుముదోత్పలప(త్రాణి మూ) ర్వాసౌగంధికాని చ ।
మృణాలవిశశాలూకతృణశోలే(శాలీ) క్షువాలికాః ।
ప్రపౌణ్డరీకం మధుకం తాలీశం సకశేరుకమ్ ॥

ఇక్షు వేతసమూలాని సానన్తాః క్షీరిణాం త్వచః ।
శతావరీం సమఞ్జిష్ఠాం కుమ్భీకామితి సంహరేత్ ॥
సంక్షాద్యైతాని మతిమాన్ వాసయేత్ సలిలే నిశి ।
రసం తమథ నిస్రావ్య పరిషేకం తు దాపయేత్ ॥

కదలీ, కుశ, కాశ, నల, వేతస, వీటి మూలమును రక్త చందన, ఉశీర, పద్మక, ఋషభక, జీవక, కుముద, ఉత్పలపత్ర మూర్వ, సౌగంధిక, మృణాల, విష, శాలూక, తృణ, శాలీ, ఇక్షు బాలిక, పుండరీక, యష్టి మధు, తాలీష, కశేరుక, ఇక్షు, వేతస, వీటి మూలములు అనంత క్షీర వృక్షములతో, శతావరి మంజిష్ట, కుంభీక, వీటిని యవ కూట చూర్ణము చేసి బుద్ధి మంతుడైన వాడు రాత్రి శీతల జలముతో ఇవ్వవలెను. ఉదయమున వాటిని అన్నింటిని పిండి రసం తీసికొనవలెను.

ఘృతం వా విపచేదేభిర్మక్షణం పయసా సహ ।
ఏతేష్వేవ కషాయేణ పయస్తుల్యం పచేద్భిషక్ ॥
చతుర్భాగావశిష్టం చ ఖజేనాభిప్రమన్థయేత్ ।
తత్రోత్థితం ఘృతం భూయః పయసాఽష్టగుణేన తు ॥
కల్కైః పయస్యామధుకచందనానాం విపాచితమ్ ।
అభ్యఙ్గే భోజనే పానే దద్యాద్విసర్పనాశనమ్ ।
ఘృతేన పరిషేక్త . . . . న్తర ।

వాటితో పరిషేకించవలెను. లేదా పై చెప్పిన ఔషధములతో ఘృతసిద్ధం చేయాలి. వీటితో ఈ కషాయమునకు సమానముగా పాలు కలపాలి. చతుర్థావశేషముగా దించుకొని కవ్వంతో బాగ చిలకవలెను. ఈ విధముగా తయారయిన ఘృతమునకు 8 రెట్లు పాలు కలిపి జీవంతి, యష్టమధు, రక్త చందనం వీటికల్కం కలిపి పక్వం చేయవలెను. ఘృత సిద్ధమైన తర్వాత అభ్యంగములకు భోజన పానములకు ఉపయోగించవలెను. ఇది విసర్పమును నశింపచేయును. ఈ ఘృతముతో పరిషేకం కూడ చేయవచ్చును.

యష్టీమధుకతోయేన క్షీరేణేక్షురసేన వా ॥ 51 ॥

వటాదివల్కతోయేన శీతేన పరిషేచయేత్।

యష్టిమధు క్వాథముతో ఇక్షు రసము లేదా వటాది త్వక్ క్వాథము చల్లార్చి దానితో పరిషేకము చేయవలెను.

ప్రదిహేద్వా వటాదీనాం కల్కేన సఘృతేన తు ॥ 52 ॥
తథా సహస్రధౌతేన (శతధౌతేన) వా పునః।
సర్పిషా ప్రదిహేదేనం దాహే క్షీరోత్థితేన వా।

వటాది కల్కములో ఘృతము కలిపి లేదా సహస్రధౌత లేద శతధౌత ఘృతమును లేపము చేయవలెను. లేదా విసర్పము దాహముగా ఉన్నచో పాలతో తీసిన ఘృతమును లేపము చేయవలెను.

సదాహరామ(గ)పాకే తు శ్వయథౌ విప్రసర్పతి ॥ 53 ॥
అంతర్విశుద్ధదేహానాం జలౌకాభిహరేదస్రుక।

విసర్పరోగములో దాహరాగపాకములు ఉన్నచో వమన విరేచనాదుల ద్వార అంతశ్శోధనము చేయవలెను. తర్వాత జలూకల ద్వారా రక్తమోక్షణము చేయాలి.

నిఃస్రావ్య దుష్టం రుధిరం కుర్యాద్రక్తప్రసాదనమ్ ॥
సఘృతైః క్షీరిణాం కల్కైర్యథోక్తైః శీతలైరపి।

దూషిత రక్తము తీసిన తర్వాత పై చెప్పిన క్షీరవృక్ష శీతల వృక్ష త్వక్ కల్కముతో నెయ్యిని కలిపి రక్త ప్రసాదనము చేయవలెను.

ఆదితః శ్లేష్మవైసర్పే వమనం సంప్రకల్పయేత్ ॥ 54 ॥
తద్ఘనం వాఽల్పదోషాణాం తతః కుర్యాదిమాం క్రియామ్।

శ్లేష్మక విసర్ప చికిత్స : మొదట రోగికి వమనం చేయించవలెను. దోషములు తక్కువగా ఉన్నచో లంఘనం చేయించి ఈ క్రింది చికిత్స చేయవలెను.

ముస్తాం పాఠాం హరిద్రే ద్వే కుష్ఠం తేజోవతీం వచామ్ ॥
శార్ఙ్గేష్ఠాం త్రిఫలాం మూర్వామగ్నిం హైమవతీమపి।
వత్సకాతివిషే చైవ తథా కటుకరోహిణీమ్ ॥ 55 ॥
నిష్క్వాథ్య పాయయేదేనం పిష్టైస్తైశ్చ ప్రలేపయేత్।

ముస్త, పాఠ, హరిద్ర, దారుహరిద్ర కుష్ఠ, జ్యోతిష్మతి, వచ, కాకమాచి, త్రిఫల, మూర్వ, చిత్రక, హైమవతి, ఇంద్రయవ, అతివిష, కటుకరోహిణి వీటిని క్వాథము చేసి రోగికి త్రాగించవలెను. మర్ధించి శరీరముపై లేపనం చేయవలెను.

ఆరగ్వధం సోమవల్కం కుటజాతివిషే ఘనమ్ ॥
పాఠాం మూర్వాం సశాఙ్గిష్ఠాం కుష్ఠం చ విపచేద్భిషక్ ।
తత్కషాయం పిబేత్ కాలే సుపిష్టైస్తైశ్చ లేపయేత్ ॥ 56 ॥
తేనాస్య కణ్డూః కోఠాని శోఫశ్చాశు ప్రశామ్యతి ।

ఆరగ్వధ, సోమరాజ, కుటజ, అతివిష, ముస్త, పాఠ, మూర్వ, కాకమాచి, కుష్ఠ, వీటిని కషాయం చేయవలెను. ఉచిత కాలములో దీనిని త్రాగవలెను. ఇవి అశ్వగంధ మర్ధించి లేపనం చేయవలెను. దీని వలన కండు, కోఠ, శోఫ శీఘ్రముగా శమించును.

శృతం వాఽప్యమృతాశుణ్ఠీపర్పటైః సదురాలభైః ॥ 57 ॥
పిబేత్ కషాయం మధునా వైసర్పజ్వరపీడితః ।

విసర్ప జ్వర రోగికి, గుడూచి, శుంఠి, పర్పాటక, దురాలభ వీటి కషాయంలో మధు కలిపి త్రాగించవలెను.

త్రిఫలోశీరముస్తాని ఏరణ్డం దేవదారు చ ॥ 58 ॥
నిష్క్వాథ్య పరిషేక్తవ్యో నిమ్బపత్రోదకేన వా ।

త్రిఫల, ఉశీర, ముస్త, ఏరండ, దేవదారు, క్వాథము లేదా వేపాకు క్వాథముతో పరిషేకము చేయవలెను.

శిగ్రుత్వక్సురసాస్ఫోటకాలమాలఫణిజ్ఝకైః ॥
సాటరూషైః శృతం తోయం ప్రదద్యాత్ పరిషేచనమ్ ।
ఖదిరోదకసేకో వా గోమూత్రేణాథవా హితః ॥ 59 ॥

శిగ్రుత్వక్, తులసి, ఆస్ఫోట, కృష్ణ తులసి, ఫణిజిహ్వ వాసాక్వాథము లేదా ఖదిర క్వాథము లేదా గోమూత్రంతో పరిషేచనము చేయవలెను.

గృహధూమం హరిద్రే ద్వే మాలతీపల్లవాని చ !

విడఙ్గం ద్వే హరిద్రే చ పిప్పల్యస్తలలణ్డికా(?) ॥
ముస్తాఽమృతా హరిద్రే ద్వే పటోలారిష్టపల్లవాః ।
కుటజాతివిషే ముస్తం కుష్ఠం చేతి ప్రపేషయేత్ ॥

ఆగారధూమం రజనీం సైంధవం చ ప్రలేపనమ్ ।
శ్లోకార్ధవిహితా హ్యేతే యోగాః స్వల్పఘృతాయు(న్వి)తాః ॥ **60** ॥
ప్రదేహార్థే ప్రయోక్తవ్యాః శోఫకణ్డూరుజాపహాః ।

1. గృహధూమము, హరిద్ర, దారుహరిద్ర, మల్లె ఆకులు
2. వాయువిడంగ, హరిద్ర, దారుహరిద్ర, పిప్పలీ, తల్లెండిక
3. ముస్త, గుడూచి, హరిద్ర, దారుహరిద్ర, నింబపత్ర, పటోల
4. కుటజ, అతివిష, ముస్త, కుష్ట
5. గృహధూమము, హరిద్ర, దారుహరిద్ర, సైంధవము,
6. వీటి క్వాథములలో ఘృతము కలిపి లేపనమునకు ఉపయోగించవలెను. విసర్ప, శోథ, కండూ నశించును.

సప్తపర్ణం సఖదిరం ముస్తమారగ్వధత్వచమ్ ॥
కురణ్టకం దేవదారు ప్రలేపనమనుత్తమమ్ ।
పలాశభస్మ చైకాఙ్గం లేపో గోమూత్రసంయుతః ॥ **61** ॥

సప్తపర్ణ, ఖదిర, ఆరగ్వద త్వక్, కురంటక, దేవదారు వీటి లేపనం ఉత్తమము. ఫలాశ భస్మము చందనము గోమూత్రముతో కలిపి లేపనం చేయవలెను.

సక్షారం సార్షపం తైలమథవాఽపి ససైంధవమ్ ।
అభ్యఙ్గార్థే ప్రయోక్తవ్యం తైలం కారఞ్జమేవ వా ।
కుష్ఠసైంధవచూర్ణం వా తైలాక్తస్యావఘర్షణమ్ ॥ **62** ॥

సర్షప తైలములో క్షారము లేదా సైంధవలవణము కలిపి లేదా కరంజ తైలముతో అభ్యంగనము చేయవలెను. లేదా రోగికి తైలాభ్యంగనము తర్వాత కుష్టము సైంధవ చూర్ణం కలిపి శరీర ఘర్షణము చేయవలెను.

స్వర్జికాతివిషే ముస్తం త్వగేలేల్వార్థ(లైల్వాలు)వత్సకైః ।
శతాహ్వాగరుకుష్ఠైశ్చ పిష్టైస్తైలం విపాచయేత్ ॥ **63** ॥

తదస్యాభ్యఞ్జనే యోజ్యం కణ్డూకోఠారునాశనమ్ ।

సర్జక్షారము, అతివిష, ముస్త, దాల్చిని, ఏలవాలుకము, ఇంద్రయవ, సోంపు, అగరు, కుష్ఠము వీటి కల్కంతో తైలం సిద్ధం చేసి అభ్యంగం చేసిన కండు, కోఠ, క్షత వ్రణములు నశించును.

శిగ్రుమూలమహింస్రాం చ పిష్ట్వా సర్పిర్విపాచయేత్ ।
తేనాస్యాభ్యఞ్జయేద్గాత్రం కుష్ఠతైలేన వా పునః ॥ **64** ॥

శిగ్రు మూలము, కంటక, పిప్పలి కల్కముతో ఘృతపక్వం చేయవలెను. ఈ ఘృతము లేదా కుష్ఠ తైలంతో రోగికి అభ్యంగనము చేయవలెను.

ఏతేన విధినా వ్యాధిర్యది నైవోపశామ్యతి ।
కణ్డూమద్భిః సదాహైశ్చ మణ్డలైర్విదహేదపి ॥
తతో విరేచనం దద్యాద్రక్తం చాస్యావసేచయేత్ ।
విన్నిర్హృతే దుష్టరక్తే కుర్యాద్రక్తప్రసాదనమ్ ॥ **65** ॥
సఘృతైస్త్రిఫలాకల్కైర్మధుకోదుమ్బరాన్వితైః ।

పై చెప్పిన విధానంతో రోగం శాంతించనిచో కండూ, దాహ, మండలములు ఉన్నచో రోగికి విరేచనం చేయించవలెను. రక్తమోక్షణము చేయవలెను. తరువాత యష్టిమధు, ఉదుంబర, ఘృతయుక్త త్రిఫలా కల్కంతో రక్తప్రసారణము చేయవలెను.

**ఇతి వాతాదిజానాం తే వైసర్పాణాం చికిత్సితమ్ ॥**
**సమాసవ్యాసయోగైశ్చ పృథక్త్వేన చ కీర్తితమ్ ।**
**ఏతదేవ చ సంసృష్టం సంసృష్టేషు ప్రయోజయేత్ ॥ 66 ॥**

ఈ విధంగా నేను సంక్షేపముగా విస్తారముగా వాతాది విసర్పముల చికిత్సను వర్ణించినాను. సంసృష్ట దోష విసర్పములో ఇదే చికిత్సను సంసృష్టముగా చేయవలెను.

**యవాన్నం శాలయో ముద్గా మసూరాః సహరేణవః ।**
**భోజనార్థే పురాణాః స్యుర్జాఙ్గలాశ్చ మృగద్విజాః ॥ 67 ॥**

విసర్పములో పథ్యము భోజనములో పురాతన యవాన్నమును శాలి

ధాన్యమును, ముద్గ, మసూర, హరేణు, జాంగల పశు పక్షిమాంసమును ఇవ్వవలెను.

**మసూరికాః సవిస్ఫోటాః కక్ష్యాం పామాం తథైవ చ ।**
**సంసృష్టపిత్తరక్తోత్థా వైసర్పవదుపక్రమేత్ ॥ 68 ॥**

మసూరికా, విస్ఫోట, కక్ష, పామ, పిత్తరక్త సంసర్గము వలన ఉత్పన్నం అగును. వీటిని కూడా విసర్పం వలనే చికిత్సించవలెను.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ।**
అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**(ఇతి) ఉత్తరేషు ఖిలస్థానే భార్గవీయాయాం సంహితాయాం**
**వైసర్పచికిత్సాధ్యాయశ్చతుర్దశః ॥ 14 ॥**

విసర్పాధ్యాయము సమాప్తము.

# చర్మదళ చికిత్సితాధ్యాయః - పఞ్చదశః

అథాతశ్చర్మదలచికిత్సితం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥
ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇపుడు మనము చర్మదళ అధ్యాయము వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**అథ ఖలు భగవంతమృషిగణపరివృతం బ్రాహ్మ్యా శ్రియా దేదీప్యమానమృషిశ్రేష్ఠం కశ్యపమభివాద్య పప్రచ్ఛ భార్గవః - భగవన్ ! క ఏష చర్మదలో నామ వ్యాధిర్విసర్పమాణోఽగ్నిదగ్ధోపమరూపోఽత్యాబాధకరో బాలానామఙ్గేషూపపద్యతే, కథం చోత్పద్యతే క్షీరపాణాం కుమారాణాం ? క్షీరాన్నాదానాం తు(చ), నవాఽన్నాదవయస్థానమ్ ? అత్ర కో హేతుః ? కిమాత్మకః ? కతివిధః ? కాని చాస్య లక్షణాని ? ఉపద్రవాశ్చ కే ? ఇత్యేవం వ్యాఖ్యాతుమర్హసీతి ॥ 3 ॥**

ఐశ్వర్య, శాలి, ఋషిగణులతో ఆవరింపబడిన బ్రహ్మ తేజస్సుతో దేదీప్యమానమైన ఋష్యశ్రేష్ఠుడైన కాశ్యపునికి భార్గవుడు అభివాదం చేసి ప్రశ్నించెను. ఓ భగవాన్! బాలకులలో ఉత్పన్నం అగు చర్మదళమను రోగము వ్యాపించునది. దాని లక్షణములు అగ్నిదగ్ధ సమానముగ ఉండును. అత్యంత కష్టముగ ఉండును. ఇది క్షీరాదులలో క్షీరాన్నాదులలో ఎందుకు కలుగును? అన్నాదులు పెద్దవయసు బాలకులలో ఎందుకు ఉత్పన్నం కాదు? దీని ఉత్పన్న కారణములు ఏమి? దీని స్వరూపము ఏమి? ఎన్ని భేదములు? దీని లక్షణములు ఏవి? దీని ఉపద్రవములు ఏవి మొదలగు విషయములను ఉపదేశించగలరు.

అథ భగవానబ్రవీద్వత్స ! శ్రూయతామిహ ఖలు క్షీరపాణాం కుమారాణాం స్తన్యదోషేణ క్షీరాన్నాదానాం స్తన్యదోషేణాహారదోషేణ చ, సుకుమారాణామస్థిరధాతూనాం బాలానాం గర్భశయ్యోచితమృదుశరీరాణాం వస్త్రాఙ్కాధారణోష్ణానిలాతపస్వేదోపనాహస్వమలమూత్రపురీషసస్పర్శాశౌచ-పాణిపీడనాఽతీవోద్వర్తనకులప్రవృత్త్యాదిభిరుపాయైర్ముఖగలహస్తపాదవృషణాంతర-కట్యఙ్గసంధిషు చోత్పద్యతే ॥ 4 ॥

భగవాన్ కశ్యపుడు ఉత్తరము ఇచ్చెను. వత్సా! వినుము ఇది క్షీరాదులలో స్తన్య దోషకారణముచే క్షీరాన్నద బాలకులలో క్షీరము అహార దోషములతో ఉత్పన్నం అగును శరీర ధాతువులు స్థిరముగా లేకపోవుట శరీరము గర్భశయ్యా యోగ్యమగు మృదుత్వము సుకుమారం కలిగి ఉండుట. ఇలాంటి బాలురకు వస్త్రములు అతిగా ధారణము చేయుట ఎల్లపుడు వడిలో ఉంచుకొనుట ఉష్ణ, వాయువు, ఎండ, స్వేద, ఉపనాహ, మరియు బాలుర స్వశరీరం మలమూత్ర పురీషాదులు అంటుకొనుట, అశుభ్రమైన చేతులతో పీడనం అతి ఉద్వర్త నాది కారణములతో కులప్రవృత్తి కారణమున బాలురకు ముఖము, మెడ, హస్త, పాదములు, వృషణముల క్రింద, కటి అంగసంధులలో ఉత్పన్నం అగును.

నచాన్నాదవయఃస్థానామితి కిం కారణం ? స్థిరకఠినసంహతత్వ-గస్థిధాతూనాం తథా నిత్యవ్యాయామోపచితగాత్రాణాం క్లేశం సహతాం న భవత్యేష వ్యాధిరితి ॥ 5 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 237 తమం పత్రమ్)

అన్నాదులు పెద్ద వయసు కల బాలురలో త్వచ, అస్థి, ధాతువులు స్థిరము కఠినము, ధృఢముగా ఉండును. నిత్యవ్యాయా మాదులతో శరీరము పుష్టిగా ఉండును. క్లేశములు సహింతురు. కావున వీరిలో ఈ రోగము కలుగదు.

వాయుభూయిష్ఠత్వాద్వాయ్వాత్మకమేవోదాహరన్తి । చర్మదలమితి చర్మావదారణాత్ । స చతుర్విధో – వాతికః, శ్లైష్మికః, సాన్నిపాతిక ఇతి ॥ 6 ॥

ఈ రోగములో వాతం ప్రధానం కావున వాతాత్మకం అనబడును. చర్మ అవదారణం అగుటచే ఇది చర్మదళం అనబడును. ఇది 4 విధములుగా ఉండును. వాత, పిత్త, కఫ, సన్నిపాతములు.

తత్ర యా బాలస్య మాతా వా ధాత్రీ వా రూక్షసముదాచారాహారో-దావర్తనోపవసనశీలా తథాఽతిచఙ్క్రమణవ్యాయామక్లేశానత్యర్థముపసేవతే తస్యా వాయుః ప్రకుపితః స్తన్యం దూషయతి । తస్య లక్షణమ్ – ఉదకే ప్రక్షిప్తం ప్లవతే విచ్ఛిద్యతే ఛత్రాయతే శ్యావావభాసం, రసేన తిక్తకషాయం విరసం చేతి । తత్ పిబతో జంతోరిమాని రూపాణి భవంతి – సకణ్డూస్ఫుటితపరుషశ్యావావభాసాన్యఙ్గే మణ్డలాని; పిప్లుతం తను వివర్ణమతిసార్యతే; ప్రవేపకముఖశోషరోమహర్షాన్వితశ్చ వాతచర్మదలః ॥ 7 ॥

నిదాన సంప్రాప్తి : బాలురు, తల్లి లేదా ధాత్రి రూక్ష ఆచార ఆహారము, ఉదావర్తనము ఉపవాసం చేయుట, అతి చంక్రమణము, వ్యాయామ క్లేశాదలను సేవించుటచే వాతము ప్రకుపితమై స్తన్యమును దూషించును. ఆ స్తన్య లక్షణములు: నీటిలో వేసిన తేలును, విడిపోవును. గొడుగు వలె కనిపించును. శ్యావ వర్ణము, తిక్త కషాయరసములు, విరసముగా ఉండును. ఈ స్తన్య సేవనంవలన కండు, స్ఫోట కఠోర, శ్యావ వర్ణములు కలిగిన మండలములు కనిపించును. చీమలు కుట్టినట్లుగా, ఫేన యుక్తముగా విసర్పము కలుగును. విప్లుత, పలుచటి పలు వర్ణములుగా అతిసారం కలుగును. ఇందులో కంపము ముఖశోష రోమహర్షం కలుగును.

యదా తు ధాత్రీ క్రోధసంతాపోష్ణామ్లలవణకటుకవిదగ్ధాధ్యశనవివశా (తా) నుపసేవతే తస్యాః పిత్తం ప్రకుపితం వాయునా విక్షిప్యమాణం స్తన్యవహాభిః సిరాభిరనుసృత్య స్తన్యం దూషయతి । తస్య లక్షణాని – ఉదకే ప్రక్షిప్తం హరితరక్తాసితావభాసం భవత్యథ రసేన కట్వమ్లలవణతిక్తం, స్పర్శేనోష్ణమితి । తత్ పిబతో జంతోరిమాని రూపాణి భవన్తి – రక్తనీలావభాసాని శ్యావపీతాభాని శుష్కచ్ఛవీన్యుష్ణాని కుథితదోషపూర్ణాని మణ్డలాన్యుత్పద్యన్తే ఽస్య విసర్పిణిత్వఙ్మాంసదారణాని ప్రభిన్నాని పద్మపత్రప్రకాశాన్యగ్నిదగ్ధోపమాని భవన్తి । అతోఽతిసార్యతే హరితపీతగుదపాకకరమభీక్ష్ణం, దాహముఖశోషచ్ఛర్ది యుచ్ఛ(పీత) వదనాన్వితశ్చ పిత్తచర్మదలః ॥ 8 ॥

ధాత్రి క్రోధ, సంతాప, ఉష్ణ, అమ్ల, లవణ, కటు రసయుక్త విదగ్ధాహారము, విహారము, అధ్యశనాది సేవనము చేసినచో వాతము విక్షిప్తమై

ప్రకోపించిన పిత్తము స్తన్యవహాది సిరలలో చేరి స్తన్యమును, దూషించును. ఆ పిత్తముతో దూషించబడిన స్తన్యము నీటిలో వేసినచో పీతరక్తవర్ణము కృష్ణవర్ణము కనబడును. కటు, అమ్లలవణ తిక్తరసములు కలిగి ఉష్ణస్పర్శ కలిగి ఉండును. ఆ క్షీర సేవన చేయు బాలునికి శరీరముపై రక్త, నీల, కృష్ణ, పీత వర్ణములు కల్గి శుష్కమైన ఉష్ణదుర్గంధ యుక్త దోషపూర్ణమండలములు ఉత్పన్నమగును. త్వక్ మాంసములను దారణము చేయు పద్మపత్రి తుల్యమైన అగ్ని దగ్ధ సమాన విసర్పము కల్గును. నిరంతరము హరిత పీతవర్ణమలము అతిసారముగా ఉండి గుదపాకమును కల్గించును. దాహము, ముఖశోష ఛర్ది, ముఖము పీతముగా నుండుట ఇవి పిత్త చర్మదళ లక్షణములు.

**అథ యా ధాత్రీ గుర్వమ్లలవణమధురాభిష్యందిదివాస్వప్నాలస్యాహితాని చాత్యర్థముపసేవతే తస్యాః ప్రకుపితః శ్లేష్మా వాయునా సముదీర్యమాణః స్తన్యమభిదూషయతి । తస్య లక్షణం – జలే నిషీదత్యధస్తాద్రూపేణ సాంద్రం స్నేహబహులం స్పర్శేన శీతపిచ్ఛిలం రసేన మధురమితి । తత్ పిబతో జంతోరిమాని రూపాణి భవంతి – శీతస్తిమితస్నిగ్ధసాంద్రైర్మండలైః శ్వేతాభైర్బహుభిర్నాత్యర్థవేదనాకారైః సర్షపమాత్రీభిః పిడకాభిరుపచితైశ్చిరపాకిభిః సకణ్డూతోదయుతైరుపచీయతే, తతోఽస్య ప్రతిశ్యాయారోచకాఙ్గగౌరవకాసపాకా ఉత్పద్యంతే, బహులం పిచ్ఛిలం చాఽనుబద్ధమతిసార్యతే, నిష్టనతి శ్లేష్మాణం ఛర్దయతి, తంద్రాభిభూతః శ్వేతతాల్వోష్ఠశ్చ భవతీతి శ్లేష్మచర్మదలః ॥ 9 ॥**

గురు అమ్ల లవణ మధుర అభిష్యంద ఆహారము దివాస్వప్నము ఆలస్యము అన్య అహితకర ఆచారాదులను అధికముగా సేవించు ధాత్రికి ప్రకుపితమైన కఫము వాతము తో ప్రేరితమై స్తన్యమును దూషించును. ఈ స్తన్యము జలములో వేసిన క్రిందికి చేరును. సాంద్రము, స్నేహాధిక్యము ఉండును. శీతల స్పర్శ పిచ్ఛిలముగా నుండును. మధుర రసము కల్గి ఉండును. ఈ క్షీర సేవనచే శీతము, స్తైమిత్యము స్నిగ్ధ సాంద్రమండలములు కల్గును. శ్వేతవర్ణము అధిక సంఖ్యలో స్వల్ప వేదనతో సర్షప తుల్యమై ఆలస్యముగా పక్వమగు కండు తోదయుక్త పిటికలు ఏర్పడును తర్వాత ప్రతిశ్యాయము అరుచి, అంగగౌరవము, కాస, శ్వాస, పాకాదులు కలుగును. మరియు పిచ్ఛిలమ గుమలముతో అతిసారము

ఉండును. శ్లేష్మ వమనము ఉండును. తంద్ర ఓష్ఠ తాలు తెలుపుగ ఉండును. ఇవి శ్లేష్మజ చర్మదళ లక్షణములు.

**యదా తు త్రిదోషసంసృష్టం క్షీరమనుపిబతి తదాఽస్యాఙ్గే మణ్డలాని ప్రాదుర్భవంతి కృష్ణరక్తావభాసాని దగ్ధగుడప్రకాశాని వా త్రిభిర్గుణైరన్వితాని క్షిప్రపాకీని విగంధీన్యవదీర్ణాని పూతికుణపవిస్రావీణి చేతి । తైః స సర్వావనద్ధాఙ్గో నిష్టనత్యనిశం కృచ్ఛ్రేణ రోదితి స్తనం నాభినందతి, కృష్ణమరుణవర్ణావభాసం చాఽతిసార్యతే। సోఽసాధ్యః సన్నిపాతాత్మక ఇతి ॥ 10 ॥**

త్రిదోష దూషిత స్తన్యము సేవించిన బాలునికి శరీరముపై కృష్ణ రక్త వర్ణము దగ్ధమై గుడ తుల్యముగా కనిపించునది శీఘ్రముగా పక్వమగు దుర్గంధ యుక్త విదీర్ణమగు పూయ కుణప స్రావములు కలిగి త్రిదోష యుక్త మండలములు ఉత్పన్నం అగును. ఈ మండలములు సర్వ శరీరము వ్యాపించును. ఎల్లపుడు కృచ్ఛ్ర శ్వాస కలిగి అతిరోదనము స్తన అసహిష్ణుత ఉండి కృష్ణ అరుణ వర్ణము కల అతిసారము కలుగును. ఇది సన్నిపాతిక చర్మదళము అసాధ్యము.

**ఛర్దితృష్ణాజ్వరాధ్మానశ్వయథుహిక్కాశ్వాసస్వరభేదోపద్రవాన్వితశ్చ ప్రత్యాఖ్యేయః ॥ 11 ॥**

చర్మదళ ఉపద్రవములు వమనము తృష్ణ జ్వరము ఆధ్మానము శోథ హిక్క, శ్వాస, స్వర భేదము ఇవి వున్న అసాధ్యము.

**భవంతి చాత్ర శ్లోకాః –**

**నోపక్రమేదసాధ్యం తు సాధ్యం యత్నేన సాధయేత్ ।**
**యత్ పశ్యేద్ ద్వంద్వజం రూపే పాకం వా రూపతోఽధికమ్ ॥ 12 ॥**
**తస్య తస్య విదిత్వా తు క్రియాం సమ్యక్ ప్రయోజయేత్ ।**
**యేనోపక్రమ్యమాణోఽపి శాంతిం నైతి పునః పునః ॥ 13 ॥**
**తేనైవోత్పాతరోగోఽయం న విశ్వాస్యః కథఞ్చన ।**
**తస్మాత్ సమ్యగుపక్రమ్యో యథా వక్ష్యే చికిత్సితమ్ ॥ 14 ॥**

అసాధ్య రోగములో చికిత్స చేయకూడదు. సాధ్య రోగములో యుక్తి పూర్వకముగా చికిత్సచేయవలెను. ద్వంద్వజములో మరియు అధిక పక్వము కలిగి

ఉన్న రోగములో సరిగా చూచి చికిత్స చేయవలెను. ఇందులో పలుమార్లు చికిత్స చేసిన శాంతించదు. కావున ఇది ఉత్పాత రోగము అందురు. ఈ రోగము నెపుడు విశ్వసించకూడదు. కావున సరిగ్గా చూసి చికిత్స చేయవలెను. దీని చికిత్సను వర్ణించెదను.

తత్రాదిత్ ఏవ ధాత్రీం స్నేహాభ్యఙ్గస్వేదోపపన్నాం నీలికాచూర్ణయుతం సర్పిః పాయయేత్, త్రివృచ్చూర్ణఘృతం వా । తతః సంసర్గోపపాదితాలఘు-స్నిగ్ధైర్యూషైర్దాడిమసైన్ధవయుక్తైర్మృదుమోదనమశ్రీయాన్నివాతశయనాసనపరా । వ్యాయామాజీర్ణమైథునం చ నానుచరేత్। విదారిగన్ధైరణ్డబృహతీ గోక్షురకపునర్నవా పృశ్నిపర్ణ్య ఇతి కషాయమేనాం పాయయేత్ స్తన్యశోధనార్థం, ద్విపఞ్చ మూలకషాయం వా। రాస్నా సుగంధా నాకులీతి కల్కః స్తనాలేపః, తథాఽజగంధాఽ వల్గుజకబృహతీకణ్టకారికాయుతః ప్రదేహః, శతాహ్వామధుకాజ గంధాకాశ్మర్య బృహతీకణ్టకారికాబలాపీలుగుడూచీకల్కో వా భద్రముస్తాత్వ(గ) గరుకల్కో వా పురాణసర్పిస్తిలకల్కో వేతి । అథోరుపూగపలాశపాటలిరాస్నాక్వాథః పరిషేకః, పయసా వా సుఖోష్ణేన చేతి । దేవదారురాస్నాబర్హిణమఞ్జేతి తైలం విపక్వ మభ్యఞ్జనీయం, బిల్వదేవదారుచూతముక్తిఫలవిపక్వం వా ద్విబలాబిల్వ మూలసురదార్వామ్రపేశికావిపక్వం వేతి వాతచర్మదలచికిత్సితముక్తమ్ ॥ 15 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 238 తమం పత్రమ్)

వాతిక చర్మదళ చికిత్సః ప్రప్రథమముగా ధాత్రికి స్నేహ స్వేదములు చేయించి నీలిక లేదా త్రివృత్ చూర్ణమును ఘృతముతో తాగించవలెను. దాడిమ లవణము వేసిన సంసర్గయుక్త గురుస్నిగ్ధ యూషను మెత్తటి అన్నముతో తినవలెను. అపుడు రోగి నివాత స్థానము నందు ఉండవలెను. వ్యాయామ, అజీర్ణ, మైథునములను వర్జించవలెను. స్తన్యశోధనమునకై విదారి గంధ, ఏరండ, బృహతి, గోక్షుర, పునర్నవ, పృశ్నిపర్ణి వీటి కషాయం, లేదా దశమూల కషాయం త్రాగించవలెను. స్తనములపై, రాస్నా, సుగంధ, లేదా గంధనాదులు కలపవలెను. లేదా లేపనం చేయవలెను. లేదా అజగంధ, సోమరాజి, బృహతి, కంటకారి లేపము లేదా సోంపు, యష్టిమధు, అజగంధ, గంభారీ, బృహతీ, కంటకారి, బల, పీలు, గుడూచి, కల్కం లేదా ముస్త, అగరు కల్కం, లేదా పురాణ ఘృతములో తిల

కల్కం కలిపి లేపము చేయవలెను. శ్వేత ఏరండ, ధాతకీ, పాటల, రాస్నాక్వాథము లేదా ఉష్ణ జలముతో పరిషేకము చేయవలెను. దేవదారు రాస్న మయూర మజ్జ, లేదా బిల్వ దేవదారు, మామిడి, ముక్తి ఫలము, లేదా బల, అతిబల బిల్వమూల, దేవదారు, ఆమ్రాస్థి మజ్జతో సిద్ధము చేయబడిన తైలము అభ్యంగనమునకు ప్రయోగించవలెను. ఇది వాతిక చర్మదళ చికిత్స చెప్పబడినది.

అథ పైత్తికే వక్ష్యామః । తద్యథా - ధాత్రీం స్నేహాభ్యజ్గోపపన్నాం వమనవిరేచనేనోపక్రమేత్, నిమ్బోదకపిప్పలీకల్కేన వామయేత్ పిప్పలీలవణయుక్తేన వా దోషనిర్హరణార్థం, మృద్వీకేక్షురసాభయాదిభిర్విరేచయేన్మృద్వీకామలక-సంయోగేన వా ఆరగ్వధఫలమజ్జకషాయసంయుక్తేన వా క్షీరేణేతి యథాబలం వీక్ష్య। సంసర్గం కారయేద్యవాగ్వా యూషకృతాకృతవిధానేన వా । కాశ్మర్యమధుకపరూషకశీతపాక్య ఇతి కృత్వా సుశీతం శర్కరామధులిఖితం కషాయం పాయయేత్ స్తన్యశోధనార్థం, పయస్యాసారివామృతామధూకమృద్వీకానాం కషాయం శర్కరాయుతం చేతి । ప్రపౌణ్డరీకసారివోశీరచందనకల్కః స్తనాలేపః, మధుకక్షీరశుక్లాచందనరసాఞ్జనతుజ్గయుతః ప్రదేహః, యష్టీమధుకచందనకల్కో వా, మధుకచందనభద్రముస్తామఞ్జిష్ఠారసాఞ్జనకల్కో వా, రసాఞ్జనసారివామధుక-చందనోశీరకల్కో వా, కకుభోదుమ్బరాశ్వత్థవటనలమూలశాలూకవఞ్జులకల్కో వా ఘృతయుతః, విశమృణాలపద్మకమఞ్జిష్ఠాపద్మరసాఞ్జనకల్కో వేతి । మధుకమధుపర్ణీవేడవేతసశతావరీనలమూలకదలీకుశకాశపద్మోత్పలేక్షువిదారీవటో-దుమ్బరత్వగ్జమ్బూకుమ్భికా మధురా చేత్యేతాని జలాఢకే పక్త్వా చతుర్భాగావశేషే ఘృతప్రస్థం పాచయేత్ కషాయద్విగుణక్షీరేణ సగర్భః స్యాన్మఞ్జిష్ఠావితూర్ణకపయ-స్యాధాతక్యుశీరచందనక్షీరకాకోలీప్రపౌణ్డరీకక్షీరశుక్లాతాలీసమృద్వీకేతి సుపిష్టం విదధ్యాదేతేన సిద్ధేనాభ్యజ్య లతతోఽవచూర్ణయేల్లోధ్రమధుకదారుహరిద్రా-మలకీత్వక్పత్రచూర్ణైనైతేనేత్యేవమ్, అస్మాజ్జ్వరదాహరాగపాకత్రణాదయశ్చోప-శామ్యంతీతి పిత్తచర్మదల చికిత్సితముత్తమమ్ ॥ 16 ॥

పైత్తిక చర్మదళ చికిత్స :- ధాత్రికి స్నేహాభ్యంగనము చేసి వమనం చేయవలెను. దోష నిర్హరణము కొరకు వేప కషాయములో పిప్పలీ కల్కం కలిపి, లేదా పిప్పలీ, లవణం ద్వారా వమనం చేయించవలెను. రోగి బలానుసారము, ద్రాక్ష ఇక్షు రసము

హరీతకి, లేదా ద్రాక్ష, ఆమ్లకీ, లేదా పాలలో ఆరగ్వధ మజ్జ కషాయం కలిపి విరేచనం చేయించవలెను. తరువాత యవాగు కృతయూషము, అకృతయూషము సంసర్జనక్రమము చేయవలెను. స్తన్య శోధనం కొరకు గంభారి, యష్టిమధు, పరూషక, శాత పాక్య ( బలాఫలం) క్వాథము చేసి మధు శర్కర కలిపి ఇవ్వవలెను. లేదా క్షీర కాకోలి, సారిబ, గుడూచి, మధూకఫలము, ద్రాక్షా కషాయంలో శర్కర కలిపి ఇవ్వవలెను. పుండరీకము, సారిబ, ఉశీర చందన కల్కమును స్తనములపై లేపనం చేయవలెను. యష్టిమధు, క్షీర శుక్ల, రక్తచందన, రసాంజనం, నాగకేసరము, లేదా యిష్టిమధు చందన కల్కమును లేదా యష్టి మధు రక్త చందనము, ముస్త, మంజిష్ట, రసాంజన కల్కం, లేదా రసాంజనము, సారిబ, యష్టిమధు, రక్త చందనం, ఉశీర కల్కమును లేదా అర్జున త్వక్, వేండి, అశ్వత్థ, వట, నలమూలము, శాలూకము, వంజుల, కల్కంలో ఘృతమును కలిపి లేదా విశమృణాలము, పద్మకము, మంజిష్ట, కమలమును రసాంజన కల్కము లేపనం చేయవలెను. తరువాత, యష్టిమధు, గుడూచి, వేడ (చందనము) వేతసం, శతావరీ, నలమూలము, కదలీ, కుశ, కాశ, పద్మ, ఉత్పల, ఇక్షు, విదారి, వట, ఉదుంబర త్వక్, నేరేడు, కుంభీక, సోంపు, వీటినన్నిటిని ఆఢక జలంలో పక్వం చేసి, చతుర్థావశేషముగా ఉన్నపుడు, ఒక ప్రస్థము ఘృతము, కషాయమునకు రెండింతలు పాలు కలుపవలెను. మంజిష్ట, విత్తూర్ణక, కాకోలీ, ధాతకీ పుష్పము, ఉశీర, రక్తచందన, క్షీరకాకోలీ, పుండరీక, క్షీర శుక్ల, తాలీసపత్ర, ద్రాక్ష బాగమర్ధించి కల్కం చేసి ఘృత సిద్ధం చేయవలెను. ఈ ఘృతమును అభ్యంగనం చేసి శరీరముపై లోధ్ర యష్టి మధు, దారు హరిద్ర, ఆమలకీ, దాల్చిన తేజపత్ర చూర్ణమును చల్లవలెను. దాని వలన జ్వరము, దాహ, రాగ, పాక, వ్రణాలు శాంతించును.

అత ఊర్ధ్వం శ్లైష్మికే వక్ష్యామః - అథ ధాత్రీం పూర్వేణ విధినోపచార్య నిమ్బకషాయమదనఫలసిద్ధాం వ్యక్తలవణాం యవాగూం పాయయేన్మదనఫలతిల-పిష్టతణ్డులసిద్ధాం వా వమనవిధానేన సుఖసలవణస్నిగ్ధాయాః శ్లేష్మోద్ధరణార్థం చ పిప్పల్యుష్ణోదకం పీత్వా చ్ఛర్దయేత్, కృతవమనాయాః శిరోవిరేచనం విదధ్యాన్ముద్ర సతీనవేత్రాగ్రపటోలనిమ్బముస్తకానామన్యతమపరిగృహీతేన యూషేణ

మృదుమోదనం భోజయేత్ । కుటజఫలముస్తాప్రియఙ్గశార్ఙ్గిష్ఠాపాఠాలోధ్ర గుడూచీమూర్వేత్యక్షమాత్రాణి యథాలాభం సుఖోష్ణోదకేనానుపిబేత్, పాఠాశృఙ్గబేరకల్కం వా, కుటజఫలపాఠాకల్కం వా, కిరాతతిక్తముస్తాచూర్ణం వా మధునా లిహేత్ । భద్రముస్తారిష్టపటోలమూర్వాదారుహరిద్రాత్రిఫలా సప్తపర్ణత్వగిత్యేతైః కషాయమాసుతం మధునా పాకవ్యపదేశతఃప్రయోజయేత్, ముస్తకమాలతీపత్రకల్కేన స్తనావాలేపయేత్ । అథ విరేచనం త్రివృత్త్రిఫలోష్ణోదక లవణసంయుక్తముపయోజ్య యూషశ్చాహారవిధిః । కుటజారిష్టారగ్వధమదన స్వాదుకణ్టకముస్తకనక్తమాలయుతః ప్రదేహః, కుష్ఠశుకనాసారోహిణీముస్తకకిరాత తిక్తాతివిషాయుతో వా, సురసశిగ్రుముస్తాకాల మాలకవిడఙ్గహిఙ్గుపర్ణీతి వా,, త్రిఫలాదారుహరిద్రాకల్కో వా హరిద్రారసాఞ్జనకల్కో వేతి । భద్రముస్తోశీరా ఫోటాటరూషకహరిద్రాకరఞ్జ– సుమనారిష్టసిద్ధం తైలమభ్యఞ్జనీయమితి ॥ 17 ॥

ఇపుడు శ్లేష్మ చర్మదళ చికిత్సను చెప్పెదను.

ధాత్రి, పూర్వోక్త విధితో ఉపచారము చేసి, వమన విధిని అనుసరించి యవాగును త్రాగించవలెను. నింబకషాయం, మదన ఫలంతో సిద్ధం చేయబడిన దానిలో లవణము కలిపి లేదా మదనఫలం, తిలపిష్టము, బియ్యముతో సిద్ధం చేయబడిన కషాయం సుఖ పూర్వకముగా లవణయుక్త ద్రవ్యముల ద్వార స్నేహనమైన తర్వాత, కఫమును వెడలించుటకు పిప్పలీ, ఉష్ణజలము త్రాగించి వమనం చేయించవలెను. వమనానంతరం శిరోవిరేచనం చేయవలెను. తర్వాత ముద్గ, సతీన, నేత్రాగ్ర, పటోల, నింబ ముస్త వీటిలో ఏదో ఒకటి యూషతో మృదు ఓదన భోజనము చేయవలెను. ఇంద్రయవ, ముస్త, ప్రియంగు, కాకజంఘ, పాఠ, లోధ్ర, గుడూచి, మూర్వ, యథా లభ్యముగా, ఒక్కొక్క అక్షచూర్ణము, లేదా, పాఠ, ఆర్ద్రక కల్కము, ఇంద్రయవ, పాఠాకల్కము సుఖోష్ణ జలముతో త్రాగించవలెను. లేదా కిరాత తిక్త, ముస్త చూర్ణము మధుతో ఇవ్వవలెను. ముస్త, నింబ, పటోల, మూర్వ, దారుహరిద్ర త్రిఫల, సప్తపర్ణత్వక్ క్వాథము, సంధానం చేసి మధుతో కలిపి పాక రూపములో ప్రయోగించవలెను. ముస్త, మల్లె ఆకుల కల్కము, స్తనములపై లేపము చేయవలెను. త్రివృత, త్రిఫల, ఉష్ణజలములో లవణం కలిపి విరేచనం కివ్వవలెను. ఆహార రూపములో యూషను సేవించవలెను.

కుటజ, నింబ, అరగ్వధ, మదనఫల, గోక్షూర, ముస్త, కరంజ, లేదా కుష్ఠ, శుకనాసా, రోహిణి, ముస్త, కిరాతతిక్త, అతివిష, లేదా తులసి, శోభాంజనము, ముస్త, కృష్ణముస్త, విడంగ, హింగుపర్ణి లేదా త్రిఫల, దారుహరిద్ర కల్కము హరిద్ర రసాంజన కల్కమును లేపనం చేయవలెను. ముస్త, ఉశీర, అస్ఫోట, వాస, హరిద్ర, కరంజ, పూతి కరంజ, నింబత్వక్‌తో సిద్ధం అయిన తైలముతో అభ్యంగనము చేయవలెను.

**భవతి చాత్ర శ్లోకః –**

**ఏషా చర్మదలోత్పత్తిర్వ్యాఖ్యాతా వర్ణరూపతః ।**
**సాధ్యాసాధ్యవిధానైశ్చ (ప్రతీకార్యో) యథాక్రమమ్ ॥ 18 ॥**

ఈ విధముగా వర్ణరూపానుసారం చర్మదళ ఉత్పత్తి వర్ణించబడినది. సాధ్యా అసాధ్య అనుసారము యథాప్రకారముగా చికిత్స చేయవలెను.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ (పృ 85) ।**

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**(ఇతి) ఖిలేషు చర్మదలచికిత్సా(ధ్యాయః పఞ్చదశః) ॥ 15 ॥**

చర్మదళాధ్యాయము సమాప్తం.

# ఆమ్ల పిత్త చికిత్సితాధ్యాయః - షోడశః

అథాతో ఽమ్లపిత్తచికిత్సితం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥
ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము అమ్ల పిత్త చికిత్సను వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

విరుద్ధాధ్యశనాజీర్ణాదామే చామే చ పూరణాత్ ।
పిష్టాన్నానామపక్వానాం మద్యానాం గోరసస్య చ ॥ 3 ॥
గుర్వభిష్యందిభోజ్యానాం వేగానాం ధారణస్య చ ।
అత్యుష్ణస్నిగ్ధరూక్షామ్లద్రవాణామతిసేవనాత్ ॥ 4 ॥
ఫాణితేక్షువికారాణాం కులుత్థానాం చ శీలనాత్ ।
భృష్టధాన్యపులాకానాం పృథుకానాం తథైవ చ ॥ 5 ॥
భుక్త్వా భుక్త్వా దివాస్వప్నాదతిస్నానావగాహనాత్ ।
అంతరోదకపానాచ్చ భుక్తపర్యుషితాశనాత్ ॥ 6 ॥
వాతాదయః ప్రకుప్యన్తి తేషామన్యతమో యదా ।
మందీకరోతి కాయాగ్నిమగ్నౌ మార్దవమాగతే ॥ 7 ॥
ఏతాన్యేవ తథా భూయః సేవమానస్య దుర్మతేః ।
యత్కించిదశితం పీతం దేహినస్తద్ధి దహ్యతి ॥ 8 ॥

**విదగ్ధం శుక్తతాం యాతి శుక్తమామాశయే స్థితమ్ ।**
**తదమ్లపిత్తమిత్యాహుర్బ్రాయిష్ఠం పిత్తదూషణాత్ ॥ 9 ॥**
**జంతోర్యదనుబధ్నాతి లౌల్యాదనియతాత్మనః ।**

**నిదాన సంప్రాప్తి :** విరుద్ధ భోజనము, అధ్యశనము, అజీర్ణ మరియు ఆమరసము లేదా ఆమ ఆహారము శరీరమునందున్నపుడు మరలభుజించుట పిష్టాన్నము అపక్వమద్యము, గోరసముతో, గురు అభిష్యంద భోజనముతో, వేగధారణము వలన, అతి ఉష్ణ, స్నిగ్ధ, రూక్ష, అమ్ల భోజనముచే, ద్రవపదార్థముల అధిక సేవనచే ఫాణితము, గుడాది అన్య ఇక్షు వికారములు కులుత్థ, వేయించిన ధాన్యము, తుష తుచ్ఛ ధాన్యము మరియు పృధుకము అధికసేవనచే భోజనానంతరము వెంటనే ధివాస్వప్నము చేయుట అధిక స్నానము అవగాహనము, భోజనమధ్యమందు నీరుసేవించుట పర్యుషిత భోజనము, వీటిచే వాతాది దోష ప్రకోపము జరుగును. వీటిలో ఏదైనా జఠరాగ్నిని మందము చేసి నపుడు ఉపర్యుక్త విరుద్ధ్యశనాది కారణములసేవనచే మూర్ఖుడు ఏదైనా సేవించినపుడు అది విదగ్ధమగును. ఈ విదగ్ధాన్నము శుక్తమగును. అది ఆమాశయములో స్థితమగును. ఈ అవస్థలో అసంయమన మనిషి జిహ్వా లోల్యముచే ఏదైనా తిన్నపుడు విదగ్ధమైన పిత్తము దూషితమగును దీనినే అమ్లపిత్త మందురు.

**అవిశుష్కే యథా క్షీరం ప్రక్షిప్తం దధిభాజనే ॥ 10 ॥**
**క్షిప్రమేవామ్లతామేతి కూర్చీభావం చ గచ్ఛతి ।**
**రసధాతౌ తథా వ్యమ్లే భుక్తం ముక్తం విదహ్యతే ॥ 11 ॥**

సరిగా ఎండిన దధి పాత్రలో పాలుపోసినపుడు వెంటనే అమ్లమై పెరుగు అగునట్లు, ధాతువులు అమ్ల యుక్తమైనపుడు ఏ భోజనము చేసిననూ విదగ్ధమగును.

**అవ్యాపన్నే త్వధిష్ఠానే జాగ్రతః స్వపతోఽపి వా ।**
**ప్రేర్యమాణః సమానేన ప్రశ్వాసోచ్ఛ్వాసయోగతః ॥ 12 ॥**

శారీరక అధిష్ఠానము దూషితము కానపుడు జాగృత స్వప్నావస్థలో శ్వాసప్రశ్వాస ప్రక్రమతో సమానవాతముతో ప్రేరితమై ఉదాన వాతముతో ప్రజ్వలింపబడిన పాచకాగ్ని సక్రమముగా పాచనము చేయును.

ధమ్యమాన ఉదానేన సమ్యక్ పచతి పాచకః ।
ఇత్యుద్దిష్టం సముత్థానం, లిఙ్గం వక్ష్యామ్యతః పరమ్ ॥ 13 ॥
విడ్భేదో గురుకోష్ఠత్వమమ్లోత్క్లేశః శిరోరుజా ।
హృచ్ఛూలముదరాధ్మానమఙ్గసాదోఽన్త్రకూజనమ్ ॥ 14 ॥
కణ్ఠోరసీ విదహ్యేతే రోమహర్షశ్చ జాయతే ।
సామాన్యలక్షణం త్వేతద్విశేషస్తూపదేక్ష్యతే ॥ 15 ॥

ఇప్పుడు లక్షణములను వివరించెదను. విట్ భేదము, గురు కోష్ఠము, అమ్లోత్క్లేశము, శిరశ్శూల, హృత్ శూల, ఆధ్మానము, అంగసాదము, అంత్ర కూజనము, కల్గును. రోగి కంఠములో ఉరస్సులో మంట కల్గును. రోమహర్షముకల్గును. ఇవి సామాన్య లక్షణములు. ముందు విశేష లక్షణములు వర్ణించబడును.

వాతాచ్ఛూలాఙ్గసాదౌ చ జృమ్భా స్నిగ్ధోపశాయితా ।
పిత్తాద్భ్రమో విదాహశ్చ స్వాదుశీతోపశాయితా ॥ 16 ॥
కఫాద్ గురుత్వం ఛర్దిశ్చ స్యాద్రూక్షోష్ణోపశాయితా ॥ 17 ॥

**వాతిక అమ్లపిత్త లక్షణము :** శూల, అంగసాదము, జృంభ, స్నిగ్ధ పదార్థములచే ఉపశమనము, పైత్తిక అమ్లపిత్త లక్షణములు, భ్రమ విదాహము, స్వాదుశీత పదార్థములు శరీరమునకు ఉపశయము కల్గించును. శ్లేష్మక అమ్ల పిత్త లక్షణములు, శరీరగురుత్వము వమనము, రూక్ష ఉష్ణ పదార్థములచే ఉపశమనము కల్గును.

వ్యాధిరామాశయోత్థోఽయం కఫపిత్తే తదాశ్రయే ।
తస్మాదాదిత ఏవాస్య మూలచ్ఛేదాయ బుద్ధిమాన్ ॥ 18 ॥
అక్షీణబలమాంసస్య వమనం సంప్రకల్పయేత్ ।
నాన్యో మాన్యః క్ర(మో)హ్యస్య శాంతయే వమనాదృతే ॥ 19 ॥

ఈ రోగము ఆమాశయము నుండి ఉత్పన్నమగును. కఫ పిత్తములు దీని ఆశ్రితములు. కావున దీని మూల ఛేదనమునకై బలమాంసములు క్షీణించని రోగికి మొదట వమనము చేయించవలెను. స్కంధము, శాఖలు దూషితమైనపుడు వృక్ష మూలమును నరికినట్లు ఈ రోగ నివారణకు వమనము తప్ప మరో చికిత్స లేదు.

దోషశేషశ్చ వాంతస్య యః స్యాత్తదనుబంధకృత్ ॥ 20 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 239 తమం పత్రమ్)

తస్యోపశమనం కుర్యాల్లఙ్ఘనైర్లఘుభోజనైః ।

సాత్మ్యకాలోపపన్నైశ్చ యోగైః శమనపాచనైః ॥ 21 ॥

వమనము తర్వాత దోష శేషమును శాంతింప చేయుటకు లంఘణము, లఘు భోజనము, సాత్మ్యము కాలోచిత శమన పాచన యోగముల ద్వారా చికిత్స చేయవలెను.

దోషోత్క్లేశే న సహసా ద్రవమౌషధమాచరేత్ ।

వమనీయాదృతే తద్ధి న సమ్యక్ పరిపచ్యతే ॥ 22 ॥

దోషోత్క్లేశము తర్వాత వమనము తప్ప మరో ద్రవరూప ఔషధము వెంటనే ఇవ్వకూడదు. ఎందుకనగా అది సక్రమముగా పచనము కాదు.

చేష్టాహారవిశేషేణ కిఞ్చిత్ పరిణతే తతః ।

పీతం తు కురుతే యస్మాచ్ఛమపాచనభేదనమ్ ॥ 23 ॥

కొంత విరామము తర్వాత శరీర చేష్ట ఆహారాదులచే శరీరావస్థ పరిణిత చెందిన తర్వాత ఇచ్చిన ద్రవరూప ఔషధము, దోషముల శమన పాచన భేదములను చేయును.

నాగరాతివిషే ముస్తా నాగరాతివిషేఽభయా ।

త్రాయమాణా పటోలస్య పత్రం కటుకరోహిణీ ॥ 24 ॥

త్రయస్త్రికార్షికా హ్యేతే పాతవ్యా దోషదర్శనాత్ ।

కిరాతతిక్తక్వాథో వా రోహిణ్యా వాఽథ కేవలః ॥ 25 ॥

శరీరము నందు దోషములున్నంతవరకు శుంఠి, అతివిష, ముస్త, లేదా శుంఠి, అతివిష, హరీతక త్రాయమాణ, పటోల పత్ర కటుక రోహిణి ఈ మూడింటిని, 3, 3 కర్షముల క్వాథమును లేదా కిరాతతిక్త లేదో రోహిణి క్వాథమును త్రాగించవలెను.

సంసర్గహ్రుతదోషస్య విశుద్ధామాశయస్య చ ।

యత్నేనాగ్నిసమాధానే ప్రయతేత విచక్షణః ॥ 26 ॥

సంసర్గముతో దోషములు నష్టమైనపుడు ఆమాశయ శుద్ధి జరిగిన తర్వాత బుద్ధిమంతుడైన వాడు ప్రయత్న పూర్వకముగా జఠరాగ్ని వృద్ధి పొందించవలెను.

**యథా గోమయచూర్ణాద్యైః సూక్ష్మైః సంధుతితోఽనలః ।**
**క్రమేణాప్యాయితబలో దహత్యార్ద్రమపీన్ధనమ్ ॥ 27 ॥**
**తథా విశుద్ధదేహానాం కాయాగ్నిః సముదీరితః ।**
**పాచయత్యన్నపానాని సారవన్త్యపి దేహినామ్ ॥ 28 ॥**

సూక్ష్మమైన పేడ చూర్ణాదులతో చేయబడిన అగ్ని క్రమముగా ప్రజ్వలితమై తర్వాత పచ్చిగా ఉన్న ఇంధనమును కూడ దహింపచేయునట్లు శరీరము శుద్ధమైన తర్వాత ప్రదీప్తమైన జఠరాగ్ని సారయుక్తమైన అన్న పానములను కూడ పచింప చేయును.

**సమ్యక్పరిణతేష్వేషు న స్యురామాన్వయా గదాః ।**
**జాయతే చ తదోత్సాహస్తుష్టిః పుష్టిర్వపుర్బలమ్ ॥ 29 ॥**

దోషములు ఆహారము సరిగా పరిపక్వమైన పిదప ఆమయుక్తరోగములు కలుగవు. అప్పుడు శరీరమునందు ఉత్సాహము, తుష్టి, పుష్టి, శరీరబలము ప్రాప్తించును.

**తతః క్రమవిశేషేణ జాతప్రాణస్య దేహినః ।**
**పక్వాశయగతాన్ దోషాన్ స్రంసనేన వినిర్హరేత్ ॥ 30 ॥**

తర్వాత ఆప్రాణికి క్రమముగా బలము వచ్చిన తర్వాత స్రంసనము ద్వారా పక్వాశయగత దోషములను వెడలింపవలెను.

**లవణామ్బునా సుఖోష్ణేన క్షీరేణేక్షురసేన వా ।**
**మధూదకేన తిక్తైర్వా వమనం సంప్రకల్పయేత్ ॥ 31 ॥**

వమనయోగము : లవణామ్బు చేత ( ఉప్పు నీరు),

**త్రిఫలా త్రాయమాణా చ కటుకా రోహిణీ త్రివృత్ ।**
**పఞ్చైషామర్ధపలికాస్త్రివృతా త్వర్ధభాగికా ॥ 32 ॥**
**పీత్వా విరేచనం హ్యేతదమ్లపిత్తాద్విముచ్యతే ।**

విరేచనయోగము : త్రిఫలా, త్రాయమాణ, కటుకరోహిణి త్రివృత ఇవి అయిదు

అర్ధపలము త్రివృత్ ఇందులో సగము తీసుకొనవలెను. ఇది త్రాగిన అమ్లపిత్తము హరించును.

పటోలపత్రం త్రిఫలాత్వచశ్చార్ధపలోన్మితాః ॥ 33 ॥
త్రాయన్తీరోహిణీనిమ్బయష్టికాః కర్షసంమితాః ।
ఫలద్వయం మసూరాణాం చైకధ్యం తద్విపాచయేత్ ॥ 34 ॥
జలాఢకేఽష్టభాగం తు పూతశేషం పునః పచేత్ ।
సర్పిషః కుడవం దత్త్వా ప్రస్థార్ధమవశేషితమ్ ॥ 35 ॥
తత్ పీత్వా నాతిశీతోష్ణం సుఖేనాశు విరిచ్యతే ।
చిరప్రసక్తమప్యేతదమ్లపిత్తం వ్యపోహతి ॥ 36 ॥
వాతపిత్తం జ్వరం కుష్ఠం వైసర్పం వాతశోణితమ్ ।
విద్రధి రక్తగుల్మం చ విస్ఫోటాంశ్చాశు నాశయేత్ ॥ 37 ॥

పటోలపత్రము త్రిఫలాత్వక్ అర్ధపలము, త్రాయ మాణము, రోహిణి, నింబ, యష్టిమధు ఒక కర్షము మసూరము 2 పలములు ఇవన్ని ఒక ఆఢక జలములోపక్వము చేయవలెను. అష్టమాంశము శేషముగా నున్నప్పుడు వడబోసి ఒక కుడవము ఘృతము కలిపి తిరిగి పక్వము చేయవలెను. అర్ధ ప్రస్థము శేషముగా నున్నప్పుడు సుఖోష్ణముగా నున్నపుడు సుఖ విరేచనమగును. ఇది అతి పురాతన అమ్ల పిత్తమును కూడ నశింప చేయును. దీనితో వాత పిత్త జ్వరములు కుష్ఠ, విసర్ప, వాతరక్త విద్రధి, రక్త గుల్మ విస్ఫోటములు శీఘ్రముగా శాంతించును.

పురాణాః శాలయో ముద్గా మసూరాః సహరేణవః ।
గవ్యం సర్పిః పయో వాఽపి జాఙ్గలాశ్చ మృగద్విజాః ॥ 38 ॥
కలాయశాకం పౌతీకం వాసాపుష్పం సవాస్తుకమ్ ।
యాని చాన్యాని శాకాని తిక్తాని చ లఘూని చ ॥ 39 ॥
భోజనేనాఽతిశస్యన్తే యచ్చాన్యదవిదాహి చ ।
తత్సాత్మ్యానాం ప్రయోగాణాం యథోక్తానాం చ శీలనమ్ ॥ 40 ॥

**పథ్యములు :** అమ్లపిత్తములు, పురాణశాలి, ముద్గ, మసూర, హరేణు, గోఘృత జాంగలపశు పక్షి మాంసము, కలాయశాకము, పౌతికము, వాసాపుష్పము, సవాస్తుకము అన్య తిక్తశాకములు, అవిదాహి ఆహారము ప్రయోగించవలెను. యథోక్త సాత్మ్యములను సేవించవలెను.

లశునస్య హరీతక్యాః పిప్పల్యాః సర్పిషస్తథా ।
మదిరాయాశ్చ జీర్ణాయాః కాలాగ్నిబలవృద్ధయే ॥ **41** ॥
వ్యాఘేరస్య యథోక్తానాం నిదానానాం చ వర్జనమ్ ।

కాలాగ్ని బల వృద్ధి కొరకు లశున, హరీతకి, పిప్పలి, ఘృతము, పురాణ మదిర, సేవనము చేయవలెను. నిదాన పరివర్జనము ఆచరించవలెను.

యుక్తాహారవిహారస్య యుక్తవ్యాయామసేవినః ॥ **42** ॥
శుక్తకోఽయమలోలస్య శామ్యత్యాత్మవతః సతః ।

సముచిత ఆహారము విహార సేవనము చేయువాడు, సముచిత వ్యాయామము చేయువాడు జిహ్వాలోల రహితుడు, ఆత్మవంతుడు సజ్జన పురుషులకు శుక్తికరోగము శాంతించును.

యశ్చ యస్యానుబంధః(ద్ధః)స్యాద్దోషస్తస్యోపశాంతయే ॥ **43** ॥
ప్రయతేత భిషజ్ నిత్యం తచ్ఛాన్తౌ స ప్రశామ్యతి ।

అనుబంధ దోషమును కూడ శాంతింప చేయవలెను. దోష శాంతి జరిగినపుడు అనుబంధ దోషము తనకు తానే శాంతించును.

ఆనూపదేశే ప్రాయేణ సంభవత్యేష దేహినామ్ ॥ **44** ॥
తస్మాజ్జాఙ్గలజైరేనమౌషధైః సముపక్రమేత్ ।
అప్రశామ్యతి చైతస్మిన్నపి దేశాన్తరం వ్రజేత్ ॥ **45** ॥

ఈ వ్యాధి ప్రాయకముగా అనూపదేశములో నుండు వారికి కల్గును. కావున జాంగల ఔషధముల ద్వార ఉపచారము చేయవలెను. అప్పటికీ రోగము శాంతించనిచో రోగి వేరే దేశమునకు పోవలెను.

స ఏవ దేశో యత్ర స్యాదారోగ్యం తే చ బాంధవాః ।
గచ్ఛంతి యే న గచ్ఛంతి యే చాస్య హితకారిణః ॥ **46** ॥

మనిషి స్వస్థుడుగా ఉండు దేశమే ఉత్తమదేశము. దూరము వెళ్లని వారు హితులనే బంధువులందురు.

నిత్యాలోలస్య దీనస్య పరిదూనస్య దేహినః ।
క్రియాః సర్వాః ప్రహీయంతే స్వజనో విజనీభవేత్ ॥ **47** ॥

స్నిగ్ధ అవస్థలో ఉన్న రోగి, దీనుడు, కష్టశరీరము కల్గిన వానికి సర్వ కార్యములు నష్టమగును. స్వజనులు కూడ విడిచి వెళ్లెదరు.

**తస్మాత్ సతతమారోగ్యే ప్రయతేత విచక్షణః ।**
**అరోగో జీవితఫలం సుఖం సమధిగచ్ఛతి ॥ 48 ॥**

కావున బుద్ధిమంతుడు ఆరోగ్యము కొరకు ప్రయత్నము చేయవలెను. స్వస్థుడైనవాడు జీవనఫలమును సుఖముగా ప్రాప్తి పొందును.

**జ్వరాతీసారపాణ్డుత్వశూలశోథారుచిభ్రమైః ।**
**ఉపద్రవైరమైర్జుష్టః క్షీణధాతుర్న సిద్ధ్యతి ॥ 49 ॥**

అమ్ల పిత్తములో జ్వరము, అతిసారము, పాండు, శూల, శోధ అరుచి, భ్రమాదులు కల్గి, ధాతువులు క్షీణించినచో అసాధ్యమగును.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ పుప్ర (46)**

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**ఇతి ఖిలేష్వమ్లపిత్తచికిత్సాధ్యాయః షోడశః ॥ డ ట (16)**

**(ఇతి తాడపత్రపుస్తకే 240 తమం పత్రమ్)**

అమ్లపిత్త అధ్యాయము సమాప్తము.

# శోథచికిత్సితాధ్యాయః - సప్తదశః

అథాతః శోథచికిత్సితం నామాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము శోథచికిత్స అను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

వాన్తస్యాథ విరిక్తస్య కర్శితస్య జ్వరాదిభిః ।
మహోపవాసక్లిష్టస్య విరుద్ధాజీర్ణభోజినః ॥ 3 ॥
సద్యశ్చాత్యర్థలవణక్షారోష్ణామ్లకటూన్ రసాన్ ।
శూకరోరభ్రమాంసాది దధిమృద్భక్షణాది చ ॥ 4 ॥
శీతప్రవాతవ్యాయామవ్యవాయాంశ్చాతిసేవతః ।
తథైవ దుష్ప్రజాతాయా నార్యాః కృచ్ఛ్రేణ వా పునః ॥ 5 ॥
సూతాయా నిఃస్రుతాయాశ్చ ద్విషన్త్యాః స్వముపక్రమమ్ ।
ఏతదేవ నిదానం చ శీలయన్త్యాస్తతస్తయోః ॥ 6 ॥
శోథః సంజాయతే శీఘ్రం దారుణః, స చతుర్విధః ।

నిదాన సంప్రాప్తి : వమన విరేచనముల తర్వాత జ్వరాదుల వలన కృశుడగుటచే, దీర్ఘ ఉపవాసము తర్వాత విరుద్ధ భోజనము అత్యధిక లవణ, క్షార, ఉష్ణ అమ్ల కటు సేవన, సూకర, కప్పల మాంససేవన, దధి మృద్భక్షణ, చల్లని తీవ్రగాలి, వ్యాయామము, వ్యవాయము, అధిక ప్రయోగము కృచ్ఛ్ర ప్రసవము వికృత ప్రసవము, గర్భస్రావము కల్గిన వారికి, చికిత్సను ద్వేషించువారికి - ఈ కారణముల వలన శీఘ్రమే దారుణమైన శోథకల్గును.

వాతికః పైత్తికశ్చైవ శ్లైష్మికః సాన్నిపాతికః ॥ 7 ॥

శోథ భేదములు : 4 విధములు. 1 వాత 2 పిత్త, 3 కఫ 4. సన్నిపాత

ఆగంతుః క్షతనిష్పిష్టచ్యుతభగ్నాదిసంభవః ।
దష్టావమూత్రితాఘ్రాతసంస్పర్శగరయోగజః ॥ 8 ॥

ఆగంతుక శోథ. ఇవిగాక ఆగంతుక శోథ అభిఘాతము వలన, నిష్పిష్ట, చ్యుత, అస్థి భగ్న విషప్రాణుల కాటు, మూత్ర స్పర్శ, వాసనచూచుట, స్పర్శ లేదా విష కారణమున గూడ ఏర్పడును.

ప్రకోపహేతుః సర్వేషాం సామాన్యేనైవ కీర్తితః ।
పూర్వం జ్వరనిదానే తు ప్రోక్తః ప్రత్యేకశో మయా ॥ 9 ॥

ఈ అన్ని శోథల ప్రకోపకారణము సామాన్య రూపముగానే చెప్పబడినవి. ఎందుకనగా పూర్వము జ్వర నిదానములో నేను వేర్వేరు ప్రత్యేక కారణములను చెప్పినాను.

యథావదేషాం రూపాణి సంప్రవక్ష్యామ్యతః పరమ్ ।
అపరాహ్ణే ధ్రువా వృద్ధిః శ్వయథోరనిలాత్మనః ॥ 10 ॥
పూర్వాహ్ణే శ్లైష్మికస్య స్యాన్మధ్యాహ్నే పైత్తికస్య తు ।

ఇప్పుడు వీటి స్వరూపమును యథావిధిగా వర్ణించెదను. శోథవృద్ధికాలము- వాతశోథ అపరాహ్ణము, శ్లేష్మిక శోథ పూర్వాహ్ణము, పిత్తశోథ మధ్యాహ్నము వృద్ధి చెందును.

పూర్వామధ్యాపరే యామే ప్రోస్తశ్చైషాం యథాక్రమమ్ ॥ 11 ॥

శోథ శమనము! క్రమముగా పూర్వాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్ణముతో కల్గును.

శ్యావవర్ణః సవర్ణో వా క్షిప్రోత్థాననివర్తనః ।
పిపీలికాకీర్ణ ఇవ తామ్యతే పరితుద్యతే ॥ 12 ॥

విషమజ్వరజుష్టస్య చిరాచ్చైవ విదహ్యతే ।
భిన్నరోమా చలోఽజ్గల్యా నిమ్నో భవతి పీడితః ॥ 13 ॥

సిరాస్నాయుత్వగాయామైరధఃకాయే చ వర్ధతె।
స్నిగ్ధోష్ణోపశయా రూక్షః శ్వయథుర్వాతసంభవః ॥ **14** ॥

**వాతిక శోథ లక్షణములు :** శ్యావ వర్ణము లేదా సవర్ణముగా నుండును శీఘ్రముగా ఉత్పన్నమై శీఘ్రముగా శాంతించును. చీమలచే ఆక్రాంతమైనట్లుగా నుండును. చీమలు కుట్టినట్లు బాధకల్గును. విషమ జ్వరములో శోథ శీఘ్రముగా విదగ్ధమై పాకము నొందును. రోమములు రాలిపోవును. శోథ అస్థిరముగా నుండి వేలితో నొక్కినచో గుంతలేర్పడును. శరీరఅధో భాగమున సిరాస్నాయు త్వచ ద్వారా వృద్ధి పొందును. స్నిగ్ధ ఉష్ణ పదార్థములు అనుకూలము సాత్మ్యముగా నుండును. శోథ రూక్షముగా నుండును.

నీలలోహితపీతాభః పీడ్యతే ధూప్యతే ముహుః।
క్షిప్రపాకీ సవిడ్భేదస్తృష్ణాదాహజ్వరాన్వితః ॥ **15** ॥
నాభ్యాం చ బస్తిమూలే చ వృద్ధిశ్చాస్య విశేషతః।
నిత్యం చ (రోచ)తే శీతం శ్వయథుః పిత్తసంభవః ॥ **16** ॥

పైత్తిక శోథ! నీల రక్త పీతవర్ణము, అధిక బాధ దాహము శీఘ్ర పక్వము, అతిసారము, తృష్ణ, దాహ, జ్వరములు నాభి వస్తిమూలమునందు ఎక్కువ శోథవృద్ధి, శీతము సాత్మ్యముగా నుండుట, పైత్తికి శోథలక్షణములు.

స్థిరః శీతోఽతిబహలః శ్లక్ష్ణః పాణ్డురవేదనః।
సోత్క్లేశారోచకస్వాపకణ్డూకాఠిన్యగౌరవః ॥ **17** ॥
చిరాద్ వృద్ధిమవాప్నోతి చిరాచ్చ వినివర్తతే।
ఉరోగణ్డాక్షికూటేషు వృద్ధిశ్చాస్య విశేషతః ॥ **18** ॥
శీతజ్వరకరః శీతద్వేషీ శోఫః కఫాత్మకః।

శ్లైష్మిక శోథ లక్షణములు, స్థిరము శీతలము అతిఘనము శ్లక్ష్ణము పాండు వర్ణము, వేదనారహితము, అందులో ఉత్క్లేశము అరుచి, స్పర్శజ్ఞాన నాశనము, కండూయుక్తము కఠినత, గురుత్వము, ఆలస్యముగా వృద్ధి పొందునది, నిదానముగా శమించునది, ఉరస్సు, అక్షికూట కపోలములందు ఎక్కువగా వృద్ధి పొందుట, చలితో జ్వరము వచ్చుట శీతము సహింప కుండుట శ్లైష్మిక శోథ లక్షణములు.

**నీలపీతారుణాభాసః సిరాజాలోపసంతతః ॥ 19 ॥**
**అనేకోపద్రవస్రావః సర్వరూపసమన్వితః ।**
**సుతీవ్రవేదనోఽసాధ్యః శ్వయథుః సాన్నిపాతికః ॥ 20 ॥**

**సన్నిపాత శోథ లక్షణములు :** నీల పీత అరుణ వర్ణములు కల్గి ఉండుట, సిరాజాల యుక్తము, ఉపద్రవములు కల్గి ఉండుట, త్రిదోషలక్షణములు కల్గి ఉండుట, తీవ్రవేదన, ఇవి సన్నిపాత శోథ లక్షణములు, అసాధ్యము.

**రక్తశ్యావారుణోఽత్యుష్ణస్తోదభేదరుజాన్వితః ।**
**ఆగన్తుః, సవిషస్తామ్రః కృష్ణో వాఽఽశు విసర్పితః ॥ 21 ॥**
**హృల్లాసారుచితృణ్మూర్ఛాజ్వరారుచికరో భృశమ్ ।**

ఆగంతజ శోథ లక్షణములు! రక్త శ్యావారుణవర్ణము, అత్యుష్ణము, తోద భేద యుక్త పీడ ఉండును. విషజశోథ ! తామ్ర కృష్ణ వర్ణము, సర్వశరీరము శీఘ్రముగా వ్యాపించుట, హృల్లాసము, అరుచి, తృష్ణ, మూర్ఛ జ్వరము అరోచకము ఉండును.

**ఇతి షడ్విధముద్దిష్టం శ్వయథోర్లక్షణం మయా ॥ 22 ॥**

ఈ విధముగా 6 విధముల శోథలక్షణములు చెప్పినాను.

**నృణాం తు పాదప్రభవః స్త్రీణాం చ ముఖసంభవః ।**
**ఉభయోర్యశ్చ గుహ్యస్థః సర్వగశ్చ న సిద్ధ్యతి ॥ 23 ॥**

**అసాధ్య శోథ లక్షణములు :** పురుషులలో పాదముల నుండి ఉత్పన్నమై ముఖమునకు వ్యాపించునది, స్త్రీలలో ముఖమునుండి ఉత్పన్నమై పాదములకు వ్యాపించునది, అసాధ్యము. గుహ్య స్థాన శోథ సంపూర్ణ శరీర శోథ ఉభయులలో అసాధ్యము.

**మారుతః సర్వశోఫానాం మూలహేతురుదాహృతః ।**
**యథా చ పిత్తం దాహస్య, శైత్యస్య చ యథా కఫః ॥ 24 ॥**

దాహమునకు మూల హేతువు పిత్తము, శీతలమునకు కఫము అదేవిధముగా సర్వ శోథలకు మూలము వాతము.

త్వగ్రక్తమాంసమేదాంసి శోథోఽధిష్ఠాయ వర్ధతే ।
తదస్యాశు క్రియాం కుర్యాద్దారుణస్య యథోత్తరమ్ ॥ 25 ॥

శోథ త్వక రక్త మాంస మేదలను ఆశ్రయించుకుని వృద్ధి పొందును. ఇది యధోత్తరము దారుణముగా నుండును కావున ఇది వెంటనే చికిత్స చేయవలెను.

కఫపిత్తోత్తరే శోఫే క్షామదేహస్య దేహినః ।
వమనాద్యాం క్రియాం కుర్యాత్తద్యుక్తమనిలోత్తరే ॥ 26 ॥
శాల్యన్నముద్రమణ్డేన శోథీ భుఞ్జీత మాత్రయా ।
సబాలమూలకవ్యోషపిప్పలీకేన వాఽఽదితః ॥ 27 ॥

కఫపిత్త ప్రధానమై క్షీణించిన రోగికి మొదట వమనము చేయించవలెను. వాత ప్రధానమైన శోథలో రోగికి యుక్తి పూర్వక మాత్రలో శాలి అన్నము, ముద్గమండముతో లేదా అపక్వముల్లంగి త్రికటు పిప్పలితో భోజనము చేయవలెను.

లఘ్వ్యామాశయకోష్ఠస్య పఞ్చగవ్యేన సర్పిషా ।
కల్యాణకేన తిక్తేన దశమూలాదికేన వా ॥ 28 ॥
స్నిగ్ధస్విన్నస్య వమనం విదధ్యాచ్చ విరేచనమ్ ।
తతో దశాహాన్ సోఽశ్నీయాత్ పయసా వాఽన్నభోజనమ్ ॥ 29 ॥

రోగి ఆమాశయము మరియు కోష్ఠము లఘువైనచో స్నేహస్వేదములు చేయించి పంచగవ్య ఘృతము, కళ్యాణఘృతము, తిక్త ఘృతము లేదా దశమూలఘృతము ద్వారా వమన విరేచనము చేయించవలెను. దాని తర్వాత 10 దినముల వరకు పాలతో భోజనముచేయవలెను.

తతో యవాన్నం తక్రేణ శీలయేచ్చ యథాబలమ్ ।
(ఇతి తాడపత్రపుస్తకే 241 తమం పత్రమ్)
పఞ్చముష్టికయూషేణ జాఙ్గలానాం రసేన వా ॥ 30 ॥

తదనంతరము రోగికి బలానుసారము తక్రము పంచముష్టికయూషము లేదా జాంగలమాంసరసముతో యవాన్నమును ఇవ్వవలెను.

దధిమద్యసురాస్నేహశాకపిష్టామ్లసేవనమ్ ।
అసాత్మ్యాని నిదానం చ వర్జయేత్ పథ్యామాచరేత్ ॥ 31 ॥

శోథ అపథ్యములు : దధి, మద్యము, సురా, స్నేహ, శాక మాష పిష్ట అమ్ల సేవనము అన్య అసాత్మ్యములు నిదాన భావములు త్యజించవలెను. పథ్యము నాచరించవలెను.

సగుడం శృఙ్గబేరం చ భక్షయేత్ ప్రాతరుత్థితః ।
హరీతకీం గుడయుతాం త్రిసమాం వాఽభ్యసేత్ సదా ॥ 32 ॥

ప్రాతః కాలము రోగి అల్లము హరీతకి బెల్లముతో కలిపి సేవించవలెను. లేదా హరీతకి గుడూచి శుంఠి చూర్ణమును సమాన భాగములో సేవించవలెను.

పిప్పలీవర్ధమానం వా, పిప్పల్యో మధుకేన వా ।
దేవర్దావభయాశుణ్ఠీచూర్ణకల్కమథాపి వా ॥ 33 ॥
పిబేత్త్రయాణామేతేషాం క్వాథం చ సపునర్నవమ్ ।

లేదా వర్ధమాన పిప్పలిని ప్రయోగించవలెను. పిప్పలి యష్టిమధు నివ్వవలెను. లేదా పునర్నవాతో దేవదారు, హరీతకి శుంఠి ఈ 3 చూర్ణముల కల్కము క్వాథము చేసి త్రాగించవలెను.

మహౌషధం చిత్రకం వా పిప్పల్యో దేవదారు వా ॥ 34 ॥
తక్రేణ పయసా వాఽథ సేవమానః సుఖీ భవేత్ ।

లేదా శుంఠి చిత్రక పిప్పలి దేవదారు చూర్ణమును తక్రము లేదా పాలతో త్రాగినచో రోగి స్వస్థుడగును.

చిత్రామూలాగ్నికశ్యామాత్రివ్యోషైర్వా శృతం పయః ॥ 35 ॥
మహౌషధం దేవదారుకల్కం వా పయసా పిబేత్ ।

చిత్రా (ద్రవంతీ లేదా ఇంద్రవారుణి) మూలము, చిత్రక, త్రివృత్ త్రికటుతో సిద్ధమైన క్షీరమును ప్రయోగించవలెను. లేదా పాలతో శుంఠి దేవదారు కల్కమును ప్రయోగించవలెను.

గంధర్వహస్తం త్రివ్యోషం శ్యామామూలం చ పఞ్చమమ్ ॥ 36 ॥
క్షీరసిద్ధం పిబేదేతద్యస్య స్యాచ్ఛ్వయథుర్మహాన్ ।

శరీరములో మహాశోథ ఉన్నచో ఏరండ త్రికటు త్రివృత్మూలము ఈ 5 ద్రవ్యములను క్షీరపాకము చేసి ఇవ్వవలెను.

**గోమూత్రం మహిషీమూత్రముష్ట్రమూత్రమథో పిబేత్ ॥ 37 ॥**
**యథాస్వం క్షీర మిశ్రం వా శీలయేచ్ఛోప శాంతయే ।**

గోవు, మహిషము, ఒంటె మూత్రములను త్రాగించిన శోథశమించును. లేదా ఈ మూత్రములలో యోగ్య పరిమాణములో పాలను కలిపి సేవించవలెను.

**సర్పిః పునర్నవాక్వాథే కల్కైరేభిర్విపాచయేత్ ॥ 38 ॥**
**వ్యోషముస్తా . . . . . . . దినే దినే ।**
**సర్వేషామేవ శోథానాం ప్రయోగోఽయం విధీయతే ॥ 39 ॥**

పునర్నవాక్వాథములో త్రికటు ముస్త మొదలగు కల్కములు వేసి ఘృత సిద్ధముచేసి సమస్త శోథలలో ప్రతిదినము ప్రయోగించవలెను.

**అయోరజస్త్రికటుకం త్రివృతా కటురోహిణీ ।**
**త్రిఫలాయా రసేనైతత్ పీత్వా చూర్ణం సుఖీ భవేత్ ॥ 40 ॥**

త్రిఫలా రసముతో లోహచూర్ణమును త్రికటు, త్రివృత్ కటుక రోహిణి చూర్ణమును కలిపి ఇచ్చిన రోగికి సుఖము కల్గును.

**త్రిఫలా త్రివృతా దంతీ విడఙ్గం గజపిప్పలీ ।**
**త్రివ్యోషం రోహిణీ దారు చిత్రకం చేతి చూర్ణయేత్ ॥ 41 ॥**
**అయోరజస్తద్ ద్విగుణం క్షీరేణాభ్యస్య ముచ్యతే ।**

త్రిఫలా త్రివృత్ దంతీ విడంగ, గజపిప్పలీ త్రికటు, రోహిణి దారు హరిద్ర చిత్రమూల చూర్ణములో వీటన్నిటికి రెండింతలు లోహచూర్ణము కలిపి పాలతో సేవించిన రోగముక్తుడగును.

**త్రివ్యోషత్రిఫలాముస్తావిడఙ్గచిత్రకాః సమాః ॥ 42 ॥**
**నవైతే సుధృతా భాగా నవాయోరజసస్తథా ।**
**తచ్చూర్ణం మధునా లీఢ్వా భుఞ్జీత యవషష్టికమ్ ॥ 43 ॥**
**శుష్కమూలకయూషేణ ముస్తాక్తపయసాఽపి వా ।**

త్రికటు త్రిఫలా ముస్త విడంగ చిత్రక ఈ 9 ద్రవ్యములు మరియు లోహచూర్ణము సమభాగములు తీసుకుని చూర్ణంచి మధుతో సేవించి శుష్కముల్లంగి యూషముతో లేదా ముస్త పాలు యవలు, శాలి అన్నము భోజనము చేయవలెను.

భల్లాతకం త్రివృద్దంతీ త్రివ్యోషం త్రిఫలాఽగ్నికః ॥ 44 ॥
తిలా గుడా విడఙ్గం చ మధు సర్పిరయోరజః ।
నామ్నా కటుకబిందుర్హి లేహః శోథప్రమర్దనః ॥ 45 ॥

**కటుకబిందు అవలేహము :** భల్లాతక, త్రివృత్ దంతి, త్రికటు, త్రిఫలా, తిల, గుడము విడంగ మధుఘృతము లోహ చూర్ణము అన్ని కలిపి అవలేహము చేయవలెను. దీనిపేరు కటుకబిందు శోథను నశింప చేయును.

సామాన్యేనైతదాఖ్యాతం పృథక్త్వేన నిబోధ మే ।
తత్రాదితః ప్రవక్ష్యామి వాతికస్య భిషగ్జితమ్ ॥ 46 ॥

ఇవన్ని సామాన్య చికిత్సలు చెప్పబడినవి. ఇప్పుడు వీటి ప్రత్యేక చికిత్సలు వినుము. మొదట వాతిక శోథ చికిత్స చెప్పెదను.

కులత్థయవకోలానాముభయోః పఞ్చమూలయోః ।
నిర్యూహే సాధితం తైలం కల్కైరేతైః సమాంశికైః ॥ 47 ॥
శతావరీకృష్ణగంధాయష్టీమధుకజీవనైః ।
సక్షీరైస్తత్ పిబేత్ కాలే కుర్యాదభ్యఞ్జనం చ తత్ ॥ 48 ॥

వాతిక శోథచికిత్స : కులుత్థ యవ, కోల, దశమూల క్వాథములో సమానమాత్రలో శతావరి, కృష్ణ గంధ, యష్ఠిమధు, జీవనీయగణ ద్రవ్యముల కల్కమును వేసి తైలసిద్ధము చేయవలెను. ఉచితకాలములో ఈ తైలమును పానాభ్యాంగాదుల ద్వారా సేవించవలెను.

శతాహ్వాం మధుకం దారు సశ్వేతాం చ గవాదనీమ్ ।
వత్సాదనీం చ పిష్ట్వా తైః సుఖోష్ణైః శోథమాదిహేత్ ॥ 49 ॥

శతపుష్ప, యష్ఠిమధు, దారుహరిద్ర, శ్వేతా (శ్వేతవచ), గవాదనీ (ఇంద్రవారుణీ) వత్సాదినీ (గుడూచి) వీటిని మర్దించి శోథపై సుఖోష్ణ లేపనము చేయవలెను.

వర్షీవం బిల్వమేరణ్డం తర్కారీం సపునర్నవామ్ ।
నిష్క్వాథ్య వారిణోష్ణేన శ్వయథుం పరిషేచయేత్ ॥ 50 ॥

వర్షీవ (శ్వేతపునర్నవ), బిల్వ, ఏరండ, తర్కారి (అగ్నిమంథలేదా జయంతి) పునర్నవ వీటి క్వాథమును సుఖోష్ణముగా శోథపై పరిషేచనము చేయవలెను.

తిలానాం సర్షపాణాం చ గోధూమస్య యవస్య చ ।
చూర్ణానాం తైలమిశ్రాణాముపనాహం విధాపయేత్ ॥ 51 ॥
తథైవైరణ్డబీజానాం భృష్టానాం వోపనాహనమ్ ।

తిలసర్షప గోధుమ యవచూర్ణము తిల తైలములో కలిపి ఉపనాహము చేయవలెను. లేదా ఏరండ బీజమును వేయించి ఉపనాహము చేయవలెను.

ఏరణ్డో బిల్వమూలం చ బృహతీ కణ్టకారికా ॥ 52 ॥
కరఞ్జశ్చిరిబిల్వశ్చ శ్వదంష్ట్రా చ సమాంశికా ।
లేపోఽయం సర్పిషా యుక్తో వాతశ్వయథునాశనః ॥ 53 ॥
ఏష ఏవ యథాలాభం పరిషేకః సుఖావహః ।

వాత శోథలో ఏరండ బిల్వమూలము, బృహతీ కంటకారి కరంజ చిరబిల్వ (పూతికరంజ) గోక్షుర సమభాగములుగా చూర్ణించి నెయ్యిలో కలిపి లేపనము చేయవలెను. ఈ ద్రవ్యములనే యథా లభ్యముగా తీసుకుని పరిషేచనము చేసిన సుఖ కరముగా నుండును.

శారివా మూలకం శుష్కం శుకనాసా మహౌషధమ్ ॥ 54 ॥
కుష్ఠం ముస్తా జలం లమ్బా ప్రలేపః శోఫనాశనః ।

సారిబ, శుష్క ముల్లంగి, శుకనాసా, శుంఠి, కుష్ఠ, ముస్త హ్రీబేర, కటుకాలాబును లేపము చేసినచో శోథ నశించును.

శ్వదంష్ట్రైరణ్డమూలం చ బిల్వమూలం మహౌషధమ్ ॥ 55 ॥
పురాణమూలకం చైషాం క్వాథే క్షీరం విపాచయేత్ ।
క్షీరావశేషమాహృత్య కాలే సఘృతశర్కరమ్ ॥ 56 ॥
యథాగ్ని పాచయేదేనం వాతశ్వయథునాశనమ్ ।

గోక్షుర, ఏరండమూల, బిల్వమూల, శుంఠి వీటన్నిటిని పురాతన మూలములను క్వాథముచేసి పాలతో పక్వము చేయవలెను దుగ్ధము మాత్రము అవశేషముగా నున్నపుడు దించుకొన వలెను. మళ్లీ అందులో ఘృతము శర్కర కలిపి మంద మధ్య తీక్షాగ్నిపై పక్వము చేయవలెను. ఇది వాత శోథను నశింపచేయును.

ఏరణ్డతైలం పయసా గవాం మూత్రేణ వా పిబేత్ ॥ 57 ॥
తేనాస్య దోషశేషశ్చ శ్వయథుశ్చ నివర్తతే ।

పాలు లేక గోమూత్రముతో ఏరండ తైలమును త్రాగించవలెను. దీనివలన అవశిష్ట దోషములు శోథ నశించును.

లఘూన్యన్నాని భుఞ్జీత స్నిగ్ధోష్ణసహితాని చ ॥ 58 ॥
(ఇతి తాడపత్రపుస్తకే 242 తమం పత్రమ్)

ఈవాత శోథలో లఘు స్నిగ్ధ ఉష్ణ అన్న భోజనము చేయవలెను.

అథ పిత్తసముత్థస్య ప్రవక్ష్యామి చికిత్సితమ్ ।
అభయాఽఽమలకీదంతీత్రికర్మమధుచందనైః ॥ 59 ॥
సంజీవనీయమఞ్జిష్ఠైర్మధూకకుసుమైః సమైః ।
సక్షీరైః పాచితం సర్పిః శోఫస్యాభ్యఞ్జనం పరమ్ ॥ 60 ॥
పానం చైతత్ ప్రదాతవ్యం శోఫరోగనివారణమ్ ।

ఇప్పుడు పిత్తశోథ చికిత్సను చెప్పెదను. హరీతకి, ఆమలకి, దంతి, త్రికర్మ, మధు, చందన, జీవనీయగణ ఔషధములు, మంజిష్ఠ, మధూక పుష్పములు, సమభాగములు తీసుకుని పాలతో పక్వమైన ఘృతమును శోథలో అభ్యంగము చేయవలెను. శోథ రోగమును నశింప చేయుటకు ఈ ఘృతమును త్రాగవలెను.

జీవకర్షభకావైంద్రీ మధుపర్ణీ శతావరీ ॥ 61 ॥
ముదితా వేతసం చైవ ప్రలేపః సరసాఞ్జనః ।

జీవకము, ఋషభకము, ఇంద్రవారుణి, మధుపర్ణి (గుడూచి) శతావరి, ముదితా, వేతసములో రసాంజనము కలిపి శోథపై లేపనము చేయవలెను.

తాలీశోశీరముదితాచందనం సరసాఞ్జనమ్ ॥ 62 ॥
మధుకం పద్మకం చేతి లేపః శ్వయథునాశనః ।

తాలిసపత్రి ఉశీర, ముదితా, చందన, రసాంజనము, యష్ఠిమధు, పద్మకమును లేపము చేసిన శోథ నశించును.

శతావరీం హంసపదీం మధుపర్ణీం చ చిత్రకమ్ ॥ 63 ॥
బన్దాం తాలీసపత్రం చ పిష్ట్వా శ్వయథుమాదిహేత్ ।

శతావరి, హంసపాది, గుడూచి, చిత్రకము, బందా, తాలిసపత్రిని మర్దించి శోథపై లేపనము చేయవలెను.

క్షీరద్రుమాణాం త్వఙ్మూలక్వాథస్తు పరిషేచనే ॥ 64 ॥
సదాహరాగపాకే చ హితః సక్షీరశర్కరః ।

శోథలో దాహ పాక రాగములున్నచో క్షీర వృక్షములు త్వక్‌ను మరియు మూలక్వాథములో పాలు శర్కర కలిపి పరిషేచనము చేయవలెను.

త్రివృన్మధుకమృద్వీకాకాశ్మర్యాభిః శృతం పయః ॥ 65 ॥
విరేచనీయమన్యద్వా యథావస్థం ప్రయోజయేత్ ।

విరేచనము కొరకు త్రివృత్, యష్ఠిమధు, ద్రాక్షా గంభారితో సిద్ధము చేసిన క్షీరమును లేదా అవస్థానుసారము అన్ని ద్రవ్యములను ప్రయోగించవలెను.

నాత్యచ్ఛస్నిగ్ధశీతాని స్వాదూని చ లఘూని చ ॥ 66 ॥
పయో ద్రవాణి భుఞ్జీత యథోక్తాని చ మాత్రయా ।

పైత్తిక శోథలో పథ్యము : అధిక సాంద్ర స్నిగ్ధ, శీతలము కాని స్వాదు లఘు ద్రవ్యములను అన్య యథోక్త ద్రవ్యములను ప్రయోగించవలెను.

శ్వయథోః కఫజస్యాపి చికిత్సాం శృణ్వతః పరమ్ ॥ 67 ॥

కఫజశోథ చికిత్సను కూడ వినుము.

హ్రీబేరాగరుదారూణి చవ్యచిత్రకనాగరమ్ ।
అభయా పిప్పలీమూలం రజన్యౌ హిఙ్గు మాత్రయా ॥ 68 ॥
క్వాథం గోమూత్రపిష్టం వా పిబేచ్చోప నిబర్హణమ్ ।

**కఫజశోథ చికిత్స :** హ్రీబేర, అగరు, దేవదారు, చవ్య పిప్పలీ మూలము, హరిద్ర, దారుహరిద్ర, హింగ్వాదులను క్వాథము చేసి గోత్రముతో మర్దించి త్రాగవలెను.

**చిత్రకారగ్వధౌ మూర్వావిడఙ్గామలకాభయాః ॥ 69 ॥**
**పిప్పలీశారివాపాఠాకషాయం మధునా పిబేత్ ।**

చిత్రక, ఆరగ్వధ, మూర్వ, విడంగ, ఆమలకి, హరీతకి, పిప్పలి, సారిబా, పాఠా, వీటి కషాయమును మధుతో కలిపి త్రాగవలెను.

**దేవదారు చ పాఠాం చ శృఙ్గబేరం చ భాగశః ॥ 70 ॥**
**తథా పుష్కరమూలం చ గోమూత్రక్వథితం పిబేత్ ।**

దేవదారు పాఠా, అల్లము, పుష్కరములము, గోమూత్రములో క్వాథము చేసి త్రాగవలెను.

**పాఠా ముస్తాఽభయా దారు చిత్రకో విశ్వభేషజమ్ ॥ 71 ॥**
**పిప్పల్యతివిషా మూర్వా తథా తాడకపత్రికా ।**
**బాధాసు తత్ పిబేత్ పూతం కఫశ్వయథునాశనమ్ ॥ 72 ॥**

శ్లేష్మక శోథ కష్టమును దూరము చేయుటకు ముస్త, హరీతకి, దేవదారు, చిత్రక, శుంఠి, అతివిష, పిప్పలి మూర్వా తాడ పత్రక్వాథము వడబోసి త్రాగవలెను.

**తగరాగరుముస్తాని సరలం దేవదారు చ ।**
**కుష్ఠం త్వచా చ లేపోఽయం కఫశ్వయథువారణః ॥ 73 ॥**

తగరు, అగరు, ముస్త, సరళ, దేవదారు, కుష్ఠత్వక్‌ను లేపము చేసిన శోథ నశించును.

**కాలాం గోధాపదీం హింస్రాం సుషవీం తాలపత్రికామ్ ।**
**పిష్ట్వా శీతకమూలం చ శోథమస్య ప్రలేపయేత్ ॥ 74 ॥**

త్రివృత్, హంసపాది, హింస్ర, సుషవీ (నల్లజీలకర) తాల పత్రికా (ముసలీ) శీతక (అసనపర్ణి) మూలమును మర్దించి లేపనము చేయవలెను.

**కుష్ఠచ్ఛత్రాకవల్కం చ యాతుమూలం త్రికణ్టకమ్ ।**
**భద్రదారుం సుగంధాం చ పిష్ట్వోష్ణైః శోఫమాదిహేత్ ॥ 75 ॥**

కుష్ఠ, చక్రాకత్వక్ ( ఆమలకి) యాతుకమూలము, గోక్షుర దేవదారు, సుగంధా, మర్దించి వేడి చేసి శోథపై లేపము చేయవలెను.

మూలకాని చ శుష్కాణి భద్రముస్తం సశారివమ్ ।
గోమూత్రపిష్టో లేపోఽయం శ్వయథోర్వినివారణః ॥ 76 ॥

శుష్కముల్లంగి, ముస్త, సారిబ, గోమూత్రముతో మర్దించి లేపనము చేసిన శోథ నశించును.

పలాశభస్మ చైకాఙ్గలేపో గోమూత్రసంయుతః ।
శ్లైష్మికే శ్వయథావేష పరిషేకో విధీయతే ॥ 77 ॥

పలాశ భస్మమును గోమూత్రముతో కలిపి అంగములపై లేపనము చేయవలెను. శ్లేష్మికశ్వయథులో పంచమూలముతో సిద్ధము చేసిన జలమును లేదా గోమూత్రముతో పరిషేచనము చేయవలెను.

నిమ్బాఙ్కోఠోరుపూగానాం తర్కార్యాః కుటజస్య చ ॥ 78 ॥
నక్తమాలస్య వంశస్య పత్రక్వాథోఽవగాహనః ।

నింబ, అంకోఠ, ఏరండ, తర్కారి, కుటజ, నక్తమాల ( కరంజ) వాసా పత్ర కషాయముతో అవగాహనము చేయవలెను.

త్రిఫలా చిత్రకవచే ద్వే హరిద్రే కుఠేరకః ॥ 79 ॥
శ్యామాఖుపర్ణీకటుకాకాకమాచీసువర్చలాః ।
వార్తాకీ నిచులం నిమ్బో విడఙ్గం విశ్వభేషజమ్ ॥ 80 ॥
రాస్నా పునర్నవా మూర్వా కుష్ఠం వ్యాఘ్రనఖం వృషమ్ ।
శిగ్రుమూలమథార్కం చ యథాలాభం సమాహృతైః ॥ 81 ॥
గోమూత్రపిష్టైర్లేపః స్యాత్ క్వథితైః పరిషేచనమ్ ।
ఏతైరేవ ద్రవైః పక్వైరభ్యఙ్గః శోథనాశనః ॥ 82 ॥

త్రిఫలా చిత్రమూలము, వచ, హరిద్ర, దారు హరిద్ర, కుఠేరక ( శ్వేత తులసి భేదము) శ్యామా ( త్రివృత్) ఆఖుపర్ణి, కటుకరోహిణి, మొక్క జొన్న హులహులము, వార్తాక, నిచుల, నింబ, విడంగ, శుంఠి, రాస్నా, పునర్నవా, మూర్వా, కుష్ఠ, వ్యాఘ్రనఖ, వాసా, శిగ్రుమూలము అర్కము యథా లభ్యముగా

గ్రహించి గోమూత్రముతో మర్దించి లేపనము చేయవలెను. వీటి క్వాథముతోనే పరిషేచనము చేయవలెను. ఇదే ద్రవ్యములతో తైల సిద్ధము చేసి అభ్యంగము చేసిన శోథనశించును.

పటోలమూలం త్రిఫలా విడఙ్గం రజనీతి షట్।
కార్షికాః స్యుస్తథైకస్మాద్ ద్విగుణం రోచనీఫలమ్ ॥ **83** ॥
నీలికా త్రిగుణా దేయా త్రివృతా తు చతుర్గుణా।
చూర్ణమేతద్రవాం మూత్రసంయుతం మాత్రయా పిబేత్ ॥ **84** ॥
కాలే విరిక్తో భుఞ్జీత జాఙ్గలానాం రసేన తు।

పటోలమూలము త్రిఫల, విడంగ హరిద్ర, ఈ ద్రవ్యములు ఒక్కొక్కకర్షము చొప్పున రేచన ఫలము (నేపాళము) రెండింతలు నీలికా మూడింతలు, త్రివృత్ నాలుగింతలు వీటి చూర్ణమును యోగ్య మాత్రలో గోమూత్రముతో కలిపి ఇవ్వవలెను. ఉచిత సమయములో విరేచనమైన పిదప జాంగల మాంసరస భోజనము చేయవలెను.

త్రిఫలా సరలం దారు రజన్యో రోహిణీ వచా ॥ **85** ॥
పిప్పలీ పిప్పలీమూలం నాగరాతివిషే ఘనమ్।
క్షారద్వయం విడఙ్గం చ పాఠాఽగరు సచిత్రకమ్ ॥ **86** ॥
అయోరజశ్చ చూర్ణాని గోమూత్రేణ విపాచయేత్।
(ఇతి తాడపత్రపుస్తకే **243** తమం పత్రమ్)
ద్రా(క్షావ)లయమాహృత్య గుటికా బదరోపమాః ॥ **87** ॥
కృత్వాఽథైకాం తతో ద్వే వా పిబేదుష్ణేన వారిణా।
ముచ్యతే కఫజాచ్ఛోఫాదేవం శ్వయథుపీడితః ॥ **88** ॥
ఏషా హి గ్రహణీదోషం పాణ్డురోగం కఫాత్మకమ్।
కఫార్శాంసి చ వృద్ధిం చ ప్రమేహం చ శమం నయేత్ ॥ **89** ॥

త్రిఫల, సరళ, దేవదారు, హరిద్ర, దారుహరిద్ర, రోహిణి, వచ, పిప్పలి, పిప్పలీమూలము, శుంఠి, అతివిష, ముస్త, క్షార ద్వయము, విడంగము, పాఠా, అగరు, చిత్రక, లోహచూర్ణము ఈ చూర్ణములను గోమూత్రముతో పక్వము

చేయవలెను. మళ్లీ ద్రాక్షతో మర్దించి రేగు పళ్లసమాన మాత్రలు చేసి ఒకటి లేదా 2 మాత్రలు ఉష్ణ జలముతో ఇవ్వవలెను. కఫజ శోథ నశించును. ఇది గ్రహణి దోషము, శ్లేష్మక పాండు, అర్శరోగము, వృద్ధి ప్రమేహ రోగమును శాంతింప చేయును.

పఞ్చమూలం వరుణకం సరలం దేవదారు చ ।
హస్తికర్ణపలాశశ్చ ఫలాని నిచులస్య చ ॥ **90** ॥
పలాశః కాకలా కాలా గుడూచీ దేవపుష్పకమ్ ।
అహింస్రా శ్రేయసీ హింస్రా కృష్ణగంధా పునర్నవా ॥ **91** ॥
కాయస్థా చ వయఃస్థా చ చోరకో జటిలా జటా ।
అలమ్బుషం సోరుపూగం ప్రపున్నాడం సనాగరమ్ ॥ **92** ॥
శిగ్రుర్గోధాపదీ భార్గీ తర్కారీ శుష్కమూలకమ్ ।
ఏతైః సిద్ధం యథాలాభం తైలమభ్యఞ్జనైస్త్రిభిః ॥ **93** ॥
నిహన్త్యుదీర్ణశ్వయథు జంతోర్వాతకఫోత్తరమ్ ।

పంచమూలములు (బృహత్) వరుణ, సరళ, దేవదారు, హస్తికర్ణ పలాశ, నిచులాఫల, పలాశ, కాకలా, (షష్టి ధాన్య జాతి భేదము) కాలా (త్రివృత్) గుడూచి, లవంగ అహింస (కంటకపాలి) శ్రేయసీ (హరీతకి) హింస్రా (జటామాంసి) శోభాంజనము, పునర్నవ, కాయస్థా (ఆమలకి) వయస్థా (హరీతకి) చోరక, జటిలా, జటా (భూమ్యామలకి), అలంబుషా, ఏరండ, ప్రపున్నాట (చక్రమర్ద) శుంఠి, శిగ్రు, గోధాపది, (హంసపది) భారంగి, తర్కారి (అగ్నిమంథ) యథాలభ్యముగా గ్రహించి తైలసిద్ధము చేసి అంభ్యంగము చేసిన 3 విధములైన విశేషించి వాత కఫ ప్రధాన శోథ నశించును.

ఉభే హరిద్రే మఞ్జిష్ఠా యష్టీమధుకచందనమ్ ॥ **94** ॥
పిప్పల్యో బాలకం చైవ పీతద్రుః పద్మకం తథా ।
మాంస్యుశీరం సతగరమేలాఽగరు కుటన్నటమ్ ॥ **95** ॥
శ్రీవేష్టకం సర్జరసం మూర్వాకుష్ఠప్రియఙ్గవః ।
ఏతైస్తైలం విపక్తవ్యమభ్యఙ్గాచ్ఛోథనాశనమ్ ॥ **96** ॥

హరిద్ర, దారుహరిద్ర, మంజిష్ఠ, యష్టిమధు రక్త చందన పిప్పలీ బాలక (హ్రీబేర) పీతద్రు, పద్మకము, జటామాంసి, ఉశీర, తగరు, చిన్న ఏలకులు, అగరు భద్రముస్త, శ్రీవేష్టక, సర్జరస, మూర్వ, కుష్ఠ, ప్రియంగు, ఈ ఔషధములతో తైలసిద్ధము చేసి ఇచ్చిన శోథను నశింపచేయును.

క్రియైషా దోషజస్యోక్తాఽఽగంతోర్వైసర్పవత్ క్రియా ।
అగ్నిసాదో జ్వరస్తృష్ణా కార్శ్యారుచితమోభ్రమాః ॥ 97 ॥
శ్వాసవ్రణాతిసారాశ్చ స్వైశ్చికిత్స్యా ఉపద్రవాః ॥ 98 ॥

ఇది దోషజశోథ చికిత్స చెప్పబడినవి. ఆగంతుక శోథ చికిత్స విసర్పమునకు సమానముగా నుండును. శోథ ఉపద్రవములు అగ్నిమాంద్య, జ్వర, తృష్ణా, కృశతా, అరుచి, తమోగుణ ప్రధానత, భ్రమ, శ్వాస, వ్రణ అతిసారము. ఈ ఉపద్రవములకు వాటివాటికే చికిత్స చేయవలెను.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ అభ్ర (106)

అనిభగవాన్ కశ్యపుడు చెప్పెను.

(ఇతి) ఖిలేషు శ్వయథుచికిత్సాధ్యాయః సప్తదశః ॥ 17 ॥

శోథ చికిత్స సమాప్తం

చేయవలెను. మళ్లీ ద్రాక్షతో మర్దించి రేగు పళ్లసమాన మాత్రలు చేసి ఒకటి లేదా 2 మాత్రలు ఉష్ణ జలముతో ఇవ్వవలెను. కఫజ శోథ నశించును. ఇది గ్రహణి దోషము, శ్లేష్మక పాండు, అర్శరోగము, వృద్ధి ప్రమేహ రోగమును శాంతింప చేయును.

పఞ్చమూలం వరుణకం సరలం దేవదారు చ ।
హస్తికర్ణపలాశశ్చ ఫలాని నిచులస్య చ ॥ 90 ॥
పలాశః కాకలా కాలా గుడూచీ దేవపుష్పకమ్ ।
అహింస్రా శ్రేయసీ హింస్రా కృష్ణగంధా పునర్నవా ॥ 91 ॥
కాయస్థా చ వయఃస్థా చ చోరకో జటిలా జటా ।
అలమ్బుషం సోరుపూగం ప్రపున్నాడం సనాగరమ్ ॥ 92 ॥
శిగ్రుర్గోధాపదీ భార్గీ తర్కారీ శుష్కమూలకమ్ ।
ఏతైః సిద్ధం యథాలాభం తైలమభ్యఞ్జనైస్త్రిభిః ॥ 93 ॥
నిహన్త్యుదీర్ణశ్వయథు జంతోర్వాతకఫోత్తరమ్ ।

పంచమూలములు (బృహత్) వరుణ, సరళ, దేవదారు, హస్తికర్ణ పలాశ, నిచులాఫల, పలాశ, కాకలా, (షష్టి ధాన్య జాతి భేదము) కాలా (త్రివృత్) గుడూచి, లవంగ అహింస (కంటకపాలి) శ్రేయసీ (హరీతకి) హింస్రా (జటామాంసి) శోభాంజనము, పునర్నవ, కాయస్థా (ఆమలకి) వయస్థా (హరీతకి) చోరక, జటిలా, జటా (భూమ్యామలకి), అలంబుషా, ఏరండ, ప్రపున్నాట (చక్రమర్ద) శుంఠి, శిగ్రు, గోధాపది, (హంసపది) భారంగి, తర్కారి (అగ్నిమంథ) యథాలభ్యముగా గ్రహించి తైలసిద్ధము చేసి అంభ్యంగము చేసిన 3 విధములైన విశేషించి వాత కఫ ప్రధాన శోథ నశించును.

ఉభే హరిద్రే మఞ్జిష్ఠా యష్టీమధుకచందనమ్ ॥ 94 ॥
పిప్పల్యో బాలకం చైవ పీతద్రుః పద్మకం తథా ।
మాంస్యుశీరం సతగరమేలాఽగరు కుటన్నటమ్ ॥ 95 ॥
శ్రీవేష్టకం సర్జరసం మూర్వాకుష్ఠప్రియజ్గవః ।
ఏతైస్తైలం విపక్తవ్యమభ్యఙ్గాచ్ఛోథనాశనమ్ ॥ 96 ॥

హరిద్ర, దారుహరిద్ర, మంజిష్ఠ, యష్ఠిమధు రక్త చందన పిప్పలీ బాలక (హ్రీబేర) పీతద్రు, పద్మకము, జటామాంసి, ఉశీర, తగరు, చిన్న ఏలకులు, అగరు భద్రముస్త, శ్రీవేష్టక, సర్జరస, మూర్వ, కుష్ఠ, ప్రియంగు, ఈ ఔషధములతో తైలసిద్ధము చేసి ఇచ్చిన శోథను నశింపచేయును.

క్రియైషా దోషజస్యోక్తాఽఽగంతోర్వైసర్పవత్ క్రియా ।
అగ్నిసాదో జ్వరస్తృష్ణా కార్శ్యారుచితమోభ్రమాః ॥ 97 ॥
శ్వాసవ్రణాతిసారాశ్చ స్వైశ్చికిత్స్యా ఉపద్రవాః ॥ 98 ॥

ఇది దోషజశోథ చికిత్స చెప్పబడినవి. ఆగంతుక శోథ చికిత్స విసర్పమునకు సమానముగా నుండును. శోథ ఉపద్రవములు అగ్నిమాంద్య, జ్వర, తృష్ణా, కృశతా, అరుచి, తమోగుణ ప్రధానత, భ్రమ, శ్వాస, వ్రణ అతిసారము. ఈ ఉపద్రవములకు వాటివాటికే చికిత్స చేయవలెను.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ అభ్ర (106)

అనిభగవాన్ కశ్యపుడు చెప్పెను.

(ఇతి) ఖిలేషు శ్వయథుచికిత్సాధ్యాయః సప్తదశః ॥ 17 ॥

శోథ చికిత్స సమాప్తం

# శూలచికిత్సితాధ్యాయః - అష్టాదశః

అథాతః శూలచికిత్సితం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము శూల చికిత్సను వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

క్షోభాత్రాసాధ్యయనాతిప్రసఙ్గాత్
 క్షుత్కాలే చాత్యమ్బునః పానదోషాత్ ।
వేగానాం వా నిగ్రహోద్యానయానా-
 దామాద్భ్రంశసాద్రూక్షధాన్యాశనాద్వా ॥ 3 ॥
కృద్ధో వాయుః కర్తనాయామతోదైః
 కమ్పాధ్మానైరావిశన్ కుక్షిదేశే ।
శూలం పిత్తేనాన్వితః శ్లేష్మణా వా
 ద్వాభ్యాం వాఽపి ప్రేర్యమాణః కరోతి ॥ 4 ॥

శూల నిదాన సంప్రాప్తి : క్షోభ, త్రాస, అధ్యయనము అతి ప్రసంగముతో, ఆకలిగానున్నప్పుడు అధికముగా నీరు త్రాగుట, వేగ నిగ్రహము, వాహన ప్రయాణము, ఆమదోషము, పడుట, రూక్ష ధాన్య సేవనము, మొదలగు వాటిచే ప్రకోపమైన వాయువు కర్తన ఆయామ, తోద కంపన ఆధ్మానముతో కూడిన కుక్షిలో ప్రవిష్ఠమైన పిత్తము కఫము లేదా రెంటితో ప్రేరితమైన శూలను ఉత్పన్నము చేయును.

వాతాచ్ఛూలం క్షుధితస్యోగ్రరూపం
ఘోరైర్వేగైర్యన్నిరుచ్ఛ్వాసకర్తృ ।
విద్యాద్భుక్తే జీర్యతి స్వేదదాహ-
తృష్ణార్తస్య ప్రతతం పిత్తశూలమ్ ॥ 5 ॥
మందాబాధం స్తిమితం భుక్తమాత్రే
కఫోద్రేకాత్ స్తమ్భహృల్లాసకర్తృ ।
విద్యాచ్ఛూలం సన్నిపాతాశ్చతుర్థం
సర్వైర్లిఙ్గైర్దుఃసహం తత్త్వసాధ్యమ్ ॥ 6 ॥

**వాతిక శూల :** ఆకలిగా నున్నప్పుడు లేదా శూన్యమైన కుక్షవృద్ధి చెందును. మరియు శూలతీవ్ర వేగముగా నున్నప్పుడు శ్వాస నిలిచి పోవును.

**పైత్తిక శూల :-** ఇది భోజనము జీర్ణమైన పిదప కల్గును. ఇందులో రోగి అత్యధిక స్వేదము, దాహము తృష్ణచే పీడితుడగును. **శ్లేష్మిక శూల :** ఇందులో రోగికి ఎక్కువ కష్టముగా నుండదు. రోగి స్థిమితముగా నుండును. భోజనము చేసిన వెంటనే శూల ప్రారంభమగును. ఇందులో స్తంభము హృల్లాసాది లక్షణములుండును.

**సన్నిపాతిక శూల-** ఇది నాల్గవది. ఇందులో పై అన్ని లక్షణములుండును. ఇది దుస్సహము అసాధ్యము.

వాయుః ప్రోక్తో బలవానుగ్రవేగః
(సోఽయం) క్రుద్ధో దేహమాశ్వేవ హన్తి ।
తస్మాదాదావర్దితం వాతశూలే-
నాఽభ్యక్తాఙ్గం స్వేదయేదాశు వైద్యః ॥ 7 ॥
వాతఘ్నోష్ణైరవగాహోపనాహైః
పిణ్డస్వేదైరుష్ణకైః పాయసైర్వా ।

వాతము అతిబలము ఉగ్రవేగము కలది. ఇది కృద్ధమై నపుడు శరీరమును శీఘ్రముగా నశింపచేయును. కావున వాత శూల రోగికి సర్వప్రథమమున స్నేహనము చేయించి వాతనాశక ఉష్ణ అవగాహము, ఉపనాహము పిండస్వేదము ఉష్ణ పాయసాదుల ద్వారా స్వేదనము చేయవలెను.

ఏణాదీనాం జాఙ్గలానాం రసాంశ్చ
లావాదీనాం చాన్వితాన్ సైంధవేన ॥ 8 ॥
స్నిగ్ధోష్ణామ్లాన్ శీలయేద్వాతశూలీ
వాతఘ్నైర్వా సాధితం క్షీరముష్ణమ్ ॥ 9 ॥
తైలం శుక్తం మస్తు సౌవీరకం చ
పిబేచ్ఛూలీ సహ సౌవర్చలేన ।

వాతిక శూల రోగికి హరిణ జాంగల పశు పక్షి, లావక లవణయుక్త మాంసరసము స్నిగ్ధ ఉష్ణ అమ్ల పదార్థము వాతఘ్న ఔషధములతో సిద్ధము చేసిన క్షీరము, సౌవర్చలవణయుక్త తైలము, శుక్తము, మస్తు, సౌవీరకము సేవించవలెను.

శ్యామాం శుణ్ఠీం సైన్ధవం తుమ్బురూణి
హిఙ్గు క్షారం యావశూకం విడం చ ॥ 10 ॥
శ్లక్ష్ణం పిష్ట్వా ప్రవరాహ్వాం శఠిం చ
పేయం కోష్ణం చామ్బునా వాతశూలే ।

వాతజ శూలలో త్రివృత్, శుంఠి, సైంధవ లవణము తుంబురు, హింగు, క్షారము, యవక్షారము, విడలవణము ప్రవరము ( అగరు) శఠి, వీటిని మెత్తగా మర్దించి వేడినీటితో సేవించవలెను.

క్షీరం పీత్వా శీతలం పిత్తశూలీ
వమేత్ కామం శర్కరావారిణా వా ॥ 11 ॥

శూలార్తం వా శఙ్ఖకుందేందుగౌరై-
ర్ముక్తాహారైః సంస్పృశేత్ పఙ్కజైర్వా ।
రౌప్యైః కాంస్యైః స్ఫాటికైః కాఞ్చనైర్వా
(తోయా)సిక్తైర్భాజనైశ్చంద్రశీతైః ॥ 12 ॥

యస్మింఛ్ఛూలం సంస్పృశేత్తం ప్రదేశం
భూయో భూయః కదలీనాం దలైర్వా ।
మృద్వీం శయ్యాం విసినీపత్రభక్తి-
న్యాసోపేతాం చందనామ్బుప్రసిక్తామ్ ॥ 13 ॥

శీతే వేశ్మన్యహతాం సోపధానాం
సేవేతాంతః ప్రస్ఫురత్పద్మపత్రామ్ ।

పైత్తిక శూల రోగికి శీతల క్షీరము త్రాగి లేదా నీటిలో ఖండశర్కర కలిపి త్రాగించి యథేచ్ఛ వమనము చేయించవలెను. ఆ శూల పీడితునికి శంఖ, కుంద, చంద్రుని తుల్యమైన శ్వేత కమలముల ద్వారా చంద్రుడితో సమానమైన మైన శీతలము గల వెండి, కంచు, స్ఫటికము, స్వర్ణము యొక్క జలపూర్ణ పాత్రలను స్పర్శించవలెను. శూల ఉన్న ప్రదేశములో మాటి మాటికి కదలీ పత్రములతో స్పర్శించవలెను. ఆ రోగికి శీతల గృహములో మృదు, విసిని పత్రములతో చందనార్కముతో తడిపి ఉపాధానయుక్త విరిగి పోని పద్మపత్రములు పరిచిన శయ్యను ఉపయోగించవలెను.

హృద్యాః శీతా మధురా భేదనీయాః
పేయాః సిద్ధాః శీతలా వా కషాయాః ॥ **14** ॥

(ఇతి తాడపత్రపుస్తకే **244** తమం పత్రమ్)

క్షౌద్రోన్మిశ్రాః స్వాదవః పిత్తశూల-
స్యోచ్ఛేదార్థం శర్కరాచూర్ణయుక్తాః ।

పిత్త శూలను నశింపచేయుటకు మధు శర్కర మిశ్రితమను స్వాదు, హృద్య, శీతల, మధు విరేచన గుణయుక్త పేయను లేదా శీతల కషాయమును ప్రయోగించవలెను.

సామే సోత్క్లేశే భోజనే వా విదగ్ధే
సంశుద్ధ్యర్థం సైన్ధవోష్ణోదకేన ॥ **15** ॥

కుర్యాత్ కామం వమనం శ్లేష్మశూలే
వాంతం చైనం లఙ్ఘితం సుప్రతాన్తమ్ ।

క్షారోపేతం పాయయేత్ పాచనీయం
పిప్పల్యాదిక్వాథముష్ణం సహిఙ్గుః ॥ **16** ॥

తత్సిద్ధాం వా భోజయేత్తం యవాగూం
సంసృష్టాన్నః క్రమశో వా నిషేవేత్ ।

చూర్ణం సపిర్వటకక్షారబస్తీన్
కల్కక్వాథాన్ భాగశః కల్పశశ్చ ॥ 17 ॥

శ్లేష్మిక శూలలో ఆమరసము ఉత్క్లేశమైనపుడు లేదా భోజనము విదగ్ధమైనపుడు సంశోధనము కొరకు వేడి నీటితో యథేచ్ఛగా వమనము చేయించవలెను. తర్వాత లంఘనము చేయించి క్షారము కలిపి పాచన యోగమును త్రాగించవలెను. వేడి వేడి పిప్పల్యాది క్వాథములో హింగును కలిపి లేదా ఇదే క్వాథముతో సిద్ధము చేయబడిన యవాగును లేదా సంసర్జన క్రమముతో భోజనము చేయించవలెను. ఇది కాక చూర్ణ, సర్పి, వటక, క్షారవస్తి, కల్కము మరియు క్వాథము యోగ్య పరిమాణములో కల్పానుసారము ప్రయోగించవలెను.

శూలాటోపానాహగుల్మామయఘ్నం
సిద్ధం ప్రోక్తమృషిభిర్ధ్యానయోగాత్ ॥ 18 ॥
హిఙ్గుపాఠాత్రికటుకక్షారసైంధవచిత్రకాన్ ।
హపుషామభయాం చవ్యమజాజీధాన్యపుష్కరాన్ ॥ 19 ॥
అమ్లవేతసవృక్షామ్లయవానీదాడిమాని చ ।
శటిం సౌవర్చలం చైవ సూక్ష్మచూర్ణాని కారయేత్ ॥ 20 ॥
ఏతద్ధి చూర్ణముష్ణామ్బుదధిమస్తుసురాసవైః ।
పీతమానాహహృద్వస్తిశూలగుల్మార్తినాశనమ్ ॥ 21 ॥

ఋషులు ధ్యాన బలముతో శూల, ఆటోప, ఆనాహ గుల్మరోగములను నశింపచేయు క్రింది సిద్ధయోగములు చెప్పబడినవి. హింగు, పాఠా, త్రికటు, సర్జక్షారము, సైంధవము, చిత్రకము, హ్రీబేరము, హరీతకి, చవ్యము, అజామోద, ధనియాలు, పుష్కరమూలము, అమ్ల వేతసము, వృక్షామ్లము, యవాని, దాడిమ, శఠి, సౌవర్చలవణము, వీటి సూక్ష్మ చూర్ణమును తీసుకొనవలెను. ఈ చూర్ణముల ఉష్ణబలము, దధిమస్తు, సురా ఆసవములను సేవించుటచే ఆనాహము, హృచ్ఛూల, వస్తి శూల, గుల్మ రోగమును నశింపచేయును.

ప్లీహార్శోగ్రహణీదోషకాసశ్వాసానురోగ్రహమ్ ।
మాతులుఙ్గరసైర్యుక్తం హన్తి మూత్రగ్రహం తథా ॥ 22 ॥

పై చెప్పిన చూర్ణమును మాతులుంగ రసముతో సేవించిన ప్లీహ వృద్ధి, అర్శను, గ్రహణి వికారములు, కాస, శ్వాస ఉరోగ్రహము, మూత్రగ్రహము నశించును.

అమ్లవేతసవృక్షామ్లయవానీక్షారచిత్రకమ్ ।
హిఙ్గుచవ్యోషకశటీజీవంతీత్రికటూని చ ॥ **23** ॥
పిప్పలీం పిప్పలీమూలం బదరం శిరివారికామ్ ।
నాగదంతీం చ బిల్వం తథా లవణపఞ్చకమ్ ॥ **24** ॥
సమభాగాని మతిమాన్ సూక్ష్మచూర్ణాని కారయేత్ ।
రసేన మాతులుఙ్గస్య వటకాన్ కారయేత్తతః ॥ **25** ॥
గుల్మోదావర్తశూలేషు పిబేదేతాన్మహాగుణాన్ ।
సుఖోష్ణవారిమద్యామ్లైర్మూత్రకృచ్ఛ్రే తథైవ చ ॥ **26** ॥
హృద్రోగేషు గుదభ్రంశమేఢ్రబస్తిరుజాసు చ ।

అమ్లవేతసము, వృక్షామ్లము, అజామోద, సర్జక్షార, చిత్రక, హింగు, చవ్య, ఊషక (టంకణక్షారం) శఠి, జీవంతి, త్రికటు పిప్పలి, పిప్పలీమూలము, బదరీ, శిరివారికా (చాంగేరి) నాగదంతి, బిల్వ, పంచ లవణములు (సౌవర్చ, సైంధవ, విడ, ఉద్భిద సాముద్ర) ఇవన్ని సమభాగములు తీసుకుని సూక్ష్మచూర్ణము చేయవలెను. మాతులుంగ రసములో వీటిని మాత్రలుగా చేసుకొనవలెను. ఉష్ణజలము, మద్యము, అమ్ల కాంజిక అనుపానముతో గుల్మము ఉదావర్తము, శూల, మూత్ర కృచ్ఛ్రము, హృద్రోగము, గుదభ్రంశము మేఢ్రశూల వస్తి శూలలో ప్రయోగించవలెను.

విడదాడిమహిఙ్గూని సైన్ధవం మరిచం తథా ॥ **27** ॥
మాతులుఙ్గరసైర్యుక్తం శూలాటోపహరం పిబేత్ ।

బిడాలవణము, దాడిమ, హింగు, సైంధవలవణము, మరిచమును మాతులుంగ రసముతో కలిపి త్రాగిన శూల ఆటోపము శాంతించును

ఏతాని వ్యోషపృథ్వీకాచవ్యచిత్రకసైంధవైః ॥ **28** ॥
సాజాజిపిప్పలీమూలయుతైర్వా పథ్యముత్తమమ్ ।

పై చెప్పిన యోగము త్రికటు పృథ్వీకా (జీరక) చవ్య, చిత్రక, సైంధవము అజామోద పిప్పలీ మూలముతో సేవించుట ఉత్తమ పథ్యము.

**సౌవర్చలవచాహిఙ్గుత్ర్యూషణం సహరీతకమ్ ॥ 29 ॥**
**సురేశయవసంయుక్తం హంతి శూలబలం క్షణాత్ ।**

సౌవర్చలవణము వచహింగు, త్రికటు హరీతకి ఇంద్రయవ చూర్ణము క్షణములో శూల వేగమును నష్టమొందించును.

**పలికాన్ ఘృతసంయుక్తాన్ సక్తుసైంధవచిత్రకాన్ ॥ 30 ॥**
**వచాం చైవైకతః కృత్వా కటాహే ప్రదహేద్భిషక్ ।**
**ప్రదీప్తమవతార్యాథ తం క్షారం మాత్రయా పిబేత్ ॥ 31 ॥**
**తణ్డులోదకసంయుక్తం శూలగుల్మరుజాపహమ్ ।**

సక్తు సైంధవము చిత్రక, వచ, ఒక్కొక్క ఫలము చూర్ణము చేసి బాణలిలో వేసి మండించవలెను. పూర్తిగా ప్రదీప్తమైన తర్వాత ఈ క్షారము ఉచిత మాత్రలో తండులోదకముతో సేవించిన శూల, గుల్మ రోగములు నశించును.

**పఞ్చమూలయవక్వాథయుక్తమేరణ్డజం పిబేత్ ॥ 32 ॥**

పై చెప్పిన ప్రయోజనమునకు పంచమూలములు, యవ, క్వాథముతో ఏరండ క్షారము ప్రయోగించవలెను.

**తైలం వాయ్వాత్మకే శూలే ద్రాక్షాక్వాథయుతం తథా ।**
**సశర్కరం పిత్తశూలే పిత్తగుల్మే ప్లిహేషు చ ॥ 33 ॥**

వాతిక శూలలో ద్రాక్షా క్వాథముతో పైత్తిక శూల పైత్తిక గుల్మము ప్లీహ రోగము శర్కరతో తిలతైలమును ప్రయోగించవలెను.

**దాడిమవ్యోషహపుషాపృథ్వీకాక్షారచిత్రకైః ।**
**సాజాజిపిప్పలీమూలచవ్యదీప్యకసైన్ధవైః ॥ 34 ॥**
**సమాంశైర్విపచేత్ సర్పిః సక్షీరం మృదునాఽగ్నినా ।**
**కోలమూలకయూషేణ సంయుక్తం వాతగుల్మనుత్ ॥ 35 ॥**
**శూలానాహశ్వాసకాసవిషమజ్వరహృద్గ్రహాన్ ।**
**అరుచిగ్రహణీదోషశూలపాణ్డ్వామయాంస్తథా ॥ 36 ॥**

**యోనిదోషాంశ్చ హన్త్యేతదమృతప్రతిమం ఘృతమ్ ।**

దాడిమ, త్రికటు, హపుష, పృథ్వీక, సర్జక్షారము, చిత్రమూలము, అజాజీ (నల్లజీరక), పిప్పలీ మూలము చవ్యము, దీప్యక (అజామోద), సైంధవము, సమభాగములు తీసికొని కొద్దిపాలతో మృద్వగ్నిపై ఘృతపాకము చేయవలెను. ఈ ఘృతము బదిలీ, మూలీయూషముతో సేవించిన వాతగుల్మము నశించును. అమృత సమానమగు ఈ ఘృతము శూల, ఆమ, శ్వాస, కాస, విషమ జ్వరము, హృద్గ్రహము, అరుచి, గ్రహణీ వికారము, పాండురోగము, యోని రోగములను నశింప చేయును.

**బిల్వకుష్ఠయవక్షారవచాచిత్రకసైంధవైః ॥ 37 ॥**
**ఏనీయకవిడవ్యోషతిన్తిడీకామ్లవేతసైః ।**
**హిఙ్గుసౌవర్చలాజాతి(జి)దాడిమేంధయవైస్తథా ॥ 38 ॥**
**పునర్నవాకారవీభ్యాం హంసపద్యా చ సాధితమ్ ।**
**ఘృతం చతుర్గణో దధ్ని శుక్తకాతి(జి)కసంయుతమ్ ॥ 39 ॥**
**ద్విపఞ్చమూలకోలానాం కులుత్థానాం రసేన చ ।**
**శూలగుల్మానిలోత్కృమ్పగ్రంథీనర్దితహృద్గ్రహాన్ ॥ 40 ॥**
**వాతకుణ్డలికావర్తమేతత్ సర్పిరపాహరేత్ ।**

బిల్వ, కుష్ఠ, యవక్షారము, వచ, చిత్రక, సైంధవం, యనీయకము, బిడాలవణము, త్రికటు, తింతిడీకము, ఆమ్లవేతసము, హింగు, సౌవర్చలము, అజాజీ, దాడిమ, ఇంద్రయవ, పునర్నవ, కృష్ణ జీరక, హంసపాది, వీటి చూర్ణంలో ఘృతము వేసి ఘృతమునకు నాలుగు రెట్లు శుక్తము, కాంజికము, దశమూలములు కోల, కుళుత్థ రసమును కలిపి ఘృతపాక విధిన సిద్ధము చేయవలెను. దీని సేవనచే శూల, గుల్మ, వాతకఫము, గ్రంధిరోగము, అర్దితము, హృద్గ్రహము, వాతకుండలి, ఆవర్త రోగమును నశింపచేయును.

**సౌవర్చలయవక్షారవచాత్ర్యూషణచిత్రకైః ॥ 41 ॥**
**హరీతకీవిడఙ్గాభ్యాం పయసా చైవ సాధితమ్ ।**

(ఇతి తాడపత్రపుస్తకే 245 తమం పత్రమ్)

సంయుక్తం భద్రరోహిణ్యా దశాఙ్గం శూలనుద్ ఘృతమ్ ॥ 42 ॥
ప్లీహగుల్మక్రిమిశ్వాసకాసహిక్కా-వినాశనమ్ ।

సౌవర్చలము, యవక్షారము, వచ, త్రికటు, చిత్రక, హరీతకి, విడంగము, భద్రరోహిణి, ఈ పది ద్రవ్యముల లో పాలను కలిపి ఘృతపాకము చేయవలెను.

శతపుష్పావచాకుష్ఠపిప్పలీఫలసైంధవైః ॥ 43 ॥
సర్షపద్వయసంయుక్తాం ఫలవతి ప్రయోజయేత్ ।
ఏషాఽఽధ్మానముదావర్తం శూలం చాశు వ్యపోహతి ॥ 44 ॥
ఉష్ణోదకస్నేహయుక్తం మూత్రక్షౌద్రామ్లకాఞ్జికైః ।
సంయోజ్యైకత్ర మతిమానేభిశ్చూర్ణైః సమావపేత్ ॥ 45 ॥

సోంపు, వచ, కుష్ఠ, పిప్పలి, మదనఫలము, సైంధవం, శ్వేతసర్షప, పీతసర్షప, వీటి చూర్ణమును మర్దించి ఉష్ణజలము, స్నేహము, గోమూత్రము, మధు, అమ్లకాంజికముతో కలిపి ఫలవర్తి తయారుచేయువలెను. దీని ప్రయోగముతో ఆధ్మానము, ఉదావర్తము శూలాదులు శీఘ్రముగా నశించును.

శతాహ్వాపిప్పలీకుష్ఠవచానాం దేవదారుణః ।
పూతీకస్య హరేణూనాం బిల్వానాం మదనస్య చ ॥ 46 ॥
శూలానాహవిబంధఘ్నమిమం బస్తిం ప్రదాపయేత్ ।
ఆస్థాపనప్రమాణేన స్నిగ్ధస్విన్నస్య దేహినః ॥ 47 ॥
సంరుద్ధే వాయునా మూత్రే ప్రతిస్తబ్ధే తథోదరే ।
పురీషే చ విమార్గస్థే చూర్ణబస్తిరయం హితః ॥ 48 ॥

స్నేహ, స్వేదములు చేసిన తర్వాత ఆస్థాపన వస్తి ప్రమాణమునుసరించి సోంపు, పిప్పలి, కుష్ఠ, వచ, దేవదారు, పూతక హరేణు, బిల్వ, మదనఫల చూర్ణములతో తయారు చేసిన వస్తి నివ్వవలెను. ఇది శూల ఆనాహ విబంధమును నశింపచేయును. ఈ చూర్ణ వస్తి, వాతముచే అడ్డగింపబడిన మూత్రము ఉదరస్తబ్ధతతో పురీషము విపరీత మార్గముపోవుటను నివారింప చేయును.

వారిద్రోణే పలాన్యష్టౌ పచేద్గంధపలాశకాత్ ।
తతః కషాయం తు వచాపిప్పలీఫలసైంధవైః ॥ 49 ॥

సంయుక్తం క్షౌద్రతైలాభ్యాం శతాహ్వాకుడవేన చ ।
దద్యాన్నిరూహమానాహపార్శ్వహృద్బస్తిశూలినామ్ ॥ 50 ॥

ఒక ద్రోణజలములో 8 పలముల శఠిని వేపకషాయము చేయవలెను. అందులో వచ, పిప్పలి, మదన ఫలము, సైంధవము మధు తైలము సోంపు ఒక కుడవము వేయవలెను. ఆనాహ పార్శ్వ శూల హృచ్ఛూల వస్తి శూల రోగులకు ఈ నిరూహ వస్తి నివ్వవలెను.

బలవర్ణాగ్నిజననం శ్రోణిగుల్మరుజాపహమ్ ।
కులుత్థయవకోలాని పఞ్చమూలద్వయం తథా ॥ 51 ॥

క్వాథయేత్తం జలద్రోణే తతస్తం తైలసంయుతమ్ ।

కులుత్థ, యవ, కోల దశమూలములు ఒక ద్రోణజలములో వేసి కషాయము చేయవలెను. ఈ క్వాథములో తైలము కలిపి వస్తి రూపములో ప్రయోగించిన బలవర్ణ అగ్ని వృద్ధి పొందును

కషాయం పిప్పలీకుష్ఠవచేంద్రియవసర్షపైః ॥ 52 ॥

హరేణుకాసైంధవాభ్యాం తగరేణ ఘృతేన వా ।
తన్నిరూహముదావర్తకుష్ఠగుల్మోపశాంతయే ॥ 53 ॥
దద్యాచ్చైవేదమాశ్వేవ బలవర్ణాగ్నివర్ధనమ్ ।
తైలపక్వాశనం ధీరః కల్కపేష్యైర్విపాచితమ్ ॥ 54 ॥

పిప్పలి, కుష్ఠ, వచ, ఇంద్రయవ, సర్షప, హరేణు, సైంధవము, తగరము, ఘృతములతో నిరూహవస్తి నిచ్చినచో ఉదావర్త కుష్ఠ, గుల్మ రోగములను నశింప చేయును. పై చెప్పిన ద్రవ్యముల కల్కమును తైల పక్వము చేసి ప్రయోగించిన బలవర్ణ జఠరాగ్నులు వృద్ధి పొందును.

పిప్పలీబిల్వమధుకశతాహ్వాఫలచిత్రకైః ।
దేవదారువచాకుష్ఠపుష్కరాఖ్యైశ్చ సంయుతమ్ ॥ 55 ॥

సమాంశైర్ద్విగుణక్షీరం తదుదావర్తినాం హితమ్ ।
శూలానాహగుదభ్రంశవర్చోమూత్రవినిగ్రహాన్ ॥ 56 ॥

కట్యూరుపృష్ఠశూలార్శోమూఢవాతాంశ్చ నాశయేత్ ।
గుదశూలం తథోత్థానం బహుశః సప్రవాహికమ్ ॥ 57 ॥

పిప్పలి, బిల్వ, యష్ఠి, శతాహ్వ, మదన ఫలము, చిత్రక, దేవదారు వచ కుష్ఠ, పుష్కరమూలమును సమభాగములు తీసుకొని ఇందులో రెండు రెట్లు పాలను కలిపి క్షీరపాకము చేయవలెను. ఇది ఉదావర్త రోగులకు హితకరము. దీనివలన శూల, ఆనాహము, గుదభ్రంశము, వర్చగ్రహము, మూత్ర గ్రహము, కటిశూల, ఉరుశూల, పృష్ఠశూల, అర్ష, మూఢవాత, గుదశూల ప్రవాహిక ఉత్థాన రోగములు నశించును.

కుష్ఠం విడఙ్గాతివిషాదారుదార్వీహరేణుకాః ।
ఏలాఽజమోదా హ్రీబేరం నాగరం పుష్కరం శటీ ॥ 58 ॥
స్థిరా సకట్ఫలా రాస్నా పిప్పల్యశ్చవ్యచిత్రకమ్ ।
శ్యామా శతాహ్వా యష్ట్యాహ్వా సైంధవం మదనం వచా ॥ 59 ॥
నిచులం నీలినీ దంతీ బిల్వం చాక్షార్ధసంశ్రి(మి)తైః ।
గంధర్వతైలం తైలం వా పచేత్తదనువాసనమ్ ॥ 60 ॥
గుల్మాఢ్యవాతశూలార్శప్లీహోదావర్తవృద్ధినుత్ ।
సకుణ్డలం మూత్రకృచ్ఛ్రమానాహం చ వ్యపోహతి ॥ 61 ॥

కుష్ఠ, విడంగ, అతివిష, దేవదారు, దారుహరిద్ర, హరేణు, ఏల, అజమోద, హ్రీ బేర, శుంఠి, పుష్కరమూల, శఠి, శాలిపర్ణి, కాయఫలము, రాస్నా, పిప్పలి చవ్యము చిత్రకము, త్రివృత్, శతాహ్వ యష్ఠిమధు, సైంధవము, మదనఫలము, వచ, నిచుల, నీల, దంతి, బిల్వ ఇవన్ని ఒక్కొక్కటి అర్ధ అక్షము తీసుకొనవలెను. వీనికల్కము ద్వార ఏరండ లేదా తిలతైలముతో పక్వము చేయవలెను. ఈ తైలమును అనువాసన చేయుటచే గుల్మము ఆఢ్య వాతము, శూల, అర్శ, ప్లీహ, ఉదావర్త, వృద్ధి, కుండల, మూత్ర కృచ్ఛ ఆనాహ రోగములను నశింపచేయును.

శతార్ధం దశమూలస్య మదనానాం తథాఽఽఢకమ్ ।
పూతీకదంతీసురభీశ్వదంష్ట్రాణాం చ బుద్ధిమాన్ ॥ 62 ॥

పలాని వింశతిం దద్యాద్దేకైకస్య తమేకతః ।
యవకోలకులత్థానాం ప్రస్థయుక్తం జలోన్మనే ॥ 63 ॥
క్వాథయేత్ పాదశేషం తు తస్మింస్తైలాఢకం పచేత్ ।
గోమూత్రార్ధాఢకం యవపిప్పలీసైంధవత్రికమ్ ॥ 64 ॥
. . . . యవశతాహ్వానాం . . . . . వలీనకైః ।
కుష్ఠవక్ర(క్ర)స్య(త్వ)చాయుక్తమేతత్స్యాదనువాసనమ్ ॥ 65 ॥
ఊరుస్తమ్భకటీపృష్ఠగుదవంక్షణశూలిషు ।
ప్లీహోదావర్తగుల్మేషు ఫలతైలం ప్రయోజయేత్ ॥ 66 ॥

**ఫలతైలము :** దశమూలములు 40 పలములు, మదన ఫలము, పూతికరంజ, దంత, సురభి (రాస్నా) గోక్షుర ప్రత్యేకము 20 పలములు, యవ, కోల, కులుత్థము, ప్రస్థము వీటన్నిటి ఒక ద్రోణజలములో పక్వము చేసి క్వాథము చేయవలెను. చతుర్థాంశావ శేషమున్నపుడు ఒక ఆఢక తైలమును కలిపి సిద్ధము చేయవలెను. అందులో అర్ధ ఆఢకము గోమూత్రము, యవ, పిప్పలి, త్రిలవణములు (విడ, సైంధవ, రుచక) యవ, శతాహ్వా, వలీనక, కుష్ఠ, వక్ర (తగర) త్వక్‌ను వేసి పక్వము చేయవలెను. ఇది ఉత్తమ అనువాసనము. ఇది ఉరుస్తంభమును, కటిశూల, పృష్ఠశూల, గుదశూల, వంక్షణశూల, ప్లీహ, ఉదావర్త గుల్మరోగములో ప్రయోగించవలెను.

ఇతి శూలచికిత్సా తే విస్తరేణ ప్రకీర్తితా ।
సిద్ధైః ప్రయోగైర్వివిధైః ప్రాణినాం హితకామ్యయా ॥ 67 ॥

ఈ విధముగా నేను నీకు ప్రాణుల హితమును దృష్టిలోనుంచుకొని వివిధ రకములైన సిద్ధ యోగముల ద్వారా విస్తారముగా శూల చికిత్సను ఉపదేశించినాను.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ చూ 1 (71)

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

(ఇతి) ఖిలేషు శూలచికిత్సాధ్యాయోఽష్టాదశః ॥ 17 ॥ డాడ (18) ।

శూల చికిత్సాధ్యాయము సమాప్తము.

# అష్టజ్వర చికిత్సితోత్తరాధ్యాయః-ఏకోనవింశతితమః

**అథాతో౽ష్టజ్వరచికిత్సితోత్తరమధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥**

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥**

ఇప్పుడు మనము అష్టజ్వర చికిత్సితోత్తరమను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**ఏకద్విత్రిసముత్థానాం నిదానం ప్రాగుదాహృతమ్ ।**
**చికిత్సాం సంప్రవక్ష్యామి సన్నిపాతస్య హేతువత్ ॥ 3 ॥**

**(ఇతి తాడపత్రపుస్తకే 246 తమం పత్రమ్)**

నేను ఏక దోషజను, ద్విదోషజము, త్రిదోషజను జ్వర నిదానము మొదలు చెప్పినాను. ఇప్పుడు వాటన్నిటి చికిత్స మరియు సన్నిపాత జ్వర నిదానము చెప్పెదను.

**అహితా . . . . . . . . . . . . . . . . . ।**
**. . . . . . . . . . . . . . . . గుడసంయుతః ॥ 4 ॥**

ఈ శ్లోకములో బహుశా జ్వర నిదానము వర్ణించబడినది అహితకర ఆహారము గుడసేవనాదులచే జ్వరము త్పన్నమగును.

**సమఙ్గీ మధుకం ముస్తం భద్రదార్వథ శర్కరా ।**
**వాతజ్వరే ప్రయోక్తవ్యం గుడూచ్యా సహ పానకమ్ ॥ 5 ॥**

మంజిష్ఠ, యష్టిమధు, ముస్త, దేవదారు, శర్కర, గుడూచి పానకము తయారుచేసి వాత జ్వరములో ప్రయోగించవలెను.

**విదారిగంధా హ్యేరణ్డం బృహత్యౌ పృశ్నిపర్ణికా ।**
**భద్రదారుసమాయుక్తో వాతజ్వరహరో మతః ॥ 6 ॥**

విదారి గంధ, ఏరండ, బృహత్, పృశ్ని పర్ణికా, దేవదారు వీటన్నిటిని వాత జ్వరములో ప్రయోగించవలెను.

**విదారిగంధా కలశీ తథా గంధర్వహస్తకః ।**
**మధుకం భద్రదారుశ్చ క్వాథః శర్కరయా యుతః ॥ 7 ॥**
**వాతజ్వరహరో దేయో మాతులుఙ్గరసాప్లుతః ।**

విదారిగందా, కలశీ (పృశ్నిపర్ణి) ఏరండ, యష్టిమధు, దేవదారు క్వాథములో శర్కర మాతులుంగ రసము కలిపి ఇవ్వవలెను. వాతజ్వరము.

**ఏరణ్డం వరుణం చైవ బృహత్యౌ మధుకం తథా ॥ 8 ॥**
**వాతజ్వరహరః క్వాథో రాస్నాకల్కసమాయుతః ।**

ఏరండ, వరుణ, బృహతీద్వయము, యష్టిమధు క్వాథములో రాస్నా కల్కమును కలిపి ఇచ్చిన వాతజ్వరము నశించును.

**ద్విపఞ్చమూలనిష్క్వాథః కోష్ణో వా యది వా హిమః ।**
**రాస్నాకల్కసమాయుక్తో వాతజ్వరహితో మతః ॥ 9 ॥**

దశమూలముల ఉష్ణ లేదా శీత క్వాథమునందు రాస్నా కల్కమును కలిపి ఇచ్చిన వాత జ్వరమునందు హితకరము.

**రాస్నాసరలదేవాహ్వయష్టీమధుకసంయుతః ।**
**పేయో విదారిగంధాద్యో నిష్క్వాథో వా ససైంధవః ॥ 10 ॥**

రాస్నా, సరళ, దేవదారు, యష్టిమధు యుక్త విదారి గంధ క్వాథములో సైంధవలవణము కలిపి త్రాగవలెను.

**పఞ్చముష్టికయూషేణ యుక్తామ్లలవణేన చ ।**
**భుఞ్జీత భోజనం కాలే జాఙ్గలానాం రసేన చ ॥ 11 ॥**
**పిబేదంతరపానం చ బిల్వమూలశృతం జలమ్ ।**

యోగ్యమాత్రలో అమ్ల లవణములు కలిసిన పంచముష్టిక యూషము లేదా జాంగల పశుపక్షుల మాంసరసముతో యోగ్యకాలములో భోజనము

చేయవలెను. భోజన మధ్యలో బిల్వ మూలముతో సిద్ధము చేయబడిన జలము నివ్వవలెను.

ద్వే పఞ్చమూలే వర్చీవమేకేషీకా పునర్నవామ్ ॥
సహస్రవీర్యాం నాదేయీాం శతవీర్యాం శతావరీమ్ ।
విశ్వదేవాం శుకనసాం సహదేవాం సనాకులీమ్ ॥
రాస్నాజగంధే పూతీకం దేవాహ్వాం దేవతాడకమ్ ।
బలే ద్వే హంసపాదీం చ క్వాథోత్థీముపలఙ్కశామ్ ॥
కృష్ణాగరుం వ్యాఘ్రనఖం శతపుష్పాం పలఙ్కషామ్ ।
కాయస్థాం చ వయస్థాం చ చోరకం జటిలాం జటామ్ ।
అపేతరాక్షసీం యక్షాం గుహాహ్వాముష్ట్రలోమికామ్ ।
హరేణుకాం హైమవతీం కైతర్యం సువహాం వచామ్ ॥
వృశ్చికాలీం చ భార్గీం చ . . . స్యా శిగ్రుం చ కల్కశః ।
సంహృత్య తైలం విపచేద్వాతజ్వరనిబర్హణమ్ ॥ **12** ॥
పురాణసర్పిఃసంస్కారో విధేయో జాఙ్గలో రసః ।

దశమూలములు, వర్చీవ, ఏకేషికా (పాఠా), పునర్నవ, సహస్ర వీర్య (దూర్వ) నాదేయి (అరణి లేదాముస్త) శతవీర్యా (శతమూలీ లేదా ద్రాక్ష) శతావరి, విశ్వదేవా (గోరక్షతండుల) శుకనాస (శ్యోనాక) సహదేవ (బల), గంధనాకులి, రాస్నా, అజగంధ (వనయవానీ) పూతీక (కరంజ) దేవదారు, దేవతాడక (దేవదాలి ఘోషాలతో) బలాద్వయము, (బల అతిబల) హంసపది, క్వాథముతో శోధితమైన గుగ్గులు, కృష్ణాగరు, వ్యాఘ్రనఖి, సోంపు, పలంకషా, కాయస్థ ( ఆమలకి లేదా కాకోలి) వయస్థా (హరీతకి) చోరక ( గ్రంధిపర్ణి భేదము) జటిల (వటవృక్ష) జటామాంసి, అపేత రాక్షసి (కృష్ణ తులసి), యక్షా, గుహాహ్వ (పృశ్నిపర్ణి భేదము), ఉష్ట్రలోమికా, హరేణు హైమవతి (స్వర్ణ క్షీరి లేదా హరీతకి) కైటర్య (మహానింబ భేదము) సువహ (శేఫాలికా) వచ, వృశ్చి కాలీ (బరహంలు) భారంగి. . . . శిగ్రు వీటి కల్కముతో తైలపాకము చేయవలెను. ఇది వాత జ్వరమును నశింప చేయును. ఇందులో పురాణ ఘృతముతో సంస్కరించబడిన జాంగల మాంసరసమును ప్రయోగించవలెను.

దశమూలకులుత్థానాం యవానాం కుడవస్య చ ॥
కులీరశృఙ్గ్యా రాస్నాయాః శటీపుష్కరమూలయోః ।
భార్గ్యా దురాలభాయాశ్చ నిర్యూహః సాధు సాధితః ॥ 13 ॥
తేనాస్య విగుణో వాయుర్జ్వరశ్చాశు ప్రశామ్యతి ।

దశమూలములు కులుత్థము, యవ కులీర శృంగి (కర్కాటకశృంగి) రాస్నా, శఠి, పుష్కరమూలము, భారంగి, దురాలభా ఒక్కొక్కటి పలము చొ॥న తీసుకొని క్వాథము చేయవలెను. దీనిప్రయోగముచే దూషిత వాతము, జ్వరము శీఘ్రముగా శాంతించును.

వాతశ్లేష్మసముత్థస్య వ్యాఖ్యాస్యామి చికిత్సితమ్ ॥
బృహత్యౌ పుష్కరం దారు పిప్పల్యో నాగరం శటీ ।
క్వాథమేషాం పిబేదుష్ణమాదౌ దోషవిపాచనమ్ ॥ 14 ॥

ఇప్పుడు నేను వాతశ్లేష్మ జ్వర చికిత్సను ఉపదేశించెదను. ప్రారంభములో బృహతీ ద్వయము, పుష్కరమూలము, దేవదారు పిప్పలి, శుంఠి, శఠి, క్వాథమును త్రాగవలెను. ఇది దోషపాచనము చేయును.

ద్విపఞ్చమూలం భార్గీం చ కర్కటాఖ్యాం దురాలభామ్ ।
నాగరం పిప్పలీం దారు పిబేద్వా సైంధవాన్వితమ్ ॥ 15 ॥

లేదా ఇందులో ద్విపంచమూలము, భారంగి, కర్కాటక శృంగి, దురాలభ, శుంఠి, పిప్పలి, దేవదారు, క్వాథములో సైంధవమును కలిపి త్రాగించవలెను.

పటోలం ధాన్యకం ముస్తా మూర్వా పాఠా నిదిగ్ధికా ।
కషాయ ఏషాం పాతవ్యః షడఙ్గో మధుసంయుతః ॥ 16 ॥

పటోలము, ధనియాలు, ముస్త, మూర్వ, పాఠా, నిదిగ్ధికా, ఈ 6 ద్రవ్యముల కషాయములో మధును కలిపి సేవించవలెను.

త్రిఫలా జీవనీయాని పిప్పలీమూలశర్కరే ।
సిద్ధో గ్రహాఘ్నసంయుక్తో వాతశ్లేష్మజ్వరాపహః ॥ 17 ॥

త్రిఫల జీవనీయ వర్గ ఔషధములు, పిప్పలీమూలము, శర్కర, గ్రహఘ్న (శ్వేత సర్షప) ములక్వాథము వాత శ్లేష్మ జ్వరమును నశింపచేయును.

నాగరం దశ(మూలం) చ కట్వఙ్గం దారుకద్వయమ్ ।
పిప్పల్యస్త్రిఫలా భార్గో కర్కటాఖ్యా దురాలభా ॥ 18 ॥
వాతశ్లేష్మజ్వరే పేయం సుఖోష్ణం సైంధవాన్వితమ్ ।

శుంఠి, దశమూలములు, కట్వంగ, హరిద్ర, దారుహరిద్ర, పిప్పలి, త్రిఫల, భారంగి, కర్కాటకశృంగి, దురాలభ వీటి సుఖోష్ణ క్వాథములో సైంధవ లవణము కలిపి వాత శ్లేష్మ జ్వరములో త్రాగవలెను.

తిక్తకం కటురోహిణ్యాః కల్కమక్షసమం భిషక్ ॥
హిఙ్గుసైంధవసంసృష్టం పిబేత్ క్షిప్రం సుఖామ్బునా ।
కఫజేఽనిలజే చైవ జ్వరే పీతం సుఖావహమ్ ॥ 19 ॥

వైద్యుడు తిక్తకము (పటోలము) కటుక రోహిణి కల్కము ఒక అక్షము తీసుకోవలెను. అందులో హింగు లవణము కలిపి శీఘ్రముగా సుఖోష్ణ జలముతో త్రాగించవలెను. ఈ క్వాథమును వాత శ్లేష్మ జ్వరములో త్రాగిన సుఖముగా నుండును.

మహతః పఞ్చమూలస్య క్వాథః శ్లైష్మికవాతికే ।
నాగరామరదారుభ్యాం శృతముష్ణం పిబేజ్జలమ్ ॥ 20 ॥

వాతశ్లేష్మ జ్వరములో బృహత పంచమూల క్వాథమును శుంఠి దేవదారుతో సిద్ధమైన ఉష్ణజలమును త్రాగించవలెను.

బాలమూలక యూషేణ జాఙ్గలానాం రసేన వా ।
కటూష్ణద్రవ్యయుక్తేన మందస్నిగ్ధేన భోజయేత్ ॥ 21 ॥

వాత శ్లేష్మ జ్వరములో రోగికి పచ్చి ముల్లంగి యూషము జాంగల మాంసరసము మరియు అల్ప స్నేహయుక్త కటు ఉష్ణ ద్రవ్యముల భోజనము చేయవలెను.

లాక్షాప్రియఙ్గుమఞ్జిష్ఠాయష్టికోశీరబాలకైః ।
చందనాగరుబాహ్లీకశ్రీవేష్టకకుటన్నటైః ॥

మూర్వాశతాహ్వాసరలసాలనిర్యాసరోచకైః ।
క్షీరద్రోణేఽర్ధపలికార్భిషక్తైలాఢకం పచేత్ ॥ 22 ॥
తత్ సాధు సిద్ధమాహృత్య స్వనుగుప్తం నిధాపయేత్ ।
లాక్షాదికమిదం తైల . . . . . . . . . . . . . ।

(ఇతి తాడపత్రపుస్తకే 250 తమం పత్రమ్)

. . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . . .

లక్షాది తైలము లాక్షా, ప్రియంగు, మంజిష్ఠ, యష్టిమధు, ఉశీర, నేత్రబాల, చందన, అగరు, బాహ్లీక (హింగు) శ్రీవేష్టిక (సరళ నిర్వాసము, గంధ ఫిరోజ) కుటన్నట (శ్యోనాక) మూర్వ శతాహ్వా, సరళ, సాల నిర్యాసము, రోచక (గజనిమ్మ) అర్ధపలముచొ॥ న ద్రోణ జలములో తీసుకొని ఒక ఆఢక తైలమును సిద్ధము చేసుకొనవలెను. తర్వాత ఏకాంత స్థానములో నుంచవలెను. ఇది లాక్షాది తైలము.

(పిప్ప)ల్యోఽతివిషాముస్తా స్థిరాఢ్యా సదురాలభా ॥
సచందనయవోశీరసారివాః సనిదిగ్ధికాః ।
రోహిణ్యామలకం బిల్వం త్రాయమాణాతిసాధితమ్ ॥ 23 ॥
ఘృతం హంతి శిరః శూలం కాసం జీర్ణజ్వరం క్షయమ్ ।

పిప్పలి, అతివిష, ముస్త, స్థిరా (శాలిపర్ణి) ఆఢ్యా (అజామోద) దురాలభా, రక్త చందన, యవ, ఉశీర, సారిబా, కంటకారి, రోహిణి, ఆమలకి, బిల్వ, త్రాయమాణముతో సిద్ధము చేయబడిన ఘృతమును శిరశ్శూల, కాస, జీర్ణజ్వరము క్షయ రోగమును నశింపచేయును.

వమనం కఫరోగాణాం పైత్తికానాం విరేచనమ్ ॥ 24 ॥
శోధనం శమనం కార్యం కృశే శమనశోధనమ్ ।

శ్లేష్మక రోగములలో వమనము ద్వారా, పిత్తరోగములలో విరేచనము ద్వారా శోధనము చేసి శమనము చేయవలెను. రోగి కృశుడైనచో మొదట శమనముచేసి తర్వాత శోధనము చేయవలెను.

మణ్డాదిరిష్యతే సామే యవాగూర్వాతజే తథా ॥ 25 ॥
విషౌషధిప్రజాతానాం పిత్తఘ్నీం కారయేత్ క్రియామ్ ।

ఆమజ్వరములో మండాదులు వాత జ్వరములో యవాగు సేవనము విష ఔషధములతో ఉత్పన్నమైన జ్వరములో పిత్తనాశక చికిత్సను చేయవలెను.

సన్నిపాతజ్వరస్యాతః ప్రవక్ష్యామి చికిత్సితమ్ ॥ 26 ॥
స సర్వలక్షణోఽసాధ్యః కృచ్ఛ్రసాధ్యోఽల్పలక్షణః ।

ఇప్పుడు నేను సన్నిపాత జ్వర చికిత్సను చెప్పెదను. సన్నిపాత జ్వరములో సంపూర్ణ లక్షణములున్నచో అది అసాధ్యము. కొన్ని లక్షణములు మాత్రమున్నచో కృచ్ఛ్ర సాధ్యము.

బలహీనస్య నష్టాగ్నేః సర్వథా నైవ సిద్ధ్యతి ॥
కిమఙ్గ! బాలకానాం తు క్షీణధాతుబలౌజసామ్ ।
తథాఽపి యత్నమాతిష్ఠేదానృశంస్యాద్భిషగ్వరః ॥ 27 ॥

ఓ ప్రియా! బలహీనుడైన బాలకునికి, జఠరాగ్ని నశించినవాడికి దాతుబల ఓజస్సు క్షీణించిన వానికి సన్నిపాత జ్వరము అసాధ్యము అయినా చికిత్సకుడు అంతిమ క్షణమువరకు ప్రయత్నించవలెను.

సన్నిపాతేషు దోషేషు యో దోషో బలవాన్ భవేత్ ।
తమేవాదౌ ప్రశమయేచ్ఛేషం దోషమతః పరమ్ ॥ 28 ॥

సన్నిపాత జ్వరములో బలమైన దోషమునకు మొదట చికిత్స చేయవలెను. శేషదోషములకు తర్వాత చికిత్సచేయవలెను.

అల్పాన్తరబలేష్వేషు దోషేషు మతిమాన్ భిషక్ ।
శ్లేష్మాణమాదౌ శమయేత్ స హ్యేషామనుబంధకృత్ ॥ 29 ॥
గురుత్వాత్ కృచ్ఛ్రపాకిత్వాదూర్ధ్వకాయాశ్రయాత్తథా ।

సన్నిపాత జ్వరములో దోషములు సమాన బలముగా నున్నచో మొదట కఫమును శాంతింప చేయవలెను. ఎందుకనగా ఇందులో గురు, కృచ్ఛ్రపాకము, శరీర ఊర్ధ్వ భాగములో నుండుట వలన కఫమే అనుబంధముగా నుండును.

తస్మాజ్జ్వరే యదుద్దిష్టం వాతపిత్తకఫాత్మకే ॥ 30 ॥
తస్మాత్తస్యామవస్థాయాం తత్తత్ కార్యం చికిత్సితమ్ ।

కావున వాత పిత్త కఫ జ్వరములలో ఏచికిత్స చెప్పబడినదో జ్వరముల యొక్క ఆయా అవస్థలలో ఆచికిత్సనే చేయవలెను.

పిప్పల్యాదివచాదారువయస్థాసరలాన్వితః ॥
పేయః కఫోత్తరే సామే సహిఙ్గుక్షారసైంధవః ।
దోషాస్తేనాశు పచ్యంతే విబంధశ్చోపశామ్యతి ॥ 31 ॥

జ్వరము నందు కఫ రూప ఆమరసము ప్రధానముగా నున్నపుడు పిప్పలి, వచ, దేవదారు, హరీతకి, సరళ, హింగు, సర్జక్షారము సైంధవలవణమును ప్రయోగించవలెను. దీనివలన దోషములు శీఘ్రము పాచనమై జ్వరము కూడ శాంతించును.

నాగరం కట్ఫలం ధాన్యం ముస్తం పర్పాటకం వచా ।
దేవదార్వభయా భార్గీ భూతీకం దశమం భవేత్ ॥
శృతం సైంధవహిఙ్గుభ్యాం పేయం వాతకఫోత్తరే ।
ఊర్ధ్వజత్ర్వజ్గరోగాణాం జ్వరితానాం ప్రశస్యతే ॥ 32 ॥

వాత కఫ ప్రధాన జ్వరములో శుంఠి, కాయఫలము, ధనియాలు ముస్త పర్పాటకము, వచ, దేవదారు, హరీతకి, భారంగి, భూతీక ( అజామోద) ఈ 10 ద్రవ్యములను క్వాథము చేసి అందులో సైంధవము హింగు కలిపి ప్రయోగించవలెను. ఇది జ్వర యుక్త రోగికి ఊర్ధ్వ జత్రుగతరోగములలో ప్రశస్తముగా చెప్పబడినది.

శటీపౌష్కరపిప్పల్యో బృహతీ కణ్టకారికా ।
శుణ్ఠీ కర్కటకీ భార్గీ దురాలమ్భా యవానికా ॥ 33 ॥
శూలానాహవిబంధఘ్నం శట్యాద్యం కఫవాతనుత్ ।

శఠి, పుష్కరమూలము, పిప్పలి, బృహతి, కంటకారి, శుంఠి, కర్కాటక శృంగి, భారంగి, దురాలభ, యవాని ప్రయోగించవలెను. ఈ శట్యాది ప్రయోగము శూల ఆనాహము, విబంధము వాతకఫములను నశింపచేయును.

విడఙ్గాతివిషే భార్గీ పౌష్కరం చిత్రకం శటీ ॥ 34 ॥
శార్ఙ్గేష్టా పిప్పలీ శుణ్ఠీ పిబేద్వాతకఫోత్తరే ।

వాత కఫ ప్రధాన జ్వరవములో విడంగవు అతివిష భారంగి, పుష్కరమూలము, చిత్రకము, కచూరములు, శారంగేష్ట, (కాకజంఘ) పిప్పలి, శుంఠిని సేవించవలెను.

దురాలభావచాదారుపిప్పలీమూలనాగరమ్ ॥
. . . . . . . . . . . . పుష్కరం శటీ ।
క్వాథం సలవణం దేయం హిఙ్గుక్షారాన్వితం పిబేత్ ॥ 35 ॥
సన్నిపాతే విబంధే చ వాతశ్లేష్మోత్తరే జ్వరే ।

సన్నిపాత విబంధ, వాత కఫ ప్రధాన జ్వరములో దురాలభ, వచ దేవదారు, పిప్పలీమూల, శుంఠి, పుష్కరమూల, కచ్చూర క్వాథములో లవణము హింగు, సర్జక్షారము కలిపి త్రాగించవలెను.

జీవకర్షభకౌ శృఙ్గీ మూలం పుష్కరజం శటీ ॥ 36 ॥
సన్నిపాతేఽనిలకఫే కాసే చైషాం ప్రశస్యతే ।

సన్నిపాత జ్వరములో వాత కఫ ప్రధానముగా నున్నచో కాస ఉన్నచో జీవకము ఋషభకము, కర్కాటక శృంగి, పుష్కరమూలమును, కచ్చూరముల క్వాథము ప్రశస్తముగా చెప్పబడినది.

బృహత్యౌ పుష్కరం దారు పిప్పల్యో నాగరం శటీ ॥ 37 ॥
క్వాథమేషాం పిబేదుష్ణమాదౌ దోషవిపాచనమ్ ।

సన్నిపాత జ్వరప్రారంభములో దోష పాచనము చేయుటకు బృహతి పుష్కరమూలము, దేవదారు, పిప్పలి, శుంఠి, కచ్చూరముల వేడి వేడి క్వాథమును త్రాగవలెను.

దురాలభా వచా దారు పిప్పలీ భద్రరోహిణీ ॥
మహౌషధం కర్కటకీ బృహతీ కణ్టకారికా ।
క్వాథః సలవణః పేయః సన్నిపాతజ్వరాపహః ॥ 38 ॥
సన్నిపాత జ్వరమును నశింపచేయుటకు దురాలభ, వచ, దేవదారు,

పిప్పలి, కటుకరోహిణి, శుంఠి, కర్కాటకశృంగి, బృహతి కంటకారి క్వాథములో లవణము కలిపి త్రాగవలెను.

దేవదారు వచా ముస్తం కైరాతం కటురోహిణీ ।
గుడూచీ నాగరం క్వాథః సన్నిపాతజ్వరాపహః ॥ **39** ॥
ఉరోగ్రహే కణ్ఠరోగే ముఖరోగే చ శస్యతే ।

సన్నిపాత జ్వరములో దేవదారు, వచ, ముస్త, కిరాతతిక్త, కటుక రోహిణి, గుడూచి, శుంఠి క్వాథమును ప్రయోగించవలెను.

త్రిఫలా రోహిణీ నిమ్బం పటోలం కటుకత్రయమ్ ॥
పాఠా గుడూచీ వేతాగ్రం సప్తపర్ణః సవత్సకః ।
కిరాతతిక్తకం ముస్తా వచా చేత్యేకతః శృతమ్ ॥ **40** ॥
కఫోత్తరం నిహన్త్యేతత్ పానాదగ్నిం చ దీపయేత్ ।

త్రిఫలా, రోహిణి, నింబ, పటోల, త్రికటు, పాఠా, గుడూచి వేతాగ్ర (నాడీశాకను) సప్తపర్ణ, ఇంద్రయవ, కిరాతతిక్త, ముస్త, వచ క్వాథమును కఫప్రధాన సన్నిపాత జ్వరమును నశింపచేయును. అగ్నిని ప్రదీప్తి చేయును.

పటోలముస్తమధుకరోహిణీక్వథితం జలమ్ ॥
యోగమేతం త్రిఫలయా యుక్తం చ సురదారుణా ।
పాయయేన్మధునాఽఽలోడ్య సన్నిపాతే కఫోత్తరే ॥ **41** ॥

కఫప్రధాన సన్నిపాతజ్వరములో ముస్త యష్టిమదు, రోహిణి, త్రిఫల, దేవదారు క్వాథములో మధు కలిపి సేవించవలెను.

ఆరగ్వధవచానిమ్బపటోలోశీరవత్సకమ్ ।
శార్ఙ్గేష్టాఽతివిషా మూర్వా త్రిఫలా సదురాలభా ॥
భద్రముస్తా బలా పాఠా మధుకం భద్రరోహిణీ ।
కషాయ ఏష శమయేజ్జ్వరమాశు త్రిదోషజమ్ ॥ **42** ॥
జాడ్యం సశోఫమాధ్మానం గురుత్వం చాపకర్షతి ।

ఆరగ్వధ, వచ, నింబ, పటోల, ఉశీర, ఇంద్రయవ, శారంగేష్ట, అతివిష, మూర్వ, త్రిఫల, దురాలభ, ముస్త, బలా, పాఠా, యష్టి, కటుకరోహిణి,

కషాయము సన్నిపాత జ్వరమును శీఘ్రముగా శాంతింపచేయును. ఇది జడత్వము శోథ, ఆధ్మానము, శరీరగురుత్వమును అపకర్షముచేయును.

నాగరం దశమూలం చ కట్వఙ్గం దా . . . . . . . . ॥ 43 ॥

శుంఠి, దశమూల, శ్యోనాక. ...... . . ఆదిక్వాథము సన్నిపాత జ్వరములో ఇవ్వవలెను. మిగతా అధ్యాయము లుప్తమైనది. 5 తాలపత్రములు లుప్తమైనందున 20వ అధ్యాయము పూర్తిగా మరియు 21వ అధ్యాయము మధు విశేషణము ప్రారంభమున కూడ ఖండితమైయున్నది.

# మధు విశేషణీయాధ్యాయము-ఏకవింశతిః

**. . . . . . . . . . . . . . . . . శిశుం ప్రాశయేయుః కథఞ్చన ॥ 1 ॥**

శిశువుకు ఏ విధంగానైనా మధు సేవనము చేయించవలెను.

**నవసద్యఃక్షతానాం తద్ వ్రణానాం రోహణం భవేత్।**

**క్షతజం ప్రాప్య హి విషం దర్శయత్యాత్మనో బలమ్ ॥ 2 ॥**

**మధు గుణములు :-** మధు నవీన, సద్యక్షతవ్రణములను రోపణము చేయును. క్షతము వలన శరీరమున జనించు విషమును నిర్వీర్యము చేయును. ఆవిషమును శాంతింపచేసి వ్రణ సంధానము చేయును.

**తస్మాత్ స్వభావతో నృణాం సహోష్ణైనాశితం మధు ॥**

**విరుద్ధత్వాత్త్రిభిర్దోషైర్జీవితాన్తాయ కల్పతే।**

**తుల్యత్వాదుష్ణయోగాచ్చ యథా చ మధుసర్పిషీ ॥ 3 ॥**

మధు తన స్వభావముచే త్రిదోషములకు విరుద్ధమగుటచే ఉష్ణ పదార్థములతో సేవించిన మృత్యుకారకమగును. ఉదాహరణకు మధు ఘృతము సమానమాత్రలో తీసుకొనుట వలన ఉష్ణత కల్గి ఘాతక ప్రాయమగును.

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 4 ॥**

అని భగవాన్ కశ్యపుడును చెప్పెను.

(ఇతి) ఖిలేషు మధువిశేషణీయో నామైకవింశతితమోఽధ్యాయః ॥ థ 1 (21)

ఖిలస్థాన మందలి మధువిశేషణీయమను

21 వ అధ్యాయము సమాప్తము.

# క్షీరగుణ విశేషీయాధ్యాయః-ద్వావింశతితమః

అథాతః క్షీరగుణవిశేషీయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము క్షీరగుణ విశేషీయమను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

గోర్మహిష్యా అజాయాశ్చ నార్యా ఉష్ట్ర్యా అవేః స్త్రియాః ।
తురఙ్గ్యా ఇతి చోక్తాని పూర్వమేవ పయాంసి తు ॥ 3 ॥
భూయశ్చ గుణవైశేష్యాత్ క్షీరాణ్యష్టౌ నిబోధమే ।

గో, మహిష, అజా, నారీ, ఉష్ట్ర, గొఱ్ఱె, స్త్రీ, గుఱ్ఱముల క్షీరములు మొదట వర్ణించ బడినవి. ఇప్పుడు గుణ విశేష కారణమున తిరిగి నానుండి క్షీరము గురించి వినుము.

ప్రజాపతేః పురేచ్ఛాతః ప్రజానాం ప్రాణధారణమ్ ॥ 4 ॥
పఞ్చభూతగుణం చాపి భూరుహాం జన్మ కథ్యతే ।
వనస్పతీనాం వృక్షాణాం వానస్పత్యగణస్య చ ॥ 5 ॥
వీరుధామోషధీనాం చ గుల్మానామపి జీవక ! ।
వివిధానాం తృణానాం చ సస్యానాం చైవ దేహినామ్ ॥ 6 ॥
ఏవమాదిగణో యస్తు భూమేః సార ఉదాహృతః ।

ఓ జీవకా! ప్రాచీనకాలములో ప్రజాపతి ఇచ్ఛానుసారము సమస్త జీవుల ధారణము చేయబడెను. పంచ మహాభూత గుణములతో యుక్తమైన పర్వతములు సృష్టించబడెను. మరియు వనస్పతులు, వృక్షములు, సమస్త వానస్పత్యములు

వీరుధ, ఔషధ, గుల్మ, వివిధ తృణములు, సస్యములు మనుషుల ఉత్పత్తి జరిగినది. ఈ వర్గములన్ని భూమి యొక్క సారముగా చెప్పబడినవి.

సోమస్య వాయుతేజోపాం బుద్ధిశ్చేతి ప్రజాపతేః ॥ 7 ॥
తదాహారగుణోత్పన్నం గవాదీనామతః పరమ్ ।

పై చెప్పిన గుణములు గల ఆహారమునుండి ఉత్పత్తి అయినందున గోవు మొదలగు వాటి క్షీరము సోమ వాయు తేజ జలప్రజాపతికలను బుద్ధి రూపముగా చూడబడును.

యథా సర్వౌషధీసారం క్షీరోదే మథితే పురా ॥ 8 ॥
సంభూతమమృతం దివ్యమమరా యేన దేవతాః ।
తథా సర్వౌషధీసారం గవాదీనాం తు కుక్షిషు ॥ 9 ॥
క్షీరముత్పద్యతే తస్మాత్ కారణాదమృతోపమమ్ ।

ప్రాచీన కాలవములో క్షీరసాగరమును మథించినపుడు సంపూర్ణ ఔషధముల సారము దివ్యామృతము అయినట్లు సంపూర్ణ ఔషధముల సారము గోవు మొ॥ వాటి కుక్షిలో చేరి క్షీరముగా ఏర్పడును. కావున ఇది అమృత తుల్యము.

జరాయుజానాం భూతానాం విశేషేణ తు జీవనమ్ ॥ 10 ॥

పశు మనుష్యాది జరాయుజ ప్రాణులకు క్షీరము విశేషించి జీవనము నిచ్చునది.

క్షీరం సాత్మ్యం హి బాలానాం క్షీరం జీవనముచ్యతే ।
క్షీరం పుష్టికరం వృద్ధికరం బలవివర్ధనమ్ ॥ 11 ॥
క్షీరమోజస్కరం పుంసాం క్షీరం ప్రాణగుణావహమ్ ।
గర్భాధానకరం క్షీరం వంధ్యానామపి యోషితామ్ ॥ 12 ॥

బాలురకు క్షీరము సాత్మ్యము మరియు జీవనము. ఇది పుష్టి, శరీరవృద్ధి మరియు బలమును వృద్ధి పొందించునది. పాలు ప్రాణులలో ఓజస్సును వృద్ధి పొందించును. కావున ప్రాణులను బలముగా చేయును. వంధ్యాస్త్రీలకు గర్భ స్థాపనము చేయును.

క్షీణానాం చ కృశానాం చ శోషిణాం రాజయక్ష్మిణామ్ ।
వ్యాయామశ్రమనిత్యానాం స్త్రీనిత్యానాం చ దేహినామ్ ॥ 13 ॥

సంక్షీణరేతసాం చాపి గర్భస్రావే చ దారుణే ।
రక్తపిత్తామయోऽర్శస్సు మదక్షీణే జ్వరే తథా ॥ **14** ॥
గర్భశోషే చ వాతానాం క్షీరం పరముచ్యతే ।

ఇది క్షీణులకు, కృశులకు, శోథ రాజ యక్ష్మరోగులకు నిత్యవ్యాయాములకు, శ్రమకరమైన పనులు చేయువారికి, నిత్య సంభోగులకు, వీర్యము క్షీణించినవారికి హితకరము. ఇవిగాక దారుణ గర్భస్రావము, రక్త పిత్తము అర్శస్సు, మద కారణమున క్షీణించిన వారికి జ్వర వాతములచే కల్గిన గర్భశోషలో పాలు మిక్కిలి హితకరము.

సామాన్యాదిహ దుగ్ధానాం పురా చోక్తా గుణాదయః ॥ **15** ॥
పృథక్త్వేన చ వక్ష్యామి గవాదీనాం విశేషణమ్ ।

ఇవి అన్ని పాలయొక్క సామాన్య గుణములు చెప్పబడినవి. ఇప్పుడు నేను గోవు మొ॥ వాటి క్షీరమును వేర్వేరుగా వర్ణించెదను.

తృణగుల్మౌషధీనాం చ అగ్రాగ్రం పయ ఏవ హి ॥
ఖాదన్తి మధురప్రాయం లవణం చ విశేషతః ।
తత్సారగుణవైశేష్యాద్గవాం క్షీరం ప్రశస్యతే ॥ **16** ॥

**గోదుగ్ధగుణములు :** తృష్ణ, గుల్మ ఓషధుల ప్రధాన సారభాగము గోవులు మధుర లవణ ద్రవ్యములను భుజించును. కావున వీటి అన్నిటి సారమగుటచే గోక్షీరము ప్రశస్తమని చెప్పబడినది.

మధురో హి రసః శ్రేష్ఠో రసానాం పరికీర్తితః ।
తన్నిత్యం వా గవాం క్షీరం మధురం బృంహణం మతమ్ ॥ **17** ॥

సర్వరసములలో మధుర రసము శ్రేష్ఠమని చెప్పబడినది. దాని నిత్యసేవనచే గోక్షీరము మధురము, మరియు బృంహణము.

ఔషధాగ్రాతిభక్షత్వాద్విరేచయతి తత్ పయః ।
ఏతస్మాత్ కారణాదుక్తం గవాం క్షీరం రసాయనమ్ ॥ **18** ॥

ఓషధుల ప్రధానాంశము అధికముగా భుజించుటచే గోదుగ్ధము విరేచనము చేయును. కావున గోదుగ్ధము రసాయనము ఇవన్ని గోదుగ్ధ విశేష గుణములు.

ఏష వైశేషికగుణో గోక్షీరస్య ప్రకీర్తితః ।
క్రిమికీటపతఙ్గైశ్చ సర్పైరపి తృణాశ్రితైః ॥
సహ నానాతృణం హీనం మహిష్యో భక్షయన్తి హి ।
అవగాహన్తి తోయాని గర్భాణి చ విశేషతః ॥ 19 ॥

ఏతస్మాత్ కారణత్తాసాం క్షీరం కషాయశీతలమ్ ।
శీతత్వాద్ దుర్జరం స్నిగ్ధం (గురు) దాహనిబర్హణమ్ ॥ 20 ॥
గవాం క్షీరాచ్చాల్ప (గు)ణం మహిషీణాం పయో మతమ్ ।

మహిష దుగ్ధ గుణములు : తృణ సస్యాదులలో నుండు క్రిమి కీటక పతంగ సర్పాదులతో పాటు హీనమైన గడ్డిని భుజించును. నీటిలో అవగాహనము చేస్తూ ఉండును. కావున దీని క్షీరము కషాయము శీతలముగా నుండును. శీతలమగుటచే దుర్జరము, స్నిగ్ధము, గురు, దాహమును శాంతింపచేయును. కావున మహిష క్షీరము గోక్షీరము కంటె అల్ప గుణము గలవి.

అజానామల్పకాయత్వాత్ కటుతిక్తానిబర్హణాత్ ॥ 21 ॥
అల్పత్వాచ్చ బలిత్వాచ్చ లఘు దోషహరం పయః ।
అల్పత్వాత్తద్ఘనం క్షీరం ఘనత్వాదపి బృంహణమ్ ॥ 22 ॥
శీతం సంగ్రాహి మధురం బల్యం వాతానులోమనమ్ ।

అజాదుగ్ధ గుణములు : దీని కాయము సూక్ష్మమగుటచే కటు తిక్త ద్రవ్యములను సేవించుటచే క్షీరము అల్పము బలకరము లఘు, దోషనాశకముగానుండును. క్షీర మల్పమగుటచే ఘనముగా నుండును. ఘనమగుటచే బృంహణ కారకము. శీతలము, సంగ్రాహి, మధురము, బల కరము, వాతానులోమనము చేయును.

మహాశయతయా శ్యామ(న)మధురప్రాయసేవనాత్ ॥
బహుత్వాచ్చ ఘనత్వాచ్చ బల్యం పుష్టికరం పయః ।
గురు వృష్యం చ నిర్దిష్టం మధురం చ విశేషతః ॥
అల్పాహారతయాస్త్రీణాం ప్రియం చాఽఽలవణం . . . . ॥ 24 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 259 తమం పత్రమ్ ।)

ఉష్ట్ర దుగ్ధ గుణములు : ఒంటె శరీరము పెద్దదిగాను శ్యామ వర్ణముగా నుండుటచే

మధుర ఔషధములను ప్రాయకముగా సేవించుట వలన క్షీర పరిమాణము అధిక మగుట వలన ఒంటె పాలు పుష్టి కారకము, గురు, వృష్యము విశేషించి మధుర రసము. ఒంటె ఆహారము తగ్గించినచో పాలు ప్రియము మరియు లవణముగా నుండును.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . । 

. . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . . ।

# పానీయగుణ విశేషీయాధ్యాయః-త్రయోవింశతిః

ఈ అధ్యాయము ప్రారంభములో ఖండితమైయున్నది.

అతీతే ప్రథమే మాసి ప్రావృట్ప్రోష్ఠపదాగమే ॥
దివ్యం ఖాత్ పతితం తోయం నామ్నా హంసోదకం శివమ్ ।
ఆపూతం సూర్యతేజోభిరగస్త్యేనాఽవిషీకృతమ్ ॥

ప్రావృట్ మరియు ప్రోష్టపదమునకు వ్యతీతమగుటచే ప్రథమ మాసము (శరత్ ఋతువు) నందు ఆకాశమునుండి కురిసే దివ్య జలము హంసోదక మనబడును. ఇది కళ్యాణ కారకము పవిత్రము సూర్య తేజము మరియు అగస్త్య నక్షత్రం ఉదయించుటచే విషరహితముగా నుండును.

. . . . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . . . . . . . . . . . .తి ॥
స్నిగ్ధం వృష్యం చ బల్యం చ హేమన్తే గురు వర్షతి ।
శిశిరే వర్షతి జలం కఫవాతప్రకోపనమ్ ॥ 2 ॥
వసన్తే వర్షతి జలం కషాయస్వాదురూక్షణమ్ ।
తత్ర . . . . . . . . . . . . . . . . . ॥

------హేమంత ఋతువులో వర్షము పడునప్పుడు జలము స్నిగ్ధ వృష్యము బలము గురువుగా నుండును. శిశిర ఋతువులో వర్షించు జలము కఫ వాతములను ప్రకోపింపచేయును. వసంతములో వర్షించు జలము కషాయము, స్వాదు, మరియు రూక్షముగా నుండును. వివిధ ఋతువులలో వర్షించు జల గుణములు వేర్వేరుగా నుండును.

. . . . . . . . . . . . . . . . (పతి) తం క్షితౌ ।
తత్ పాత్రోపేక్షితవతి పాత్రదోషేణ తత్త్వతః ॥ 3 ॥
నానారసత్వం భజతే తోయం సంప్రాప్య భూతలమ్ ।

అంతరిక్షములో నుండి పడుజలము భూమిని చేరి స్థానమును వెదుకుకొనును. స్థానము యొక్క దోషానుసారము భూమిని చేరి అనేక రసములుగలదిగా మారును.

సర్వామ్బు సద్యఃపతితమప్రశస్తమనార్తవమ్ ॥
త . . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . . . . . . . . . రూదకమ్ ॥ 4 ॥

సంపూర్ణ జలము అప్పుడే వర్షించినది ఋతువిపరీతమైనది. అప్రశస్తముగా చెప్పబడినది---- వర్షఋతు అతిరిక్త ఋతువుల జలమును ప్రయోగించకూడదు.

కఫానిలకరం పిత్తే హితం శీతాతికారకమ్ ।
రక్తపిత్తహరం రూక్షమవశ్యాయోదకం లఘు ॥
ఏతచ్చతుర్విధం ప్రోక్తం తత్త్వేనామ్బోఽన్తరిక్షజమ్ ।
సహ్యా . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . . . . . . . . శ్లేష్మప్రకోపనాః ॥ 5 ॥

**అవశ్యాయ జలము :** కఫ వాతములను వృద్ధి పొందించునది, రక్త పిత్తమును నష్టమొందించునది రూక్షము లఘువుగా నుండును. అంతరిక్షమును నష్టమొందించునది రూక్షము లఘువుగా నుండును.

క్షారోదాః ప్రాకసృతా నద్యః కఫఘ్నాః పిత్తకోపనాః ॥
లఘూదకాః ప్రతీచీగా వాతలాః కఫనాశనాః ।
క్షారం తాభ్యస్తు సాముద్రం మధురం గురు పచ్యతే ॥ 6 ॥
. . . . . . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . . . . . . . . లవణం జలమ్ ॥

తూర్పు వైపు ప్రవహించు నదుల జలము క్షార యుక్తముగా నుండును.

కఫనాశకము. పిత్త ప్రకోపమును చేయును. పడమర వైపు ప్రవహించు జలము క్షార యుక్త మధుర గురు---- మరియు లవణయుక్తముగా నుండును.

**సాభిష్యన్ది స్వాదుపాకి శీతం పిత్తఘ్నమౌద్భిదమ్ ।**
**సత్త్వక్లేదమలాద్ దుష్టం పల్వలామ్బు గురు స్మృతమ్ ॥**
**కషాయమధురం స్వాదు విమలం సారసం జలమ్ ।**
**కౌపం పి . . . . . . . . . . . . . . . . . . . ॥**
**. . . . . . . . . . . . . . . . . . . . . . . . . ।**
**ఇత్యష్టధా జలం ప్రోక్తం భూమిజం వృద్ధజీవక ! ॥ 7 ॥**

**ఔద్భిద జలగుణములు :** అభిష్యంది, మధుర విపాకము, శీతలము పిత్తనాశకము. పల్లవ జలము సత్త్వక్లేద మల కారణముచే దూషితమై గురువుగా యుండును. సరోవరజలము కషాయము మధుర, స్వాదు నిర్మలముగా నుండును. కూపజలము---- ఓ వృద్ధ జీవకా ఈ విధముగా 8 విధములైన భౌమ జలము చెప్పబడినది.

**లఘు ప్రకామం సస్నేహం శీతం సర్వరసాన్వితమ్ ।**
**తృష్ణాపహం మనోహ్లాది శ్లేష్మఘ్నం క్రిమినాశనమ్ ॥ 8 ॥**
**రక్షోఘ్నం జీవనం వృష్యం మూర్ఛఘ్నం . . . . . . !**
**. . . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥**

**సేవనీయ జలము :** ఏదైతే లఘు, ఈషత్ స్నేహయుక్తము శీతలము మరియు సర్వరస యుక్తముగా నుండునో, తృష్ణను శాంతింప చేయునది, మనసును ఆహ్లాదితమును చేయునది శ్లేష్మ, కృమి, జంతు నాశకమైనది, జీవనము నిచ్చునది వృష్యమైనది మూర్ఛను నశింపచేయు జలము సేవనయోగ్యము.

**. . . . . . . . . . . . . సూక్ష్మప్రాణిసమాకులమ్ ।**
**బహలం కలుషం చైవ తథా పిచ్ఛిలమావిలమ్ ।**
**గ్రామక్షేత్రరసైర్దుష్టం విషమూలోపదూషితమ్ ॥ 9 ॥**
**శకుంతక్రిమిశైవాలయుక్తమత్యుష్ణచిక్కణమ్ ।**

**త్యాజ్యజలము :** సూక్ష్మ జీవులున్నజలము, బహళము కలుషితమైనది పిచ్ఛిలము, మలయుక్తము అయిన జలము, గ్రామ జలము, పంటపొలముల జలము, అనేక

రసములతో దూషితమైన జలము, విషయుక్త కందమూలములతో విషమైనది పక్షి కృమి శైవాలములు పడినది వేడి, స్నిగ్ధమైన జలమును త్యజించవలెను.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . ॥
. . . . . . . . . . గుర్విణీషు చ వర్జయేత్ ।
ధాత్రీణాం చ విశేషేణ స్వస్థానాం రోగిణామపి ॥
పూర్వోక్తగుణబాహుల్యాత్ పానీయం సేవ్యమిష్యతే ।
విపాకే మధురం శైత్యాద్వారి పిత్తఘ్నముచ్యతే ॥ 10 ॥

**శీతల జలనిషేధము :** గర్భిణీ స్త్రీలకు శీతల జలము నివ్వకూడదు. స్వస్థ లేదా రుగ్న ధాత్రికి శీతల జలము ఇవ్వవలెను. శీతలమగుట వలన జలవిపాకము మధురమగును. కావున పిత్తనాశకము.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . . . . . . ణశీతముష్ణమథాపి వా ।
భక్తస్య పూర్వం పీతం వా కృశత్వం కురుతే శిశోః ॥
భక్తస్య మధ్యే పీతం తన్మధ్యమత్వం నియచ్ఛతి ।
భక్తస్యోపరి పీతం తు పీనత్వం (సంప్రయచ్ఛతి) ॥ 11 ॥

భోజనమునకు పూర్వము శిశువు ఉష్ణలేదా శీతల జలము సేవించిన కృశుడగును. భోజన మధ్యములో జలము సేవించిన మధ్య అవస్థగానుండును. భోజనానంతరము జలము సేవించిన శిశువు స్థూలుడగును.

. . . . . . . . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . నిష్క్వథోష్ణామ్బు పాచనమ్ ॥
శ్రమే ఖేదేషు తృష్ణాసు మూర్ఛాస్వతిపిపాసితే ।
నిష్క్వథలాఘవాదమ్బు సర్పిం తప్తశీతలమ్ ॥ 12 ॥
నిర్దిశేత్ సర్వదోషఘ్నం బాలానాం . . . . . . . ।

**ఉష్ణజలగుణము :** క్వాథము వేడిచేసి చల్లార్చిన నీరు పాచకముగా నుండును. క్వాథముచేయుటచే లఘువైన ఈజలము శ్రమ, ఖేద, తృష్ణ, మూర్ఛ, అతిపిపాసలో ఉపయోగము. వేడిచేసి చల్లార్చిన నీరు బాలురలో అన్నిరోగములను దోషములను నశింపచేయును.

. . . . . . . . . . . . . . . . . . . ॥
. . . . . . . . . . ముష్ణోదకం శిశోః ।
రక్తపిత్తామయం త్యక్త్వా ప్రాయో వాతకఫాత్మకే ॥
రోగే శిశుర్వా ధాత్రీ వా గుర్విణీ వోష్ణకం పిబేత్ ।
క్వచిద్రోగవిశేషేణ తప్తశీతం హితం బహు ॥ **13** ॥

(ఇతి తాడపత్రపుస్తకే **261** తమం పత్రమ్ ।)

రక్త పిత్తములో తప్ప మిగతా అన్ని వాత కఫ రోగములలో శిశువుకు ఉష్ణజలము నివ్వవలెను. కొన్ని వ్యాధులలో వేడి చేసి చల్లార్చిన నీరు అధికహితముగా చెప్పబడినది.

అథాన్తరిక్షం శరది ప్రశస్తం సంతప్యమానం చ రవేర్మయూఖైః ।
పిబేత్సరో వాఽథ నదీం తడాగం హేమన్తకాలే శిశిరే చ బాలః ॥
వాప్యుద్భిదం ప్రాస్రవణం హి తోయం గ్రీష్మే ప్రశస్తం కుసుమాగమే చ ।
వర్షాసు కౌపం సలిలం ప్రశస్తమారోగ్యహేతోరథ తప్తశీతలమ్ ॥ **14** ॥

శరత ఋతువులో సూర్యకిరణములతో సంతప్తమైన అంతరిక్షజలము బాలురకు ప్రశస్తమైనదిగా చెప్పబడినది. హేమంత శిశిర ఋతువులలో సరోవరము నది తటాకజలము త్రాగవలెను. గ్రీష్మ వసంత ఋతువులో బావి, ఔద్భిద లేదా సెలయేరు జలమును ప్రయోగించవలెను. వర్షఋతువులో వేడి చేసి చల్లార్చిన నీరు ఆరోగ్యమునకు హితకరము.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

(ఇతి) ఖిలేషు పానీయగుణవిశేషీయాధ్యాయః ॥ (23)

ఖిలస్థానమందలి పానీయగుణ విశేషీయాధ్యాయము సమాప్తము.

# మాంసగుణ విశేషీయాధ్యాయః - చతుర్వింశః

**అథాతో మాంసగుణవిశేషీయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥**

**ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥**

ఇప్పుడు మనము మాంసగుణ విశేషీయమను అధ్యాయమును వ్యాఖ్యానించెదము అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**మాంసం వృష్యం చ బల్యం చ మాంసం ప్రాణావివర్ధనమ్ ।**
**మాంసం పుష్టికరం వద్ధకృశానాం మాంసవర్ధనమ్ ॥ 3 ॥**

**మాంస సామాన్యగుణములు :** వృష్యము, బల్యము, ప్రాణులకు శక్తి వృద్ధి నొందించునది, పుష్టికారకము, వృద్ధ మరియు కృశులకు మాంసమును వృద్ధి పొందించును.

**క్షయిణాం క్షీణదేహానాం మాంసమేవ పరాయణమ్ ।**
**న మాంసతుల్యమన్యత్స్వారోగ్యవీర్యవివర్ధనమ్ ॥ 4 ॥**

క్షయరోగులకు క్షీణ దేహము కలవారికి మాంసము శ్రేష్ఠ ద్రవ్యము. వారి ఆరోగ్యము మరియు వీర్య వృద్ధి కొరకు మాంస సమానమైనది మరేది లేదు.

**నరాణాం క్షీణశుక్రాణాం మాంసం రేతోభివర్ధనమ్ ।**
**వన్ధ్యానామపి నారీణాం కుమారాణాం తథైవ చ ॥ 5 ॥**

శుక్రము క్షీణించిన వారికి మాంసముతో వీర్య వృద్ధి కల్గును. వంధ్యస్త్రీలలో, బాలురకు కూడ శుక్ర ధాతువును వృద్ధి పొందించును.

**గర్భాధానకరం మాంసమంతే పుష్టికరం తథా ।**
**గర్భిణీనాం చ నారీణాం వాతప్రశమనం పరమ్ ॥ 6 ॥**

మాంసము గర్భాధానము చేయును. గర్భమును పుష్టి చేయును. గర్భిణీ స్త్రీలు మాంసము సేవించుటచే వాతము శాంతించును.

**స్త్రీణాం ప్రసవకాలే తు మాంస. . . .మేవ చ ।**
**గర్భకాలే చ బాలానాం సరసం పరమౌషధమ్ ॥ 7 ॥**

ప్రసవసమయములో స్త్రీలకు మాంసరసము శ్రేష్ఠముగా చెప్పబడినది. గర్భసమయములో బాలురకు మాంసరసము శ్రేష్ఠ ఔషధముగా చెప్పబడినది.

**స్త్రీప్రియాణాం తథా పుంసాం నిత్యవ్యాయామసేవినామ్ ।**
**క్షీణానాం యక్ష్మిణాం చైవ జ్వరక్షీణాశ్చ యే నరాః ॥ 8 ॥**
**వాతాహతాస్తు యే సత్త్వాస్తేషాం మాంసరసో హితః ।**

స్త్రీలంటే ప్రేమగలవారు, నిత్యవ్యాయాములకు, క్షీణ క్షయరోగులకు, జ్వరముచే క్షీణించిన వారికి వాతరోగపీడితులకు మాంసరసము హితకరము.

**సుసంస్కృతో మాంసరసో బిడజీరకహిఙ్గుభిః ॥ 9 ॥**
**స్నేహే సిద్ధశ్చ పయసా విశేషాద్వాతికే స్మృతః ।**

బిడాలవణము, జీరక, హింగుతో బాగా సంస్కరించబడిన పాలు కలిపి స్నేహముతో సిద్ధము చేయబడిన మాంసరసము విశేషించి వాత రోగులకు హితకరము.

**వాతపిత్తోత్తరే పుంభిః శర్కరామధురీకృతః ॥ 10 ॥**
**స్నిగ్ధో మాంసరసః పేయస్తథా రక్తామయార్దితైః ।**

వాత పిత్త ప్రకోపము రక్త రోగములతో పీడిత వ్యక్తులకు శర్కరతో మధురము చేయబడిన స్నిగ్ధమాంసరసము త్రాగించవలెను.

**క్షీణ(ర)సిద్ధో మాంసరసో మధురో లవణోఽపి వా ॥ 11 ॥**
**బాలానాం క్షీణదేహానాం గర్భకాలే చ శస్యతే ।**

పాలతో సిద్ధము చేయబడిన మధుర లేదా లవణ మాంసరసము క్షీణ దేహముగల బాలురకు మరియు గర్భ సమయములో ప్రశస్తము.

**హితం చ బా(బ)లకామానాం మాంసస్వరససాధితః (మ్) ॥ 12 ॥**

బలమును కాంక్షించు వ్యక్తులకు మాంసరసముతో సిద్ధము చేయబడిన ద్రవ్యములు హితకరము.

**సుసిద్ధం లవణే సిద్ధం మాంసం కటుకరోచనమ్ ।**
**కాయాగ్నిదీపనం చైవ రసా . . . . పో హితః ॥ 13 ॥**

బాగా లవణముతో, మరిచాది కటు ద్రవ్యములతో రుచికరముగా చేయబడిన మాంసము కాయాగ్నిని ప్రదీప్తము చేయును.

**వేసవారః సమధురో లావణో వాఽపి రోచనః ।**
**పిష్టచూర్ణితపక్వం వా ప్రకు. . . . .వాపివాన్న(?)తత్ ॥ 14 ॥**

రుచికారక మధుర లేదా లవణ వేసవారములు లేదా పిష్ఠ చూర్ణితముతో పక్వమైన మాంసము హితకరము. మాంసము అస్థి రహితముగా చేసి ఉడికించి రాయిపై మర్దించ వలెను. ( దానిలో పిప్పలి, మరిచము, శుంఠి, గుఢము, ఘృతము కలిపి పక్వము చేసినచో దానిని వేసవారమందురు. )

**శూల్యమఙ్గారతప్తం చ మాంసం శ్లేష్మామయే హితమ్ ।**
**సామ్లః(మ్లం) సలవణశ్చై(ణం చై)వ**
**హితస్త(తం త)స్మాత్తు జీవక ! ॥ 15 ॥**

లోహ శలాకలపై లేపనము చేసి నిప్పులపై పక్వము చేసిన మాంసము శ్లేష్మ రోగములలో హితకరము. కావున ఓ జీవకా ! అమ్ల, లవణ యుక్తములు చేసి దీనిని ప్రయోగించుట ప్రశస్తమని చెప్పబడినది.

**పిష్టం వా ఖణ్డశో వాఽపి మాంసం పుటకసాధితమ్ ।**
**సహిఙ్గుసైన్ధవబిడైర్మరిచామ్లసజీరకైః ॥ 16 ॥**

**సాఙ్కురైర్ధాన్యకైశ్చైవ శృఙ్గబేరార్ద్రకైరపి ।**
**పలాశే భూస్తృణోపేతం మాంసం సిద్ధం ప్రయోజయేత్ ॥ 17 ॥**

మాంసమును మర్దించి లేదా ముక్కలు ముక్కలుగా చేసి హింగు సైంధవము, విడాలవణము, మరిచము, దాడిమ గింజలు, జీరక, అంకుర యుక్త

గోధుమలు, శెనగలు లేదా ధాన్యము, శుంఠి, అల్లము భూస్తృణాదుల ద్వారా పాత్రలో సిద్ధము చేసి ప్రయోగించవలెను.

**అథ మాంసరసం(సః) సర్పిః**
**సిద్ధం (ద్ధః) సక్షీరమి(రఇ)ష్యతే ।**
**రసపాకవిశేషేణ తద్బల్యం (స బల్యః)**
**తద్ర(సర) సాయనమ్ (నః) ॥ 18 ॥**

ఘృతముతో సిద్ధము చేయబడిన మాంసరసములో పాలను కలిపి ప్రయోగించవలెను. ఈ విధముగా మాంసరసము పాక విశేష కారణమున బల్యము రసాయనముగా చెప్పబడినది.

**అతః పరం తు మాసాంనాం రసపాకవిశేషణమ్ ।**
**వక్ష్యే గుణవిశేషం చ వృద్ధజీవక ! తచ్ఛృణు ॥ 19 ॥**

ఓ వృద్ధ జీవకా! ఇప్పుడు నేను మాంసము యొక్క రసము పాక విశేషము, దాని విశేషగుణములను చెప్పెదను వినుము.

**కఫపిత్తకరం మాంసం గవాం వాతే హితం గురు ।**
**విదాహి బృంహణం చైవ, ఖడ్గమాంసం చ తత్సమమ్ ॥ 20 ॥**

గోమాంసము కఫపిత్తకారకము. వాత రోగములలో హితకరము. గురు, విదాహి, బృంహణము. ఖడ్గ (నీటిగుఱ్ఱం) మాంసము కూడి దీనితో సమాన గుణములు కల్గియుండును.

**న్యఙ్కూనాం విహితం వాతే కఫపిత్తహరం లఘు ।**
**సక్షారం దాంతినం మాంసం బృంహణం కటుతిక్తకమ్ ॥ 21 ॥**
**వీర్యేణోష్ణం చ తద్విద్యాత్ కఫపిత్తం కరోతి చ ।**

**శంబర మృగమాంసము :** వాతరోగములలో హితకరము, కఫ పిత్తహరము, లఘువు, ఏనుగు మాంసము క్షారయుక్తము, బృంహణము, కటు మరియు తిక్తముగా నుండును. ఉష్ణవీర్యము. కఫ పిత్తములను వృద్ధి పొందించును.

**గోకర్ణమాంసం తత్తుల్యం గవయస్య రురోరపి ॥ 22 ॥**

గోకర్ణము ( మృగభేదము) గవీయ ( నీలగ్రోవు) రురు ( మృగభేదము) మాంసము కూడ ఏనుగు మాంస గుణములనే కలిగియుండును.

**రసే పాకే చ మధురం వాతపిత్తహరం గురు ।**
**ఉష్ణం చైవ చ్ఛాగమాంసమావికం చాపి తద్గుణమ్ ॥ 23 ॥**

అజామాంసము : మేకమాంసము విపాకములో మధురము, వాత పిత్త నాశకము, గురు, ఉష్ణగుణములు కల్గి ఉండును. గొఱ్ఱె మాంసము మేకకు సమాన గుణములు కల్గి ఉండును.

**వృష్యం తు మాంసం వారాహం మధురం గురు పచ్యతే ।**
**తద్గుణం మాహిషం విద్ధి, శౌకరం స్యాత్తతో గురు ॥ 24 ॥**

సూకర మాంసము : వృష్యము, మధురము గురుపాకము మాహిష మాంసము సూకర మాంసమునకు సమానగుణము కలిగి యుండును. సూకర మాంసము దీనికంటె కూడ గురువుగానుండును.

**గర్దభస్య తథాఽశ్వస్య మాంసం యత్ పృషతస్య చ ।**
**కఫఘ్నం వాతలం రూక్షం కటుతిక్తాహ్వయం లఘు ॥ 25 ॥**

గాడిద, గుఱ్ఱము పృషతమను హరిణ మాంసము కఫ నాశకము, వాతకారకము, రూక్షము, కటు తిక్త లఘువుగా నుండును.

**శ్వదంష్ట్రో వృషదంష్ట్రశ్చ ఋష్యః శరభ ఏవ చ ।**
**వాతఘ్నా ఉష్ణవీర్యాశ్చ రసతః కటుకాన్వయాః ॥ 26 ॥**
**గోలాఙ్గూలా వానరాశ్చ తత్తుల్యా మధురోత్తరాః ।**

శ్వదంష్ట్ర, వృష దంష్ట్ర, ఋష్య, శరభ (కాశ్మీరిహరిణ) వీటి మాంసము వాతనాశకము, ఉష్ణ వీర్యము, రసములో కటుగానుండును. గోలాంగూల (కోతి జాతి) మరియు వానరమాంసము వీటి మాంసము వలెనే ఉండును. కాని వీటిలో మధురరసము అధికముగా నుండును.

**వృకర్క్షకోకజమ్బూకాః సింహో వ్యాఘ్రతరక్షవః ॥ 27 ॥**

**(ఇతి తాడపత్రపుస్తకే 262 తమం పత్రమ్)**

స్వాద్యమాంసాస్త్విమే వృష్యా ఉష్ణాః పిత్తవివర్ధనాః ।
కషాయతిక్తా రసతో వాతఘ్నాః కటుపాకినః ॥ **28** ॥

వృకము, ఋక్షము, కోక, జంబూక, సింహ వ్యాఘ్ర, తరక్షు, (వ్యాఘ్రభేదము) లమాంసము స్వాదు, వృష్య, ఉష్ణ, పిత్త వర్ధకములుగా నుండును. ఇవి వాత నాశకము కటు విపాకము.

నకులో మూషికః శ్వావిద్బభ్రుః శల్యక ఏవ చ ।
కషాయమధురాః శీతా వృష్యా గోధాశ్చ తద్గణాః ॥ **29** ॥

ముంగిస, మూషిక, శ్వావిత్, బభ్రు (నకుల భేదము) శల్యక- వీటి మాంసము కషాయ, మధుర శీతవృష్యము గోధా మాంసము కూడ వీటికి సమానగుణములు కల్గి యుండును.

యే స్యుః శశకురఙ్గాద్యాః సృమరశ్చమరాశ్చ యే ।
లఘవో . . . . ష్ణాః పిత్తలా నాతిబృంహణాః ॥ **30** ॥

శశ, (కుందేలు) కురంగ (హరిణ) సృమర (శృంగత్యాగి మృగము) చమర వీటి మాంసములు లఘు....... ఉష్ణ పిత్తకారకములు కొంచెము బృంహణము.

బార్హిణం మధురోష్ణం తు విషఘ్నం గురు బృంహణమ్ ।
తుల్యం కౌక్కుటజం వన్యం, తత్తుల్యం గ్రామ్యకౌక్కుటమ్ ॥ **31** ॥

నెమలి మాంసము - మధుర, ఉష్ణ, విషనాశకము, గురు బృంహణము, అడవికోడి, ఊరికోడి మాంసము కూడ దీనికి సమాన గుణములు కల్గియుండును.

విష్కిరాః క్రౌఞ్చవర్తికా మయూరేణ సమాః స్మృతాః ।
తస్మాల్లఘుస్తు వర్తీరో వర్తికా లఘవో లఘుః ॥ **32** ॥

విష్కిర, క్రౌంచ, వర్తిక మాంసగుణములు నెమలికి సమానముగా నుండును. వర్తీర (కపింజలమువంటి పక్షి) దానికంటె లఘువుగా నుండును. వర్తికము దానికంటె కూడ లఘువుగానుండును.

తిత్తిరిస్తు కటుః పాకే సోష్ణస్తు కఫవాతజిత్ ।
కపిఞ్జలశ్చకోరశ్చ ఉపచక్రశ్చ తత్సమాః ॥ **33** ॥

తిత్తిరి మాంసము - కటువిపాకము, ఉష్ణము, కఫవాతములను శాంతింప చేయునది. కపింజలము, చకోరము ఉపచక్రము (హంసబేదము)ల మాంసరసము తిత్తిరిమాంస గుణములనే కల్గి యుండును.

లోహపృష్ఠో రక్తపృష్ఠో రక్తాక్షో జీవజీవకః ।
తథాఽన్యే హిమవజ్జాతా మధురా వృష్యబృంహణాః ॥ 34 ॥
గురవః శీతలాః పాకే కషాయా రసతస్తథా ।

లోహ పృష్ఠి (కంక పక్షి) రక్తి పృష్ఠ రక్తాక్ష (పావురము) జీవ జీవకము (ప్లవ జాతిచకోర భేదము) అన్య హిమాలయ ఉత్పన్నమగు ప్రాణులమాంసము - మధురము, వృష్య, బృంహణ గురు, శీతపాకము కషాయ రసము కల్గి యుండును.

ఖఞ్జరీటో వపుక్కారః క్రకరో దీర్ఘపుంసకః ॥ 35 ॥
కోయష్టికః కపోతశ్చ రక్తపాదో వసంతకః ।
భృఙ్గరాజోఽథ హారీతః కోకిలః శుకసారికాః ॥ 36 ॥
ఏతే చాన్యే చ ప్రచ్ఛదా (?) శీతమారుతకోపకాః ।
కషాయమధురాః స్వాదే కఫఘ్నాః కటుపాకినః ॥ 37 ॥

ఖంజరీట, వపుక్కార, క్రకరము, దీర్ఘపుంసకములు కోయష్టిక (క్రౌంచము) పావురము, చిలుక (వసంతక భృంగరాజము (పక్షిభేదము) హారీత (హరితాల పక్షి) కోకిల చిలుక గోరింక ఇంకా అన్య ప్రచ్ఛద పక్షుల మాంసము శీత మరియు వాతమును ప్రకోపింపచేయును. ఇవి కషాయ మధుర రసములు కఫహరము కటు విపాకము.

గృధ్రః కాకః శ్యేనచాషౌ భాసోలూకకులిఙ్గకాః ।
శశన్తా మూషికాః కోడస్తథాఽన్యే మాంసభోజనాః ॥
ప్రసహాస్తే తు మధురా వాతఘ్నాః కటుపాకినః ।
బృంహణాశ్చోష్ణవీర్యాశ్చ సతతం శోషిణాం హితాః ॥ 39 ॥

గృధ్ర, కాకి, శ్యేన, చాష, భాస (గృధ్రభేదము) గుడ్లగూబ, కులింగక (పిచ్చుక) శశాంత, మూషిక, కోడ అన్య ప్రసహవర్గముల మాంస భోజనము

చేయునవి మధురము వాతనాశకము కటువిపాకము, బృంహణము ఉష్ణవీర్యము కలవి. శోషరోగులు నిరంతరము సేవించుట హితము.

ప్లవా బకా బలాకాశ్చ తీదార్యః కురరాస్తథా ।
. . . . . రక్తాక్షా మల్లికాక్షాః సవారటాః ॥ 40 ॥
నందీముఖా మేఘరావాః శరాఖ్యా జలకుక్కుటాః ।
సముద్రకాకాః కుహరా గోటుభా గణ్డమాలకాః ॥ 41 ॥
కారణ్డవాః సజీమూతాస్తథాఽన్యే జలచారిణః ।
పాకే చ మధురా వృష్యా గురవశ్చ . . . . ॥ 42 ॥
. . . . . . . . . . . . . . . . . . . . ।
. . . . . . . . . . . . . . . . . . . . . ॥ 43 ॥

ప్లవ ( నీటిలో ఈదు పక్షులు), కొంగ, బలాకా ( కొంగభేదము, తీదార్య, కురర, ..... రక్తాక్ష, మల్లికాక ( హంస భేదము) వారట ( హంసి), నందీముఖ, మేఘనాథ ( లేదా చాతకపక్షి) శర, నీటికోడి, సముద్రకాకి, కుహర, గోటుభ గండమాలక, కారండవ ( తెల్లహంస భేదము) జీమూత మరియు అన్య జలచర పక్షులమాంసము మధుర విపాకము, వృష్యము గురువుగానుండును.

హంసస్తు గురురత్యర్థం వృష్యోఽథ కఫపిత్తలః ।
శరారిః పాకహంసశ్చ చక్రవాకస్తథైవ చ ॥ 44 ॥

హంస మాంసము అత్యంత గురువు వృష్యము, కఫము మరియు పిత్త వర్ధకము, శరారి, పాక హంస, చక్రవాక, జాలపాద మరియు అన్య పక్షులమాంస గుణములు హంసకు సమానముగా చెప్పబడినవి.

క్రౌఞ్చః కులిఙ్గో ద్రవిడః పద్మపుష్కరసాదకః ॥ 45 ॥
వార్ధీణసః సారసశ్చ సారఙ్గో ధామ్బృణ్యలికః (?) ।
ఏతే చాన్యే చామ్బుచరాః పక్షిణో గురవః స్మృతాః ॥ 46 ॥
రసే పాకే చ మధురా ఉష్ణాః సలవణాన్వయాః ।
వృష్యా వాతహరాశ్చైవ కఫపిత్తవివర్ధనాః ॥ 47 ॥

క్రౌంచ, కులింగ, ద్రవిడ, పద్మపుష్కర, సాదక, వాగ్ధీర్నస ( వార్ధీణస)

(నీలి మెడ ఎరుపుతల పక్షి) సారస, సారంగ (చిత్రమృగము) ధామృణ్యాలిక మొదలగు జలచర పక్షులు గురువుగా చెప్పబడినవి. ఇవి రస, విపాకములలో మధురము గానుండును. ఇవి ఉష్ణ, లవణయుక్త, వృష్య, వాతనాశక, మరియు కఫపిత్తములను వృద్ధి పొందించునవి.

నలమీనో ఝషశ్చైవ పాఠీనశ్చర్మపీవరః ।
చేలీమః శకులార్భ(ద)శ్చ శిలీంధ్రో గర్గరస్తథా ॥ **48** ॥
పుష్కరో గోకరో మూచో వారడః శూలపాటలః ।
కృష్ణమత్స్యః శ్వేతమత్స్యో గోమత్స్యో రోహితస్తథా ॥ **49** ॥
శకలీ మహాశకలీ చమ్పః కుందోఽథ మద్గురః ।
ఇల్యః శఙ్కుశ్చిచరణో రాజీవః శఫరీ తథా ॥ **50** ॥
ఏతే చాన్యే చ బహవో వివిధా మత్స్యజాతయః ।
రసే పాకే చ మధురా వాతఘ్నా వృష్యబృంహణాః ॥ **51** ॥
ఉష్ణవీర్యాశ్చ తే జ్ఞేయా గురవః కఫపిత్తలాః ।
లఘ్వాశయాస్తేఽన్యే తు కిఞ్చిత్తిక్తాన్వయాన్తరాః ॥ **52** ॥
రోహితో నలమీనశ్చ . . . . . లఘవః స్మృతాః ।

నల మీన (చిలిచిమిచేప) ఝష (మత్స్యభేదము) పాఠీన, చర్మపీవర, చేలీమ, శకులార్భక, శిలీంద్ర గర్గర, పుష్కర, గోకర, మూచ, వారడ, శూల పాటరి, కృష్ణ, మత్స్య, శ్వేతమత్స్య, గోమత్స్య, రోహిత, శకలీ, మహాశకలా, చంప, కుంద మద్గుర, ఇల్య, శంకు, చిచరణ, రాజీవ, శఫరీ (ప్రోష్ఠీ మత్స్య) మొదలగు అన్య మత్స్య జాతులు రసపాకములలో మధురము, వాతఘ్నము, వృష్యము బృంహణము, ఉష్ణవీర్యము, గురు, కఫపిత్త వర్ధకములు. లఘు శరీరము కలవి తిక్త రసము కల ప్రాణులను గ్రహించవలెను. రోహిత నలమీనాదులు లఘువుగా చెప్పబడినవి.

కూర్మో దుటిశ్చ నక్రశ్చ మకరోఽవకుశస్తథా ॥ **53** ॥
తిమిః సహస్రదశనస్తథైవ చ తిమిఙ్గిలః ।
ఇఞ్చకః శుక్తికః శఙ్ఖోఽవలూకో జలసూకరః ॥ **54** ॥

శమ్బూకశ్చంద్రికః శృఙ్గీ కర్కటః శకుటీపయః ।
ఏతే చాన్యే చ జలజా మధురా రసపాకయోః ॥ 55 ॥
గురవశ్చోష్ణవీర్యాశ్చ గురవః కఫపిత్తలాః ।

కూర్మ, దృటి, నక్ర, మకర, అవకుశ, తిమి, సహస్రదశన, తిమింగిల, ఇంచక, శుక్తిక, శంక, అవలూక, జలసూకర, శంభూక, చంద్రిక, శృంగి, కర్కట, శకుటీపయ, మొదలగు అన్య జలచర ప్రాణులు రసపాకములలో మధురము, గురు, ఉష్ణవీర్యము, గురు, కఫిపకత్త వర్ధకములుగానుండును.

ఆనూపే తూత్తమశ్ఛాగః, శ్రేష్ఠో మత్స్యేషు రోహితః ॥ 56 ॥
జలజే శుక్తికూర్మౌ చ, వారటోఽప్యథ పక్షిషు ।
ఏణో మృగేషు ప్రవరః, ప్రతుదేషు శుకో వరః ॥ 57 ॥

(ఇతి తాడపత్రపుస్తకే 262 తమం పత్రమ్)

విషయేషు . . . . . గ్ర్యో లావః ఖగేషు తు ।
తిత్తిరో విష్కిరేష్వగ్ర్యః, కాకోఽగ్ర్యః ప్రసహేషు తు ॥ 58 ॥

ఆనూప ప్రాణులలో మేక శ్రేష్ఠమైనదిగా చెప్పబడినది మత్స్యములలో రోహితము సర్వశ్రేష్ఠము. జలజ ప్రాణులలో శుక్తి కూర్మము, పక్షులలో వారట, మృగములలో ఏణహరిణము ప్రతుత పక్షులలో చిలుక, విషయములలో---, పక్షులలో లావక, విష్కిరములలో తీతువు, ప్రసహములలో కాకి శ్రేష్ఠముగా చెప్పబడినది.

లఘూక్తం రుధిరం మాంసాద్ గురు మేదశ్చ చర్మ చ ।
మజ్జావసే గురుతరే తేభ్యో గురు శిరః స్మృతమ్ ॥ 59 ॥

మాంసము కంటె రక్తము లఘువుగా నుండును. మేద, త్వచ, మజ్జలు గురు, వీటికంటే శిరస్సు గరువుగా చెప్పబడినది.

లఘుః స్కంధో హి శిరసస్తస్మాత్ పార్శ్వం లఘు స్మృతమ్ ।
పార్శ్వాత్ సక్థి లఘు ప్రోక్తం పాదమాంసం గురు స్మృతమ్ ॥ 60 ॥

శిరస్సు కంటె భుజములు లఘువుగా ఉండును. భుజముల కంటె పార్శ్వభాగము, పార్శ్వముల కంటె ఊరువులు లఘువుగా ఉండును. పాద మాంసము గురువుగా ఉండును.

**వసా మేదశ్చ మజ్జా చ వాతపిత్తహితాః స్మృతాః ।**
**రసే పాకే చ మధురాః స్నేహాచ్ఛ్లేష్మప్రకోపనాః ॥ 61 ॥**
**రక్తం రక్తప్రశమనం మాంసం మాంసంవివర్ధనమ్ ।**

**వసమేద మజ్జ :-** వాతపిత్తముల యందు హితకరము. రసపాకములలో మధురముగా ఉండును. స్నేహయుక్తముగా ఉండును. శ్లేష్మమును ప్రకోపింపచేయును. రక్తము రక్తమును నిర్మలము చేయును. మాంసము మాంసమును వృద్ధి చేయును.

**గురవః ప్రాణినో బాలా, యువానో వృష్యబృంహణాః ॥ 62 ॥**
**వృద్ధాస్తు వాతలా రూక్షాః, పుంభ్యస్తు లఘవః స్త్రియః ।**
**మృగాల్లఘుతరః పక్షీ, పక్షిభ్యోఽమ్బుచరో గురుః ॥ 63 ॥**

బాల ప్రాణములు గురువుగా చెప్పబడినవి. యువ ప్రాణములు వృష్యము బృంహణముగా ఉండును. వృద్ధ ప్రాణములు వాత కారకము, రూక్షముగా ఉండును. పురుషుల కంటె స్త్రీల మాంసము లఘువుగా ఉండును. మృగముల కంటె పక్షులు లఘువుగా ఉండును. పక్షుల కంటె జలచర ప్రాణులు గురువుగా నుండును.

**మహాశరీరాశ్చాల్పకాయా లఘవో జీవక ! స్మృతాః ।**
**విజ్ఞేయాశ్చాల్పభుగ్భ్యోఽపి గురవో బహుభోజనాః ॥ 64 ॥**

ఓ జీవకా! (నకుల మూషికాది) అల్ప శరీరము గల ప్రాణులలో పెద్దగా బృహత్ శరీరముగల ప్రాణుల మాంసము లఘువుగా నుండును. అల్పముగా భుజించు ప్రాణులలో అధికముగా భుజించు ప్రాణులు లఘువుగానుండును.

**లఘవోఽల్పభూమిచరా, అలసేభ్యో విదూరగాః ।**
**లఘుదేశచరా అల్పా లఘవో లఘుభోజనాః ॥ 65 ॥**

అల్ప భూచర ప్రాణులు లఘువుగా నుండును. అలసత్వముగల ప్రాణులలో చాలా దూరము చరించు ప్రాణులు లఘువుగా నుండును. లఘు దేశములో చరించునవి అల్పశరీరము గలవి లఘు భోజనము చేయు ప్రాణులు కూడ లఘువుగా నుండును.

**గురుదేశచరాః స్థూలా గురవో గురుభోజనాః ।**
**పాశబద్ధం గురు మాంసం రూక్షం క్షుద్వ్యాధిభిర్హతమ్ ॥ 66 ॥**

గురు ( విశాల) ప్రదేశములో చరించునవి స్థూల, గురు భోజనము చేయు ప్రాణులు గురువుగా నుండును. వలలో చిక్కిన ప్రాణులమాంసము గురువుగా నుండును. ఆకలి, వ్యాధితో మరణించిన ప్రాణుల మాంసము రూక్షముగా నుండును.

**శ్వభిర్హతం పీతరక్తం నాతిబృంహణముచ్యతే ।**
**పిష్టైర్హతమభక్ష్యం స్యాచ్ఛుష్కం నాతిగుణావహమ్ ॥ 67 ॥**

కుక్కల ద్వారా చంపబడిన లేదా వాటి రక్తపానము చేసిన ప్రాణుల మాంసము అధిక బృంహణముగా ఉండదు. విషముచే మరణించిన ప్రాణుల మాంసము అభక్ష్యము, అది శుష్కము గుణహీనముగా నుండును.

**సద్యోఽపరిక్లిష్టహతం మాంసం ధాతుం వివర్ధయేత్ ।**
**పూతిమాంసం గుర్వసారం తదవృష్యమబృంహణమ్ ॥ 68 ॥**

సద్యఃమృత అదూషితమాంసము, మాంసము మరియు ధాతువృద్ధిని చేయును. కుళ్లిన మాంసము, గురు సారరహితమైనది అవృష్యము అబృంహణము.

**ఏవం మాంసవిశేషజ్ఞః కల్పయేద్భోజనే సదా ।**
**బాలానాం గుర్విణీనాం వా బాలపుత్రాసు వా భిషక్ ॥ 69 ॥**
**దుష్ప్రజాతాసు వా స్త్రీషు బాలే వా కృశితే సదా ।**
**ప్రయుఞ్జన్ సిద్ధిమాప్నోతి తత్త్వవిద్ వృద్ధజీవక ! ॥ 70 ॥**

ఈ విధముగా మాంసగుణములను తెలిసిన వ్యక్తి ఎల్లప్పుడు భోజనములో మాంస కల్పనలు చేయవలెను. ఓ వృద్ధ జీవకా! తత్త్వవేత్త అయినవాడు బాలుడు గర్భిణి బాలిక దుష్ప్రజాతా స్త్రీ మరియు కృశించిన బాలురలో కల్పనానుసారము మాంసమును ప్రయోగించవలెను. అది సిద్ధిని కల్గించును.

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥

అని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

**(ఇతి) ఖిలేషు మాంసగుణవిశేషీయాధ్యాయశ్చతుర్వింశతితమోఽధ్యాయః ॥ 24 ॥ చూ (70)**

ఖిల స్థాన మందలి మాంస గుణ విశేషయాధ్యాయమును 24వది సమాప్తము.

# దేశసాత్మ్యాధ్యాయః - పఞ్చవింశః

అథాతో దేశసాత్మ్యాధ్యాయం వ్యాఖ్యాస్యామః ॥ 1 ॥

ఇతి హ స్మాహ భగవాన్ కశ్యపః ॥ 2 ॥

ఇప్పుడు మనము దేశసాత్మ్యమను అధ్యాయమును వ్యాఖ్యానించెదమని భగవాన్ కశ్యపుడు చెప్పెను.

కశ్యపాఖ్యమృషిశ్రేష్ఠం పృష్టవాన్ . . . . రోచతః ।
దేశసాత్మ్యమజానన్తః కథం కుర్యుశ్చికిత్సితమ్ ॥ 3 ॥
కస్య దేశస్య మధ్యే తు కురుక్షేత్రం ప్రతిష్ఠితమ్ ।

కశ్యప నామ ధేయముగల శ్రేష్ఠ ఋషితో జీవకుడు ప్రశ్నించెను. దేశ సాత్మ్యమును తెలిసి కొనక మనము చికిత్సనెలా చేయగలము? కురుక్షేత్రము ఏ దేశమధ్యము నున్నది.

ఇత్యేవముక్తో భగవాన్ కాశిరాజో మహామునిః ॥ 4 ॥
ఇదముత్తరమక్లిష్టం వ్యాఖ్యాతుముపచక్రమే ।
కురుక్షేత్రం మధ్యదేశాద్యోజనానాం శతం పరమ్ ॥ 5 ॥
సమస్తాన్ షడ్రసాన్ ప్రాయో భుఞ్జతే మధ్యదేశజాః ।
భక్ష్యభోజ్యాన్నపీరాస్తే తు భుఞ్జన్తో వాఽసకృత్తథా ॥ 6 ॥

ఈ విధముగా ప్రశ్నించిన మీదట మహాముని భగవాన్ కాశిరాజు సరళముగా జవాబునిచ్చెను. దేశమధ్యములో 100 యోజనముల విస్తారముగల కురుక్షేత్ర ప్రదేశమున్నది. మధ్య దేశ నివాసులు సామాన్యముగా షడ్రస సేవన

చేయుదురు. వారు భక్ష్య భోజ్య అన్నములో అత్యంత వీరులు. అనేక సార్లు భోజనము చేయుదురు.

పూర్వదేశస్తు విజ్ఞేయో మధురః శీతలో గురుః ।
కుమారవర్తనీమా(చా)దౌ కటీవర్షస్తథైవ చ ॥ 7 ॥
మాగధాసు మహారాష్ట్రమృషభద్వీపమేవ చ ।
పౌండ్రవర్ధనకం చాపి మృత్తికావర్ధమానకమ్ ॥ 8 ॥
కర్వటం చ సమాతఙ్గం తామ(మ్ర)లిప్తం సచీరకమ్ ।
ప్రియఙ్గుమథ కౌశల్యం కలిఙ్గపృష్ఠపూరకమ్ ॥ 9 ॥

తూర్పున గల ప్రాంతము మధురము శీతలము గురువుగా చెప్పబడినది. ఈ దేశములు మొదట కుమార వర్తని, తర్వాత కటీ వర్షము మగధలో మహారాష్ట్రము, ఋషభ ద్వీపము, పౌండ్ర వర్ధనకము, మృత్తికావర్ధమానకము, కర్వట మాతంగ, తామ్రలిప్తము, చీర, ప్రియంగు, కౌశల్య, కలింగ, మరియు పృష్ఠ పూరకము.

ఏషు ప్లీహవినో మర్త్యా గలగణ్డికమే(న ఏ)వ చ ।
గుడశాల్యోదనప్రాయా మత్స్యభోజనసేవినః ॥ 10 ॥
ప్రాయశో మధురాహారా వాతశ్లేష్మాత్మకా నరాః ।

ఈ దేశ ప్రజలు ప్లీహ మరియు గల గండము తో అధికముగా బాధపడు చుందురు. వీరు ఎక్కువగా గుధము, శాలి, మత్స్య భోజనము చేయుదురు. వీరి ఆహారము మధురముగా నుండును వాత శ్లేష్మ ప్రకృతి గలవారు గా నుందురు.

తేషాం కటుకతిక్తం చ రూక్షముష్ణం చ భోజనమ్ ॥ 11 ॥
యచ్చాన్యదపి శ్లేష్మఘ్నం తేషాం తత్తత్ ప్రయోజయేత్ ।

వీరికి కటు తిక్త రూక్ష ఉష్ణ భోజనమును చేయించవలెను అన్యశ్లేష్మనాశక ఆహార విహారములను సేవించవలెను.

కక్షీపదా నవధ్యానా కావీరాస్తుల్యయోరపి ॥ 12 ॥
వానసీ కుముదారాజ్యం చిరిపాలిస్తథైవ చ ।

చీరరాజ్యఞ్చ చోరాణాం పులిన్ద(న్దం) ద్రవిడేషు చ ॥ 13 ॥
కరఘాటశనానాం చ వివే(దే)హో మణ్డపేషు చ ।
కాంతారం చ వరాహం చ ఘటాస్వాభీరమేవ చ ॥ 14 ॥
దక్షిణాం దిశమాశ్రిత్య దేశా వి . . . . . . . . ।

(ఇతి తాడపత్రపుస్తకే 264 తమం పత్రమ్)

దక్షిణ ప్రదేశమందు ఈ క్రింది దేశములు గలవు. కంచీపద, నవధ్యాన, కావీర, వానసీ, కుముదారాజ్య చిరిపాలి, చోరులచీరి రాజ్యము, ద్రవిడములో పులింద శనులలో కరఘాటము. మండపములో విదేహము కాంతారము, వారాహము, ఘటావులలో ఆభీరము ఈ దేశములు దక్షిణమున ఉన్నవి.

ఖిలస్థానస్యైతావానేవ భాగ ఉపలబ్ధః ।

ఖిలస్థానమందు ఇంతే ఉపలబ్ధము

సమాప్తము